తెలుగు అకాడమి ప్రచురణ (బి.ఏ.) - 112



# భారతీయ సామాజిక సమస్యలు

రచయితలు

**పి. నరసింహారావు,** M.A. (S.W)., M.A. (Socio)., M.Com.,

శాఖాధిపతి, సంఘసంక్షేమశాఖ, ఎ. ఎమ్. ఎ. ఎల్. కళాశాల, అనకాపల్లి.

**శ్రీమతి పవిరాల,** M.A. (S.W).,

ఉపన్యాసకులు, సంఘసంక్షేమశాఖ, విశాఖ ఉమెన్సు కాలేజి, విశాఖపట్టణం.

సంపాదకులు

**పి. సంజీవ దీక్షిత్,** M.A. (S.W).,

జాతీయ సేవాపథకం సమన్వయాధికారి, సంఘ సంక్షేమ శాఖ, ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు.

తెలుగు అకాడమి

హైదరాబాదు

**1986**

# భూమిక

1968 లో స్థాపన జరిగిన నాటినుంచి ఉన్నతస్థాయిలో బోధన భాషగా తెలుగు కుదురు కోవటంలో తెలుగు అకాడమి నిర్వహిస్తున్న పాత్ర అందరికీ విశదమైనదే. ఎన్నోరకాల ఇబ్బందులను అధిగమిస్తూ అత్యల్ప వ్యవధానంలో విస్తృతంగా పాఠ్య పఠనీయ అనువాద, పరామర్శ గ్రంథాలను ప్రచురించి అకాడమి విద్యా రంగానికి సముచితమైన సేవ చేయగల్గింది. అకాడమి ప్రచురణలు ఎన్నో పునర్ముద్రణ కూడా పొందినవి. పునరభ్యసన గోష్ఠులద్వారాను, విద్యార్థులు, విద్యాధికులు, ఉపాధ్యా యులు ఆసక్తితో చేస్తున్న సూచనల ద్వారాను ఎప్పటికప్పుడు ఈ గ్రంథాలను మెరుగుపరచటంలో కృషి జరుగుతూనే వచ్చింది. అయినా ఒక క్రమపద్ధతిలో శాస్త్రీయ దృష్టితో ఆ గ్రంథాలను గుణ పరీక్ష చేయించి పరిష్కృత ముద్రణలను వెలువరించడానికి అకాడమి ఒక ప్రణాళికను చేపట్టింది. ఈ కార్యక్రమంలో విశ్వవిద్యాలయ ఆచార్యులు, కళాశాల ఉపాధ్యాయులు మాకు ఎంతగానో సహకరించి నారు. ఆ గుణపరీక్ష, మూల్యాంకన విధానాల పర్యవసానమే ఈ పరిష్కృత ముద్రణము.

ఈ విధంగా పరిష్కృత ముద్రణాలను వెలువరించటానికి వెనుకవున్న ఆశయాలు రెండు : మొదటిది – అప్పుడప్పుడు పాఠ్యప్రణాళికలో తీసుకొనివచ్చే మార్పులకు అనుగుణంగా పుస్తకాలను తీర్చిదిద్దటం, రెండవది గ్రంథాలలో ఉన్న విషయానికి అవసరమైన మేరకు సరికొత్త విషయాలు చేర్చటం.

పుస్తకంలో ఉపయోగించిన పారిభాషిక పదాల పట్టికలను, సమానార్థకాలను పుస్తకం చివర మునుపు ఇవ్వటం జరిగింది. అయితే పారిభాషిక పదాలను కూడా పరీక్ష చేయించి పరిష్కృత పదకోశాలను ఏ శాస్త్రానికి ఆ శాస్త్రంగా విడివిడిగాకాని, పరస్పర సన్నిహితత్వం ఉన్న శాస్త్రవర్గంగా గాని, వేరుగా ప్రకటిస్తున్నాము. ఆ కారణంచేత ఆ పట్టికలను ఇప్పుడు పుస్తకం చివర ఇవ్వటం లేదు.

ఈ గ్రంథాన్ని ఇంతకంటె సమగ్రంగాను, సుందరంగాను తీర్చిదిద్దటానికి సూచనలిస్తే కృతజ్ఞతతో స్వీకరించగలము.

# ప్రవేశిక

ప్రగతిపథంలోనికి పరుగులు తీస్తున్న నేటి మన భారతీయ సమాజం ఎన్నో సమస్యలను ఎదుర్కొంటున్నది. వాటిలో సామాజిక సమస్యలు ప్రధానమైనవి. మనిషి మనుగడ యీ సమస్యల వలయం నుండి ప్రశాంతత కోసం నిరీక్షిస్తున్న రోజులివి. సమాజంలోని అనేక క్లిష్ట సమస్యలకు మానవుడు గురి అవుతున్నాడు.

నేటి ఆధునిక సమాజంలో మారుతున్న పరిస్థితులకు తమ జీవన విధానాలను సర్దుబాటు చేసుకోలేక, సమస్యల విషవలయంలో చిక్కుకొని అనేకమంది తప్పుదారి త్రొక్కుతూ, వారికి, వారి కుటుంబాలకి, సమాజానికి తీరని సమస్యలుగా తయారవుతున్నారు. వీటి ఫలితమే మన సమాజంలో పేదరికం, భిక్షాటన, పడుపువృత్తి, నేరాలు, బాలనేరాలు, మురికివాడలు పెరుగుదల, నిరక్షరాస్యత, నిరుద్యోగం మొదలయినవి విశృంఖలంగా విలయతాండవం చేస్తూ సమాజ పురోభివృద్ధికి తీరని అవరోధాలను కల్పిస్తున్నాయి.

డిగ్రీస్థాయిలో సంఘ సంక్షేమ శాస్త్రం అధ్యయనం చేస్తున్న విద్యార్థులు సామాజిక సమస్యల గురించి కూలంకషంగా అవగాహన చేసుకోవటం చాల అవసరం. ఎందుకంటే సంఘ సంక్షేమ శాస్త్రం వ్యక్తి, సమూహ, సముదాయ, సమాజ పురోభివృద్ధికి కృషి చేస్తుంది. ఈ అవగాహనతో బాటు, సంఘ సంక్షేమ శాస్త్ర కార్యకర్తలు యీ సమస్యల పరిష్కారానికి కృషి చేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. సంఘ సంక్షేమ శాస్త్రం ద్వారా విద్యార్థి నేర్చుకొనే శాస్త్రీయ పద్ధతులు, మనో వైజ్ఞానిక అంశాలు అతనిని మంచి సంఘ సంక్షేమ కార్యకర్తగా తీర్చిదిద్ది, ఆతనికి వృత్తిపరమయిన దృక్పథాన్ని, సామర్థ్యాన్ని, మెలుకువలను చేకూర్చకలదు. దీనివల్ల అతడు సామాజిక సమస్యలను పరిష్కరించడానికి, నివారించడానికి, ప్రభుత్వం, స్వచ్ఛంద సేవాసంస్థలు రూపొందించి అమలుపరిచే సేవాపథకాలలో చాలా కీలకమయిన పాత్ర వహిస్తాడు.

శ్రీమతి పమీలా 1, 2, 3, 4, 5, 13, 14 అధ్యాయాలను, శ్రీ నరసింహారావు 6, 7, 8, 9, 10, 11, 12 అధ్యాయాలను రచించారు.

ఈ గ్రంథం సంఘ సంక్షేమ కృషి విద్యార్థులకేగాక, సమాజంలో సంఘ సేవా తత్పరతతో స్వచ్ఛందంగా పనిచేసే కార్యకర్తలకు, సమాజ పురోభివృద్ధికి వివిధ శాఖలలో పని చేస్తున్న ప్రభుత్వ, ప్రభుత్వేతర ఉద్యోగులకు కూడా ఉపయోగపడుతుంది.

# విషయసూచిక

# 1
# భారతదేశం - సామాజిక వ్యవస్థ

## సమాజం - ముఖ్య లక్షణాలు

ఒకే విధమైన అభిరుచులు, జీవనవిధానం కలిగి, 'మనందరం ఒకటే' అనే భావంతో, ఒకే సమూహంగా నిర్ణీత భూభాగంలో నివసిస్తూ, ఒకే లక్ష్యాన్ని, ప్రయోజనాన్ని సాధించే ఉద్దేశ్యంతో కొన్ని నియమ నిబంధనలకు లోబడి, శాశ్వత సంబంధం ఉన్న ప్రజల సమూహాన్ని సమాజం అని చెప్పవచ్చు.

సమాజ స్వభావం సామాజిక సంబంధాలపై ఆధారపడి ఉంటుంది. వ్యక్తుల మధ్య పరస్పర సంబంధం, పరస్పర అవగాహన ఉన్నప్పుడే దానిని సామాజిక సంబంధం అంటారు. మానవుడు సంఘ జీవి. మానవుడు పుట్టిననాటినుండీ, తన కోరికలను అవసరాలను నెరవేర్చుకోడానికి, సంఘం మీదనే ఆధారపడి ఉన్నాడు. వ్యక్తికీ, సమాజానికి మధ్యగల సంబంధం అత్యంత ప్రధానమయింది. వ్యక్తిని, సమాజానికి దూరంగావుంచి, సామాజిక సంబంధాలు లేకుండా చేస్తే, అతడు మానవ స్వభావానికే దూరం అవుతాడు.

సమాజాన్ని సంపూర్ణంగా వివరించాలంటే, రెండు అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి.

అవి : 1) సమాజ నిర్మితి (Social Structure)

2) సమాజ ప్రకార్యం (Social Function)

నిర్మాణం దృష్ట్యా, సమాజం కొన్ని సమూహాల, సముదాయాల, సంఘాల, సంస్థల, వ్యవస్థల, వ్యక్తుల కలయిక. ప్రకార్యం దృష్ట్యా, సమాజం, ఒక సామాజిక సంబంధ, బాంధవ్యాల వ్యవస్థ.

## సమాజ లక్షణాలు :

మానవ సమాజం ఒక సంక్లిష్టమయిన వ్యవస్థ అయినా, దానికి కొన్ని సామాన్యమయిన ప్రాథమిక లక్షణాలున్నాయి : అవి

### 1. భౌగోళిక ప్రాంతం

ప్రజలు జీవించడానికి ఒక భౌగోళిక ప్రాంతాన్ని ఆక్రమించుకొంటారు. దానివల్ల వారు, ప్రాదేశిక సామీప్య భావంతో ఉంటారు. సమాజం నిలకడగా ఉండటానికి, అభివృద్ధి చెందటానికి, దానికి ఒక భౌగోళిక ప్రాంతం అవసరం.

## 2. విభిన్నమయిన పరస్పర చర్యలు, పరస్పర సంబంధాలు

సమాజ సభ్యుల మధ్య పరస్పర సంపర్కం ఉండటంవల్ల, వారిమధ్య పరస్పర చర్య జరిగి, సాంఘిక సంబంధాలు ఏర్పడతాయి.

## 3. సామాజిక వ్యవస్థాపన (Social organisation) :

సామాజిక వ్యవస్థాపనలో వ్యక్తులు సమూహాలు, సముదాయాలు, సమితులు, సంస్థలు మొదలయినవి ముఖ్య అంశాలుగా చెప్పవచ్చు. సమాజంద్వారా ఒక వ్యవస్థీకృతమయిన జీవన విధానాన్ని వ్యక్తులు పొందుతారు. దానివల్ల, వ్యక్తి తనకున్న అవసరాలను, అభిరుచులను క్రమ బద్ధమయిన రీతిలో తృప్తిపరచుకోవటానికి ప్రయత్నిస్తాడు.

## 4. ఐక్యత - విభేద ప్రకార్యాలు

సమాజ సభ్యులందరిమధ్య పరస్పర అవగాహన సుస్థిరంపు భావం ప్రబలి ఉంటుంది. ఒకే ప్రాంతంలో నివసించటంవల్ల, ఒకే రకమయిన నమ్మకాలు, విలువలు కలిగివుండటంవల్ల, వారిలో ఐక్యతా భావం పెంపొందుతుందికాని వ్యక్తుల పాత్రలలోను, ప్రకార్యాలలోను, స్థాయిలలోను భేదం ఉండటంవల్ల, సమాజంలో విభేదాలు గోచరిస్తాయి.

## 5. సంస్కృతి (Cculture)

మానవ సమాజాలలో, ఒక్కొక్క సమాజానికి ఒక్కొక్క రకమైన సంస్కృతి ఉంటుంది. ఒకే సమాజంలోని ప్రజలు, ప్రత్యేకమయిన నమ్మకాలు, విలువలు, కళలు, మతము, ఆచార వ్యవహారాలు, ప్రవర్తనారీతులను కలిగివుండి, ఒక ప్రత్యేక జీవన విధానాన్ని ఏర్పరచుకొంటారు. దానినే సంస్కృతి అని అంటారు.

## సమాజం - ప్రాథమిక ప్రకార్యాలు (Primary Functions of a Society)

సమాజం, సమాజ సభ్యులకు తమ అవసరాలను క్రమపద్ధతిలో తీర్చుకోవటానికి, క్రమబద్ధమయిన జీవన విధానంలో ఉండటానికి తోడ్పడుతుంది.

మానవుని కనీస అవసరాలను తీర్చటం సమాజ ప్రధానవిధి. వ్యక్తికి రక్షణ కల్పించటానికి, వ్యక్తి మూర్తిమత్వ అభివృద్ధికి అవసరమయిన వనరులను వృద్ధి పరచటానికి సమాజం తోడ్పడుతుంది.

## సాంఘిక సమూహం (Social group)

సమాజంలో అనేకమయిన సమూహాలుంటాయి. మెకైవర్ అనే సమాజ శాస్త్రవేత్త అభిప్రాయ ప్రకారం సాంఘిక సమూహం అంటే 'సాంఘిక సంబంధాలున్న వ్యక్తుల కలయిక' అని నిర్వచించవచ్చు. వ్యక్తుల మధ్య సామాజిక పరస్పర చర్య (Social intenactions) జరిగినప్పుడు, సాంఘిక సంబంధాలేర్పడి, సమూహం ఏర్పడుతుంది. పరస్పర అవగాహన, పరస్పర సంబంధాలు, సమూహం యొక్క ప్రధాన లక్షణాలు. ఉదాహరణకు కుటుంబం, క్రీడా సమూహం, విద్య, వృత్తి సమూహాలు మొదలైనవి.

## వ్యవస్థలు (Associations)

మానవుని ప్రయోజనాలను తీర్చటానికి వ్యవస్థలు ఏర్పడినాయి. తమ అవసరాలను, అభిరుచులను తీర్చుకోడానికి వ్యక్తులు ఒక సమూహంగా ఏర్పడి, సంఘటిత కృషి చేస్తే, దానిని సామాజిక వ్యవస్థ అంటారు. వ్యాపార సంఘాలు, సాంస్కృతిక సంఘాలు, దీనికి ఉదాహరణలు.

## సముదాయము (Community)

సమాజం అనేక సముదాయాలతో కూడి ఉంటుంది. ఏదైనా ఒక నిర్ణీత ప్రాంతంలో వ్యక్తులు సామాజిక ఐక్యతతో, సహజీవనం గడిపితే, ఆ ప్రాంతాన్ని సముదాయమని మెకైవర్ (Maciver) నిర్వచించాడు. "నిర్ణీత ప్రాంతంలో" సహభావంతో (We feeling) నివసిస్తున్న సామాజిక సమూహాన్ని సముదాయం అని బొగార్డస్ (Bogardus) నిర్వచించాడు. గ్రామం, పట్టణం, సముదాయాలకు ఉదాహరణలు.

## సంస్థలు [Institutions

సమాజంలో సంస్థలు ప్రధాన పాత్ర వహిస్తాయి. మెకైవర్ సామాజిక కార్యక్రమాలను అమలు చేయటానికి ఏర్పడిన పద్ధతులు లేదా విధానాలకు సంస్థలని నిర్వచించాడు. సంస్థలు లేకుండా ఏ మానవ సమాజం ఉండదు. మానవుల కోర్కెలను, అవసరాలను తీర్చడమే ఈ సంస్థల ప్రధాన కర్తవ్యం. ఉదాహరణకు మతపరమయిన సంస్థలు, ప్రభుత్వ సంస్థలు, ఆర్థిక సంస్థలు, విద్యాసంస్థలు మొదలయినవి.

## సమాజం - సామాజిక ప్రమాణాలు (Society - Social Norms)

సమాజంలో ఉన్న సంబంధాలు సక్రమంగా అభివృద్ధి చెందడానికి సామాజిక ప్రమాణాలు చాలా అవసరం. సక్రమమైన నడవడికోసం ఏర్పరచిన నిబంధనలే సామాజిక కట్టుబాట్లు, క్రమం, అక్రమం, అంగీకారం, అనంగీకారం మొదలయినవి తెలియచేసేవే సాంఘిక ప్రమాణాలు. వాటిలో ఆచారాలు (customs) జానపదరీతులు (Folkways) సంఘరీతులు (Mores) ముఖ్యమైనవి. సమాజంలోని అత్యధిక వ్యక్తులు ఇష్టపూర్వకంగా ఆచరించే శాశ్వత సాంఘికవిధానాలను "ఆచారాలు" అంటారు. సమాజంలో గుర్తించిన లేదా అంగీకరించిన ప్రవర్తనా విధానాలను "జానపదరీతులు" అంటారు. జానపదరీతులు కట్టుబాట్లకు లోనయితే వాటిని "సంఘరీతులు" అంటారు. ఉదాహరణకు ఏవిధమయిన దుస్తులు ధరించాలి. అనే నిబంధన జానపదరీతి అయితే, అసలు దుస్తులు ధరించాలి అనేది సంఘరీతి.

ఈ విధంగా సమాజం ప్రత్యేక ఉద్దేశాలు, లక్షణాలు, విధులు, రూపాలతో ఉన్నా, అది ఒక నిత్య నూతన చైతన్య స్రవంతి. అనుక్షణం మారుతూనే ఉంటుంది. మార్పు లేనటువంటి సమాజాలు మనకు కనిపించవు.

## భారతీయ సమాజం [Indian Society]

భారతీయ సమాజంలో మూడు ముఖ్యమైన సముదాయాలను చూడవచ్చు.

1. గ్రామీణ సముదాయం (Rural Community)
2. నగర సముదాయం (Urban Community)
3. గిరిజన సముదాయం (Tribal Community)

భారత దేశంలో అధిక శాతం ప్రజలు గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్నారు. పూర్వం గ్రామీణ సముదాయాలు స్వయంపోషకాలై ఉండేవి. కులం, మతం, సమిష్టి కుటుంబం, ఒకప్పుడు గ్రామీణ ప్రజలకు సాంఘిక రక్షణ కల్పించి, సరిఅయిన సామాజికీకరణానికి దోహదపడేవి. కాని నేడు, పారిశ్రామికాభివృద్ధి, నగరీకరణం, విధునికీకరణంవల్ల, గ్రామీణ సముదాయాలు విచ్ఛిన్నమై అనేక నూతన సమస్యలకు దారి తీస్తున్నాయి.

పారిశ్రామికీకరణం, నగరీకరణంవల్ల, నగర సముదాయాలు, నేటి సమాజంలో ఎక్కువగా అభివృద్ధి చెందుతున్నాయి. నగర సముదాయాలలో లభించే, ఉద్యోగావకాశాలు, ఆధునిక జీవన సౌకర్యాలు మొదలగు వాటివల్ల, అధిక సంఖ్యలో ప్రజలు గ్రామీణ ప్రాంతాలనుండి నగర ప్రాంతాలకు వలసపోతున్నారు. అందువల్ల నగరాలలో మురికివాడలు ఉద్భవించి, అనేక సమస్యలకు అవి మూలకారణ మవుతున్నాయి.

గిరిజన సముదాయాలను వెనుకబడిన సముదాయాలకింద చేర్చడమైంది. వీరు నాగరిక ప్రపంచానికి దూరంగా, అడవులు, కొండప్రాంతాలలో నివసిస్తూ, ప్రత్యేక జీవన విధానాన్ని కలిగి ఉంటారు. సంచార జీవితం వీరి ముఖ్య లక్షణం. అయితే మారుతున్న పరిస్థితులతోబాటు గిరిజనులు కూడా, వారి జీవన విధానాలను మార్చుకొంటున్నారు. వీరిలో ముఖ్యంగా నిరక్షరాస్యత, అమాయకత్వం, దారిద్ర్యం, అనారోగ్యంతో ముడిపడిన సమస్యలు చాలా ఉన్నాయి. వీరి సంక్షేమానికి ప్రభుత్వం చాలా కృషిచేస్తున్నది.

## భారతీయ సమాజం - వ్యవస్థలు

భారతీయ సమాజంలోని ముఖ్య సామాజిక వ్యవస్థలలో కులం, మతం, సమిష్టి కుటుంబం ప్రముఖంగా పేర్కొనదగినవి. భారతీయ సమాజపు ఆయువుపట్టు కుల విధానం. కులవిధానం వర్ణ వ్యవస్థ ఆధారంగా నిర్మితమైంది. వర్ణవ్యవస్థ హిందూ సమాజంలోని క్రమశ్రేణిని (Heirarchy) సూచిస్తుంది. సాంప్రదాయవృత్తులు కులపరంగా నిర్ణీతమై ఉంటాయి. వివిధ కులాలమధ్య సాంస్కృతిక, వ్యత్యాసాలుంటాయి. మారుతున్న భారతీయ సమాజంలో ఈ కులవ్యవస్థ చాలావరకు మార్పులు చెందుతూ, ఒక ముఖ్య సమస్యగా మిగిలిపోయింది. దీనివల్ల అస్పృశ్యత, సాంఘిక అసమానతలు ఏర్పడి, ప్రజలమధ్య సాంఘిక దురభిప్రాయాలు, సంఘర్షణలు చెలరేగుతున్నాయి.

మతం : ప్రాచీన కాలంనుంచి, భారతీయ సమాజంలో మతానికి ఒక సామాజిక వ్యవస్థగా చాలా ప్రత్యేకత ఉన్నది. మతం దానికిసంబంధించిన వ్యక్తులతో, సామాజిక నియంత్రణా పద్ధతులద్వారా,

ఒకవిధమయిన సమిష్టి జీవనాన్ని పెంపొందించేది. కాని నేటిసమాజంలో మతం నిర్వర్తించ వలసిన విధులు క్షీణించి పోవడంవల్ల, కొన్ని సామాజిక సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ముఖ్యంగా మత పరమయిన దురభిప్రాయాలు, సంఘర్షణలు అందువల్ల ప్రజలు సామాజిక సమైక్యతను సాధించని పోతున్నారు.

భారతీయ సామాజిక నిర్మితిలో సమిష్టి కుటుంబం చాలా ప్రధానమయిన వ్యవస్థ. సామాజిక ఉత్పత్తి, సామాజిక భద్రత మానసిక రక్షణ, క్రమశిక్షణ, ఉమ్మడి శ్రమ మొదలయిన విధులను సమిష్టి కుటుంబం నిర్వహిస్తూ ఉండేది. కాని ప్రస్తుతం, సమాజంలో పారిశ్రామికీకరణం. నగరీకరణం, వ్యక్తివాదం మొదలయినవి ప్రబలంగా ఉండటంవల్ల, నిర్మితిలోను, విధులలోను మార్పులువస్తున్నాయి. దీనివల్ల సమిష్టి కుటుంబం విచ్ఛిన్నమయి, దానిస్థానంలో ఆధునిక కుటుంబం ఏర్పడి అనేక సమస్యలను దారితీస్తున్నది.

సామాజిక పరివర్తన మన సమాజంలో వేగంగా జరగటంవల్ల దానితో బాటు సామాజిక నిర్మితిలో యిమిడిఉన్న వివిధ అంశాలు వేగంగా మార్పుచెందుతున్నాయి. అంతస్తు – పాత్రలలో (Status and role) మార్పులు జరుగుతున్నాయి. చాలామంది వ్యక్తులు మారుతున్న పరిస్థితుల కనుగుణంగా తమ అంతస్తును, పాత్రను రూపొందించుకోలేక పోతున్నారు. అందువల్లనే వ్యక్తి విఘటన, సామాజిక విఘటన జరిగి, సాంఘిక సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి.

మనదేశంలో ఉన్న సాంఘిక సమస్యలన్నీ, భారతీయ సామాజిక నిర్మితితో సంబంధమున్నవే. ఈ సమస్యలను శాస్త్రీయంగా అధ్యయనం చేయాలి. నేటి గ్రామీణ, నగర, గిరిజన సమస్యలకు పరిష్కారం కావాలంటే, భారతీయ సామాజిక నిర్మితిలోను, వ్యవస్థల, సంస్థల స్వభావ ప్రక్రియలలోను, మార్పులు తీసుకురావడం అవసరం.

## భారతదేశంలో సామాజిక సమస్యలు - ఒక పరిశీలన

సమాజ వ్యవస్థాపన, సామాజిక సంబంధాలపైనే పూర్తిగా ఆధారపడి ఉన్నది. సాంఘిక సంబంధాలు కుంటుపడినట్లయితే, సామాజిక అవ్యవస్థాపన ఏర్పడుతుంది. ఈ అవ్యవస్థతవల్ల సమస్యలు ఉత్పన్నమవుతాయి.

ప్రతి సమాజంలోను సామాజిక సమస్యలు ఉంటాయి. కాని వాటి స్వరూప స్వభావాలు వివిధ సమాజాలలో భిన్నంగా ఉంటాయి. అవి ఆయా ప్రాంతాల సాంస్కృతిక, సామాజిక, ఆర్థిక, నైతిక విలువలమీద ఆధారపడి ఉంటాయి.

భారత సమాజంలో ఏర్పడిన అనేక మార్పులకారణంగా, సామాజిక అవ్యవస్థత ఏర్పడి అనేక సమస్యలు ఉత్పన్నమయ్యాయి. సామాజిక సమస్యలు సమాజ నిర్మితి, సామాజిక విలువలలో కలిగిన మార్పులపైన ఆధారపడి ఉంటాయి. సాధారణంగా అన్ని దేశాలలోవున్న నేరం జనాభా

పెరుగుదల, నిరుద్యోగం, వ్యభిచారం మొదలగు సమస్యలు మన దేశంలో కూడా ఉన్నాయి. కాని కులవ్యవస్థ, అస్పృశ్యత, వెనుకబడిన వర్గాల సమస్యలు ప్రత్యేకంగా మన సమాజ నిర్మితివల్లనే ఏర్పడి నటువంటి సమస్యలు.

మన దేశంలో ఈనాటికి కూడా అధిక శాతం జనాభా గ్రామాలలోనే నివసిస్తున్నారు. వారిలో ఎక్కువ శాతం వ్యవసాయ వృత్తిపై ఆధారపడి జీవిస్తున్నారు. గ్రామీణ ప్రజలు ముఖ్యంగా పేదరికం, నిరక్షరాస్యత, అనారోగ్యం మొదలైన సమస్యలచే పీడింపబడుతున్నారు. అందుచే మన దేశంలో గ్రామీణ సమస్యల విశ్లేషణ, అధ్యయనం చాలా అవసరం.

## పేదరికం

నిరక్షరాస్యత, అంటరానితనం, సాంఘిక అసమానతలు, దోపిడీ (explaitation), ఆధునిక వ్యవసాయ పద్ధతులను ఉపయోగించలేకపోవటం, ఆర్థిక వనరుల అసమాన పంపిణీ మొదలయిన కారణాల వల్ల ఏర్పడిన పేదరికంతో గ్రామీణ ప్రజలు బాధపడుతున్నారు. వారి జీవన ప్రమాణస్థాయి సామాన్య ప్రజల స్థాయికంటే చాలా తక్కువగా ఉన్నది. కనీస అవసరాలను తీర్చుకొనే అవకాశం కూడా లేక దారిద్ర్యంతోనే అనేకమంది క్రమ్మగుతున్నారు. గిరిజన నగర సముదాయాలలోకూడా ఈ సమస్య ఎక్కువగా ఉంది.

## నిరక్షరాస్యత

భారతీయ సమాజ సమస్యలలో నిరక్షరాస్యత ముఖ్యమైనది. విద్యయొక్క ప్రాముఖ్యత ప్రయోజనం చాలమంది ప్రజలకు తెలియదు. విద్య నేర్చుకునే అవకాశాలు కూడా వారికి చాలా తక్కువగా ఉన్నాయి. సాంప్రదాయక పద్ధతులు, కుల వృత్తులకే అధిక ప్రాధాన్యత నివ్వటంవల్ల గ్రామీణ ప్రజలలో అనేకమంది నిరక్షరాస్యులుగానే ఉన్నారు. వారిలో వ్యక్తి అభివృద్ధి, గ్రామీణ సమగ్రాభివృద్ధి జరగకపోవటానికి నిరక్షరాస్యత ముఖ్యకారణమవుతున్నది.

ఆరోగ్యం : గ్రామీణ సమస్యలలో అనారోగ్యం ఒక ముఖ్యమయిన సమస్య. ఆరోగ్య సూత్రాలను పాటించకపోవటం, వ్యక్తి - పరిసరాల పారిశుభ్రతకు ప్రాధాన్యమివ్వకపోవటం, సరిఅయిన పోషకాహారాన్ని తీసుకొనకపోవటం, పారిశుధ్య సౌకర్యాలు లేకపోవటం, అంటువ్యాధులను, దీర్ఘ రోగాలను నివారించే పద్ధతులను ఉపయోగించకపోవటం, తగిన వైద్యసౌకర్యాలు లేకపోవటం, మొదలయిన కారణాలవల్ల గ్రామీణ ప్రజలలో అనారోగ్యం ప్రబలి ఉన్నది.

## సామాజిక జడత [Social - inertia]

సామాజిక జడత గ్రామీణ, గిరిజన, జీవన విధానాలలో ఎక్కువగా కన్పిస్తున్నది. మూర్ఖత్వం, సోమరితనం, నూతనపద్ధతు లవలంబించటానికి భయసందేహాలు, అలవాటుపడిన జీవితాన్ని మార్చుకోవటానికి ఇష్టం లేకపోవటం, మొదలయిన వానివల్ల ప్రజలలో సామాజిక జడత ఏర్పడు

సున్నది. గ్రామీణ, గిరిజన ప్రజల అభివృద్ధికి సామాజిక జడత ముఖ్య అవరోధమై ఉన్నది. దీనివలన, గ్రామీణ గిరిజన సముదాయాలలో యితర సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి.

భారతీయ సమాజంలో కులవిధానం, సమిష్టి కుటుంబం, అతి ముఖ్యమయిన సాంఘిక వ్యవస్థలో గల భేదాలు అస్పృశ్యతకు దారితీస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాలలోని వ్యక్తుల దృక్పథం. అలవాట్లు, ఆచారాలు మారకపోవటంవల్ల, అస్పృశ్యత యీనాటికీ తీరని సాంఘిక సమస్యగానే ఉన్నది. అంతేగాక కులతత్వంవల్ల సామాజిక ఐక్యత, సామాజిక అభివృద్ధి కుంటుపడుతున్నాయి.

మన సమాజంలో స్త్రీ విద్యకు ఆటంకం, వితంతు పునర్వివాహాలకు నిషేధం మొదలైనవి కూడా సమస్యలుగానే ఉన్నాయి. దీనికి కారణం ప్రజలలో సనాతన ఆచారాలు, మూఢ నమ్మకాలతో కూడిన అమాయకత్వం ప్రబలి ఉండటమే.

భారతీయ సామాజిక నిర్మితిలో సమిష్టి కుటుంబం చాలా ప్రధానమయిన వ్యవస్థ. కాని సమాజంలో త్వరితంగా వస్తున్న మార్పుల వలన ఈ వ్యవస్థ చాలా బలహీనమయింది. ఉత్పత్తి, సామాజిక భద్రత, క్రమశిక్షణ, మానసిక రక్షణ మొదలయిన ప్రాథమిక విధులను నిర్వర్తించే సమిష్టి కుటుంబం విచ్ఛిన్నం కావటంవల్ల, నేరం, మద్యపానం, అవినీతి, అనాథలు, అవివాహిత మాతృత్వం మొదలయిన అనేక వ్యక్తిగత, కుటుంబ, సాంఘిక సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ఈ సమస్యలు ముఖ్యంగా పారిశ్రామికీకరణంవల్ల అభివృద్ధి చెందుతున్న నగర సముదాయాలలో ఎక్కువగా మనకు కన్పిస్తున్నాయి.

జనాభా పెరుగుదల భారతదేశంలో ఒక ప్రధాన సమస్యగా చెప్పుకోవచ్చు. జనాభా పెరుగుదలవల్ల సమాజ ఆర్థిక స్థితి బాగా దిగజారిపోయింది. గ్రామీణ ప్రజలు ఉపాధికోసం నగరాలకు తరలిపోవడంవల్ల. నగరాలలో పెద్ద స్థాయిలో మురికివాడలు అవతరించాయి. దీనితోబాటు నిరుద్యోగము, అల్పోద్యోగం, దారిద్ర్యం, తక్కువస్థాయి జీవన ప్రమాణాలు, గృహవసతి సౌకర్యాలు తగినంతగా లేకపోవడం, వనరులను సక్రమమయిన రీతిలో వినియోగించుకోలేకపోవడం మొదలయిన సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ముఖ్యంగా నగర సముదాయాలలో మురికివాడలు, వ్యభిచారం, భిక్షుకవృత్తి, నేరం, బాలనేరం మొదలయిన సామాజిక సమస్యలు నానాటికీ విస్తృతిమవుతున్నాయి.

ఈ విధంగా పైన పేర్కొన్న సమస్యలన్నీ సామాజిక నిర్మితికి, ప్రకార్యాలలో వస్తున్న మార్పులమీద ఆధారపడి ఏర్పడినవే. ఈ సమస్యలను శాస్త్రీయ పద్ధతిద్వారా స్పష్టంగా అవగాహన చేసుకోవలసి ఉన్నది. ఈ సమస్యల స్వభావం, వాటి కారణాలు, సమస్యలవల్ల కలిగే దుష్ఫలితాలు, వాటిని నివారించే మార్గాలు, నిర్మూలించే పథకాలు మొదలయిన అంశాలను గురించి సాంఘిక పరిశోధనద్వారా కూలంకషంగా అవగాహన చేసుకోవాలి. అంతేగాక, సమస్యలకు గురిఅయిన వ్యక్తులకు, సరిఅయిన పునరావాస సౌకర్యాలను కల్పించాలి. ఈకృషిని రెండు విధాలుగా చేయవచ్చు ఒకటి సంస్థాగత సేవలు, (Institutional Services) రెండు సంస్థాగతేతర సేవలు (Non - Institutional Services)ఈ సేవలద్వారా సమస్యాపీడిత వ్యక్తులను తిరిగి సమాజంలో సక్రమమయిన జీవిత

విధానాన్ని, స్థాయిని పొందటానికి సంఘ సంక్షేమకృషి శాస్త్రీయ విధానాలను, ప్రక్రియలను ఉపయోగించాలి.

## భారతదేశంలో సంఘ సంక్షేమ కృషి (Social Work in India)

వ్యక్తిగత సమస్యల వల్లగాని, కుటుంబ సమస్యల వల్లగాని, సామాజిక పరిసరాల వల్లగాని, వ్యక్తులు సామాజిక జీవనప్రమాణాలకు అనుగుణంగా ప్రవర్తించడంలో విఫలులయితే, వారికి సహాయం చేయటమే సంక్షేమ కృషి యొక్క ముఖ్య ఆశయం. కొందరు వ్యక్తులు కొన్ని సమూహాలు ఒత్తిడిని, కష్టాలను ఎదుర్కొని ఆ పరిస్థితులు తట్టుకోలేనప్పుడు సంక్షేమ కార్యకర్త వారికి సహాయం చేస్తాడు. సంఘ సంక్షేమ కృషి సామాజిక సమస్యలను పరిష్కరించటానికి, తద్వారా వ్యక్తి అభివృద్ధి, సంఘ అభివృద్ధి సాధించటానికి కృషి చేస్తుంది.

చారిత్రాత్మకంగా సంఘ సంక్షేమ కృషి, మత మానవతా విలువల ప్రేరేపణవల్ల వాడుకలోనికి వచ్చింది. ధర్మకార్యాలు, సేవాకార్యక్రమాలు, మతంలో గాఢమైన విశ్వాసంవల్ల నిర్వహించటం జరుగుతూ ఉండేది. మన దేశంలో అనాదినుంచీ సంఘసేవ ఆచరణలో ఉండేది. ప్రాచీన కాలంలో సమస్యా పీడితులను సమిష్టి కుటుంబాలు, కులాలు, మతాలు ఆదుకొనేవి. అనాథలు, వితంతువులు, రోగగ్రస్తులు, వికలాంగులు మొదలగువారి సంక్షేమం కోసం కులవ్యవస్థలు, మత సంస్థలు, సాంఘిక సేవా సంస్థలు అనేక రకాల సేవా కార్యక్రమాలను ఏర్పాటుచేసేవి.

సమాజంలో అతివేగంగా ఆర్థిక, సాంఘిక మార్పులు జరిగాయి. పారిశ్రామికీకరణం, నగరీకరణంవల్ల గ్రామాలలోని అధిక శాతం ప్రజలు పట్టణ ప్రాంతాలకు తరలిపోవడం ప్రారంభించారు. దీని వల్ల స్వయం సమృద్ధమై అనేక ప్రాథమిక విధులను నిర్వహిస్తున్న సమిష్టి కుటుంబం విచ్ఛిన్నమైంది. మనదేశంలోవున్న పేదరికం, నిరక్షరాస్యత, సాంఘిక అసమానతలవల్ల సమస్యలు చాలా తీవ్రతరమైనాయి. అనేక సాంఘిక దురాచారాలు, సాంఘిక సమస్యలు నూతనంగా ఏర్పడినాయి. క్లిష్టమైన విస్తృతిమైన సాంఘిక సమస్యలను పరిష్కరింపటానికి తాత్కాలిక సహాయాన్నందించే స్వచ్ఛంద సంఘసేవ ఎంతమాత్రం చాలదని సంఘ సంస్కర్తలు గుర్తించారు.

సమస్యలు శాశ్వతంగా పరిష్కారమైతేనేకాని, సంఘం అభివృద్ధిచెందదని వారు గ్రహించారు. సాంఘిక పరిస్థితులను, సాంఘిక సమస్యలను క్షుణ్ణంగా పరిశీలించి కారణాలను తెలిసికొని వాటిని తొలగించడానికి, తద్వారా సమస్యలకు శాశ్వత పరిష్కారాన్నివ్వటానికి సంస్కర్తలు అధికంగా కృషి చేశారు. సంఘసంస్కరణోద్యమాలద్వారా సతీసహగమనం, బాల్యవివాహాలు, అంటరానితనం, మద్యపానం మొదలైన సాంఘిక సమస్యలను నిర్మూలించటానికి ప్రయత్నించారు.

1936 వ సంవత్సరంలో సర్ దొరాబ్జి తాతా స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్ (Sir Dirabji Tata School of Social Work) స్థాపించడమైంది. ఈ సంస్థ కార్యకర్తలకు సంఘ సంక్షేమ మనో విజ్ఞాన శాస్త్రాలలోను శాస్త్రీయ పద్ధతులలో సమస్యలను పరిష్కరించడంలోను శిక్షణ ఇస్తుంది. ఈ

సంస్థలో శిక్షణపొందిన కార్యకర్తలకు వివిధ సంక్షేమసంస్థలలో పనిచేయటానికి తగిన అర్హత, వేతనం లభిస్తుంది.

స్వాతంత్ర్యానంతరం మనదేశం సంక్షేమ రాజ్యంగా వెలసిల్లింది. సమాజ సంక్షేమానికి అధిక ప్రాధాన్యత నిచ్చినది. అనేక సంక్షేమ సేవలను ప్రభుత్వం ప్రణాళికాబద్ధంగా శాస్త్రీయ పద్ధతులలో వివిధ సంక్షేమ సంస్థల ద్వారా అమలుపరుస్తున్నది. ప్రభుత్వం సంఘ సంక్షేమ కృషి యొక్క ప్రాధాన్యతను గుర్తించింది. సమస్యాపీడిత వ్యక్తులతో పనిచేయటానికి, సమాజ వికాసానికి తగిన కృషి చేయటానికి వీలుగా, ఒక ప్రత్యేక శాస్త్రీయ పద్ధతిగా, వృత్తిగా ప్రస్తుతం సంఘ సంక్షేమ కృషి మనదేశంలో అభివృద్ధి చెందుతూవుంది.

## సంఘ సంక్షేమ కృషి - నిర్వచనం

సంఘ సంక్షేమ కృషి అంటే, "సమాజంలోని వివిధ వనరులను ఒకచోట సమీకరించి, దాని ప్రభావం వ్యక్తులమీద, సమూహాలమీద ఉండేటట్లుచేసి, శాస్త్రీయ పద్ధతులద్వారా, ప్రజలకు సహాయ సహకారాలందించాలని, తద్వారా ప్రజలు తమకు తామే సహాయపడేటట్లు చేసే కళ" అని ప్రొఫెసర్ స్ట్రూప్ (Prof. Stroup) నిర్వచించాడు. ప్రొఫెసర్ అండర్సన్ (Prof. Anderson) నిర్వచన ప్రకారం "సంఘ సంక్షేమ కృషి అంటే ప్రజలను వ్యక్తిగతంగా, సామాజికంగా నిర్దిష్ట జీవిత విధానాలలో వారి వారి ప్రత్యేక అభిరుచులకు, శక్తిసామర్థ్యాలకు అనుగుణంగా సముదాయంలోని వివిధ వర్గాల మధ్య సామరస్యాన్ని సాధించే వృత్తిసేవా కార్యక్రమం.

## సంఘ సంక్షేమ కృషి - శాస్త్రీయ పద్ధతులు

సంఘ సంక్షేమ కృషి కార్యకర్త వ్యక్తులతో, సమూహాలతో, సముదాయాలలో, సమాజాలతో పనిచేసేటప్పుడు ఆరు ముఖ్యమైన శాస్త్రీయ పద్ధతులను ఉపయోగిస్తాడు. అవి :

1. వ్యక్తి సేవా పద్ధతి (Case Work)
2. సమూహ సేవా పద్ధతి (Group Work)
3. సాముదాయిక వ్యవస్థాపన (Community Organisation)
4. సామాజిక చర్య (Social Action)
5. సాంఘిక పరిశోధన (Social Research)
6. సంఘ సంక్షేమకృషి కార్యక్రమాల నిర్వహణ(Social Welfare Administration)

## 1. వ్యక్తి సేవా పద్ధతి (Case Work)

సంఘ సంక్షేమ కృషిలో వ్యక్తి సేవా పద్ధతి ముఖ్యమైనది. వ్యక్తుల అశక్తతలను తెలుసుకొని, వాటిని నిర్మూలించడానికి, వ్యక్తులతో వ్యక్తిగతంగా పనిచేసే సంక్షేమకృషి విధానాన్ని వ్యక్తి సేవా పద్ధతి అంటారు. వ్యక్తిలో అంతర్లీనంగా ఉన్న శక్తులను సమీకరించి, అతని స్వశక్తితో సమస్యలను తానే ఎదుర్కొనేటట్లు చేయడం వ్యక్తిసేవయొక్క లక్ష్యం.

## 2. సమూహ సేవా పద్ధతి (Group Work)

జనసమూహాలలో ఒక క్రమ విధానంలో, నిర్ణీత పద్ధతిలో, పథక నిర్దేశ ప్రకారం, పనిచేసే విధానమే సమూహ సేవా పద్ధతి. హెచ్. బి. ట్రెకర్ (H. B. Tracker) "వ్యక్తి, సమూహం, సమాజం", ఈ మూడింటి పురోభివృద్ధిని లక్ష్యంగా ఉంచుకొని, సాంఘిక సమూహాలలోని వ్యక్తుల కోర్కెలకు, శక్తిసామర్థ్యాల కనుగుణంగా, సమూహ కార్యక్రమాలద్వారా, వారి పురోభివృద్ధికి తగిన అవకాశాలను కల్పించే పద్ధతిని సమూహ సేవా పద్ధతిగా నిర్వచించాడు.

## 3. సాముదాయిక వ్యవస్థాపన (Community Organisation)

సమాజంలో లభ్యమయ్యే వనరులను సమకూర్చి వాటినిస క్రమంగా వినియోగించి, సాంఘిక అసమానతలు, సాంఘిక అవ్యవస్థతవల్ల ఉత్పన్నమయ్యే, సాముదాయక సమస్యలను పరిష్కరించడానికి సాముదాయక వ్యవస్థాపన కృషి తోడ్పడుతుంది.

## 4. సామాజిక చర్య (Social Action)

సామాజిక సమస్యలను తెలుసుకొని, వాటిని పరిశోధించి, వాటిని శాస్త్రీయపద్ధతిలో పరిష్కరించటానికి ఉపయోగించే సంఘ సంక్షేమకృషి విధానమే సామాజిక చర్య. సామాజిక సమస్యలను, సామాజికకృషి ద్వారా, ఎదుర్కొనే విధానమే సామాజికచర్య. సామాజిక శాసనాలను రూపొందించటానికి, వాటిని అమలుపరచడానికి సామాజికచర్య చాలా ఉపయోగపడుతుంది.

## 5. సాంఘిక పరిశోధన (Social Research)

సంఘ సంక్షేమకృషి, సాంఘిక సమస్యలను నిర్మూలించటానికి ప్రయత్నిస్తుంది. సమస్యల శాశ్వత పరిష్కారానికి, శాస్త్రీయ పద్ధతిలో కృషిచేయవలెనంటే, సమస్యలను పూర్తిగా అధ్యయనం చేసి, సమస్యల కారణాలను వాటివల్ల కలిగే దుష్ఫలితాలను, నిర్మూలించే మార్గాలను అవగాహన చేసుకోవలె. వ్యక్తి, సమూహం, సముదాయం, సమాజం యొక్క సమస్యలను, సంక్షేమ కృషి కార్యకర్త సాంఘిక పరిశోధన ద్వారా అర్థం చేసుకుంటాడు.

## 6. సంఘ సంక్షేమ కృషి - కార్యక్రమాల నిర్వహణ (Social Welfare Administration)

సంఘ సంక్షేమ కృషి కార్యక్రమాలను సంక్షేమ సంస్థల ద్వారా ప్రణాళికాబద్ధంగా అమలు పరచటాన్ని సంక్షేమ కృషి కార్యక్రమముల నిర్వహణ అనవచ్చు. పథకములనేర్పాటుచేయటం, వనరులను క్రమబద్ధంగా సమీకరించి వినియోగించటం, కార్యక్రమాలను క్రమబద్ధమైన పద్ధతిలో నిర్వహించటం, ఈ పద్ధతియొక్క ముఖ్య అంశాలు.

## భారత దేశంలో సంఘ సంక్షేమ కృషి

భారత ప్రభుత్వం, స్వాతంత్ర్యం వచ్చిన తరవాతనే, సాంఘిక సంక్షేమ రంగంవైపు దృష్టి మరల్చింది. దేశం సంక్షేమ రాజ్య స్థాపనకు ప్రధాన లక్ష్యంగా పెట్టుకొన్నది. పంచవర్ష ప్రణాళికలను

ప్రవేశపెట్టినది మొదలు సంక్షేమ సేవలు విస్తారంగా అభివృద్ధి చెందుతున్నాయి. సాంఘిక సంక్షేమం కోసం అనేక శాసనాలను ప్రవేశపెట్టడం జరిగింది. కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లలో అనేక నిధులను సంక్షేమ సేవల కోసం కేటాయించడం జరిగింది. గత కాలంలో సాంఘిక సంక్షేమ కృషి సేవలు కేవలం నామ మాత్రంగానే జరిగేవి. కాని ప్రస్తుత కాలంలో ప్రభుత్వం సంక్షేమ రంగంలో అధిక శ్రద్ధ తీసుకోవడం వల్ల సాంఘిక సంక్షేమ రంగంలో ఒక నూతన శకం ఆవిర్భవించింది.

భారతదేశంలో, సంక్షేమ రంగంలో, స్వచ్ఛంద సంస్థలకు ప్రముఖస్థానం ఉంది. స్వచ్ఛంద సేవాసంస్థలు, ప్రాచీన కాలంనుంచీ ఇప్పటివరకు, అనేక సంక్షేమ కార్యక్రమాలను ప్రవేశపెట్టి, దేశ సంక్షేమాభివృద్ధికి ఇతోధికంగా కృషిచేస్తున్నాయి. స్వచ్ఛంద సంస్థలను పటిష్టంచేసి, తద్వారా సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను సక్రమ మార్గంలో నిర్వహించాలనే ముఖ్య ఉద్దేశ్యంతో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థను (U. S. W. B.) 1953 వ సంవత్సరంలో ఏర్పరచటం జరిగింది.

ప్రస్తుతం మన దేశంలో సాంఘికాభివృద్ధికి విద్య, ఆరోగ్యం, గృహనిర్మాణం మొదలయిన సంఘసేవలను, ఆర్థిక, భౌతిక, మానసిక, సాంఘిక అశక్తతలకు గురిఅయిన వ్యక్తుల, సమూహాల అభివృద్ధికోసం ప్రత్యేకమయిన సంక్షేమ కార్యక్రమాలను ప్రభుత్వం విరివిగా అమలుపరుస్తున్నది. మారుతున్న సామాజిక పరిస్థితులను అధ్యయనంచేసి, వాటిని పరిష్కరించటానికి వీలుగా, సంక్షేమ కృషిలో అనేక నూతన శాస్త్రీయ విధానాలు అభివృద్ధి చెందుతున్నాయి.

కాని మన దేశంలో, ఆర్థిక వనరులు తక్కువగా ఉండటంవల్ల, ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలను తగినరీతిలో నిర్వహించలేకపోతున్నది. అంతేకాక, సంఘ సంక్షేమకృషి విధానాలను మన దేశంలో అధికంగా, సమస్యల పరిష్కారానికి ఉపయోగిస్తున్నారు. సమస్యలను నిరోధించటానికి, సమస్యాపీడితుల పునరావాసానికి అంత అధికంగా ఉపయోగించటం లేదు. సంక్షేమ కార్యక్రమాల ప్రణాళికారచనలోను, పరిపాలనా విధానంలోను సంక్షేమ కార్యకర్తలకు తగిన ప్రాముఖ్యతను ఇచ్చినట్లయితే, సంక్షేమకృషి మన దేశంలో విజయవంతం అవుతుంది. సంక్షేమ కార్యకర్తలకు తప్పనిసరిగా, వృత్తి - పాక్షికవృత్తి యందు ప్రత్యేక శిక్షణా కార్యక్రమాలను ఏర్పాటుచేయవలె. ప్రభుత్వసంస్థలు, స్వచ్ఛంద సంస్థలు, సంక్షేమ సేవా కార్యక్రమాలను నిర్వహించడానికి సుశిక్షితులయిన సంక్షేమ కార్యకర్తలను నియమించవలె.

## సామాజిక అస్వస్థత భావన - స్వభావం

### (Concept of Social Pathology - Nature and meaning)

సమాజం యొక్క ప్రధాన విధులకు క్రమవిధానాలను భంగం కలిగించే అనారోగ్యకర మయిన పద్ధతులను, పరిస్థితులను సామాజిక అస్వస్థతగా చెప్పవచ్చు. సమాజంలోని సమస్యలను అధ్య యనం చేసే సమాజ శాస్త్రంలో ఒక భాగమే, "సామాజిక అస్వస్థత" (Social Pathology). సమాజంలో మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా సాంఘిక జీవితాన్ని సర్దుబాటు చేసుకోలేని వ్యక్తుల

సంఘర్షణ ఎక్కువగా ఉన్నప్పుడు, ఆ పరిస్థితిని సామాజిక అస్వస్థత అంటారు. వ్యక్తులు, సామాజిక ప్రక్రియలలో పాల్గొనడానికి అవసరమయిన శక్తి సామర్థ్యాలను కోల్పోయినప్పుడు ఆ పరిస్థితిని కూడా సామాజిక అస్వస్థత అనవచ్చు. సామాజిక అస్వస్థత, సాంఘిక అసమయోజనాన్ని (maladjustment) సాంఘిక అవ్యవస్థ (Social Disorganisation) ను తెలియచేస్తుంది.

ప్రతీ సమాజంలోను మనకు నియమాలు, నిబంధనలు గోచరిస్తాయి. ఈ నియమాలు వ్యక్తుల అవసరాలను తీర్చుకోవటానికి, సాంఘిక సంబంధాలను క్రమపరచటానికి వ్యక్తిగత, సాంఘిక అభివృద్ధి సాధించటానికి తోడ్పడతాయి. సమాజం రూపొందించిన నియమాలను ఉల్లంఘించే ప్రవర్తనను సామాజిక విచలిత ప్రవర్తన (Social deviant behaviour) అని అంటారు. మోసం దొంగతనం, వ్యభిచారం, బాలనేరం మొదలయినవి సామాజిక విచలిత ప్రవర్తనకు ఉదాహరణలు. సమాజంలో విచలన నేరాలువల్ల అక్రమ ప్రవర్తన, నియమోల్లంఘన, అవినీతి మొదలయినవి సామాజిక సమతుల్యత (Social equilibrium) ను సామాజిక సంక్షేమాన్ని భంగపరుస్తాయి. దీనివల్ల సామాజిక అభివృద్ధి కుంటుపడి వ్యక్తి సంక్షోభం, సామాజిక సంఘర్షణ అధికమవుతాయి. సామాజిక భద్రత, సంక్షేమం రెండూ ప్రమాదానికి గురయినపుడు సామాజిక అస్వస్థత ప్రారంభమవుతుంది.

భారత దేశంలో సామాజిక అస్వస్థత ఏర్పడటానికి కొన్ని ప్రత్యేకమయిన భౌగోళిక (Geographical) ఆర్థిక, సాంఘిక కారణాలున్నాయి. అభివృద్ధి చెందుతున్న మన దేశంలో అన్ని రకాల నేరాలకు సామాజిక విచలిత ప్రవర్తనకు, సామాజిక అస్వస్థతా పరిస్థితులకు, భౌగోళిక, ఆర్థిక, కారణాలే ముఖ్యమైనవని చెప్పవచ్చు. కరువు, అనావృష్టి, నిరుద్యోగం, పేదరికం మొదలైనవి సామాజిక సమస్యలకు ప్రత్యక్షంగానో పరోక్షంగానో కారణాలవుతున్నాయి.

మత సాంప్రదాయాలు, సాంఘిక విలువలుకూడా కొన్నిసార్లు సామాజిక అస్వస్థతకు దారి తీస్తాయి. స్త్రీలను దేవతలకు అంకితంచేసే (Dedication of girls to God) దేవదాసీ పద్ధతి ఆడపిల్లలను చిన్నతనాలలో వారిని అలక్ష్యంచెయ్యటం మొదలైనవి వ్యభిచారాన్ని ప్రోత్సహించాయి.

వెనుకబడిన తెగలకు, బలహీన వర్గాలకు చెందినవారి జీవన ప్రమాణాలు చాలా తక్కువ స్థాయిలో ఉండటంవల్ల, వారిలో చెడు వ్యసనాలు, నేరం మొదలైనవి ఎక్కువగా ప్రబలుతున్నాయి. సామాజిక అస్వస్థ పరిస్థితులకు ముఖ్య కారణం మురికివాడలు (Slums) అని చెప్పవచ్చు. పారిశ్రామికీకరణ ప్రణాళికాబద్ధంగా జరగకపోవడంవల్ల ఒక ప్రాంతంలోనే ఎక్కువ పరిశ్రమలు కేంద్రీకృతం కావటంవల్ల, ప్రజలు అధిక సంఖ్యలో ఉపాధినిమిత్తం గ్రామీణ ప్రాంతాలనుంచి పట్టణ ప్రాంతాలకు వలసపోవటంవల్ల జనాభా వృద్ధికి అధికమై నగరాలలో చాలా మురికివాడలు ఉత్పన్నమైనాయి. ఈ మురికివాడలే సామాజిక అస్వస్థతా పరిస్థితులకు పుట్టినిల్లు.

మన దేశంలో అనేక సాంఘిక, ఆర్థిక మార్పులు సంభవించాయి. వీటివల్ల వివిధ సాంఘిక సంస్థల పనితీరులో, విధులలో మార్పులు కలిగాయి. ఇది సమాజ క్షీణతకు చాలావరకు కారణమై

యాయి. పట్టణాల, నగరాల అభివృద్ధి చాలా వేగంగా జరగటంవల్ల వ్యక్తుల అలవాట్లు, అభిరుచులు వాటికి అనుగుణంగా కాక, చాలా నెమ్మదిగా మార్పు చెందటంవల్ల సమాజంలో కలవరం ఏర్పడింది. సమిష్టి కుటుంబం విచ్ఛిన్నం కావటం, సాంఘిక అంతస్థులు, ఆచారవ్యవహారాలలో మార్పులు కలగటం మొదలయిన వాటివల్ల వ్యక్తులు అనేకమైన సాంఘిక, ఆర్థిక ఒత్తిడులలు ఎదుర్కొనవలసి వచ్చింది. ప్రాచీన సంప్రదాయ విలువలకు, నూతన సాంఘిక జీవిత విధానాలకు సమన్వయం లేకపోవటంవల్ల, సాంఘిక సంబంధాలు చాలా వరకు దెబ్బతిన్నాయి. ప్రాచీన సామాజిక నియంత్రణా విధానాల ప్రభావంకూడా చాలావరకు తగ్గిపోయింది. సామాజిక, నైతిక ప్రమాణాలవల్ల మన సమాజం, సామాజిక అస్వస్థతను, సామాజిక విచ్ఛిత్తిని వివిధ దశలలో ఎదుర్కొంటున్నది.

## సామాజిక వ్యవస్థాపన - సామాజిక అవ్యవస్థాపన - కారణాలు - సిద్ధాంతాలు (Social organisation - Social disorganisation - Causes and Theories)

సామాజిక అవ్యవస్థతను, సామాజిక సమస్యలను గురించి, అధ్యయనం చేసేముందు, సామాజిక వ్యవస్థాపన అంటే ఏమిటో అర్థంచేసుకోవాలి. సామాజిక నిర్మితిలో ఉన్న సమూహాలు, సముదాయాలు, సంస్థలు, పరస్పర సహకారంతో, పరస్పర ఆధారంతో నిర్దేశించిన కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉంటే, ఆ స్థితిని సామాజిక వ్యవస్థాపన (Social organisation)అంటారు. (మెక్కైవర్) పాత్రల సంబంధాలు, విలువలు, ప్రమాణాలు, నమ్మకాలు, విధులు, మొదలైన సామాజిక ప్రక్రియలు కలిగినదే సామాజిక వ్యవస్థాపన అనవచ్చు. సమాజంలోని వ్యక్తుల మధ్య సుస్థిరమైన సంబంధాలు కలిగిఉండి, సమాజంలోని వ్యక్తులు, పరిసరాలతో సర్దుబాటు చేసుకుంటూ సామాజిక జీవితం కుంటు పడకుండా సంరక్షించుకొంటు ఉంటే, ఆ సమాజాన్ని వ్యవస్థిత సమాజం (Organised Society) అంటారు.

సమాజంలోని వ్యక్తులు, తమ అవసరాలను ఆశయాలను సంతృప్తి పరచుకోవడానికి సక్రమమైన సామాజిక జీవనం గడపడంకోసం. తమ ప్రవర్తనకు సంబంధించి కొన్ని నియమాలను, ప్రమాణాలను రూపొందించుకొంటారు. ఆ విధంగా రూపొందించిన సామాజిక ప్రమాణాలు, సామాజిక సంబంధాలను స్థిరపరుస్తాయి. ఈ సామాజిక సంబంధాల నాధారంగా చేసుకొని, అనేకమైన సామాజిక సంస్థలు, వ్యవస్థలు ఏర్పడతాయి. ఈ సామాజిక సంబంధాలు నియమబద్ధం కావడంవల్ల సమాజం క్రమబద్ధమవుతుంది. సమాజంలో ఉన్న సామాజిక సంబంధాలు, సమూహాలు, సంస్థలు, ప్రమాణాలు, విలువలు ఇవి అన్నీ పరస్పర సంబంధం కలిగి ఉండడమే కాకుండా, అవి ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉంటాయి. ఈ విధంగా పరస్పర సంబంధం, ఆధారం కలిగిఉన్న సామాజిక సంబంధాలతో ఏర్పడిన సమాజాన్ని "సామాజిక వ్యవస్థ" అంటారు.

## సామాజిక పరస్పర చర్యలు (Social Interactions)

నిత్యజీవితంలో వ్యక్తుల మధ్య అనేక పరస్పర చర్యలు జరుగుతుంటాయి. వ్యక్తుల మధ్య జరిగే పరస్పర చర్యలవల్ల, సామాజిక సంబంధాలు ఏర్పడతాయి.

## పాత్ర - పరస్పర చర్యలు (Role Interactions)

సామాజిక జీవితంలో వ్యక్తులు తమ శక్తి సామర్థ్యాలను, మానసిక ప్రవృత్తులనుబట్టి, విభిన్నమైన కార్యకలాపాలలో పాల్గొంటూచేసే చర్యలను పాత్ర (role) అంటారు. తండ్రి, తల్లి, కుమార్తె, కుమారుడు, భార్య, భర్త, విద్యార్థి, ఉపాధ్యాయుడు, కార్మికుడు, కర్షకుడు, ఉద్యోగి, యజమాని, కార్యకర్త మొదలైన అనేక పాత్రలను నిర్వహిస్తూ ఉంటారు. వ్యక్తులు సమాజంలో విభిన్న సందర్భాలలో, విభిన్నమైన పాత్రలను నిర్వహిస్తూ ఉంటారు. ఉదాహరణకి ఒకే వ్యక్తి సందర్భాన్నిబట్టి తండ్రిగా, భర్తగా, ఉద్యోగిగా, నాయకునిగా విభిన్న పాత్రలను నిర్వహించవలసివస్తుంది.

వ్యక్తులు సామూహిక జీవనంలో నిర్వహించే పాత్రలనుబట్టి వారి అంతస్తు (Status) హోదా నిర్ణయించబడతాయి. వ్యక్తులలోని వ్యత్యాసాలను బట్టికూడా పాత్ర - అంతస్తు మారుతూ ఉంటాయి. వ్యక్తులు తమ అంతస్తుకు అనుబంధమైన పాత్రలను నిర్ణీత ప్రమాణాలకులోనై నిర్వహించాలి. వ్యక్తి వివిధ అంతస్తులలో జరిపే పాత్రలన్నింటి మధ్య సామరస్యం ఉండాలి. ఈ విధంగా సమాజంలో పాత్ర అనుగుణంగా (Role Congruence) ఉన్నప్పుడు సమాజ వ్యవస్థాపన కలుగుతుంది.

వ్యక్తులవలెనే సమాజంలోని వివిధ సమూహాలు కూడా విభిన్న పాత్రలను నిర్వహిస్తూ ఉంటాయి. అవి తమ ప్రత్యేక లక్ష్యాలను, ఉద్దేశాలను సాధించి సమూహ వ్యక్తుల అవసరాలను సంతృప్తిపరచడానికి ప్రయత్నిస్తాయి. సాధారణంగా ఈ సమూహంలోని సభ్యులందరూ సంఘటితంగా ఐక్యంగా ఉంటారు. కార్మిక సంఘాలు, విద్యార్థి సంఘాలు వీటికి ఉదాహరణలు.

సమాజంలోవున్న సమూహాలన్నీ, ఒకదానితో ఒకటి సహకార సంబంధాలు కలిగి ఉన్నట్లయితే సమాజం వ్యవస్థీకృతమవుతుంది.

## అంతస్తు సంబంధాలు (Status Relationships)

సామాజిక వ్యవస్థలో, వ్యక్తి లేదా సమూహం స్థాయిని సూచించడానికి అంతస్తు (Status) అనే పదం ఉపయోగిస్తారు. వ్యక్తులు, తమలోని జైవిక, ఆర్థిక, సాంస్కృతిక, సామాజిక అంశాలలోని తేడాలనుబట్టి వివిధ అంతస్తులలో ఉంటారు. సామాజిక అంతస్తుకు, పాత్రకు చాలా దగ్గర సంబంధం ఉంటుంది. సామాజిక వ్యవస్థలో వ్యక్తి అంతస్తు అతని పాత్రను నిర్ణయిస్తుంది. ఆవిధంగానే వ్యక్తి నిర్వహించే పాత్రలనుబట్టి, అతడు సామాజిక వ్యవస్థలో అంతస్తును సంపాదించుకొంటాడు.

సమాజంలో వ్యక్తులు తమ అంతస్తును రెండు రకాలుగా కలిగి ఉంటారు.

### 1. ఆరోపించిన అంతస్తు (Ascribed Status)

వ్యక్తులు తమ జైవిక, ఆర్థిక, సాంఘిక, సామాజిక, సాంస్కృతిక లక్షణాలనుబట్టి, విభిన్న అంతస్తులను పొందుతారు. ఈ విధంగా సంప్రాప్తించిన అంతస్తును ఆరోపించిన అంతస్తు అంటారు.

## 2. సాధించిన అంతస్తు (Achieved Status)

కొంతమంది వ్యక్తులు తమ శక్తి సామర్థ్యాల నుపయోగించి, ప్రత్యేక పాత్రలను నిర్వహిస్తారు. దానివల్ల వారు అంతస్తును పొందుతారు. ఇట్లా పొందిన అంతస్తును సాధించిన అంతస్తు అంటారు. ఆధునిక సమాజంలో వ్యక్తులు, సమూహాలు చాలావరకు తమ అంతస్తునుంచి మరొక అంతస్తుకు మారి, సామాజిక గతిశీలత (Social mobility) పొందుతారు. వ్యక్తుల అంతస్తు సంబంధాలలో సామరస్యం చాలా అవసరం. విభిన్న అంతస్తులు గల వ్యక్తుల మధ్య, సామూహాల మధ్య, సామరస్యం పెంపొందించటానికి, ప్రమాణాలు, విలువలు రూపొందుతాయి. వాటివల్లనే, అంతస్తులలో తేడాలు ఉన్నప్పటికీ, వివిధ సమూహాలమధ్య సన్నిహిత్యత ఉంటుంది.

## సామాజిక నిర్మితి (Social Structure)

మెర్టన్ (Merton) అభిప్రాయ ప్రకారం, పాత్రసమితి, (Role set) అంతస్తు సమితి (Status set) ఒక నమూనాగా రూపొందితే, దానిని సామాజిక నిర్మితి అంటారు. ఉదాహరణకు, కుటుంబ విధులు నెరవేర్చటానికి తల్లి, తండ్రి, భార్య, భర్త, కొడుకు, కూతురు, మొదలైన అంతస్తు, పాత్ర సంబంధాలు కలిగిఉన్న, దానిని కుటుంబ నిర్మితి (Structure of the family) అంటారు.

సమాజంలో వివిధ ప్రకార్యాలకు సంబంధించి, వివిధ నిర్మితి ఏర్పడతాయి. ఆర్థిక, విద్యా విషయక, మత, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక, వినోద ప్రకార్యాలకు సంబంధించి అనేక నిర్మితులుంటాయి. వీటిలో కొన్ని సమూహాలు (groups)గా సమితులుగా (Association)గా సంస్థలుగా (Institutions) వ్యవస్థాపనలు (Organisations)గా ఏర్పడతాయి.

## సామాజిక ప్రక్రియలు (Social Processes)

సాంఘిక జీవనం, సాంఘిక సంబంధాలు కూడా ఈ సాంఘిక చర్యల పర్యవసానమే. సమాజంలో క్రమత, నిర్మాణం, వ్యవస్థ, ఈ సాంఘిక ప్రక్రియల ననుసరించే జరుగుతాయి. సమాజంలో సాధారణంగా, సాంఘిక ప్రక్రియ ఈ క్రింది విధంగా జరుగుతుంది.

## 1. సంఘర్షణ (Conflict)

ప్రత్యర్థిని లేదా పోటీదారుని ఏదోరకంగా బలహీనునిగా చేసి, అణగద్రొక్కి- తన ప్రయోజనం సాధించుకొనే ప్రక్రియనే సంఘర్షణ అంటారు. సమస్యలను ఎదుర్కొ-డానికి సంఘర్షణ ప్రోత్సహిస్తుంది. సంఘర్షణ సామాజిక పరివర్తనకు దారితీస్తుంది. సంఘర్షణ ఫలితంగా నూతన సంస్థలు, నూతన నియమాలు రూపొందుతాయి. ఉదాహరణకు ఐక్యరాజ్యసమితి రెండో ప్రపంచ యుద్ధ ఫలితమే. కార్మికులకు, యజమానులకు మధ్య సంఘర్షణ ఏర్పడినపుడు చట్టాలు లేదా చట్టాలలో మార్పు, కొత్త నిబంధనలు రూపొందుతాయి. సంఘర్షణ కొన్ని సమయాలలో సామాజిక ప్రగతికి దారి తీస్తుంది.

## 2. పోటీ (Competetion)

ధనము, వస్తువులు, అంతస్తు, హోదా, అధికారం మొదలైన ప్రయోజనాలు, వనరులు అందరికీ సమానంగా లభ్యం కావు. కొంతగావుండే ఈ ప్రయోజనాలను, వనరులను అందరూ ఆశించ

డంవల్ల పోటీ ఏర్పడుతుంది. పోటీ, వ్యక్తుల సామాజిక అంతస్తును నిర్ణయిస్తుంది. వ్యక్తులు తమ శక్తి సామర్థ్యాలను ప్రదర్శించడానికి పోటీ అవకాశాన్ని కలిగిస్తుంది.

### 3. సర్దుబాటు (Accommodation)

పరిస్థితులకు అనుగుణంగా ప్రవర్తనలు సరిదిద్దుకొని జీవనాన్ని సాగించే పద్ధతిని సర్దుబాటు అంటారు. వ్యక్తులమధ్య, సమూహాలమధ్య భేదాలున్నప్పటికీ, సంఘర్షణా పరిస్థితులు శాశ్వతం కాకుండా సర్దుబాటు తోడ్పడుతుంది. సామాజిక వ్యవస్థాపన సర్దుబాటుపైనే ఆధారపడి ఉంటుంది. సర్దుబాటు లోపిస్తే, సంఘర్షణలు పెరిగి, సామాజిక వ్యవస్థ భద్రతకు కోల్పోతుంది.

### 4. సహకారం (Co-operation)

ఒక పనిని లేదా కొన్ని ఆశయాలను నెరవేర్చటానికి, ఇద్దరు లేదా అంతకంటె ఎక్కువ మంది మధ్య ఏర్పడే సంబంధాలనే "సహకారమని" ఎ. డబ్ల్యు. గ్రీన్ (A. W. Green) నిర్వచించాడు. సామాజిక వ్యవస్థలు, వాటి నిర్మితి, వ్యక్తుల మధ్యగల సహకారంపై ఆధారపడి ఉంటాయి. సంస్థితమైన సామూహిక జీవితం (balanced social life), సభ్యుల మధ్యగల సహకారం మీదే ఆధారపడి ఉంటుంది.

## సామాజిక పరివర్తన (Social change)

మెకైవర్, పేజ్‌ల (Maciver and Page) అభిప్రాయం ప్రకారం, సామాజిక సంబంధాలలో కలిగే మార్పులే సామాజిక పరివర్తన. గిల్లిన్, గిల్లిన్‌ల (Guillin and Guillin) అభిప్రాయం ప్రకారం, స్థిరపడిన సామాజిక జీవన విధానంలో మార్పురావడమే సామాజిక పరివర్తన. సామాజిక మార్పుకు నిరంతరం దోహదం చేసే కారకాలు ముఖ్యంగా నాలుగు రకాలుగా ఉన్నాయి. భౌతిక పరిసరాలలో మార్పుకలిగినప్పుడు సమాజం కూడా మార్పుకు లోనవుతుంది. డార్విన్ (Darwin) ఉద్దేశంప్రకారం, సామాజిక పరివర్తన ప్రధానంగా, జైవిక పరివర్తనవల్లనే జరుగుతుంది. సాంకేతికాభివృద్ధి జరిగినప్పుడు కూడా సామాజిక మార్పులు సంభవిస్తాయి. సాంకేతిక విధానాలలో మార్పునుబట్టి, వ్యక్తుల ఆలోచనా రీతులు, సామాజిక వ్యవస్థలు, మారుతుంటాయని వెబ్లన్ (Weblon) అభిప్రాయం. సంస్కృతి మానవులమధ్య సంబంధ బాంధవ్యాలను ప్రభావితంచేసి, వారి కార్యకలాపాలను నిర్దేశిస్తుంది. సాంస్కృతిక విలువలు మారినపుడు, సామాజిక సంబంధాలు కూడా మారి, సామాజిక పరివర్తన కలుగుతుంది. ఈవిధంగా భౌతిక, జైవిక, సాంకేతిక, సాంస్కృతిక కారకాలు సమాజంలో ఎప్పుడూ మార్పు తీసుకుని రావడానికి ప్రయత్నిస్తాయి. ఇవిగాక, ఆర్థిక, రాజకీయ మార్పులు కూడా సామాజిక పరివర్తనను కలగచేస్తాయి. సామాజిక వ్యవస్థాపనకు, సామాజిక క్రమాభివృద్ధికి, సామాజిక పరివర్తన చాలా అవసరం.

## సామాజిక వ్యవస్థాపన - సామాజిక నియంత్రణ
(Social Organisation And Social Control)

వ్యక్తుల ప్రవర్తనను క్రమబద్ధం చేయటంలో సమాజంచేసే ఒత్తిడిని "సామాజిక నియంత్రణ" (Social Control) అనవచ్చు. సమాజం కొన్ని నియమాల ద్వారా వ్యక్తుల ప్రవర్తనను

క్రమబద్ధం చేసినప్పుడు, ఆ విధానాన్ని సామాజిక నియంత్రణ అంటారు. సాంఘిక నియంత్రణ అనేక ఏజన్సీల సహాయంతో సామాజిక ప్రవర్తనకు కట్టుబాట్లను ఏర్పాటు చేస్తుంది. ఆచారాలు, చట్టాలు, మతాలు, నైతిక సూత్రాలు, విద్య, రాజకీయ వ్యవస్థ, కుటుంబం మొదలయిన సంస్థలు సాంఘిక నియంత్రణా సాధనాలుగా పనిచేస్తాయి. సామాజిక నియంత్రణా విధానాలు సమర్థవంతంగా పనిచేసినంతవరకూ సమాజం వ్యవస్థీకృతమై ఉంటుంది.

## సామాజిక విలువలు - సామాజిక ప్రమాణాలు
[Social Values And Social Norms]

సమాజంలో వ్యక్తులు సామాజిక ప్రమాణాలను పాటించటంమూలంగా సమాజంలో క్రమత ఏర్పడుతుంది. సామాజిక ప్రమాణాలను విలువలననుసరించటం ద్వారా వ్యక్తులతో సర్దుబాటు కలుగుతుంది. సమాజంలోని వివిధ వ్యవస్థల ప్రమాణాలమధ్య అనుగుణ్యత ఉన్నప్పుడే సమాజంలోని సామరస్యం సమైక్యం సంస్థితి (balance) ఉంటాయి.

## సామాజిక వ్యవస్థ - వ్యవస్థా సమైక్యం
[Social System And System integration]

సమాజంలోవున్న వివిధ వ్యవస్థలమధ్య పరస్పరసంబంధం, అన్యోన్యత, అవినాభావ సంబంధాలు కలిగి ఉన్నప్పుడు సమాజ వ్యవస్థాపనకు అవకాశం ఏర్పడుతుంది.

మానవ సమాజం నిత్యచైతన్య స్రవంతి. దానిలో పరివర్తన కలిగించే శక్తులు నిగూఢంగా ఉంటాయి. సమాజం గతిశీల స్వభావం కలిగి ఉన్నప్పటికీ, దానిని సుస్థిరంగా నిలిపే శక్తులుకూడా పనిచేస్తుంటాయి. అందువల్లనే సమాజంలో సంస్థితి, నిలకడ, వ్యవస్థాపన సాధ్యమవుతున్నాయి.

## సామాజిక అవ్యవస్థత [Social Disorganisation]

మానవ సంబంధాల రీతులలో, విధానాలలో కలిగే భంగపాటును సామాజిక అవ్యవస్థత అంటారు. (ఇలియట్ అండ్ మెర్రిల్ (Elliot and Merril) అభిప్రాయ ప్రకారం, సామాజిక నియంత్రణరూపాలు శక్తివంతంగా పనిచేయలేక పోయినప్పుడు, సమాజ వ్యవస్థ క్షీణించినపుడు సామాజిక అవ్యవస్థత ఏర్పడుతుంది. వ్యవస్థకు వ్యతిరేకంగా పనిచేసే శక్తులే అవ్యవస్థతకు కారణమవుతాయి. సామాజిక నిర్మితి దెబ్బతిన్నప్పుడు పాత సాంఘిక నియంత్రణా సాధనాలు, సమర్థవంతంగా పనిచేయనప్పుడు సమాజ వ్యవస్థ బలహీనమవుతుంది. సామాజిక సమస్యల స్థితిని (Social equilibrium) కాపాడే అంశాలలో మార్పు వచ్చినప్పుడు కూడా సామాజిక అవ్యవస్థత ఏర్పడుతుంది.

సమాజం గతిశీల స్వభావం కలది. సమాజ నిర్మితి, సంస్థల విధులు, వ్యక్తుల ప్రవర్తనా ధోరణులు ఎల్లప్పుడూ మారుతుంటాయి. సమాజం యొక్క పాత విలువలు, ప్రమాణాలు తమ ప్రభావాన్ని కోల్పోతాయి. దీనివల్ల సామాజిక నియంత్రణా శక్తులు బలహీనమవుతాయి. సామాజిక అవ్యవస్థతా పరిస్థితులు ఏర్పడతాయి.

సామాజిక అవ్యవస్థత కలిగినప్పుడు సభ్యులమధ్య సంబంధాలు విచ్ఛిన్నమవుతాయి. సమాజంలోని వివిధ సంస్థలూ వ్యవస్థా విఘటనాన్ని (Disorganisation) పొందుతాయి.

ఇలియట్, మెరిల్‌ల అభిప్రాయ ప్రకారం సామాజిక అవ్యవస్థత **మూడు** రకాలుగా జరుగుతుంది.

1. వైయక్తిక అవ్యవస్థత (Individual Disorganisation)
2. కుటుంబ అవ్యవస్థత (Family Disorganisation)
3. సాముదాయక అవ్యవస్థత (Community Disorganisation)

నేరం, బాలనేరం, వ్యభిచారం, తాగుబోతుతనం మొదలైనవి వ్యక్తిగత అవ్యవస్థతవల్ల ఏర్పడతాయి. విడాకులు, వ్యభిచారం మొదలైనవి కుటుంబ అవ్యవస్థతవల్ల ఏర్పడతాయి. దారిద్ర్యం, లంచగొండితనం, నిరుద్యోగం మొదలైనవి సాముదాయక అవ్యవస్థతవల్ల ఏర్పడతాయి. ఈ **మూడు** అవ్యవస్థతాపరిస్థితులు కూడా ఒకదానితో ఒకటి సంబంధాన్ని కలిగి ఉన్నాయి.

## సామాజిక అవ్యవస్థత - కారణాలు
## (Causes of Social Disorganisation)

సమాజం గతిశీల స్వభావంకలది. సామాజిక సంబంధాలలో, సామాజిక నిర్మితులలో క్రమంగా మార్పుకలుగుతూ ఉంటుంది. వేగంగా మార్పు చెందే సమాజంలో వివిధ వ్యక్తులమధ్య, సమూహాలమధ్య, సంబంధాలు దెబ్బతిని సామాజిక అవ్యవస్థత ఏర్పడుతుంది.

ఆధునిక సమాజాలలో భిన్న భాషలు, వ్యక్తులు, జాతులు, మతాలు, సంస్కృతులు, వర్ణాలు, ఎన్నో రకాలుగా ఉంటాయి. వీటి లక్ష్యాలు, విలువలు, ప్రమాణాలు కూడా భిన్నంగా ఉంటాయి. అందువల్ల వాటిమధ్య సమన్వయం లేక సమాజంలో అవ్యవస్థతా పరిస్థితులేర్పడవచ్చు.

సమాజంలో అతివేగంగా పెరుగుతున్న జనాభావల్ల సాంకేతిక, వైజ్ఞానిక అభివృద్ధి జీవన విధానాలలో కూడా త్వరితగతిని మార్పులు జరుగుతున్నాయి. ఈ మార్పులవల్ల సామాజిక వ్యవస్థకు భంగం కలుగుతున్నది. సమాజం సుస్థిర సమతౌల్యస్థితిని కోల్పోతున్నది. అందుచేత అవ్యవస్థతా పరిస్థితులకు అవకాశమేర్పడుతుంది,

సామాజిక పరివర్తనకు, సామాజిక అవ్యవస్థతకు చాలా దగ్గర సంబంధముంది. సామాజిక పరివర్తన క్లిష్టంగానూ తీవ్రతరంగానూ ఉన్నప్పుడు, సామాజిక సంస్థలపై సామాజిక నియంత్రణా ప్రభావం తగ్గి, సామాజిక అవ్యవస్థత ఏర్పడుతుంది.

## సామాజిక నిర్మితి - సామాజిక అవ్యవస్థత
## (Social Structure And Social Disorganisation)

సామాజిక నిర్మితిలో పాత్రలు, అంతస్తులు, ప్రమాణాలు, సంబంధాలు, సంస్థలు మొదలైన అనేక అంశాలు ఉన్నాయి. సామాజిక పరివర్తన వేగంగా జరిగేటప్పుడు, ఈ అంశాలుకూడా మార్పు చెందుతాయి. అంశాలలో మార్పు కనుగుణంగా వ్యక్తులు మార్పు చెందకపోవటవల్ల వ్యక్తివిఘటన,

సామాజిక విఘటన ఏర్పడతాయి. అవ్యవస్థిత సమాజంలో అంతస్తులు, పాత్రలు స్పష్టంగా ఉండవు. అంతస్తులలోను, పాత్రలలోను అస్పష్టత, వైరుధ్యం అధికంగా ఉండటమే అవ్యవస్థిత సమాజంయొక్క లక్షణం.

## విభిన్న అంతస్తుల మధ్య సామరస్యం లేకపోవడం

వ్యక్తుల అంతస్తు సంబంధాలలో సామరస్యముండటం చాల అవసరం. సమూహాల యొక్క వివిధ అంతస్తుల మధ్య అంతరాలు ఎక్కువగా ఉన్నప్పుడు సంఘర్షణలు చెలరేగి అవ్యవస్థత ఏర్పడుతుంది.

అవ్యవస్థిత సమాజంలో వ్యక్తులు ఆశించే అంతస్తును, సాధించగలిగే అంతస్తుకు మధ్య అంతరం ఉండటం అనేది ముఖ్య లక్షణాలలో ఒకటి.

## పాత్రలపట్ల ఏకాభిప్రాయం లేకపోవడం

వ్యవస్థిత సమాజంలో వ్యక్తుల యొక్క వివిధ పాత్రలపట్ల నిర్దిష్టమైన ఏకాభిప్రాయం ఉంటుంది. సామాజిక మార్పులు జరుగుతున్నకొద్దీ, ఈ పాత్రలయొక్క లక్ష్యాల ప్రాధాన్యత, నిర్దిష్టత తగ్గిపోతుంది. అటువంటి పరిస్థితులలో వివిధ పాత్రలపట్ల ఏకాభిప్రాయం క్షీణించి, భేదాభిప్రాయాలు ఏర్పడి, సామాజిక వ్యవస్థలో విఘటన ఏర్పడుతుంది. ఉదాహరణకు ఆధునిక సమాజంలో భార్య యొక్క పాత్రపట్ల నిర్దిష్ట అభిప్రాయంలేదు. కుటుంబంలో స్త్రీ పాత్ర, ఆర్థిక విధులు నిర్వర్తించటంలో స్త్రీ పాత్ర సాంఘిక రంగంలో స్త్రీ పాత్ర వివిధ రకాలుగా ఉంటుంది.

## సాధించిన అంతస్తు (Achieved Status)

ప్రాచీన సమాజాలలో వ్యక్తులు సాంప్రదాయకంగా నిర్ణయించిన అంతస్తులను స్వీకరించి, వాటి కనుబంధమైన పాత్రలను నిర్వహిస్తూ, సామాజిక వ్యవస్థాపనకు తోడ్పడుతుండేవారు. ఆధునిక సమాజాలలో వ్యక్తులు ఎక్కువగా సాధించిన అంతస్తులను కలిగిఉన్నారు. అంతస్తులను సాధించటం కోసం, వ్యక్తులలో అవాంఛనీయమైన పోటీ, సంఘర్షణ పెరగడంవల్ల సామాజిక అస్వస్థతకు దారి తీయవచ్చు.

## సామాజిక పరివర్తన - సామాజిక అవ్యవస్థత

సమాజంలో సంస్థితి (balance) నిలకడ ఉన్నప్పటికీ, దానిలో క్రమంగా పరివర్తన కలుగుతుంది. సామాజిక వ్యవస్థలలో, వాటియొక్క వివిధ అంశాలలో సామాజిక నిర్మితులు, అంతస్తులు, ప్రమాణాలు, విలువలు, ఇవన్నీ క్రమంగా మారుతూఉంటాయి. సంఘర్షణ, పోటీ, సహకారం, మొదలయిన సాంఘిక ప్రక్రియలవల్ల సామాజిక వ్యవస్థలో పరివర్తన శీఘ్రంగా కలుగుతున్నపుడు అసమాయోజనం, అవ్యవస్థత ఏర్పడతాయి. వైజ్ఞానిక, సాంకేతిక రంగాలలో కలిగిన విశేషాభివృద్ధి. ఆర్థిక, రాజకీయ వ్యవస్థలలోని మార్పులు, నగరీకరణ, పారిశ్రామికీకరణ మొదలగు వాటివల్ల, సాంప్రదాయక జీవిత విధానాలలో, సామాజిక సంబంధాలలో, సామాజిక వ్యవస్థలలో

త్వరితంగా మార్పులు ఏర్పడుతున్నాయి. ఈ మార్పులవల్ల సామాజిక నిర్మితి విఘటనమై, సామాజిక అవ్యవస్థత ఏర్పడుతుంది.

## సాంస్కృతిక విలంబన (Cultural lag) - సామాజిక అవ్యవస్థత (Social disorganisation)

సాంకేతిక రంగాలలో మార్పునుబట్టి, సాంస్కృతిక రంగాలలో అనుసరణీయమైన మార్పులు కలుగుతాయి. సాంకేతిక, వైజ్ఞానిక, భౌతికరంగాలలో మార్పు చాలా శీఘ్రంగా జరుగు తున్నది. కాని సాంఘిక, మానసిక, సాంస్కృతిక రంగాలలో మార్పు, దాని కనుగుణంగా జరగక, నెమ్మదిగా జరుగుతుంది. సమాజంలో ఒక రంగంలో పరివర్తన జరిగి, దాని కనుసరణీయంగా, ఇతర రంగాలలో మార్పు కలగనప్పుడు, విలంబన ఏర్పడుతుంది. ఒక సమాజంలోని వివిధ అంశాలమధ్య వివిధ వేగాలలో మార్పు జరిగినపుడు ఆ సమాజం అవ్యవస్థతకు గురవుతుంది.

సంస్కృతిలో రెండు ముఖ్య అంశాలున్నాయి. 1. భౌతిక సంస్కృతి (material culture) 2. భౌతికేతర సంస్కృతి (non-material culture). సాధనాలు, పరికరాలు, యంత్రాలు, పరిశ్రమలు మొదలైనవి భౌతిక సంస్కృతిలోని అంశాలు. సామాజికరీతులు, కుటుంబం, విద్య, మతం, తత్వశాస్త్రం, కళలు, విలువలు, ఆచార వ్యవహారాలు ఆలోచనలు, ప్రవర్తనారీతులు మొదలైనవి భౌతికేతర సంస్కృతిలోని వివిధ అంశాలు. సమాజంలో భౌతిక సంస్కృతి త్వరితగతిన మార్పు చెందుతుందని, భౌతికేతర సంస్కృతి నెమ్మదిగా మార్పుచెందుతుందని, దానివల్ల ఏర్పడే అంతరాన్నే సాంస్కృతిక విలంబన(cultural lag)అని అగ్‌బర్న్(Ugburn)శాస్త్రజ్ఞుని అభిప్రాయం. ఈ విధంగా సంస్కృతిలోని వివిధ అంశాలు అసమాన వేగంతో మార్పు చెందేటప్పుడు సామాజిక ఇబ్బందులు, సామాజిక అసమాయోజనం ఏర్పడతాయి. ఉదాహరణకు, పారిశ్రామికీకరణంవల్ల గ్రామీణ ప్రాంతాలనుంచి అనేకమంది బ్రతుకు తెరువు నిమిత్తం, పట్టణ ప్రాంతాలకు తరలివస్తున్నారు. కాని వారిలో అనేకమంది ఆధునిక జీవితవిధానాలతో సమన్వయపడలేక అవ్యవస్థకు గురిఅవుతున్నారు.

## సామాజిక అభివృత్తులు - సామాజిక అవ్యవస్థత (Social Attitudes - Social disorganisation)

ప్రతివ్యక్తి సమాజంలోని వివిధ అంశాలపట్ల, ప్రత్యేక అభివృత్తులను ఏర్పరచుకొని, వాటికనుగుణంగా సామాజిక ప్రక్రియలలో పాల్గొంటాడు. మారుతున్న సమాజంలో అభివృత్తులు మార్పుచెందటం సహజం. దీనివల్ల కొన్ని సమయాలలో సామాజిక ప్రవర్తనను కాపాడే నియంత్రణా విధానాలు బలహీనమవటానికి ఎంతయినా అవకాశముంది. అంతేగాక, సమాజ వ్యతిరేక నైతికసులు పెరిగి సామాజిక విచలనం ఏర్పడుతుంది. అది క్రమంగా సామాజిక అవ్యవస్థకు దారితీస్తుంది.

## సామాజిక విలువలు - సామాజిక అవ్యవస్థత

## (Social Values - Social disorganisation)

వ్యక్తి జీవితంలో సామాజిక విలువల పాత్ర ప్రధానమైనది. ఈ విలువల నాధారంగా చేసికొని, సామాజిక వ్యవస్థలు రూపొందుతాయి. విలువలలో మార్పు కలిగినపుడు, ఇతర సామాజిక అంశాలలో మార్పులు కలుగుతాయి. సామాజిక విలువల ప్రాధాన్యం తగ్గిపోవటం, సామాజిక అవ్యవస్థకు ముఖ్య కారణమవుతుంది.

ఈ విధంగా సామాజిక అవ్యవస్థత వైయక్తిక, కుటుంబ, సాముదాయక విఘటనలవల్ల ఏర్పడుతుంది.

అవ్యవస్థత చెందిన సమాజాలను తిరిగి, వ్యవస్థీకృతం చేయటానికి, సాంఘిక సమస్యలను పరిష్కరించటానికి సాంఘికాభివృద్ధిని సాధించటానికి, చేసే ప్రయత్నాలు సఫలీకృతం కావాలంటే సంఘసంక్షేమ కృషి శాస్త్రీయ విధానాలను అమలుపరచాలి. ఈ శాస్త్రీయ పద్ధతుల నుపయోగించి సమాజంలోని వ్యక్తులను, తమకు తామే సమస్యలను అవగాహన చేసుకొనేటట్లుగా చేయాలి. సమస్యలను పరిష్కరించడానికి, తగిన మానసిక సహాయాన్ని, వ్యక్తిసహాయాన్ని సంఘసంక్షేమకృషి నిపుణతలద్వారా కార్యకర్త వ్యక్తుల కందించాలి. సమస్యా పీడితులు తమ సమస్యలను సరిగా అర్థంచేసుకుని, వారి సమస్యలను వారే పరిష్కరించుకొనేటట్లు, సహాయపడాలి. సామాజిక చర్య, సామాజిక శాసనాలద్వారా సమస్యలను శాశ్వతంగా పరిష్కారమయ్యేటట్లు కృషిచేయాలి. సమస్యల పట్ల ప్రజల వైఖరిలో మార్పును తీసుకురావాలి. సమస్యా పీడితుల పునరావాసం కోసం, సంక్షేమ కృషి కార్యక్రమాల నిర్వహణా పద్ధతుల నుపయోగించి సంస్థాగత, సంస్థాగతేతర సేవలను ఏర్పాటు చేయాలి. సాంఘిక పరిశోధనాపద్ధతి సహాయంతో సాంఘిక సమస్యల కారణాలు, వాటివల్ల కలిగే దుష్ఫలితాలు, వాటిని నివారించే మార్గాలను అధ్యయనంచేసి, కారణాలను తొలగించి, సమస్యలను శాస్త్రీయ పద్ధతులలో పరిష్కరించుకోవటానికి పథకాలను రూపొందించి అమలుపరచాలి. ఈ విధంగా సామాజిక అవ్యవస్థతను తొలగించడానికి సంఘ సంక్షేమ కృషి పద్ధతుల నుపయోగించటం చాలా అవసరం.

## భారతదేశంలో సామాజిక పరివర్తన - ప్రక్రియ

సమాజం మానవుని సామాజిక సంబంధాలతో కూడుకొని ఉన్నది. సామాజిక జీవనం చైతన్య చరిత మయింది. సమాజం నిలకడగా ఉండక ఎల్లప్పుడూ దాని నిర్మితిలోను, ప్రక్రియలలోను, అంతర్భాగమయివున్న వ్యవస్థలు, సమూహాలు, వ్యక్తులు ఏర్పరచుకొన్న సంబంధ బాంధవ్యాల లోను మార్పులు సంభవిస్తూ ఉంటాయి. ఈ మార్పులు సామాజిక పరివర్తన కలిగించే శక్తులవల్ల జరుగుతాయి అని సమాజ శాస్త్రవేత్తలు నమ్ముతారు. ముఖ్యంగా భౌగోళిక, నైసర్గిక పరిస్థితులు, సాంకేతిక విజ్ఞానంలో అభివృద్ధి, సాంస్కృతిక విలంబన, జైవిక కారణాలవల్ల సమాజంలో మార్పులు సంభవిస్తాయని సమాజ శాస్త్రజ్ఞులు జరిపిన పరిశీలనలవల్ల, పరిశోధనలవల్ల రుజువయినది.

మానవ ప్రపంచంలోని ప్రతీ సమాజంలోను ఈ మార్పులు రావడం సహజం. మార్పులు లేని సమాజం మనకు కనపడదు. కాని ఈ మార్పులు లేదా పరివర్తన కొన్ని సమాజాలలో చురుకుగాను, కొన్నింటిలో మందకొడిగాను జరుగుతుందని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. నేటి ఆధునిక ప్రపంచంలో రెండు రకాలయిన సమాజాలున్నాయి. ఒకటి అభివృద్ధిచెందిన సమాజాలు. రెండు అభివృద్ధి చెందుతున్న సమాజాలు. భారత సమాజం అభివృద్ధి చెందుతున్న వాటిలో ఒకటి.

ప్రాచీన భారత సమాజంలో ప్రభుత్వం సంక్షేమ కార్యక్రమాలలో పాల్గొనకుండా ఉన్నప్పుడు, సామాజిక వ్యవస్థలయిన కుటుంబం, కులం, మతం మానవుని జీవితాలపై ప్రభావం కల్గివుండి, అవసరంలో ఉన్నవారికి సహాయ సహకారాలను అందిస్తూ, సంక్షేమ కార్యక్రమాలలో పాల్గొన్నాయి.

కాని ఈ సామాజిక పరివర్తన వరవడిలో ఈ వ్యవస్థల నిర్మితి, ప్రక్రియలలో అనూహ్యమయిన మార్పులు సంభవించి, వాటి ప్రాముఖ్యత రానురాను తగ్గిపోతూ వచ్చింది. అట్లాంటి పరిస్థితులలో సామాజిక వ్యవస్థను సంస్కరించడానికి, సాంఘిక సంస్కర్తలు, ఎనలేని కృషి జరిపి ప్రజలలో చైతన్యాన్ని రేకెత్తించి, విచక్షణాజ్ఞానాన్ని, ఆలోచనా శక్తిని పరిశీలనా దృక్పథాన్ని పెంపొందించి, భారత సమాజ చరిత్రలో ఒక నూతనాధ్యాయాన్ని ప్రవేశపెట్టారు.

స్వాతంత్ర్యం వచ్చిన తరవాత దేశనాయకులు, మేధావులు, శాస్త్రజ్ఞులు కలసి అప్పటి దేశ పరిస్థితులను అన్ని కోణాలనుంచి పరిశీలించి, దేశ సమగ్ర పురోభివృద్ధిని సాధించడానికి ఒక రాజ్యాంగాన్ని రూపొందించి, ప్రణాళికా రచనలనుచేసి, సమాజ అవసరాల కనుగుణంగా కార్యక్రమాలను రూపొందించి, అమలుపరచి, సామాజిక పరివర్తనకు దోహదం చేశారు. దీనినే ప్రణాళికా పురోభివృద్ధి అని అంటారు.

సాంప్రదాయిక వ్యవసాయిక సమాజం నుంచి, ఆధునిక పారిశ్రామిక సంక్షేమ సమాజం అవతరిస్తున్న తరుణంలో భారతదేశం అనేక పరివర్తనలకు గురిఅయింది. దేశ రాజ్యాంగంలో పొందుపరిచిన లక్ష్యాల ప్రకారం ప్రభుత్వం, ప్రజలు, ప్రజాస్వామిక విలువలను గుర్తించి, వాటి సూత్రాలను అనుసరించి, ప్రతీ పౌరునికి సామాజిక, ఆర్థిక, రాజకీయ పరమయిన న్యాయాన్ని, కుల మత, జాతి, రంగు విచక్షణ లేకుండా అందిస్తూ, సమాజాన్ని రూపొందించాలి. దీనిని సిద్ధంపచేసుకోడానికి కొన్ని రాజ్యాంగ పరమయిన నిర్దేశక సూత్రాలను ప్రవేశపెట్టడం జరిగింది.

వీటిని ఆధారంగా తీసుకొని, పంచవర్ష ప్రణాళికలను రూపొందించి, అమలుపరుస్తూ, సామాజిక వ్యవస్థలలోను, ప్రజల మానసిక దృక్పథంలోను, ఆర్థిక, రాజకీయ జీవన విధానాలలోను గణనీయమైన ప్రగతిని, మార్పులను తీసుకొని రావడం జరిగింది. దీనితోబాటు, సామాజిక శాసనాల ద్వారా, సామాజిక విద్యా కార్యక్రమాల ద్వారా సామాజిక స్పృహను కల్పించి, సామాజిక చైతన్యాన్ని తీసుకురావటానికి ప్రయత్నాలు చేయడం జరిగింది.

ప్రగతిపథంలో ముందుకుపోతున్న సమాజంలో సంభవించే మార్పుల వరవడిలో కొన్ని సమస్యలుకూడా ఉద్భవించడం సహజం. సామాజిక వ్యవస్థలయిన కుటుంబం, మతం, కులం వాటి

నిర్మితిలోను ప్రక్రియలలోను మార్పులువచ్చి, ఈనాడు ప్రజలపై వాటి ప్రభావాన్ని కోల్పోయి, విచ్ఛిన్నకరమయినవిగా సమాజంలో మిగిలిపోయినాయి.

ఉదాహరణకు వివాహం అనే వ్యవస్థలో మార్పులువచ్చి, మతపరమయిన ప్రాముఖ్యతను కోల్పోయి, నేడు ఆధునిక సమాజంలో ఒక ఒప్పందబడిక విధానంగా వివాహం మారింది.

స్త్రీ పురుషులు సమానంగా చదువుకొని, ఉద్యోగాలను సంపాదించడంలోను, సమాన అవకాశాలను ప్రభుత్వం కల్పించడంవల్ల, సమాజంలో స్త్రీ స్థాయిలోను, పాత్రలోను మార్పు వచ్చింది. ఇంతేకాక వైవాహిక సంబంధాలలో కూడా సమస్యలుత్పన్నమయినాయి. విడాకులు, వదలివేయటం, లైంగిక అక్రమ సంబంధాలు, అవివాహిత మాతృత్వం, అక్రమ సంతానం (illegitimate children) మొదలయినవి.

మతం, కులం, వాటి సామాజిక విలువలను కోల్పోయి, వాటి విధులను సక్రమంగా నిర్వహించలేక, నేటి సమాజంలో సమస్యలుగా మిగిలిపోయినాయి. వీటివల్ల కులతత్వం, మతాభిమానం మొదలయిన విపరీత ధోరణులు ప్రజ్వరిల్లి, సామాజిక సంఘీభావానికి, సమైక్యతకు, సమగ్రతకు విచ్ఛిన్నకరమయినవిగా తయారయినాయి.

మారుతున్న ఈ సమాజంలో చాలా సామాజిక సమస్యలు అపరిష్కారంగా మిగిలిపోయినాయి. అంతేకాక, ఈ సమస్యల స్వభావాలలోను, నైజాలలోను, తీరులలోను తేడాలు కన్పిస్తున్నాయి. కాబట్టి ఈ సమస్యల గురించి కూలంకషంగా అవగాహన చేసుకోవడం చాలా అవసరం. ఇంతేకాక, వాటిని పరిష్కరించడానికి చేపట్టవలసిన సంస్థాగత, సంస్థాగతేతర (institutional, non-institutional) సేవల ద్వారా సమస్యలకు గురిఅయినవారి పునరావాస సేవలలోను మార్పులు తీసుకువచ్చి సమస్యాపీడిత వ్యక్తులలోను, సమూహాలలోను, శాస్త్రీయ పరిజ్ఞానంలోను, నిపుణతలలోను, సేవా కార్యకర్తలు పనిచేయడం చాలా అవసరం. ఈ సేవాకార్యక్రమాలలో సంఘ సంక్షేమ కృషి కార్యకర్తలు సరిఅయిన పాత్రలను నిర్వహించడానికి అవకాశాలను కల్పించవలె. ప్రభుత్వం, స్వచ్ఛంద సేవాసంస్థలు దీనిని గుర్తించి, సుశిక్షితులయిన సంఘ సంక్షేమ కార్యకర్తలను ఈ కార్యక్రమముల నిర్వహణలో నియమించాలి.

# 2
# పేదరికం

ప్రపంచంలోని సుసంపన్న దేశాలతో పోల్చిచూస్తే, మన దేశం ఆర్థికంగా వెనుకబడిన దేశం అని చెప్పవలె. అభివృద్ధి చెందుతున్న దేశాలు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలలో పేదరికం ముఖ్యమైనది. మన ఆర్థిక వ్యవస్థలోని లోపాల కారణంగా పేదరికం మన సామాజిక వ్యవస్థలో పాదుకొనిపోయింది. మన దేశ ప్రజల పేదరికాన్ని సూచించేవి అత్యల్పస్థాయిలో ఉన్న జీవనప్రమాణం. మన దేశంలో అధిక సంఖ్యాకులకు కనీస జీవితావసరాలు, కనీస ప్రమాణాలలోకూడా సమకూరడంలేదు.

మన దేశంలో పేదరికం సమస్య ఈనాటిది కాదు. అయితే చాలాకాలం క్రితం పేదరికాన్ని గుర్తించడం జరిగినా, దానికి సంబంధించిన అన్ని అంశాలను కూలంకషంగా పరిశీలించడానికి ప్రయత్నాలు జరుగలేదు.

## పేదరికం - నిర్వచనం

గిల్లిన్, గిల్లిన్ (Guillin and Guillin) అభిప్రాయం ప్రకారం వ్యక్తి తక్కువ ఆదాయం వల్లగాని, అనాలోచిత వ్యయంవల్ల గాని, సామాజిక జీవన ప్రమాణానికి సరితూగేటట్లు తన శారీరక మానసిక శక్తులకు తగినట్లు, తననూ తనపై ఆధారపడిన వాళ్ళను పోషించుకోలేని స్థితిని పేదరికం అంటారు. సంఘంలో అధిక జనాభా, తమకు కావలసిన కనీస అవసరాలను తృప్తిపరచుకోలేని పరిస్థితులను పేదరికం అంటారు.

పేదరికం అనేది ఒక సాపేక్షభావన (relative concept). దీనిని పూర్తిగా నిర్వచించడం చాలాకష్టం. పేదరికాన్ని నిర్వచించడానికి సాధారణ సముదాయ జీవనప్రమాణాలతో పోల్చిచూడాలి. ఈ జీవన ప్రమాణాలలో చాలా వ్యత్యాసం ఉంటుంది.

సమాజంలో అనేకవర్గాల ప్రజలు ఉండటంవల్ల వారి జీవన ప్రమాణాలు ఎన్నోరకాలుగా ఉంటాయి. తిండి, బట్ట, వసతి, విద్యాసౌకర్యాలు జీవన ప్రమాణంలోని ముఖ్య అంశాలు. ఈ కనీస అవసరాలను తీర్చుకోలేకపోవటమే పేదరికానికి చిహ్నం. జీవనప్రమాణం అల్పస్థాయిలో ఉండి, ఆదాయ పంపకాలలో వ్యత్యాసాలున్నట్లయితే, అది పేదరికానికి దారితీస్తుంది.

పేదరికం సామాజిక సమస్యలలో చాలా ప్రధానమయిన సమస్య. పేదరికం వ్యక్తి మానసిక, శారీరక ఆరోగ్యంపై ప్రభావం చూపుతుంది. పేదరికం ద్వారా కనీస అవసరాలైన తిండి, బట్ట, వసతి దుర్లభమౌతాయి. వ్యక్తిమూర్తిమత్వ అభివృద్ధికి, విద్యాభివృద్ధికి, ఆర్థికాభివృద్ధికి

అవసరమైన శక్తిసామర్థ్యాలను, సృజనాత్మక శక్తులను, పేదరికం కారణంగా వృద్ధిపరచుకోవలేదు. సమాజంలో లభించే అవకాశాలను సక్రమంగా వినియోగించుకోలేదు. చాలామంది పేదవారు దారిద్ర్యంవల్ల సరయిన శారీరకపోషణ లేక అనారోగ్యానికి గురిఅవుతారు. వారు సరయిన అభివృద్ధిని పొందలేకపోవడంవల్ల, నైతికంగా కూడా పతనంకావడానికి, అనేక సాంఘిక నేరాలు చేయటానికి అవకాశముంది.

ఆర్థికలేమివల్ల కుటుంబ జీవితం సంతృప్తికరంగా ఉండదు. కుటుంబంలో ఘర్షణలు, కలహాలు, అశాంతులు తప్పవు. తమ సంతానాన్ని సక్రమంగా పెంచలేనందువల్ల, పేదకుటుంబాలలోని పిల్లల భవిష్యత్తు దెబ్బతింటుంది. దీనివల్ల కుటుంబ అవ్యవస్థత ఏర్పడుతుంది.

దారిద్ర్యం, వ్యక్తులలో నిరాశా నిస్పృహాలను పెంచుతుంది. వారు సామాజిక కార్యకలాపాలపట్ల ఎటువంటి ఆసక్తిని చూపించలేరు. సామాజిక వ్యవస్థాపనకు, సమాజ వికాసానికి ఏవిధంగాను తోడ్పడలేరు. అంతేగాక కొన్నిసమయాలలో పేదరికం వారిలో ద్వేషాన్ని, అసంతృప్తిని రేకెత్తించి, వారిని సంఘ విద్రోహులుగా మారుస్తుంది. సరయిన క్రమశిక్షణలేక, పేదకుటుంబాలలో బాలురు, యువకులు నేరస్తులుగా, వ్యభిచారులుగా, సమస్యా పీడితులుగా తయారవుతారు. ఈవిధంగా పేదరికం వైయక్తిక, కుటుంబ, సామాజిక, అవ్యవస్థతకు దారితీస్తుంది.

## దారిద్ర్యంలో రకాలు

పేదరికం రెండు రకాలు. (1) సంపూర్ణ పేదరికం (2) సాపేక్ష పేదరికం

వ్యక్తి, తన కుటుంబ సభ్యులకు, కనీస జీవితావసరాలను కూడా సమకూర్చలేని పరిస్థితిని, సంపూర్ణ పేదరికం (Absolute Poverty) అని చెప్పవచ్చు. తననూ, తనపై ఆధారపడినవాళ్ళను సామాజిక జీవనప్రమాణానికి సరితూగేటట్లు పోషించుకోలేని స్థితినే సంపూర్ణ పేదరికమంటారు.

తన సమాజంలోని యితర వ్యక్తులతో, తన ఆర్థిక స్తోమతను పోల్చిచూసుకుని, తను వారికంటె తక్కువ ఆర్థిక పరిస్థితిలో ఉన్నట్లు గమనించినప్పుడు, అతను తనను పేదవానిగా భావించుకొంటాడు. దీనినే సాపేక్ష పేదరికం (Relative Poverty) అంటారు.

## పేదరికం - కారణాలు

పేదరికానికి చాలా కారణాలుంటాయి. పురాతనమైన ఉత్పత్తి పద్ధతులు, సామాజిక వ్యవస్థ, ఆర్థిక వ్యవస్థలలో పాదుకొని ఉన్న లోపాలు, అల్పస్థాయిలో ఉన్న ఆర్థిక, సాంకేతిక విజ్ఞానాభివృద్ధి, సహజవనరులను సక్రమంగాను, సమర్థవంతంగాను వినియోగించుకోలేకపోవటం మొదలయినవన్నీ పేదరికానికి దారితీస్తాయి. మనదేశంలో అధికశాతం గ్రామీణ సముదాయాలే. గ్రామీణ ప్రజల ముఖ్యలక్షణాలైన నిరక్షరాస్యత, అజ్ఞానం, సోమరితనం, అనారోగ్యం కూడా పేదరికానికి, కారణాలవుతున్నవి. అనేక వ్యక్తిగత, భౌగోళిక, ఆర్థిక, సామాజిక కారణాలన్నీ కలసి, పేదరికానికి దారితీస్తాయి.

## వ్యక్తిగత కారణాలు

చాలామంది వ్యక్తులు శారీరక మానసిక రోగాలవల్ల, ప్రమాదాలకు గురికావటంవల్ల, తమను తాము పోషించుకోలేని పరిస్థితులలో పేదవారవుతున్నారు.

కొంతమంది వ్యక్తులు, ఆదాయం ఉన్నప్పటికీ, అవివేకమైన ఖర్చులవల్ల పేదరికానికి గురి అవుతున్నారు. కొన్ని సమయాలలో సోమరితనం, నైతికపతనం వల్లకూడా వ్యక్తిగత విఘటనానికి తద్వారా వ్యక్తి పేదరికానికి దారితీస్తుంది. అధిక సంతానం, పెద్ద కుటుంబాలవల్ల కూడా పేదరికం కలుగుతుంది.

## భౌగోళిక కారణాలు

ఆర్థిక పరిస్థితులపై, భౌగోళిక పరిసరాల ప్రభావం చాలా అధికంగా ఉంటుంది. దేశంలో సహజ వనరులు చాలినంత లేకపోవటంవల్ల, పేదరికం ఏర్పడుతుంది. కొన్ని ప్రదేశాలలో భూమి సారవంతంగా లేనందువల్ల, పంటదిగుబడి తక్కువయి పేదరికం ఏర్పడుతుంది. వాతావరణ పరిస్థితులు, అనుకూలంగా లేకపోయినా, వ్యవసాయం, పరిశ్రమలు, ఉత్పత్తి అభివృద్ధి చెందక దారిద్ర్యం కలుగుతుంది. అనుకోకుండా హఠాత్తుగా ఏర్పడే ప్రకృతి వైపరీత్యాలయిన కరువులు, వరదలు, భూకంపాలు, పంట తెగుళ్ళు మొదలైన వాటివల్లకూడా ఆస్తినష్టం, పంటనష్టం జరిగి పేదరికం సంభవిస్తుంది.

## ఆర్థిక కారణాలు

పేదరికానికి ముఖ్యకారణం ఆర్థిక దుస్థితి. అనేక ఆర్థిక కారణాలవల్ల పేదరికం తరచుగా ఏర్పడుతుంది.

## 1. వ్యవసాయిక కారణాలు

మన దేశంలో సహజసంపద ఉన్నప్పటికీ, పెట్టుబడి, శాస్త్రీయ, సాంకేతిక అభివృద్ధి తగినంతగా లేకపోవటంవల్ల, దేశంలో పేదరికం ఏర్పడుతుంది. నీటిసరఫరా సదుపాయాలు లేకపోవటం వల్ల, ఆధునిక పద్ధతులద్వారా వ్యవసాయం జరుగకపోవటంవల్ల, సరయిన ఉత్పత్తి లేక పేదరికం ఏర్పడుతుంది.

## 2. సంపదను అసమానంగా పంపిణీ చేయుటం

ఉత్పత్తి అయిన సంపద కొంతమంది చేతిలోనే కేంద్రీకృత మవుతున్నది. ధనికులే మరింత ధనికులవుతున్నారు. పేదవారు మరింతగా పేదవారవుతున్నారు. ఉత్పత్తి అయిన సంపద అసమానంగా పంపిణీ కావడంవల్ల ఆర్థిక అసమానతలు ఏర్పడి, పేదరికం కలుగుతున్నది.

## నిరుద్యోగం

అల్పోద్యోగం, నిరుద్యోగం పేదరికానికి ముఖ్య కారణాలవుతున్నాయి. అనేకమంది తమ శక్తి సామర్థ్యాలకు, అర్హతలకు తగిన ఉద్యోగాలు సంపాదించుకోలేక పాక్షికంగా పేదవారవుతున్నారు.

జనాభా పెరుగుదలవల్ల ఉద్యోగావకాశాలు సన్నగిల్లుతున్నాయి. అంతేగాక, విద్యా విధానం లోప భూయిష్టంగా ఉండటంవల్ల విద్యావంతులుకూడా నిరుద్యోగులుగా ఉండిపోతున్నారు. ప్రభుత్వం ధరలను అదుపులో ఉంచలేకపోవటంవల్ల, పేదరికం అధికమవుతున్నది. లాభం నిమిత్తం వ్యాపారులు కృత్రిమ కొరతను సృష్టిస్తున్నారు. దానివల్ల ధరలు పెరుగుతున్నాయి కాని తలసరి ఆదాయం పెరగటంలేదు. అధిక ద్రవ్యోల్బణం మూలంగా సామాన్య ప్రజలు కనీస అవసరాలను కూడా వారికున్న ఆదాయంలో తీర్చుకోలేకపోతున్నారు.

## పొదుపులేకపోవటం

ప్రజల తలసరి ఆదాయంలో ఎక్కువ భాగం వినియోగ వస్తువులపై ఖర్చుకావటంవల్ల, పొదుపు చేయటానికి అవకాశం ఉండటంలేదు. వివాహం, పండుగలు, ఉత్సవాలు మొదలయిన సాంఘిక సాంప్రదాయాలకు అధిక ప్రాధాన్యతనిచ్చి అవివేకంగా ఎంతో ధనం దుబారా ఖర్చు చేయటంవల్ల కూడా పొదుపు ఎక్కువగా జరగటంలేదు. మనదేశంలో పొదుపులే పెట్టుబడులు కాబట్టి పొదుపు తక్కువగా ఉండటంవల్ల పేదరికం ఎక్కువవుతున్నది.

## రాజకీయం కారణాలు

ఆర్థికాభివృద్ధి ప్రణాళికలను ప్రభుత్వ యంత్రాంగం నిర్మాణాత్మకంగా అమలుపరచలేకపోతే పేదరికం ఏర్పడుతుంది. మన దేశంలో ప్రభుత్వం భారీ యంత్ర పరిశ్రమలకే ప్రాధాన్యమివ్వటంవల్ల, కుటీరపరిశ్రమలు మూలపడినాయి. అంతేగాక మనదేశం ఆర్థికంగా విదేశీ వ్యాపారంపై ఆధారపడి ఉన్నది. ఎగుమతులు తక్కువగాను, దిగుమతులు ఎక్కువగాను ఉన్నాయి. అందువల్లనే మనదేశం పేదదేశంగా ఉండిపోయింది.

## అనుచిత విద్యా విధానం

మన దేశంలో అధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులే. విద్య లేకపోవడంవల్ల అనేకమంది నిరుద్యోగులై బాధపడుతున్నారు. విద్యా విధానాలు కూడా అవసరాలకనుగుణంగా లేకపోవటంవల్ల నిరుద్యోగిత ఎక్కువవుతున్నది. విద్య, వ్యక్తులలో శక్తి సామర్థ్యాలను, సృజనాత్మక శక్తులను పెంపొందించటానికి ఉపయోగపడటంలేదు. ఉద్యోగ ఉపాధి అవకాశాలను ఎక్కువగా కల్పించే సాంకేతిక విద్యకు అంతగా ప్రోత్సాహం లభించడంలేదు. వీటన్నిటివల్ల నిరుద్యోగం ఎక్కువయి పేదరికం ఏర్పడుతుంది.

## కులతత్వం

మన దేశంలో కులతత్వం కూడా కొంతవరకు పేదరికానికి కారణమవుతున్నది. అగ్రకులాలు, నిమ్నకులాల మధ్య భేదాలు, కర్మసిద్ధాంతం, దురాచారాలు, అంధ విశ్వాసాలు పేదరికాన్ని మరింతగా ఎక్కువ చేస్తున్నాయి. కులతత్వానికి అధిక ప్రాముఖ్యతనిచ్చి, వంశపారంపర్యంగా వచ్చే కులవృత్తులనే చేయటంవల్ల, వేరే వృత్తులను, ఆధునిక విధానాలను నేర్చుకోలేకపోవటంవల్ల చాలామంది పేదవారవుతున్నారు.

**అధిక జనాభా**

మన దేశంలో జనాభా పెరుగుదల అధికంగా జరుగుతున్నది. జనాభా పెరుగుదలతో సమానంగా ఉత్పత్తి, ఆదాయం పెరగకపోవటంవల్ల, తలసరి ఆదాయం తక్కువై పేదరికం ఏర్పడుతున్నది.

కుటుంబ నియంత్రణమీద ప్రజలకు విరక్తిభావం, చిన్నవయస్సులోనే వివాహాలు జరగటం, సరయిన విద్య, వృత్తిశిక్షణ లేకపోవటం, అనారోగ్యం, సరయిన సాంఘిక భద్రతా విధానాలు (Social Security Measures) లేకపోవటంవల్ల కూడా పేదరికం ప్రబలటానికి దోహదపడుతున్నాయి.

## పేదరికం - నిర్మూలన

### పేదరికం నిర్మూలించటానికి ప్రభుత్వం తీసుకొనే చర్యలు

భారత దేశంలో పేదరికాన్ని కూలంకషంగా అధ్యయనం చేయడానికి, శాస్త్రీయపద్ధతులలో అనేక పరిశోధనలు జరిగాయి. ఈ పరిశీలనద్వారా ప్రభుత్వ దృష్టి యీ సమస్యపై కేంద్రీకరించడం జరిగింది. ఈ సమస్యపై ప్రణాళికాసంఘం ప్రత్యేక దృక్పథాన్ని కలిగిఉన్నది. ప్రజల జీవనప్రమాణాన్ని పెంచగల ఆర్థికప్రక్రియే తమ లక్ష్యమని ప్రణాళికా సంఘం తెలిపింది. దేశంలో తీవ్రంగా ప్రబలిఉన్న పేదరికాన్ని తొలగించటం, ఆర్థిక అసమానతలను తొలగించటం ప్రణాళికల ధ్యేయం. అందుచేతనే పేదరికాన్ని తొలగించటానికి పంచవర్ష ప్రణాళికలద్వారా ప్రత్యక్షంగా, పరోక్షంగా అనేక ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలను పథకాలను ఏర్పాటుచేసి, వాటిని అమలుపరచటానికి అధిక మొత్తాలలో గ్రాంటులను ప్రభుత్వం మంజూరుచేసింది.

మొదటి పంచవర్ష ప్రణాళికలో పేదరికాన్ని నిర్మూలించి, ఆర్థిక అసమానతలు తొలగించే కార్యక్రమాలను ప్రాధాన్యత నిచ్చారు. ఆహారధాన్యాల కొరత తీర్చటానికి వ్యవసాయరంగానికి అధికప్రాముఖ్యం ఇయ్యడం జరిగింది. ధరల నదుపులోకి తేవడానికి ప్రయత్నాలు జరిగాయి. అధిక సంఖ్యాకులకు ఉద్యోగ, ఉపాధి సౌకర్యాలను కల్పించే నిమిత్తం, పరిశ్రమాభివృద్ధి ద్వారా జాతీయాదాయాన్ని పెంచి, ప్రజల జీవన ప్రమాణాన్ని మెరుగుపరచటానికి కృషి జరిగింది. అనేక గ్రామాల్లో, సహకారోద్యమం ద్వారా సహకార సంఘాలను ప్రవేశపెట్టి పేదప్రజలకు సహాయపడ్డారు. పేదరికాన్ని నిర్మూలించి, వ్యక్తి సమాజాభివృద్ధికి మిక్కిలి అనుకూలమయ్యే, సమాజాభివృద్ధి కార్యక్రమాలను (Community Development Programmes) కూడా 1952వ సంవత్సరంలో ప్రవేశపెట్టడం జరిగింది.

రెండో పంచవర్ష ప్రణాళికలో ప్రభుత్వం అనేక ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలను ప్రవేశపెట్టింది. అనేక భారీ పరిశ్రమలను స్థాపించి, ఉద్యోగావకాశాలు అధికంగా కల్పించడమైంది. ఆర్థిక అసమానతలు తొలగించటానికి జాతీయ సంపదను వీలయినంతవరకు సమంగా పంపిణీ చేయటానికి ప్రయత్నాలు జరిగాయి. కుటీర పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. పేదరికాన్ని నిరోధించడానికి ఉపయోగపడే విద్యా ఆరోగ్యాభివృద్ధి కార్యక్రమాలు విరివిగా అమలుపరచడమైంది.

మూడో పంచవర్ష ప్రణాళికలోను, తరువాత వరుసగా మూడు వార్షిక ప్రణాళికలను ఇంత వరకు పేదరిక నిర్మూలనకై అమలుపరచబడిన కార్యక్రమాలనన్నింటిని ఇంకా విస్తృతంగా, విజయవంతంగా నిర్వహించటానికి కృషి జరిగింది.

నాలుగో పంచవర్ష ప్రణాళికలో ఈ కార్యక్రమాలతోపాటు అదనంగా వినియోగ వస్తువుల ఉత్పత్తి పెంచటం, జనాభా పెరుగుదల నరికట్టటానికి కుటుంబ నియంత్రణా పథకాల నమలుపరచటం, అన్ని రాష్ట్రాలలోను భూసంస్కరణా పథకాల నమలుపరచటం, పట్టణ ఆస్తులపై పరిమితులు విధించటం, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను చేపట్టటం మొదలయిన కార్యక్రమాల ద్వారా పేదరికాన్ని నిర్మూలించటానికి ప్రయత్నాలు జరిగాయి.

అయితే ఇంతవరకూ జరిగిన కృషివల్ల ఆశించిన ఫలితాలు రాలేదు. కేవలం ఆర్థికాభివృద్ధిని సాధించటం ద్వారా పేదరికాన్ని తొలగించటం కష్టమని ప్రభుత్వం గుర్తించింది. అనేక ఆర్థిక శాస్త్రవేత్తల పరిశోధనలు ప్రభుత్వాన్ని ప్రోత్సహించి, పేదరిక నిర్మూలనే అయిదో పంచవర్ష ప్రణాళికా ప్రధాన లక్ష్యంలా ఉండేలా చేశాయి. ఈ ప్రణాళికలో పేదరిక నిర్మూలనకు పటిష్టమైన కృషి జరిగింది. కేవలం పేదరిక నిర్మూలన కోసం, అధిక మొత్తాలలో గ్రాంటులు మంజూరు చేశారు. పేదరిక ప్రధాన కారణమైన నిరుద్యోగాన్ని తొలగించటానికి ఎక్కువగా కృషి జరిగింది. గ్రామీణ పేదరికాన్ని తొలగించటానికి గ్రామీణాభివృద్ధి పథకాలను చేపట్టడం జరిగింది. గృహనిర్మాణ పథకాల నేర్పాటు చేయడం, చౌక డిపోల ద్వారా నిత్యావసర వస్తువుల నందించటం, మురికివాడల నిర్మూలన, ఉచిత విద్య, వైద్య సౌకర్యాల నేర్పాటుచేయటం, కుటుంబ సంక్షేమ, కుటుంబ నియంత్రణా కార్యక్రమాల నమలుపరచటం మొదలయిన పథకాల ద్వారా పేదరికాన్ని నిర్మూలించడానికి కృషి జరిగింది.

ఆరో పంచవర్ష ప్రణాళికలో కూడా ఉద్యోగితకే ప్రధానమయిన (Employment - oriented) అభివృద్ధి కార్యక్రమాలను సాంఘికాభివృద్ధి కార్యక్రమాలను అమలుపరచడానికి ప్రాధాన్యత నియ్యడం జరిగింది. జాతీయస్థాయిలో పేదరిక నిర్మూలనా కార్యక్రమం (National Anti Poverty Programme) అమలు పరచబడింది. 20 సూత్రాల పథకాన్ని అమలు పరచడం ద్వారా, అనేక పేదరిక నిర్మూలనా పథకాలను ప్రవేశపెట్టడం జరిగింది.

ఈ విధంగా పేదరికాన్ని నిర్మూలించడానికి ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలద్వారా ఆర్థికాభివృద్ధి, సాంఘికాభివృద్ధి కార్యక్రమాల నేర్పాటు చేసింది.

## పేదరికం - నిర్మూలనా చర్యలు

పేదరికాన్ని పూర్తిగా నిర్మూలించటానికి ఇంకా ఈ కింది కార్యక్రమాలను అమలు చేయాలి.

## 1. వ్యవసాయాభివృద్ధి

దేశ ఆర్థికపరిస్థితి వ్యవసాయంమీద ఎక్కువగా ఆధారపడి ఉన్నది. భూసంస్కరణ పథకాలను చట్టాలను సక్రమంగా అమలుపరచి, ఆధునిక పద్ధతుల నుపయోగించి వ్యవసాయాన్ని చేపడితే, వ్యవసాయాభివృద్ధిని త్వరగా సాధించవచ్చు. తద్వారా పేదరికాన్ని తగ్గించవచ్చు.

## 2. పారిశ్రామికీకరణం

దేశంలో భారీపరిశ్రమల నధికంగా స్థాపించటంద్వారా దేశ ఆర్థికసంపద, ఉత్పత్తి, తలసరి ఆదాయం పెరుగుతుంది. అంతేగాక పేదరికానికి మూలకారణమైన నిరుద్యోగం చాలావరకు తొలగి పోతుంది. తద్వారా పేదరికాన్నికూడా తగ్గించవచ్చు.

## 3. కుటీరపరిశ్రమల అభివృద్ధి

కుటీర పరిశ్రమల నధికం చేయటం ద్వారా గ్రామీణ ప్రాంతాలలో నున్న పేదరికాన్ని తొలగించవచ్చు. పేదరికం ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో కేంద్రీకృతమై ఉన్నది. గ్రామీణ వ్యవసాయ కూలీల మానవశక్తిని పూర్తిగా వినియోగించి, తద్వారా ఉత్పత్తిని పెంచటానికి కుటీర పరిశ్రమల అభివృద్ధి చాలా అవసరం.

## 4. విద్యాభివృద్ధి

పేదరికానికి ముఖ్యకారణం నిరక్షరాస్యత. అంతేగాక ప్రస్తుత విద్యావిధానంకూడా ఉద్యోగ ఉపాధి సౌకర్యాలు కల్పించటానికి అంతగా దోహదపడటంలేదు. ఆధునిక సాంకేతిక విద్యావిధానాల ద్వారా, స్వయం ఉపాధి అవకాశాలను ఎక్కువగా కల్పించవచ్చు. తద్వారా పేదరికాన్ని తొలగించవచ్చు.

ప్రజలలో నిరక్షరాస్యత, అసహాయకత్వం, సోమరితనం అరికట్టేందుకు సామాజికవిద్య, వయోజనవిద్య మొదలైన కార్యక్రమాలను చేపట్టి, పేదరిక నిర్మూలనకు కృషిచేయాలి.

## 5. ఆరోగ్యాభివృద్ధి

దేశంలో ముఖ్యంగా గ్రామీణ సమాజాలలో, ఆరోగ్యాన్ని పెంపొందిస్తే, పేదరికాన్ని కొంతవరకు తగ్గించవచ్చు. గ్రామీణ ప్రాంతాలలో ఆరోగ్య కేంద్రాలను స్థాపించటం, ఆరోగ్యవిద్యా పథకాల నమలుపరచటం, అవసరమైన వైద్యసౌకర్యాల నేర్పాటుచేయటం, మంచినీటి సౌకర్యాలు పారిశుధ్య సౌకర్యాలు కల్పించటం, అంటువ్యాధుల నరికట్టే జాతీయ పథకాలను అమలుపరచటం మొదలగువాటి ద్వారా ప్రజల ఆరోగ్య ప్రమాణాన్ని, జీవనప్రమాణాన్ని మెరుగుపరచి, పేదరికాన్ని తొలగించాలి.

## 6. కుటుంబ సంక్షేమం - కుటుంబ నియంత్రణ
(Family Welfare And Family Planning)

జనాభా అధికంగా పెరిగిపోయినా, దేశంలో సహజ వనరులు ఆర్థిక సంపద జనాభాకు తగినట్లుగా లేకపోయినా పేదరికం ఏర్పడుతుంది. అందుచేత కుటుంబ నియంత్రణా పథకాలను సక్రమంగా అమలుపరచి, జనాభా పెరుగుదలను అరికట్టటానికి కృషి చేయాలి.

## 7. సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకాలు
(Integrated Rural Development Programmes)

గ్రామీణ, గిరిజన సముదాయాల సాంఘిక ఆర్థిక జీవనప్రమాణాలను అభివృద్ధిపరిస్తే, పేదరికం చాలావరకు తొలగిపోతుంది. అందుచేతనే, గ్రామీణ ప్రజలను అన్నిరంగాలలో అభివృద్ధి పరచటానికి సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకాలను చేపట్టడమైంది. సన్నకారు రైతుల, చిన్నకారు రైతుల అభివృద్ధి కార్యక్రమాలు (Small farmers and marginal farmers development programmes) జాతీయ గ్రామీణ ఉద్యోగపథకాలు (National Rural Employment Programmes) గిరిజన సముదాయ సమగ్రాభివృద్ధి సంస్థలు (Integrated Tribal Development Agencies) పనికి ఆహారం పథకాలు (Food for Work Programmes) 20 సూత్రాల పథకాన్ని సక్రమంగా అమలుచేయడం మొదలయిన అనేక కార్యక్రమాలు ఎక్కువగా ప్రవేశపెట్టడం ద్వారా గ్రామీణ గిరిజన ప్రజలలో ఉన్న నిరక్షరాస్యత, నిరుద్యోగం, అనారోగ్యం, పేదరికం మొదలయిన వానిని తొలగించి, వారి సమగ్రాభివృద్ధికి సక్రమమైన కృషి చేయవలె. ఇటువంటి పథకాలలో అంత్యోదయ పథకం (Anthyodaya) ముఖ్యమైంది. అంత్యోదయ పథకంద్వారా కేవలం గ్రామీణ ప్రజల ఆర్థికాభివృద్ధికాక, గ్రామీణ ప్రజల సాంఘిక సంక్షేమంకోసం కృషిచేయవలె. ఆర్థికాభివృద్ధి పథకాలతోపాటు విద్య, ఆరోగ్య, సాంస్కృతిక, సమాజాభివృద్ధి పథకాలు ప్రజాస్వామ్య, శాస్త్రీయ పద్ధతులలో, నూతన విధానాలలో అమలుపరచవలె. ఆదేశికంగా, స్వచ్ఛంద ఉద్యమాలయిన సర్వోదయ, భూదాన, గ్రామదాన, గ్రామస్వరాజ్య పథకాలను అభివృద్ధిపరచి, పేదరిక నిర్మూలనకు కృషిజరిగేట్లు వాటిని అమలుపరచవలె.

## సంఘ సంక్షేమ కృషి - పేదరిక నిర్మూలన

సంఘ సంక్షేమ కృషి శాస్త్రీయ పద్ధతుల సహాయంతో పేదరిక నిర్మూలనా కార్యక్రమాలను అమలుపరిస్తే త్వరితంగా ఫలితాలను సాధించగలం. పేదరికానికి మూలకారణమయిన నిరక్షరాస్యతను తొలగించటానికి ఏర్పాటయిన వయోజన విద్య, సామాజిక విద్యా పథకాలను సంఘ సంక్షేమ కృషి పద్ధతులతో అమలుపరచాలి. పేదరికాన్ని గురించి దాని కారణాలు దానివల్ల ఏర్పడే దుష్ఫలితాలు, దాని నివారణ చర్యలు, అమలుపరచవలసిన కార్యక్రమాలు మొదలయిన వాటిని గురించి ప్రజలలో అవగాహన కలిగించి, పేదరికాన్ని ఎదుర్కొనటానికి ప్రజలలో సామాజిక చర్య పద్ధతిద్వారా సంక్షేమ కార్యకర్త చైతన్యం కలిగించాలి.

పేదరికాన్ని తొలగించటానికి ఏర్పాటు అయిన సమాజ వికాసాభివృద్ధి కార్యక్రమాలను ఏర్పాటు చేయటంలోను, నిర్వహించటంలోను సంక్షేమ కృషి కార్యకర్తల సహాయం తీసుకోవాలి.

పేదరిక నిర్మూలనా పథకాలను (Poverty eradiation Programmes) ను రూపొందించడంలో, అమలుపరచడంలో శిక్షణపొందిన సంక్షేమ కార్యకర్తలకు ప్రముఖ పాత్ర ఉండవలె.

ప్రభుత్వం ఏర్పాటు చేసిన కార్యక్రమాలను అంగీకరించటానికి, వాటిని పూర్తిగా సద్వినియోగం చేసుకోవటానికి, నిరక్షరాస్యులైన సనాతన జీవితానికలవాటుపడిన గ్రామీణ ప్రజలు సిద్ధంగా ఉండరు. అటువంటి వారిలో కార్యకర్త సంక్షేమ కృషి నిపుణతలనుపయోగించి వారిలోగల సామాజిక జడతను తొలగించి, వారిలో ఉత్సాహాన్ని, స్వశక్తిని, ఆసక్తిని, చైతన్యాన్ని కలిగిస్తాడు.

సంఘ సంక్షేమ కార్యకర్త, సాముదాయక వ్యవస్థాపన, సామాజిక చర్య, సాంఘిక పరిశోధనా పద్ధతులను ఉపయోగించి సముదాయంలోవున్న వనరులను సమీకరించి పేదరిక నిర్మూలనకు కృషి చేయవలె. అందుచేత పేదరిక నివారణ, నిర్మూలన కొరకే ఏర్పాటయిన నిర్మాణాత్మక కార్యక్రమాలను (Constructive Programmes) సంక్షేమ కృషి పద్ధతుల సహాయంతో నిర్వహించవలసిన అవసరం ఎంతయినా ఉంది.

## (UNEMPLOYMENT)

మన దేశం ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలలో నిరుద్యోగ సమస్య ఒకటి. నిరుద్యోగం విశ్వజనీనమైన సమస్య అయినప్పటికీ భారతదేశానికి చాలా గడ్డు సమస్యగా మారి, దినదినాభివృద్ధి చెందుతూ ఉంది. ఈ సమస్య కారణంగా వనరులలో అతి ముఖ్యమైనదైన మానవ శక్తి సంపద వ్యర్థ మవడమే కాకుండా, ఇంకా ఇతరమైన అనేక సాంఘిక, రాజకీయ, వైయక్తిక సమస్యలు ఏర్పడు తున్నాయి. నిరుద్యోగ సమస్యను పూర్తిగా తొలగించాలంటే, దేశం సాంఘికంగా, ఆర్థికంగా అభివృద్ధి చెందదు. నిరుద్యోగ సమస్యను సంపూర్ణంగా నిర్మూలించటానికి, నిరోధించటానికి చేపట్టే పథకాలను చర్చించడానికి ముందు యీ సమస్య స్వభావాన్ని పరిమాణాన్ని బాగా అవగాహన చేసికొనడం చాలా అవసరం.

పూర్వకాలంలో మన దేశంలో నిరుద్యోగాన్ని అంత తీవ్రమైన సమస్యగా పరిగణించలేదు. కాని ప్రస్తుతం జనాభా పెరుగుదలవల్ల ఈ నిరుద్యోగ సమస్య చాలా తీవ్రమయింది. అందుచేత దానిని నిర్మూలించటానికి ప్రభుత్వం సత్వర చర్యలు తీసికొంటున్నది.

"నిరుద్యోగాన్ని" స్పష్టంగా నిర్వచించటం కష్టం. అది చాలా సంక్లిష్టమైనది. ప్రొ॥ పీగూ (Prof. Pigou) అభిప్రాయ ప్రకారం నిరుద్యోగం అనే పదం సామాన్యంగా అందరికీ అర్థమయినప్ప టికీ, దానిని ప్రత్యేకంగా, ఖచ్చితంగా నిర్వచించటం కష్టం. ఉదాహరణకు పనిచేయటం ఇష్టంలేక పోవటంవల్ల నిరుద్యోగులుగావున్న వ్యక్తులను నిరుద్యోగులలో లెక్కించవలెనా లేదా అనేది ఒక సంశయం. అట్లాగే అనారోగ్యంతో బాధపడేవారు, యాచకులు, సాధువులు, భూస్వాములు, స్త్రీలు, ఇతర శారీరక లోపాలున్నవారు నిరుద్యోగులుగా పరిగణనలోనికి రారు. శరీరదారుఢ్యంవుండి పనిచేయ డానికి ఇష్టపడిన వ్యక్తులకు పనిలేకపోవడమే నిరుద్యోగిత అని చెప్పవచ్చు. ఉద్యోగం చేయడానికి తగిన వయస్సు, అర్హత, యోగ్యత, కోరిక అన్నీ ఉండికూడా, ఉద్యోగాన్ని సంపాదించుకోలేని పరి స్థితిని "నిరుద్యోగం" అని అనవచ్చు. అయినా కొందరు శాస్త్రజ్ఞులు పనిచేయటానికి ఇష్టముండికూడా శారీరక రుగ్మతలు, లోపాలకారణంగా నిరుద్యోగులుగా ఉన్నవారిని కూడా నిరుద్యోగులుగా పరిగ ణించాలని అంటారు.

## నిరుద్యోగం - రకాలు

నిరుద్యోగానికి అనేక కారణాలున్నాయి. నిరుద్యోగానికున్న కారణాలననుసరించి, నిరుద్యోగాన్ని కొన్ని రకాలుగా వివరించవచ్చు.

### 1. నియతకాలిక నిరుద్యోగం (Seasonal Unemployment)

కొన్ని పరిశ్రమలు సంవత్సరంలో కొంత కాలం మాత్రమే పనిచేస్తాయి. పని ఉన్నంతకాలం చాలామందికి ఉద్యోగాలు లభిస్తాయి. పని ముగిసిన తరువాత వారు ఉద్యోగం నుంచి తొలగించబడతారు. ఉదాహరణకు పంచదార, జనుము, పొగాకు, ఫ్యాక్టరీలు సంవత్సరంలో కొన్ని నెలలు మాత్రమే పనిచేస్తాయి. అదేరకంగా వ్యవసాయ కూలీలకు కూడా, సంవత్సరంలో కొంత భాగమే పని లభిస్తుంది. మిగతా కాలంలో వారు నిరుద్యోగులుగా ఉంటారు. గృహనిర్మాణ పరిశ్రమలో, ఓడరేవు పనులలో కూడా ఇలాంటి నిరుద్యోగిత సంభవిస్తుంది. ఈ విధంగా ఋతువులనుబట్టి ఆర్థిక విధానంలో వచ్చే మార్పులవల్ల ఏర్పడే నిరుద్యోగితను "నియతకాలిక" నిరుద్యోగిత అంటారు.

### 2. ప్రతిఘర్షనిరుద్యోగిత (Frictional Unemployment)

పారిశ్రామిక నిర్మితిలో మార్పులు అతివేగంగా కలుగుతుంటాయి. డిమాండ్, పాత వస్తువులనుంచి క్రొత్త వస్తువులకు నిత్యమూ మారుతూ ఉంటుంది. వస్తువుల గిరాకీ తగ్గినపుడు ఆ వస్తువులను తయారుచేసే పరిశ్రమలు వెనుకబడి పనివారిలో నిరుద్యోగిత ఏర్పడవచ్చు. వస్తువుల డిమాండ్‌లలో వచ్చిన మార్పులవల్ల ఏర్పడిన తాత్కాలిక నిరుద్యోగాన్ని "ప్రతిఘర్ష నిరుద్యోగిత" అంటారు.

వైజ్ఞానిక సాంకేతిక రంగాలలో వేగంగా కలుగుతున్న అభివృద్ధికూడా కొంతవరకు నిరుద్యోగానికి కారణమవుతున్నది. ఆధునిక యంత్రాలు వేగంగా పనిచేస్తూ ఉత్పత్తిని ద్విగుణీకృతం చేస్తాయి. అందువల్ల అధికసంఖ్యలో ఉద్యోగుల అవసరముండదు. ఆధునిక యంత్రాలవల్ల, ఆధునిక విధానాలవల్ల తాత్కాలిక నిరుద్యోగిత ఏర్పడుతుంది. దీనినే "సాంకేతిక నిరుద్యోగిత" అంటారు.

### 3. చక్రీయ నిరుద్యోగిత (Cyclic Unemployment)

వ్యాపారంలో కలిగే హెచ్చుతగ్గుల ఫలితంగా నిరుద్యోగం ఏర్పడవచ్చు. ఒక వస్తువుకు కొంతకాలం గిరాకీ చాలాహెచ్చుగా ఉంటుంది. అదేవస్తువుకు మరికొంతకాలం గిరాకీ తగ్గుతుంది. అందుచేత ఉత్పత్తి కొన్నిసార్లు తగ్గించడం, కొన్నిసార్లు ఎక్కువచేయడం జరుగుతుంది. ఉత్పత్తి తగ్గించినపుడు, శ్రామికులను తగ్గించడంవల్ల, నిరుద్యోగిత అధికమవుతుంది. ఉత్పత్తి ఎక్కువ చేసినపుడు శ్రామికులను అధికంగా తీసుకోవటంవల్ల నిరుద్యోగిత తక్కువవుతుంది. ఈ విధంగా వ్యాపార రంగంలోను, వస్తువుల ఉత్పత్తిలోను జరిగే చక్రీయ మార్పుల (Cyclic Changes) ననుసరించి ఏర్పడే నిరుద్యోగితను "చక్రీయ నిరుద్యోగిత" అంటారు.

## పెట్టుబడి, ఉత్పత్తి, వనరులకొరతవల్ల ఏర్పడిన నిరుద్యోగము

మనదేశంలో పారిశ్రామికాభివృద్ధి తగినరీతిగా జరగకపోవటంవల్ల కూడా నిరుద్యోగం ఏర్పడుతున్నది. పరిశ్రమలను స్థాపించటానికి అభివృద్ధిపరచడానికి కావలసిన పెట్టుబడి, వనరులు లేకపోవటంవల్ల, పరిశ్రమలద్వారా అనేకమందికి ఉద్యోగావకాశాలు లభించడంలేదు.

## అల్పోద్యోగం (Under Employment)

కొంతమంది అర్హతలకు తగిన ఉద్యోగం పొందలేరు. అటువంటప్పుడు అసలు వేతనంకంటె తక్కువవేతనానికి పనిచేయడానికి వ్యక్తులు సిద్ధపడితే ఆ పరిస్థితిని 'అల్పోద్యోగం' అంటారు. తగిన ఉద్యోగం దొరకకపోతే వ్యక్తులు పాక్షిక ఉద్యోగాలు (Part time Jobs) గాని, అల్పమైన ఉద్యోగాలు చేయటానికి సిద్ధపడతారు. కాని వారి శాయశక్తులా సంపూర్ణ సామర్థ్యంతో, తగిన శక్తితో పనిచెయ్యలేరు. దీనిని 'అనైచ్ఛిక నిరుద్యోగిత' (involuntary Unemployment)అనిగాని, ప్రచ్ఛన్న నిరుద్యోగిత (Disguised Unemployment) అనిగాని అంటారు.

ఈ నిరుద్యోగం, గ్రామీణ ప్రాంతాలలోను, నగర ప్రాంతాలలోనుకూడా విస్తరించిఉన్నది. చాలాకొద్దిమంది మాత్రమే అర్హతలకు, శక్తిసామర్థ్యాలకు తగిన ఉద్యోగాన్ని సంపాదించుకొనగలుగుతున్నారు.

## నిరుద్యోగిత - కారణాలు

ఇంతవరకూ నిరుద్యోగంలో ఉన్న రకాలను గూర్చి చర్చించాము. నిరుద్యోగానికి ముఖ్య కారణాలను కూడా వివరంగా తెలుసుకోవలసి ఉన్నది. నిరుద్యోగం ఏర్పడటానికి ముఖ్యంగా మూడు కారణాలున్నాయి. అవి : 1. వ్యక్తిగత కారణాలు. 2. సాంకేతిక కారణాలు. 3. ఆర్థిక కారణాలు.

### . వ్యక్తిగత కారణాలు (Personal Factors)

శారీరక అంగవైకల్యం, వ్యక్తిగత లోపాలు మొదలైన శారీరక మానసిక లోపాలవల్ల అనేకమంది ఉద్యోగాలు చేయడాని కిష్టపడినా, చెయ్యలేకపోతున్నారు. కొన్ని సమయాలలో వ్యక్తిగతంగాకాక, పరిశ్రమలలో, పని స్థలాలలో కలిగే ప్రమాదాలవల్ల కూడా వైకల్యం ఏర్పడి, ఉద్యోగాలకు అనర్హులవుతున్నారు. ఉద్యోగానికి వయోపరిమితి కూడా కొంతవరకు కారణమవుతున్నది. చదువు, శిక్షణ ముగించిన యువకులకు అనుభవం లేకపోవటంవల్ల, వెంటనే ఉద్యోగాలు దొరకటం లేదు. ఏభై, అరవై సంవత్సరాలు దాటిన వ్యక్తులకు కూడా తగిన ఉద్యోగాలు దొరకవు.

విద్యా శిక్షణ, వృత్తి శిక్షణ నేర్చుకొనేముందు యువకులలో ఒక ప్రత్యేకమైన ఉద్దేశముండటంలేదు. యువకులకు సరిఅయిన వృత్తి శిక్షణ మార్గదర్శక సేవలు (Vocational guidance) లభించడం లేదు.

### సాంకేతిక కారణాలు (Technological Causes)

ఆధునిక పద్ధతులు, ఆధునిక యంత్రాలు ఉపయోగించటంవల్ల ఎక్కువ పనికి తక్కువ వ్యక్తులలో చెయ్యగలుగుతున్నారు. అంతేగాక యంత్ర పరిశ్రమలు అభివృద్ధి చెందటంవల్ల, గ్రామీణ పరి

శ్రమలు, కుటీర పరిశ్రమలు, చిన్నతరహా చేతి పరిశ్రమలు క్షీణించినాయి. వాటిమీదనే ఎక్కువగా ఆధారపడిన వ్యక్తులందరూ నిరుద్యోగు లవుతున్నారు.

### ఆర్థిక కారణాలు (Economic Causes)

ఆర్థిక వ్యవస్థలలో కలిగే మార్పులవల్ల కూడా నిరుద్యోగం సంభవిస్తుంది. పరిశ్రమాభివృద్ధికి తగిన వనరులు, పెట్టుబడి లభించకపోవటం, డిమాండ్ – సప్లయిలలో మార్పులు, గ్రామీణ ఆర్థిక వ్యవస్థనుంచి పట్టణ ఆర్థిక వ్యవస్థకు మార్పు, మొదలయిన వాటివల్ల నిరుద్యోగం అధికమవుతుంది.

## నిరుద్యోగం - దుష్ఫలితాలు

### నిరుద్యోగం – వైయక్తిక అవ్యవస్థితి (Personal disorganisation)

ప్రతి వ్యక్తి జీవితంలో మంచి అభివృద్ధిని సాధించి, సంఘంలో మంచిస్థానాన్ని సంపాదించాలని ఆశపడతాడు. అందుకవసరమయిన విద్యా శిక్షణ, వృత్తి శిక్షణ మొదలయిన అర్హతలను సంపాదించి, అర్హతలకు తగిన ఉద్యోగంకోసం ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నాలు విఫలమై తగిన ఉద్యోగాన్ని కాని ఉపాధినిగాని సంపాదించుకోలేకపోయినప్పుడు నిరాశా నిస్పృహలకు గురిఅవుతాడు. నిరుద్యోగి జీవితానికి కావలసిన భద్రత, స్థిరత్వం సంపాదించుకోలేడు. సంఘంలో మంచి స్థానాన్ని కూడా పొందలేక క్రమంగా ఆత్మ విశ్వాసాన్ని కోల్పోతాడు. ఈ విధంగా విపరీతమయిన మానసిక వేదనకు బలి అయి, జీవితంపై విరక్తిని, సంఘంపై వ్యతిరేక భావాలను ఏర్పరచుకుంటాడు. క్రమంగా మానసిక, వ్యక్తిత్వ లోపాలు కూడా ఏర్పడతాయి. కొన్నిసార్లు ఆత్మహత్యకు సైతం పాల్పడవచ్చు. వ్యక్తి, సంఘానికి ఏమాత్రం ఉపయోగపడని నిరాశావాదులుగాగాని, లేదా హాని కలిగించే విప్లవవాదులుగాగాని మారటానికి అవకాశం ఉంది. అంతేకాక దారిద్ర్య కారణంగా శారీరక ఆరోగ్యాన్ని కోల్పోవచ్చు. లేదా మానసిక అశాంతిని భరించలేక మద్యపాన వ్యసనాలకు బలికావచ్చు. ఈ విధంగా నిరుద్యోగం వ్యక్తిని శారీరకంగా, మానసికంగా కృంగదీస్తుంది.

### నిరుద్యోగం - కుటుంబ అవ్యవస్థత (Family Disorganisation)

నిరుద్యోగం వ్యక్తి ఆరోగ్యంపై దెబ్బతీయడమేకాక, కుటుంబ అవ్యవస్థతకు కూడా మూలకారణమవుతున్నది. ఉద్యోగం లేకపోవుటవల్ల నెలసరి ఆదాయముండదు. కుటుంబ అవసరాలు తీర్చటానికి తగిన ఆదాయం లేకపోవటంవల్ల కుటుంబం అప్పులపాలవుతుంది. దారిద్ర్యంవల్ల కుటుంబ సభ్యుల అవసరాలు, కోర్కెలు తీరవు. కుటుంబ సభ్యుల బాధ్యతలలో కూడా మార్పులు కలుగుతాయి. కొన్ని సమయాలలో స్త్రీలు, చిన్న పిల్లలు కూడా కష్టపడి పనిచేయవలసి వస్తుంది. పిల్లల అభివృద్ధికి కావలసిన సౌకర్యాలను, అవకాశాలను కుటుంబం కల్పించలేకపోవటంవల్ల పిల్లలు నిష్ప్రయోజకులుగా, బాలాపరాధులుగా తయారు కావటానికి అవకాశముంది. కుటుంబ సభ్యులను పేదరికం కొన్ని పరిస్థితులలో సాంఘిక, నైతిక పతనానికి కూడా దారితీస్తుంది. ఈ విధంగా వ్యక్తియే కాక, వ్యక్తి కుటుంబం కూడా నిరుద్యోగంవల్ల అవ్యవస్థతకు గురి అవుతుంది.

## నిరుద్యోగం - సాముదాయిక అవ్యవస్థత
## (Unemployment - Community Disorganisation)

నిరుద్యోగంవల్ల సమాజంలో ఉన్న వనరులు పూర్తిగా వినియోగం కావు. ఉత్పత్తి బాగా తగ్గిపోతుంది. దీనివల్ల వ్యక్తుల జీవన ప్రమాణం కూడా తగ్గిపోతుంది. నిరుద్యోగంవల్ల అనారోగ్యం, నిరక్షరాస్యత, నేరం, మానసిక అనారోగ్యం తదితర సామాజిక సమస్యలు కూడా ఏర్పడవచ్చు. నిరుద్యోగంవల్ల వ్యక్తులకు సంఘంపై వ్యతిరేక భావమేర్పడి సంఘ విద్రోహ చర్యలకు పాల్పడవచ్చు. దీనివల్ల సంఘ సంక్షేమానికి భంగం కలిగి సాముదాయిక అవ్యవస్థత సంభవిస్తుంది.

## నిరుద్యోగం - నిర్మూలనా పద్ధతులు

నిరుద్యోగం వైయక్తిక కుటుంబ సాముదాయిక అవ్యవస్థతలకు దారి తీయడమేకాక ఇంకా అనేకమైన ఇతర సాంఘిక సమస్యలకు మూలకారణ మవుతున్నది. అందుచేత నిరుద్యోగాన్ని, అల్పోద్యోగాన్ని నిర్మూలించటానికి అనేకమైన చర్యలు తీసుకోవడం జరుగుతుంది. ప్రభుత్వం నిరుద్యోగ సమస్యా నిర్మూలనకై అనేక సాంఘిక, ఆర్థిక సంక్షేమ కార్యక్రమాలను, పథకాలను ఏర్పాటు చేస్తున్నది. వాటిలో ముఖ్యమైనవి ఈ కింద పేర్కొనడం జరిగింది.

## వ్యక్తిగత అశక్తతలను తొలగించటం

అనారోగ్యం, శారీరక వైకల్యం, వృద్ధాప్యం, తగిన అనుభవం, శిక్షణ లేకపోవడం మొదలయిన వ్యక్తిగత కారణాలవల్ల నిరుద్యోగం ఎక్కువవుతున్నది. మన దేశంలో వైద్య సౌకర్యాలు ఏర్పాటుచేస్తున్నా, అవి చాలినన్ని లేవు. అందుచేత ప్రభుత్వం ఎక్కువగా వైద్య సౌకర్యాలను ప్రత్యేకంగా గ్రామీణ ప్రాంతాలలో అందరికీ తక్కువ ఖర్చులతో అందుబాటులో ఉండేటట్లు అందించాలి. సరిఅయిన వేతన విధానాన్ని రూపొందించి ఇతర సాంఘిక సంక్షేమ కార్యక్రమాల ద్వారా ప్రభుత్వం ప్రతివ్యక్తి జీవన ప్రమాణాన్ని మెరుగుపరచాలి. దీనివల్ల వ్యక్తుల ఆరోగ్య ప్రమాణం కూడా పెంపొందించవచ్చు. గ్రుడ్డి, చెవిటి, మూగ, కుంటి తదితర శారీరక వికలాంగులకు విద్యాశిక్షణ. వృత్తిశిక్షణ ఉద్యోగ ఉపాధి సౌకర్యాలు మొదలయిన పునరావాస సేవలను ఏర్పాటుచేసి, వికలాంగులలో ఉన్న నిరుద్యోగాన్ని తొలగించాలి. వారి కోసం ఏర్పాటయిన సంస్థాగత సేవలు, పునరావాస సేవలను సంక్షేమ కార్యకర్తల ద్వారా శాస్త్రీయ పద్ధతిలో అమలుపరిస్తే పూర్తి ఫలితాలను సాధించగలం.

పరిశ్రమలలోగాని, కర్మాగారాలలోగాని కార్మికులు గాయపడితే లేదా మరణిస్తే వారికి తగురీతిలో నష్టపరిహారం చెల్లించటం కార్మికులకు అవసరమయిన ఆరోగ్య భద్రతా సౌకర్యాలను ఎంప్లాయిస్ స్టేట్ ఇన్సూరెన్సు పథకంద్వారా ఏర్పాటుచేయటం సక్రమంగా జరిగేటట్లు ప్రభుత్వం చూడాలి.

ప్రణాళికా బద్ధమయిన విద్యా విధానం లేకపోవటంవల్ల వృత్తి విద్యా శిక్షణకు సరయిన ప్రోత్సాహం లేకపోవటంవల్ల వృత్తి సలహా సేవలు (Vocational guidance) అందుబాటులో లేనందువల్ల అనేకులు అల్పోద్యోగులు అవుతున్నారు. అల్పోద్యోగాన్ని తొలగించటానికి వృత్తి

విద్యా శిక్షణను అధికంగా ప్రోత్సహించే విద్యా విధానాన్ని ఏర్పాటుచేయాలి. వృత్తి సలహా కేంద్రాలను (Vocational guidance beauro) ఎక్కువగా స్థాపించాలి.

యువకులలో ఉన్న నిరుద్యోగాన్ని తొలగించటానికి అన్ని వృత్తులకు "అప్రెంటిస్" (Apprentice) విధానాన్ని అమలుపరచాలి. అనుభవంలేని యువకులు ఉద్యోగం సంపాదించటం చాలా కష్టం. అర్హతకు శక్తిసామర్థ్యాలకు తగిన వృత్తిలో, అప్రెంటిస్ ద్వారా అనుభవంసంపాదిస్తే సులభంగా ఉద్యోగాన్ని సంపాదించవచ్చు.

ఉద్యోగార్హతకు కావలసిన వయోపరిమితిని దాటిన వ్యక్తులకు ప్రత్యేకంగా కొన్ని ఖాళీలను కేటాయించాలి. వారింకను కుటుంబ బాధ్యతలను నిర్వహించవలసిన వారయితే వారికి ఉద్యోగాలిచ్చేటట్లుగా ప్రైవేట్ సంస్థలను ప్రోత్సహించాలి.

సామాజిక భద్రతా సౌకర్యాలను ప్రభుత్వం ఏర్పాటుచేస్తున్నది. అనేకమైన సాంఘిక, ఆర్థిక సహాయ పథకాల ద్వారా నిరుద్యోగుల జీవన ప్రమాణాన్ని పెంచటానికి ప్రభుత్వం కృషి చేస్తున్నది. గాని అధిక సంఖ్యలోకల నిరుద్యోగులకు ఈ సేవలు చాలటంలేదు. సామాజిక భద్రతా సౌకర్యాలు కల్పించటానికి గల చట్టాలను నిరుద్యోగులకు వర్తించేటట్లు చేయటం, వికలాంగులకు, వైధవ్యం పొందినవారికి సహాయం, నిరుద్యోగసహాయం, అనారోగ్య భీమా మొదలయిన సేవా కార్యక్రమాలను ఇంకా అధికంచేయాలి.

## ఆర్థికాభివృద్ధి పథకాలు

నిరుద్యోగం, అల్పోద్యోగం ఎక్కువగా ఉన్న మన దేశంలో, క్రొత్తగా ఉద్యోగావకాశాలను కల్పించాలి. అంటె ఆర్థిక రంగాలయిన వ్యవసాయం, పరిశ్రమలు మొదలయిన వాటిలో ప్రణాళికాబద్ధంగా ఆర్థికాభివృద్ధిని సాధించటం అవసరం. పట్టణాలలో పరిశ్రమలను అధికంచేస్తూ గ్రామాలలో వ్యవసాయ పరిశ్రమలు, కుటీరపరిశ్రమలను అధికంగా ప్రోత్సహించడంద్వారా నిరుద్యోగాన్ని చాలావరకు తొలగించవచ్చు.

## స్వయం ఉపాధి పథకాలు - పంచవర్ష ప్రణాళికలు

మొదటి ప్రణాళిక రూపొందించే సమయానికి దేశంలో నిరుద్యోగం ఎంత పరిమాణంలో ఉన్నదనే విషయం గురించి సరయిన సమాచారం లేదు. అందుచేత మొదటి ప్రణాళికలో ఈ సమస్య పట్ల తగినంత శ్రద్ధ చూపడం జరగలేదు. మొదటి పంచవర్ష ప్రణాళికలో నిరుద్యోగాన్ని తొలగించటానికి ఈ కింది సూచనలు చేయడమైంది.

1. అభివృద్ధి కార్యక్రమాలను ఏర్పరచటం ద్వారా ఉద్యోగావకాశాలు కల్పించడం.
2. సాంకేతిక మార్పుల ఫలితంగా నిరుద్యోగిత పెరుగకుండా తగిన చర్యలు తీసుకోవటం.

మొదటి ప్రణాళిక ద్వారా అదనంగా 6.3 మిలియను వ్యక్తులకు ఉద్యోగాలు లభిస్తాయని, 3.6 మిలియను వ్యక్తులకు పూర్తి ఉద్యోగిత సమకూడుతుందని ప్రణాళికా సంఘంవారు అంచనా

వేశారు. 1953 సం॥ నాటికి నిరుద్యోగ సమస్య తీవ్రరూపం దాల్చడంలో ఉద్యోగావకాశాలను పెంచటంకోసం కొత్త కార్యక్రమాలను రూపొందించారు,

1. నీటి పారుదల, విద్యుత్ ప్రాజెక్టులవద్ద పని శిక్షణా కేంద్రాలను నెలకొల్పటం.
2. చిన్న పరిశ్రమలను అభివృద్ధి చేయటం.
3. శిక్షణ సౌకర్యాలను విస్తరింప చేయటం.
4. పట్టణాలలో వయోజన విద్యా పాఠశాలలు, గ్రామాలలో ఏకోపాధ్యాయ పాఠశాలలు అధిక సంఖ్యలో ఏర్పరచటం.
5. జాతీయ విస్తరణ సేవలను విస్తృతం చేయటం ద్వారా ఉద్యోగావకాశాలను పెంచటం.
6. రోడ్డు రవాణా సదుపాయాలను అభివృద్ధి పరచటం.
7. మురికివాడల పథకాలు, గృహనిర్మాణ కార్యక్రమాలు అమలుపరచటం.

ఈ కార్యక్రమాలన్నీ అమలు పరచినా మొదటి ప్రణాళికా కాలంలో నిరుద్యోగ సమస్యను తగినంతగా పరిష్కరించడం జరగలేదు.

## రెండో ప్రణాళిక

ఉద్యోగావకాశాలను ఎక్కువగా కల్పించడం రెండో ప్రణాళికా ప్రధాన లక్ష్యాలలో ఒకటి. ఈ ప్రణాళికలో ఉద్యోగిత, ఉత్పత్తి, రెండింటిని పెంచడానికి వీలుగా కుటీర పరిశ్రమలు, చిన్న పరిశ్రమలను ప్రోత్సహించటం జరిగింది.

మూడో ప్రణాళికద్వారా 14.5 మిలియన్ల వ్యక్తులకు ఉద్యోగావకాశాలు కల్పించడమైంది. నిరుద్యోగ సమస్యను, గ్రామస్థాయిలో, జిల్లా స్థాయిలలో పరిష్కరించటానికి కృషిజరిగింది.

ఉద్యోగావకాశాలు పెంపొందించటం కోసం 4వ ప్రణాళిక కాలంలో ప్రవేశపెట్టిన కార్యక్రమాలలో ముఖ్యమైనవి.

## 1. రూరల్ వర్క్స్ ప్రోగ్రాం (Rural Works Programme)

ఈ పథకం ద్వారా గ్రామాలలో వ్యవసాయ కూలీలకు పని కల్పించటానికి జిల్లా స్థాయిలో అభివృద్ధి కార్యక్రమాలు రూపొందించబడినాయి. వ్యవసాయ కార్యకలాపాలు, పాడిపరిశ్రమ, మత్స్య పరిశ్రమ మొదలైనవి కొనసాగించటానికి, వ్యవసాయ కూలీలకు పనిలేని కాలంలో ఉత్పాదకమైన పనిని కల్పించటానికి అభివృద్ధి పథకాలను అమలుపరిచారు. మెట్టభూములలో సమగ్ర వ్యవసాయాభివృద్ధి పథకంకింద అనేక ప్రాజెక్టులు ప్రారంభమయ్యాయి.

గ్రామీణ ప్రాంతాలలో నిరుద్యోగిత, అల్పోద్యోగిత సమస్యలను ఎదుర్కోవటానికి వ్యవసాయ కేంద్రాలు స్థాపితమై వాటిద్వారా ప్రత్యేక కార్యక్రమాలను ఉధృతంగా అమలుపరిచారు. ఇంతేకాకుండా రోడ్లు, మార్కెట్లు మొదలగు సదుపాయాలను కల్పించి ఉద్యోగావకాశాలు పెంచడానికి పథకాలు రూపొందించారు. అయిదవ, ఆరవ, పంచవర్ష ప్రణాళికలలో, నిరుద్యోగ సమస్య పరిష్కారానికి కొన్ని జాతీయ స్థాయి పథకాలను ప్రవేశపెట్టడం జరిగింది. అవి ఏమంటే సమగ్ర

గ్రామీణ అభివృద్ధి పథకాలు, జాతీయ గ్రామీణ ఉపాధి, పనికి ఆహారం, చిన్నకారు, సన్నకారు రైతుల అభివృద్ధి, జిల్లా గ్రామీణ అభివృద్ధి, అంత్యోదయ మొదలయినవి ఈ జాతీయ పథకాలను అమలుపరచటం ద్వారా చాలావరకు నిరుద్యోగ సమస్యను పరిష్కరించటానికి ప్రభుత్వపరంగా ప్రయత్నాలు జరిగినాయి.

ఈవిధంగా పంచవర్ష ప్రణాళికలద్వారా గ్రామీణ ప్రాంతాలలో, పట్టణ ప్రాంతాలలో అనేక పథకాలు అమలుపరచి, అనేకులకు ఉద్యోగావకాశాలు ప్రభుత్వం కల్పిస్తున్నది. అయినప్పటికీ జనాభా అధికంగా అభివృద్ధి చెందటంవల్ల నిరుద్యోగసమస్య నానాటికీ ఎక్కువవుతున్నది.

## విద్యావంతులలో నిరుద్యోగం

మన దేశంలో విద్యావంతులయినవారు ఎక్కువగా నిరుద్యోగులుగా ఉన్నారు. దీనికి కారణాలు చాలా ఉన్నాయి. విద్యావంతుడు సాధారణంగా తన విద్యను పెట్టుబడిగా భావించి మంచి ప్రతిఫలం ఇవ్వగలిగిన ఉద్యోగం కొరకే ప్రయత్నిస్తాడు. మన దేశంలో విద్యావిధానంలో, భూయిష్టంగా ఉండటంవల్ల కొన్ని వృత్తులలో ఉద్యోగావకాశాలు లభించటంలేదు. అంతేకాక ప్రాంతీయ అభిమానంవల్లకూడా ఉద్యోగావకాశాలను సక్రమంగా వినియోగించుకోలేకపోతున్నారు. సాధారణంగా విద్యావంతులైనవారు కార్యాలయాలలో పనిచేయటానికి మాత్రమే ఇష్టపడటంవల్ల, పోటీ పెరిగి, ఉద్యోగావకాశాలు అందరికీ లభించటంలేదు.

విద్యావంతులలో ఉన్న నిరుద్యోగాన్ని తొలగించటానికి ప్రణాళికా సంఘం ప్రత్యేకంగా కొన్ని కార్యక్రమాల నేర్పాటు చేస్తున్నది. వాటిలో ముఖ్యంగా **1.** చిన్న పరిశ్రమలను స్థాపించటం కోసం కావలసిన ఆర్థిక సహాయాన్ని ఋణాల ద్వారా ఇవ్వడం, దానికి తగిన వృత్తి శిక్షణ, ముడి సరకుల సరఫరా. తయారయిన సరకుల అమ్మకం మొదలయిన విషయాలలో కూడా సహాయాన్ని అందించటం. **2.** అప్రెంటిస్ కార్యక్రమాలను విరివిగా ప్రోత్సహించటం. **3.** యూనివర్శిటీ ఎంప్లాయిమెంట్ బ్యూరోలను (University Employment Bureao) ఏర్పాటు చేయటం. **4.** విద్యా విధానాలలో తగిన మార్పులుచేసి సాంకేతిక విద్యకు, వృత్తి శిక్షణకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వటం. **5.** విద్యా శిక్షణా సహాయక సేవలు (educational counselling) వృత్తి శిక్షణా సహాయక సేవలు (Vocational Counselling) అందరకు అందుబాటులో ఉండేటట్లు చేయటం. **6.** విద్యావంతులచే గ్రామీణ ప్రాంతాలలో సహకార సంస్థల సహాయం ద్వారా చిన్న పరిశ్రమలను స్థాపించి నడిపించటం మొదలైనవి ఏర్పరిచింది.

## నిరుద్యోగం - సంఘ సంక్షేమకృషి పాత్ర

నిరుద్యోగ సమస్యను శాస్త్రీయ దృక్పథంతో అవగాహన చేసికోవటం చాలా అవసరం. ఎందుకంటే, విభిన్నమైన కారణాలు, నిరుద్యోగసమస్యను మనదేశంలో ఉధృతంచేస్తున్నాయి. నిరుద్యోగాన్ని తొలగించి, సమాజంలోని ప్రతి వ్యక్తికీ ఉద్యోగావకాశాలను కల్పించటంలో ప్రభుత్వానికి, సమాజానికి పూర్తి బాధ్యత ఉన్నది. ఈ కార్యక్రమాలను రూపొందించటంలోను,

వాటిని అమలుపరచటంలోను సంఘ సంక్షేమ కార్యకర్తల పాత్ర ఎంతయినా అవసరం. సంక్షేమ కార్యకర్త, ప్రభుత్వపరంగాను, స్వచ్ఛంద సంస్థలద్వారాను లభిస్తున్న ఉద్యోగావకాశాలను గురించి ప్రజలకు తెలియచేయవలె. ఇంతేకాకుండా సమాజంలో ఉన్న బడుగు వర్గాలకు ప్రత్యేకంగా ఏర్పరచిన స్వయం ఉపాధికల్పనా కార్యక్రమాల గురించి తెలియచేయవలె. వికలాంగుల పునరావాసానికి ఏర్పరచిన సంస్థాగత, సంస్థాగతేతర (institutional non institutional) సేవా కార్యక్రమాలలో సంఘ సంక్షేమ కార్యకర్త పాత్ర చాలా కీలకమైనది. నిరుద్యోగానికి ముఖ్య కారణాలైన నిరక్షరాస్యత, అమాయకత్వం, జడత్వం, మొదలగువానిని రూపుమాపటంలో సంఘ సంక్షేమ కార్యకర్త సామాజిక చర్య (Social Action) నుపయోగించి కృషిచేస్తాడు. నిరాశా నిస్పృహలకు గురిఅయిన నిరుద్యోగ పీడితులను సమూహ సేవా పద్ధతిద్వారా వారిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందింపచేసి వారి కాళ్ళపై వారు నిలబడేటట్లు చేయటానికి సంఘ సంక్షేమ కార్యకర్త కృషిచేయవలె. ప్రభుత్వ విధానాలలో ఉన్న లోపాలను సరిదిద్ది ప్రజల కుపయోగపడే కార్యక్రమాలను రూపొందించడంలో ప్రజానాయకులతోను, రాజకీయపార్టీలతోను, ప్రభుత్వంతోను సంప్రదించి కార్యక్రమాలను అమలు పరచటంలో సంక్షేమ కార్యకర్త కృషిచేయాలి. అంతేగాక నేడు ప్రభుత్వం చేపట్టిన నిరుద్యోగ నిర్మూలనా కార్యక్రమాలలో చురుకుగా పాల్గొని, వాటిని గురించి సవివరంగా ప్రజలకు తెలియ చేయటంలో సంక్షేమ కార్యకర్త తోడ్పడాలి.

జనసంఖ్య ఎక్కువగా ఉండి, అభివృద్ధి చెందుతున్న మన దేశంలో ఆర్థికాభివృద్ధి ఎంత ప్రాముఖ్యమో, నిరుద్యోగాన్ని తొలగించటం కూడ అంత ప్రాముఖ్యం వహిస్తుంది. కాబట్టి మన దేశంలో ఉద్యోగితా విధానంలోను, శాస్త్రీయ దృక్పథం అలవరచుకోవడం చాలా అవసరం.

# 4
# నేరం
# (CRIME)

సామాజిక సమస్యలలో నేరం చాలా ముఖ్యమైనది. నేరస్తులు సంఘానికి చాలా హానికరం గనక సంఘం వారిపట్ల తీవ్రఅసమ్మతితో ఉంటుంది. నేరస్థులు సంఘానికేగాక, వ్యక్తి భద్రతకు, వ్యక్తి స్వాతంత్ర్యానికి, వ్యక్తి ఆస్థికి కూడా భంగకరంగా ప్రవర్తిస్తారు. అందువల్లనే నేరం, దాని కారణాలు, దుష్ఫలితాలు, నేరస్థుల సంస్కరణా పద్ధతులను గురించి వివరంగా తెలుసుకోవలసి ఉంది.

## నేరం - భావన

మానవ సమాజం కొన్ని నిబంధనలను, నియమాలు, కట్టుబాట్లు, నీతులు మొదలయిన సామాజిక నియంత్రణా విధానాలతో వ్యవస్థీకృతమై ఉన్నది. ఆధునిక సమాజంలో చట్టం మానవ ప్రవర్తనను వ్యవస్థీకృతం చేస్తున్నది. కాని అనాదినుంచి కొంతమంది ఈ నియమ నిబంధనలను, చట్టాలను ఉల్లంఘిస్తూనే ఉన్నారు. చట్టాలను ఉద్దేశపూర్వకంగా, బాహాటంగా ఉల్లంఘించే చర్యను నేరం అంటారు. నేరాన్ని సాధారణంగా న్యాయసంబంధంగా నిర్వచిస్తారు. కాని నేరాన్ని పూర్తిగా అర్థం చేసికోవటానికి ఇతర భావనలను కూడా అధ్యయనం చేయాలి.

నేరాన్ని ముఖ్యంగా : 1. భూతశాస్త్రానికి సంబంధించిన నేరభావన (Delogicalnomo Concept of Crime) 2. చట్టబద్ధమయిన నేరభావన (Legal Concept of Crime) 3. సామాజిక నేరభావన (Social Concept of Crime) 4. సామాజిక న్యాయసంబంధ నేరభావన (Socio-Legal Concept of Crime) 5. మానసిక – సామాజిక – న్యాయసంబంధ నేరభావన (Psycleo-socio-legal Concept of Crime) అనే అయిదు అంశాలను అనుసరించి వివరంగా అర్థం చేసికోవచ్చు.

## భూతశాస్త్రి సంబంధ నేరబావన

ప్రాచీన సమాజాలలో ఈ భావన ఎక్కువగా అమలులో ఉండేది. సమూహానికి హాని కలిగించే చర్యలు దైవవిరుద్ధంగా భావించేవారు. ఎక్కువగా భగవంతుని తిరస్కరించే చర్యలకు అపరాధంగా ఎంచేవారు. దుష్టశక్తుల ప్రభావంవల్ల వారు నేరం చేసేవారని తలచి, ఆ దుష్టశక్తులను పారద్రోలటానికి ఆ వ్యక్తులను క్రూరంగా హింసించటం, వెలివేయటం, తరిమివేయటం మొదలైనవి చేసేవారు. కాని క్రమక్రమంగా నాగరికత పెరుగుతున్నకొద్దీ, విజ్ఞానం పెరుగుతున్నకొద్దీ ఇటువంటి మూఢ విశ్వాసాలు తగ్గిపోతున్నాయి.

## 2. న్యాయశాస్త్ర సంబంధ నేరభావన

ఆధునిక సమాజంలో చట్ట సంబంధమైన నేరభావన ఎక్కువగా అమలులో ఉన్నది. మైకేల్, ఎడ్లర్ (Michel and Adler) అభిప్రాయ ప్రకారం, "శిక్షాస్మృతి నిషేధించిన ప్రవర్తనయే నేరం". మిల్లర్ (Miller) అభిప్రాయ ప్రకారం ప్రభుత్వం ఆదేశించిన దండనాత్మక శిక్ష కలిగిన ప్రవర్తనను నేరంగా నిర్వచించవచ్చు. కొన్ని చర్యలు నైతికంగా ఎంత వ్యతిరేకమైనా సరే, చట్టం నిషేధించకపోతే, వాటిని నేరంగా పరిగణించకూడదు.

ఈ చట్టబద్ధమైన భావన సమగ్రమైనది కాదు. దీనిలో కొన్ని లోపాలున్నాయి. 1. ఎంతటి అపరాధ చర్య అయినా, చట్టం నిషేధించకపోతే నేరం కాదు. 2. ఈ భావనలో చిన్న తప్పుకు, పెద్ద నేరానికి తేడా స్పష్టంగా లేదు. 3. దేశకాల ప్రాంత పరిస్థితులు మారుతున్నకొద్దీ నేరభావన మారుతుంటుంది. కాబట్టి చట్టబద్ధమైన భావన, మారుతున్న నేరాన్ని పూర్తిగా వివరించలేదు.

## 3. సామాజిక నేరభావన

ఈ భావన ననుసరించి, సమాజానికి హానికలిగించే చర్యలను నేరంగా భావించవచ్చు. సామాజిక ప్రమాణాలను (social norms) ఉల్లంఘించినట్లయితే అది నేరమవుతుంది. సామాజిక వ్యవస్థకు సంబంధించిన నియమాలను, సాంఘికామోద్య పద్ధతులను (social sanctions) ఉల్లంఘించినట్లయితే అది నేరమవుతుంది. ఈ భావన కూడా సంపూర్ణమైందికాదు. ఎందుకంటే ఆధునిక సమాజంలో చట్ట రీత్యా మాత్రమే నేరం శిక్షింపబడుతున్నది.

## 4. సామాజిక న్యాయ సంబంధ భావన

సామాజిక భావన, నాయ భావనలలో ఉండే లోపాలను సవరించటానికి రెండు భావనలను కలిపి, నేరాన్ని అర్థం చేసికోవటానికి ప్రయత్నం జరిగింది. ఈ భావన ప్రకారం సమాజానికి హాని కలిగించే చర్యలే నేరాలు. సామాజిక ప్రమాణాల (Social Norms) ననుసరించి చేసిన చట్టాలు, న్యాయ సూత్రాల ద్వారా ఆ నేరాన్ని శిక్షించడం జరుగుతుంది. ఈ భావన కూడా సరయినది కాదు. ఎందుకంటే వ్యక్తి ఏ పరిస్థితిలో నేరం చేస్తున్నాడో ఇందులో పరిశీలనకు రాదు.

## 5. సామాజిక మానసిక న్యాయ సంబంధ భావన.

ఈ భావన చాలా ఆధునికమైనది. ఈ భావనప్రకారం నేరస్తుని జైవిక, సంపాదితలక్షణాలు, పరిసరాల ప్రభావం, నేరం చేయటానికి ప్రేరేపించిన పరిస్థితులు, వీటన్నిటిని పరిశీలించి, వాటిప్రకారం నేరాన్ని నిర్ణయించాలి. ఈ భావన చాలా సంక్లిష్టమైనది. దీనిప్రకారం రూపొందించిన శిక్షాస్మృతి చాలా అస్పష్టంగా అస్తవ్యస్తంగా తయారవుతుంది. ఎందుకంటే ఒకే నేరం కొరకు వివిధవ్యక్తులకు వివిధ శిక్షలను విధించవలసి వస్తుంది.

## నేరం - కారణాలు

నేరానికి అనేక కారణాలున్నాయి. చాలామంది మనోవైజ్ఞానిక శాస్త్రవేత్తలు, నేర శాస్త్రవేత్తలు, ఆర్థిక శాస్త్రవేత్తలు, సామాజిక శాస్త్రజ్ఞులు వివిధ పరిశోధనలుచేసి నేరానికి

సంబంధించిన అనేక కారణాలను వివరించారు. అయినా, నేరానికి ప్రత్యేకంగా ఈ కారణా లేఉన్నాయి అని ఖచ్చితంగా చెప్పలేం. విలియం హీలే అనే శాస్త్రజ్ఞుడు నేరాన్ని సామాన్యంగా పరిశీలించక, నైయక్తికస్థాయిలో నేరస్తులను పరిశోధించాడు. ఈ పరిశోధన ఫలితంగా, ప్రతీనేరానికి, ఒక ప్రధాన కారణంతోపాటు, మూడు, నాలుగు ఇతర కారణాలుకూడా ఉంటాయని తెలుసుకోవడమైంది. ఆధునిక పరిశోధనలు కూడా అనేక కారణాలు కలసి, నేరాన్ని ప్రభావితం చేస్తాయని తెలుపు తున్నాయి. ఈ కారణాలను (1) సామాన్య కారణాలు (2) ప్రత్యేక కారణాలు (Specific factors) గా విభజించవచ్చు.

# 1. సామాన్య కారణాలు (GENERAL FACTORS)

## 1. భౌతిక కారణాలు (Physical factors)

భౌగోళిక పరిస్థితులు, వాతావరణం, శీతోష్ణస్థితి మొదలయిన అంశాలు, వ్యక్తి అభివృద్ధి, వ్యక్తి ప్రవర్తనను చాలావరకు ప్రభావితం చేస్తాయి. హంటిగ్టన్ (Hantigton) అనే శాస్త్రజ్ఞుడు, శీతాకాలంలో జన్మించిన వ్యక్తులలో అనేకమంది, తక్కువ మేధాశక్తితో ఉంటారని, చాలావరకు వారు నేరస్తులుగా మారతారని తన పరిశోధనల ద్వారా తెలియచేశారు. చాలామంది ఇతర శాస్త్రజ్ఞులుకూడా నేరానికి, భౌతిక పరిసరాలకు దగ్గర సంబంధముందని నిరూపించారు. కాని గిల్లిన్ (Guillin) అభిప్రాయం ప్రకారం, భౌగోళిక పరిసరాల ప్రభావం వ్యక్తులు నేరస్తులుగా మారటానికి కొంతవరకే కారణం. ఆ ప్రభావంకూడా పరిమితంగాను, పరోక్షంగాను ఉంటుంది.

## 2. సామాజిక కారణాలు (Socialogical factors)

కొన్ని పరిశీలనల ప్రకారం, ప్రాథమిక సమూహాలలో నేరం తక్కువగా కనిపిస్తుందని తేలింది. వేరుగా ఉండి, ఎక్కువ మార్పులకు గురికాకుండా ఉన్న చిన్నదైన ప్రాథమిక సమూహాలలో ఉదా॥ ఆదిమజాతుల వ్యవసాయగ్రామాలు, మత సమూహాలు, మొదలయినవాటిలో నేరానికి చాలా తక్కువ అవకాశం ఉంటుంది. త్వరితగతిని మార్పులుచెందే సంశ్లిష్ట సమాజాలలో నేరానికి ఎక్కువ అవకాశం ఉంది.

## 3. సామాజిక అంతస్తు, లింగం, వయస్సు, జాతి ప్రాంతీయత మొదలయినవి

నేరం, సామాజిక అంతస్తు, లింగం, వయస్సు, జాతి, ప్రాంతీయతా భేదాలను బట్టికూడ మారుతుంటుంది. సాధారణంగా నేరం, సామాజికంగా తక్కువ అంతస్తుకు చెందినవారిలో ఎక్కువగా ఉంటుంది. ఆ విధంగానే స్త్రీలలో కంటే పురుషులలో ఎక్కువగా ఉంటుంది. వయస్సునకు కూడా నేరంపై అధిక ప్రభావం ఉంది. వ్యక్తులు, బాల్యం, వృద్ధాప్యంలోకంటె, కౌమార దశలోను, యవ్వన దశలోను నేరాలను ఎక్కువగా చేస్తారు.

## 2. b) ప్రత్యేక కారణాలు (SPECIFIC FACTORS)

ప్రత్యేక కారణాలలో రెండు రకాలున్నాయి.

1. జైవిక కారకాలు (Biological Factors)
2. పరిసర కారకాలు (Environmental Factors)

ఒక వ్యక్తి ప్రవర్తనపై జైవిక, పరిసర కారకాలు రెండూ ప్రభావం చూపుతాయి. కనుక నేరానికి ఇవి రెండూ కొంతవరకు కారణమవుతాయి.

### జైవిక కారణాలు

## 1. శారీరక నిర్మితి

లోంబ్రోసో (Lombroso) అనే శాస్త్రజ్ఞుని అభిప్రాయం ప్రకారం శారీరక, మానసిక నిర్మితిలోని అవలక్షణాలు నేరానికి దారితీయవచ్చు. నేరస్తులలో ఒకరకం "పుట్టుకతోనే నేరస్తులు" (born criminal type). ఈ రకానికి చెందిన వ్యక్తులందరూ, కొన్ని ప్రత్యేక శారీరక మానసిక లక్షణాలతో ఉంటారు. అవి అనురూపత్వం (Symmetry) లేని కపాలం, దిగువగానున్న ఫాలభాగం, వక్రమైన, ఒంపుతిరిగిఉన్న కనుబొమ్మలు, పెద్దవైన చెవులు, మొదలయిన శారీరక లక్షణాలు. ఇంతే కాక బాధ తెలియనితనం, (Insensibility to Pain), తీక్షణదృష్టి, జడస్వభావం, అల్పమైన నైతిక విలువలు, ఉద్రిక్త స్వభావం మొదలైన మానసిక లక్షణాలు నేరస్తులలో సామాన్యంగా ఉంటాయి. లోంబ్రోసో సిద్ధాంతాన్ని తరువాత కొంతమంది శాస్త్రజ్ఞులు ఖండించారు.

క్రెష్మర్ (Krestchmer)సిద్ధాంతం లోంబ్రోసో సిద్ధాంతంలో చాలావరకు ఏకీభవిస్తున్నది. అతని అభిప్రాయం ప్రకారం శరీరనిర్మితికి, మానవ స్వభావానికి చాలా దగ్గరసంబంధం ఉంది. శరీర నిర్మాణాన్నిబట్టి మానవులను 3 రకాలుగా విభజింపవచ్చు.

(1) ప్రాంశుకాయులు (Aesthenic) (2) స్థూలకాయులు (Pyknic) (3) సౌష్ఠవ కాయులు (Athletic). క్రెష్మర్ అభిప్రాయం ప్రకారం స్థూలకాయులు చాలా తక్కువగా నేరాలు చేస్తారు.

## 1. వారసత్వం (Heridity)

నేరస్వభావం ఏర్పడటానికి వారసత్వం చాలావరకు కారణమవుతుందని గోరింగ్ (Goring) శాస్త్రజ్ఞుని అభిప్రాయం. తల్లిదండ్రుల నుంచి వారసత్వం ద్వారా సంక్రమించిన బుద్ధిమాంద్యక, బలహీన మనస్తత్వంవల్ల కూడా వ్యక్తులు నేరస్తులుగా మారతారు. దీనిని నిరూపించటానికి చాలా పరిశోధనలు జరిగాయి.

డగ్‌డేల్ (Dugdale) అనే శాస్త్రజ్ఞుడు, జూక్స్ (Jukes) అనే కుటుంబానికి సంబంధించిన అనేక వారసులను పరిశీలించగా కింది విషయాలు తేలినవి. ఈ కుటుంబానికి చెందిన సంతానంలో

అనేకమంది హంతకులుగాను, దొంగలుగాను, దేశద్రిమ్మరులుగాను, వేశ్యలుగాను తయారయినారు. దీనినిబట్టి నేరస్వభావానికి వారసత్వం ప్రధాన కారణమని నిశ్చయమైంది.

లాంగే (Lange) అనే శాస్త్రజ్ఞుడు కవలలపై పరిశోధనలు జరపగా 13 సమరూప కవలలో 10 జతలలో ఇద్దరూ కూడా నేరస్థులుగా తేలారు. 17 ప్రతిరూప కవలలను పరిశీలించగా వారిలో ఇద్దరు మాత్రమే నేరస్థులున్నారు. దీనినిబట్టికూడా, నేర స్వభావం కలిగించటానికి వారసత్వం కారణ మని నిరూపిత మవుతున్నది.

## C. గ్రంధులు (Harmones)

వ్యక్తి శారీరక, మానసిక వికాసం, మేధస్సు, మూర్తిమత్వ అభివృద్ధి చాలా వరకు వినాళ గ్రంథులు (Ductlen glands) పనిచేసే తీరుపై ఆధారపడి ఉంటాయి. గ్రంథులు సక్రమంగా పని చేయలేకపోతే, అనేకమైన శారీరక, మానసిక అవలక్షణాలు ఏర్పడతాయి. ష్కాల్ప్ (Schalpp), స్మిత్ (Smith) అనే శాస్త్రజ్ఞుల అభిప్రాయ ప్రకారం నేరానికి ముఖ్య కారణమైన బుద్ధి మాంధ్యత, బలహీన మనస్తత్వం మొదలైనవి గ్రంధుల నిర్మాణం, అవి పనిచేసే తీరుపై ఆధారపడి ఏర్పడు తున్నవి.

శారీరక నిర్మితి, వారసత్వం, గ్రంధులు నేరానికి కొంతవరకు కారణమయినా, అవి పూర్తిగా నేర స్వభావాన్ని నిర్ణయించలేవు. సామాజిక పరిసరాల ప్రభావంవల్లనే ఎక్కువగా నేరస్థులు తయా రవుతారని ఆధునిక శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

## మానసిక కారకాలు (Psychological Factors)

బుద్ధి మాంధ్యత, మానసిక రుగ్మతలు, మానసిక రీతులు, ప్రేరేపణలు మొదలయిన లక్ష ణాలు కూడా నేర స్వభావానికి కారణమవుతాయి.

బుద్ధి మాంధ్యత నేరానికి ప్రధాన కారణంగా పేర్కోనడం జరిగింది. గోరింగ్ అభిప్రాయ ప్రకారం మానసిక బలహీనతలు కొంతవరకు నేర స్వభావాన్ని ప్రేరేపిస్తాయి. గోడర్డ్ (Goddard) అనే శాస్త్రజ్ఞుడు బాల నేరస్థుల గృహంలోని బాలురపై మనస్తత్వ పరీక్షలు జరిపి వారిలో నూటికి ఏభై మంది మానసిక బలహీనతలు కలిగినవారేనని తెలియచేశాడు. కాని వ్యక్తి నేరస్థుడు కానటానికి మానసిక బలహీనత ఒక్కటే కారణమని ఖచ్చితంగా చెప్పలేదు.

మానసిక రుగ్మతవల్ల నేర స్వభావం కలుగుతుందని చెప్పటానికి సరియైన ఆధారాలు లేవు. ఈస్ట్ (East) డన్‌హోమ్ (Dunhome) మొదలయిన శాస్త్రజ్ఞులు మానసిక అస్వస్థత కలిగినవారిపై అనేక పరిశోధనలు జరిపి, పిచ్చివారిలో చాలా తక్కువమంది మాత్రమే నేర స్వభావం కలిగి ఉన్నారు గనుక నేరానికి మానసిక అస్వస్థతకు ఎక్కువ సంబంధం లేదని తెలియచేశారు.

మనస్తత్వ విశ్లేషణా శాస్త్రజ్ఞులు మానవ ప్రవర్తనను, మానవ స్వభావాన్ని ఒక ప్రత్యేక రీతిలో వివరించారు.

వ్యక్తి ప్రవర్తన, వ్యక్తి మానసిక అంశాలను అంటే స్మృతికి తెలియని ప్రేరేపణా శక్తులు (unconscious motivating forces), సహజాతాలు (instincts), ఉద్వేగాలు (emotions) సంఘర్షణలు మొదలయినవాటిపై ఎక్కువగా ఆధారపడి ఉంటాయి. అచేతన మస్తిష్కంలోనికి (unconscious mind) త్రోక్కివేయబడిన అవాంఛనీయ కోర్కెలు, సంఘటనలు కలిసి అసమాయోజన జీవితానికి (maladjusted life) దారితీస్తాయి. వ్యక్తి కుటుంబంతో, వ్యక్తితో, సంఘంతో సమబాటు కోల్పోయినపుడు అతడు నేరస్థుడుగా మారటానికి అవకాశముంది.

అడ్లర్, అలెగ్జాండర్ (Adler and Alexander) అనే శాస్త్రజ్ఞులుకూడా తమ పరిశోధనల ద్వారా మానసిక యంత్రాంగాలు (mental mechanisms) సరిగా పనిచేయనప్పుడు, వ్యక్తి సర్దుబాటును కోల్పోయినప్పుడు నేరస్థుడుగా మారవచ్చునని నిరూపించారు.

డబ్ల్యు. ఐ. థామస్ (W. I. Thomas) అభిప్రాయం ప్రకారం ప్రతిమానవునికి నాలుగు ముఖ్యమైన మౌలిక వాంఛలు ఉంటాయి. అవి (1) నూతన అనుభవ వాంఛ (desire for new experience) (2) ప్రతిస్పందనా వాంఛ (desire for response) (3) గుర్తింపు వాంఛ (desire for recognition) (4) భద్రతావాంఛ (desire for security). ప్రతి వ్యక్తి వీటిని వాంఛనీయ పద్ధతులద్వారా తృప్తిపరచుకోవటానికి ప్రయత్నిస్తాడు. ఆ విధంగా జరగనప్పుడు, అతని ప్రవర్తన విచలనం చెంది, అతడు నేరం చేయడానికి పాల్పడవచ్చు. హీలే (Helay)అనే శాస్త్రజ్ఞుడు కూడా "వ్యక్తి ఆంతరంగిక, బాహ్య ఒత్తిడులను తట్టుకోలేనప్పుడు కలిగే ప్రతిస్పందన చర్యయే నేరానికి దారితీస్తుందని తెలియచేశాడు.

## పరిసర కారకాలు (ENVIRONMENTAL FACTORS)

నేరానికి దారితీసే కారకాలలో పరిసర కారకాలు చాలా ముఖ్యమైనవి. పరిసర కారకాలలో ప్రధానమైనవి.

### (a) కుటుంబ పరిస్థితులు

కుటుంబ పరిస్థితులు వ్యక్తి అభివృద్ధికి అనుకూలంగా లేనప్పుడు ఆ వ్యక్తి నేరస్థుడుగా మారవచ్చు.

తల్లి లేదా తండ్రి మరణించడం, విడాకులు, కుటుంబ తగాదాలు, మొదలైన వానివల్ల కుటుంబం విచ్ఛిన్నమయినప్పుడు, ఆ పరిస్థితులలో పెరిగిన వ్యక్తులు నేరస్థులుగా మారటానికి ఎక్కువ అవకాశం ఉంది. బ్రెకిన్‌రిడ్జ్, ఎబట్‌లు(Breckenridge and Abbot), చికాగోలో బాలల న్యాయస్థానం (Juvenile court) లోని బాలనేరస్థుల కుటుంబ వివరాలు పరిశీలించగా, నూటికి ముప్ఫై నాలుగు మంది బాలనేరస్థులు విచ్ఛిన్న కుటుంబాల చెడుప్రభావం పెద్దవారిమీదకంటే, పిల్లలపైనే అధికంగా ఉంటుందని కొంతమంది శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

కుటుంబ పరిమాణం ఎక్కువగా ఉండినా, పిల్లలు నేరస్తులుగా మారవచ్చునని కొంతమంది శాస్త్రజ్ఞులు అభిప్రాయపడినా, దానిని ఖచ్చితంగా నిరూపించలేకపోయారు. కాని సాధారణంగా సంతాన సంఖ్య అధికంగా ఉన్నప్పుడు, సరియైన పోషణ, సంరక్షణ, నియంత్రణలేక కొంతమంది పిల్లలు నేరస్తులుగా మారవచ్చు.

సంతానం క్రమశ్రేణి స్థితిని (Sibling Position) బట్టికూడా వ్యక్తులు నేరస్తులుగా తయారవవచ్చు. స్లెట్టో (Sletto) అభిప్రాయ ప్రకారం సంతాన వరుసలోని స్థితినిబట్టి పిల్లలు వేరు వేరు పాత్రలను నిర్వహించవలసివుంది. కుటుంబ సంబంధాలలో వారు నిర్వహించే పాత్రలనుబట్టి పిల్లలలో నేర స్వభావం ఏర్పడవచ్చు. తల్లిదండ్రులకు, పిల్లలకు మధ్యగల అసంతృప్తికరమైన సంబంధ బాంధవ్యాలు పిల్లల ప్రవర్తనపై తీవ్ర ప్రభావాన్ని కలిగి ఉంటాయి. నేరస్తులలో ఎక్కువమంది తల్లి దండ్రులతో సరియైన సంబంధాలు లేనివారేనని బుఫాంగ్ (Bufang) హీలె (Helay) బ్రోనర్ (Bronner) అనే శాస్త్రజ్ఞులు తమ పరిశోధనల ద్వారా తెలియచేశారు.

త్రాగుబోతుతనం, అవినీతి, నేరం మొదలైన చెడు అలవాట్లు ఉన్న కుటుంబాలలోనుంచి పిల్లలు నేరస్తులుగా తయారవటానికి ఎక్కువ అవకాశం ఉంది. హీలె శాస్త్రజ్ఞుడు అపరాధులను పరిశీలించినపుడు తన పరిశీలనలో నూటికి పద్దెనిమిదిమంది అవినీతికరమైన గృహాలకు సంబంధించినవారేనని తెలియచేశాడు.

పిల్లల ప్రవర్తనపై, తల్లిదండ్రుల ప్రభావం చాలా అధికంగా ఉంటుంది. తల్లిదండ్రుల అజ్ఞానం, అజాగ్రత్త నిర్లక్ష్యం, ఉద్రేకపూరితమైన ప్రవర్తన, తల్లిదండ్రుల నియంత్రణ పిల్లలపై లేకపోవడం మొదలగువానివలన పిల్లలు సులభంగా నేరప్రవర్తన నేర్చుకొంటారు.

ఈ విధంగా కుటుంబం, కుటుంబ పరిస్థితులు నేరప్రవర్తన ఏర్పడటానికి కొంతవరకు కారణమని చెప్పవచ్చు.

## (b) సహవాసం

చెడు సహవాసంవల్ల వ్యక్తులు సులభంగా నేరస్తులుగా మారతారు. చాలా నేరాలను, ఒంటరిగాకాక, ఇద్దరు, ముగ్గురితో కలిసి చేయగలరు.

సాధారణంగా మురికివాడలలోని పిల్లలు, విచ్ఛిన్నత, దారిద్ర్యంగల కుటుంబాలలోని పిల్లలు గుంపులుగాచేరి, సరదాగా ఆటల రూపంలో ప్రారంభించి పెద్దపెద్ద నేరాలు చేయడానికి క్రమంగా అలవాటుపడతారు. చెరసాలలో, ఇతర నేరస్తులతో కలసి ఉండటంవల్ల, వ్యక్తులలో నేర స్వభావం ఇంకా ఎక్కువ అవుతుంది. నేరానికి సంబంధించిన వివరాలు, నేరం చేయడంలో కొత్త విధానాలు, నిపుణతలు, సులభ పద్ధతులు మొదలగువానిని ఇతర నేరస్తుల సాంగత్యంద్వారా నేర్చుకొని పెద్దపెద్ద నేరస్తులుగా మారతారు.

## సాముదాయిక పరిస్థితులు (Community Conditions)

నేరాలను ప్రేరేపించే సాముదాయిక పరిస్థితులలో సాముదాయిక అవ్యవస్థత, అవినీతికి సంబంధించిన సంస్థలు, చలనచిత్రాలు ముఖ్యమైనవి. అవ్యవస్థీకృత సముదాయంలో సాంఘికసంస్థల ప్రాథమిక సమూహాల ప్రభావం వ్యక్తులపై తగ్గిపోతుంది. వ్యక్తి ప్రవర్తనను క్రమపరిచే సాంఘిక ప్రమాణాలు, సాంఘికపద్ధతులు కూడా తమ ప్రభావాన్ని కోల్పోతాయి. కాబట్టి వ్యక్తులు విచలిత ప్రవర్తనకు గురికావటానికి అవకాశముంది. అందుచేతనే అవ్యవస్థీకృత సముదాయాలలో నేరం ఎక్కువగా ఉంటుంది.

చౌకబారు వినోదగృహాలు, జూదగృహాలు, నాట్యశాలలు మొదలగు అవినీతిసంస్థలు వ్యక్తిలో నేరస్వభావాన్ని అధికంచేస్తాయి. సినిమాలలో చూపించే అవినీతి, నేరం, సౌలభ్యజీవితం వ్యక్తులను విపరీతంగా ఆకర్షించి, వారిని నేరస్థులవటానికి ప్రేరేపించవచ్చు. కాని నేడు ఎక్కువగా తయారవుతున్నది సినిమాల నిష్పత్తిని పోల్చిచూసినప్పుడు, అది చాలా తక్కువగా ఉన్నది కనుక నేరప్రవృత్తికి సినిమాల ప్రభావం అంత ఎక్కువగా లేదని హీలే, బర్ట్ (Burt) అనే శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

## ఆర్థిక పరిస్థితులు

ఆర్థిక దుస్థితి, ఆర్థిక ఒత్తిడి నేరానికి చాలావరకు కారణమవుతాయి. వ్యక్తిలో స్వార్థం పెరిగి, దురాశాపరుడైనపుడు, ధనం సంపాదించడంకోసం నేరం చేస్తాడు. పేదరికంవల్ల ఏర్పడే బాల శ్రామికత్వం, బాలనేరానికి తరచూ దారితీస్తుంది. నిరుద్యోగం, అల్పజీవన ప్రమాణం, ఆర్థికఅసంతృప్తి నిరక్షరాస్యత మొదలయినవాటివల్ల కూడా, వ్యక్తులు నేరస్థులవుతారు. పేదరికం ఖచ్చితంగా నేరానికి దారితీస్తుందని చెప్పలేం. పారిశ్రామిక, వ్యాపార రంగాల అభివృద్ధితోపాటు ఏర్పడిన మార్పులు, అవ్యవస్థత, అవినీతి వ్యాపారం, మొదలయినవాటివల్ల కూడా నేరం ఎక్కువవుతున్నది.

భారత దేశంలోగల నేరాన్ని పరిశోధించినప్పుడు, నిరక్షరాస్యులగల మూఢ నమ్మకాలు, సాంఘిక దురాచారాలు, మతకలహాలు కూడా నేరానికి ముఖ్య కారణాలని నిరూపించబడినాయి.

పై విధంగా నేరాలకుగల కారణాలను పరిశీలించినపుడు, జైవిక కారణాలకంటే, మానసిక ఆర్థిక, సాంఘిక కారణాలే నేరంపై అధిక ప్రభావాన్ని చూపిస్తున్నాయని బోధపడుతుంది.

## వైట్‌కాలర్ నేరం (White Collar Crime)

ఇంతవరకూ సామాన్య పౌరులలోగల నేర ప్రవర్తనను గురించి పరిశీలించాం. సామాన్య పౌరులు చేసిన ఈ నేరాన్ని సంఘంలోని ఉన్నత వర్గ సభ్యులు, రాజకీయ సమూహం పూర్తిగా వ్యతిరేకించడం జరుగుతుంది.

ఈ నేరంగాక, వైట్ కాలర్ అనే ఇంకొక రకమైన నేరముంది. వైట్ కాలర్ నేరం సంఘానికి చీడపురుగు వంటిదైనా, సంఘక్షేమానికది భంగకరంగావున్నా అది పూర్తిగా వ్యతిరేకించబడటం

లేదు. ఎందుకంటే ఈ నేరాన్ని ఐశ్వర్యవంతులైనవారు, ఉన్నతవర్గాలలోనివారు, రాజకీయ పలుకుబడి గల్గిన వ్యక్తులు చేస్తున్నారు. పైగా అది ప్రజల దృష్టికి రాకుండా, అధికార రాజకీయ సమూహం, ఐశ్వర్యవంతులు కలసి దానిని రక్షిస్తున్నారు. వైట్ కాలర్ నేరానికి ముఖ్య కారణం అత్యాశ. సంఘంలో గౌరవాన్ని ఉన్నత అంతస్తును కల్గియుండి, ఉన్నత వృత్తులలో కొనసాగుతూ ఉన్న వ్యక్తి చేసిన నేరమే వైట్ కాలర్ నేరం. సాధారణంగా ధనం, ప్రతిష్ట, అధికారం, సంఘంలో ఉన్నతస్థానాన్ని సంపాదించటానికి, ఉన్నత వర్గాల వారు వైట్ కాలర్ నేరాలు చేస్తూ ఉంటారు.

ఈ అవినీతి ప్రవర్తనవల్ల ఈ రకం నేరస్థులకు చాలా లాభాలు కలుగుతుంటాయి. మంచి మంచి గృహాలను నిర్మించుకొని, అవినీతి వ్యాపారం చట్ట వ్యతిరేక కార్యక్రమాల ద్వారా అమితమైన ధనాన్ని సంపాదించి భోగభాగ్యాలతో జీవిస్తూ ఉంటారు. అందుచేతనే వీరు చేసిన నేరం అంత సులభంగా బయటకు రాదు.

కొందరు ఐశ్వర్యవంతులు, ఉన్నత వృత్తులలో ఉన్నవారు, రాజకీయ పలుకుబడి కలిగిన వారు అనేకమైన అవినీతి కార్యక్రమాలు చేస్తారు. కొన్నిసార్లు చట్టాన్ని కూడా ఉల్లంఘిస్తారు. అయినా వారికి సంఘంలోవున్న పలుకుబడి, ప్రతిష్ట రాజకీయ నాయకులతో సంబంధం మొదలయిన వాటి వలన శిక్ష నుంచి తప్పించుకోవటమేగాక సంఘంలో పెద్దమనుష్యులుగా చెలామణి అవుతారు.

అవినీతి, లంచగొండితనం, పన్నులు ఎగవేత, కల్తీ వ్యాపారం మొదలయిన అక్రమ చర్యలన్నీ వైట్ కాలర్ నేరాలు.

## నేరం - నివారణ చర్యలు (Remedial Measures)

నేరాన్ని నివారించాలంటే చర్యలు రెండు రకాలు. 1. నేరాన్ని నివారించే చర్యలు. 2. చికిత్సావిధానం లేక సంస్కరణ చర్యలు. నేరం ఏర్పడకుండా, నేరానికి దారితీసే పరిస్థితులను పూర్తిగా నిర్మూలిస్తే అది నివారణ చర్య అవుతుంది. నేరం చేసిన వ్యక్తిని సంస్కరించి, సాధారణ జీవితానికి తిరిగి తీసికొనిరావటం సంస్కరణ చర్య అవుతుంది.

నేరాన్ని నివారించే చర్యలలో మలనేరాన్ని అరికట్టటం ప్రధానమైంది. మద్యపానం నిషేధించటం, మురికివాడలను నిర్మూలించటం, నిరక్షరాస్యతను తొలగించి వ్యక్తులను ప్రయోజకులుగా చేయటం, పేదరికాన్ని, నిరుద్యోగాన్ని తొలగించటం, వినోద విజ్ఞాన సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటు చేయటం, చట్టాలను సక్రమంగా అన్ని ప్రాంతాలలో అమలుచేయటం, గ్రామాలలో గ్రామ పంచాయతీ ద్వారా నేర స్వభావం కలిగిన వ్యక్తులపై ప్రత్యేక నిఘా ఉంచటం మొదలగు చర్యల ద్వారా నేరాన్ని నివారించవచ్చు.

## నేరం - సంస్కరణా విధానాలు

నేరానికి ముఖ్య కారణం పరిసరాలని తెలుసుకొన్న తరవాత నేరస్థులను శిక్షించు విధానాలలో పెద్ద మార్పు వచ్చింది. వారిని శిక్షించటానికి బదులుగా, వారిని సంస్కరించటానికి వారిని విద్యావంతులుగా చేయటానికి శ్రద్ధ వహించటం ప్రారంభమయింది.

నేరానికి ప్రతిఫలంగా శిక్ష విధించాలి అనేది పురాతన భావన. నేరస్థులను తగిన విధంగా శిక్షించకపోతే, నేరం ప్రోత్సహించబడి, సమాజంలో నేరస్థులు ఎక్కువ అవటానికి అవకాశం ఉంది గనుక నేరస్థులను తప్పక శిక్షించాలి అనేది ఆధునిక భావన. బెకారియా (Baccaria) అనే శాస్త్రజ్ఞుని అభిప్రాయ ప్రకారం శిక్ష ఉద్దేశ్యం "నేరస్థుని శరీరకంగా హింసించటం కాదుగాని ఇతరులను నేరం చేయటానికి ప్రోత్సహించకుండా ఉండటమే.

ఈ భావనే నేరస్థుల సంస్కరణకు దారితీసింది. వృత్తిశిక్షణ, విద్య, వినోదం మొదలయిన కార్యక్రమాలతో నేరస్థునిలో వ్యక్తిగత అభివృద్ధిని తీసుకొనివచ్చి, సంఘంలో సమన్వయ జీవితం పొందటానికి అర్హునిగాచేసే సంస్కరణ సంస్థలు ప్రారంభించబడినాయి.

శిక్షా పద్ధతులలో చాలామార్పు వచ్చింది. ప్రాచీనకాలంలో శిరచ్ఛేదనం, అవయవాలను తొలగించటం (mutilation) చిత్రహింస, ముద్రవేయటం (branding), దేశ బహిష్కరించటం (banishment) మొదలయిన కఠినశిక్షలు అమలులో ఉండేవి. 19వ శతాబ్దంలో ఇట్లాంటి శిక్షలు తగ్గించి, వాటికి బదులు కారాగార శిక్షను విధించటానికి వీలుగా సంస్థలను స్థాపించారు. శిక్షా విధానంలోకూడా చాలా మార్పులు కలిగాయి. తీర్పుకోసం వేచిఉండే నేరస్థులను కేవలం బంధించి ఉంచడానికి వీలుగా బందిగృహాలు ఏర్పాటయినాయి. 1859, 1860 సంవత్సరాలలో భారత శిక్షా స్మృతి (Indian Penal Code)ది క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ (the Criminal Procedure Code) అమలులోకి వచ్చినాయి. అప్పటినుండి నేరస్థులను శిక్షించడంకోసం కారాగారాలు స్థాపించబడినాయి. న్యాయస్థానాలద్వారా విచారించబడి తీర్పు చెప్పిన తరువాత శిక్షాకాలాన్ని నేరస్థుడు కారాగారంలో గడపాలి. కాని ఈ కారాగారాలలో పరిస్థితులు చాలా హీనంగా ఉండేవి. చాలినంత స్థలం, ఆహారం, వస్త్రం లభించేవి కావు.

భారతీయ జైళ్ళను సంస్కరించటంలో మొట్టమొదట లార్డ్ మెకాలే (Lord Macaulay) శ్రద్ధతీసుకున్నాడు. 1835 లో, జైళ్ళలోగల పరిస్థితులను పరిశీలించి, తగిన సూచనలు చేయడానికి కమిటీ ఏర్పాటుచేయడమైంది. 1869 1877, 1889, 1892 సంవత్సరాలలో వివిధ కమిటీలు ఏర్పాటయి, కారాగార సంస్కరణలకోసం అనేక సలహాలను ఇయ్యడం జరిగింది. 1894 సంవత్సరంలో కారాగార చట్టం భారతదేశమంతటా ఏర్పాటుచేయటమైంది. 1920 సంవత్సరంలో ఏర్పాటుచేసిన కమిటీ జైళ్ళ నిర్వాహణలో చాలా మార్పులను తీసుకొచ్చింది. కారాగార సిబ్బందిని నియమించటం, నేరస్థులను వర్గీకరించి, వారిని వేరువేరుగా ఉంచటం కారాగారంలో శ్రామికత్వం, క్రమశిక్షణ, వివిధ శిక్షణా విధానాలు, కారాగారంలో పరిశుభ్రత, ఆరోగ్యం, మొదలయిన మార్పులను తీసుకు రావడమైనది.

కారాగారంలోని నేరస్థుని మానవతా దృష్టితో చూసి, నేరం వ్యక్తికీ సంఘానికీ హానికరం అనే భావాన్ని అతనిలో కలిగించి, అతనిని సంస్కరించి, పునరావాసాన్ని కలగచేసే ఆధునిక శిక్షా విధానానికిప్పుడు ఎక్కువ ప్రాముఖ్యతని ఇవ్వడం జరిగింది. ప్రభుత్వం జైళ్ళ సంస్కరణ విషయంలో ఎక్కువ శ్రద్ధ తీసుకొంటున్నది.

జైళ్ళలో ఆహారం, జీవన పరిస్థితులు, పరిశుభ్రత, ఆరోగ్యం మొదలైనవి చాలా వరకు మెరుగుపరచడమైంది. విద్య, వినోద, మత, నైతిక కార్యక్రమాలు జైళ్ళలో కూడా ఇప్పుడు అమలు పరుస్తున్నారు. వేరువేరు నేరస్తుల కొరకు, వేరువేరు జైళ్ళను ప్రత్యేకంగా ఏర్పరుస్తున్నారు. నేరస్తుల కొరకు ప్రత్యేకంగా సంక్షేమాధికారులు నియామకం జరుగుతున్నది. బహిరంగ జైళ్ళుకూడా (open air Jails) కొన్ని రాష్ట్రాలలో ఏర్పరచటం జరుగుతున్నది. జైళ్ళలో శ్రామిక నేరస్తులకు వేతన ఏర్పాటు పథకాలను అమలుపరుస్తున్నారు.

## కారాగార చట్టం 1894 (The Prison Act 1894)

నేరస్తుల సంక్షేమం కోసం మొట్టమొదటగా 1894 లో కారాగార చట్టం అమలులోకి వచ్చింది. ఈ చట్ట ప్రకారం ఈ కింది సౌకర్యాలను కల్పించడం జరిగింది.

## కారాగార సిబ్బంది (Prison Officers)

నేరస్తులకు వసతి సౌకర్యం కలిగించటానికి ప్రభుత్వం కారాగారాలను ఏర్పాటు చేయాలి. ప్రతి రాష్ట్రంలో ప్రత్యేక కారాగారాల ఇన్‌స్పెక్టర్ జనరల్ ఉండాలి. ప్రతి కారాగారానికి ఒక ప్రత్యేక సంక్షేమాధికారి, వైద్యాధికారి, జైలరు, మొదలైన అధికార్ల నియామకం జరగాలి.

## నేరస్తుల వేర్పాటు (Separation of Prisoners)

నేరస్తులలో పురుషుల నుంచి స్త్రీలను వేరు చేయాలి. 21 సంవత్సరములలోపు నేరస్తులను మిగతా నేరస్తుల నుంచి వేరుగా ఉంచాలి. తీర్పుపొందని నేరస్తులకు, తీర్పు పొందిన నేరస్తుల నుంచి విడిగా ఉంచాలి. నేరస్తులను ప్రత్యేకంగా ఉంచే గదులలో కనీస సౌకర్యాలు ఉండాలి. అధికారులు ఎప్పటికప్పుడు పర్యవేక్షణ చేస్తుండాలి.

## ఆరోగ్యము

మన దేశానికి స్వాతంత్ర్యము వచ్చిన తరువాత రాష్ట్ర ప్రభుత్వాలు కూడా చాలా శ్రద్ధతో కారాగార సంస్కరణలు చేశాయి. బొంబాయి, పశ్చిమ బెంగాల్, ఉత్తరప్రదేశ్ లలోని కారాగారాలలో చెప్పుకోతగిన మార్పులను ప్రవేశపెట్టారు.

లక్నోలో ఉన్న కేంద్ర కారాగారం చాలా ఆదర్శవంతమైనది. నేరస్తుడు వచ్చినవెంటనే రిసెప్షన్ సెంటర్ (receiption centre) లో అతని వ్యక్తిగత పరిశీలన జరుగుతుంది. వ్యక్తిగత వివరాలు, కుటుంబ వివరాలు, ఆర్థిక వివరాలు, సాంఘిక సంబంధాలు, వ్యక్తిత్వ, మానసికలోపాలు, మొదలయిన వివరాలన్నింటిని సేకరిస్తారు. కారాగారంలో ఉండే కాలంలో నేరస్తుడు అనేక వృత్తి శిక్షణా కార్యక్రమాలలో పాల్గొంటాడు. శిక్షణా కాలంలో, వ్యక్తి అభిరుచులు, నమ్మకాలు, సామర్థ్యం, మొదలైనవాటిని పరీక్షిస్తారు. నేరస్తుని ప్రవర్తన తృప్తికరంగా ఉంటే, జైలులో గల కుటీర పరిశ్రమలలో గాని, వ్యవసాయ పనుల్లోగాని, వేతనం ఇచ్చేపనిని కల్పించి, వ్యక్తి తనపై తాను

ఆధారపడే అవకాశం కల్పిస్తారు. అధికారులకు నేరస్థులకు మధ్య స్నేహసంబంధాలు ఏర్పడటా కృషి జరుగుతుంది. నేరస్థులు జైలులో వారి వ్యవహారాలు వారే సర్వర్తించుకోడానికి వీలుగ పంచాయతీ పద్ధతి ఉంది. ఈ పద్ధతివలన వారు బాధ్యతగల వ్యక్తులుగా తయారవుతారు. నేరస్థ ప్రవర్తననుబట్టి, కారాగారంలోని భద్రత, స్వేచ్ఛ ఆధారపడి ఉంటుంది. మంచిప్రవర్తన కలిగి వారికి చిన్న చిన్న ప్రతిఫలాలనిచ్చి నేరస్థులను ప్రోత్సహిస్తూంటారు. చలనచిత్ర ప్రదర్శనలు, చర్చలు సంగీత కార్యక్రమాలు, మత ఉత్సవాలు, ఆటపాటలు మొదలైన వినోద, విజ్ఞాన సౌకర్యాల నేరస్థులకోసం ఏర్పాటుచేస్తారు. ఈ పై సౌకర్యాలవల్ల నేరస్థుడు సంస్కరించబడి, పునరావాసం పొందటానికి ఎక్కువ అవకాశం ఏర్పడుతుంది.

## బహిరంగ జైలు (Open Jail)

బహిరంగ జైళ్ళను 1952లో ఉత్తరప్రదేశ్‌లో ప్రారంభించారు. నేరస్థుల సంస్కరణ విధానంలో ఈ పద్ధతి చాలా వినూత్నమైనది. ఇక్కడ నేరస్థులను నాలుగుగోడల మధ్య బంధించరు. సమాజంతో సంబంధాన్ని పూర్తిగా కోల్పోరు. వ్యక్తిగత స్వేచ్ఛను కొంతవరకు వారికి ఇస్తారు. కారాగారంలో మంచి ప్రవర్తన కలిగిన నేరస్థులను ఎన్నుకొని, వారిచే వ్యవసాయం, ఆనకట్టల నిర్మాణం, మొదలగు పనులు చేయిస్తారు. వారు పనిచేసే స్థలంలో పోలీసుల నిఘా ఉండదు. జైలు వార్డర్లు మాత్రం సలహాదారులుగా ఉంటారు. మంచి ఆహార సదుపాయాలు, వినోద విజ్ఞాన సౌకర్యాలు వారికోసం ఏర్పాటుచేస్తారు. బయట కార్మికులతో కలసి వారు పనిచేస్తారు. పనికి తగిన వేతనం పొందుతారు.

మానవతా దృష్టితో ఏర్పాటు అయిన ఈ నూతన సంస్కరణా విధానం చాలా మంచి ఫలితాల నిస్తున్నది. నేరస్థులలో చాలా త్వరగా మార్పును కలిగిస్తున్నది. వారిని స్వయం శక్తిమంతు లుగా బాధ్యతగల వ్యక్తులుగా చేయటానికి, వారికి పునరావాసం కలిగించటానికి ఈ పద్ధతి చాలా ఉపయోగకరంగా ఉంటుంది.

## ప్రొబేషన్ (Probation)

ఆధునిక నేరస్థుల సంస్కరణా విధానాలలో ప్రొబేషన్ ఒక ముఖ్యమైన పద్ధతి. నేరస్థులను ...స్థలలోనుంచి సంస్కరించటంకంటె, సమాజంలో వారినుంచి పునరావాసం కోసం ప్రయత్నించడానికి ...ొబేషన్ అవసరం. నేరస్థుని ప్రవర్తన, అతని పరిసరాలు, గత చరిత్ర ఇవన్నీ పూర్తిగా పరిశీలించిన ...రువాత ప్రొబేషన్ చికిత్సను అవ్వవచ్చని నిర్ణయించిన తరువాత, ఆ వ్యక్తి ప్రొబేషన్ సౌకర్యాన్ని ...ందవచ్చు.

ప్రొబేషన్ అంటే, వ్యక్తి నేరాన్ని పూర్తిగా క్షమించి శిక్ష నుంచి విడుదల చేయటం ...దు. కాని కొన్ని షరతులపై శిక్షను తాత్కాలికంగా నిలుపుదల చేయడమవుతుంది. (Conditi-...al suspention of Punishment) ఒప్పందంలోఉన్న షరతులలో ఏ ఒక్కటైనా ప్రొబేషన్‌లో ...ఉ వ్యక్తి ఉల్లంఘించినట్లైతే తాత్కాలికంగా నిలుపుదల చేసిన శిక్షను తిరిగి కొనసాగిస్తారు.

ప్రొబేషను శిక్షా విధానం చాలా నిపుణతతో కూడినది. కనుక ప్రొబేషన్ అధికారులకు ప్రత్యేక శిక్షణ చాలా అవసరం. ఆధునిక శాస్త్రీయ వ్యక్తి సేవా పద్ధతులను, సంస్థ బయట నేరస్థులపై ఉపయోగించాలి. సంస్థలో దొరకని సామాజిక జీవితాన్ని, నేరస్థునికిచ్చి, తద్వారా సాముదాయక చికిత్స (Community treatment) నేరస్థునికి అందించాలి.

క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ ప్రకారం, 21 సంవత్సరాలు నిండిన వ్యక్తికి, ఏడు సంవత్సరాలకు మించని శిక్ష విధింపబడితే, ఆ వ్యక్తి మంచి ప్రవర్తన, నమ్మకం కలిగి ప్రొబేషన్‌కు అర్హుడని నిర్ణయింపబడితే, ఆ వ్యక్తిని కొన్ని షరతులపై జామీన్ (హామీ) తీసుకొని విడుదల చేయటమే ప్రొబేషన్. ప్రొబేషన్ చట్టం (Probation Act) ప్రకారం రాష్ట్ర ప్రభుత్వం ప్రొబేషన్ అధికారులను నియమించాలి. ప్రొబేషన్ అధికారి ఎప్పటికప్పుడు నేరస్థుని పరీక్షించి, హామీ ఇచ్చిన షరతులను పాటిస్తున్నట్లు చూడాలి. నేరస్థునితో స్నేహ సంబంధాలు కలిగి, అతనితో సహకరించి అతని పునరావాసానికి కృషి చేయాలి. అతని ప్రవర్తన ప్రకారం షరతులను తగ్గించటానికిగాని, తొలగించటానికిగాని వీలుగా న్యాయస్థానానికి అతని సలహాల నియ్యాలి. ఆధునిక సంస్కరణ పద్ధతులలో ప్రొబేషన్‌కు చాల ప్రాముఖ్యత ఇయ్యబడుతున్నది. దీనిని సక్రమంగా నిర్వహించేందుకు సుశిక్షితులయిన సాంఘిక సంక్షేమ కార్యకర్తలను నియామకం చేయాలి.

## పెరోల్ (Parole)

పెరోల్ కూడా ఒక ముఖ్యమైన వ్యక్తిగత సంస్కరణ పద్ధతి నేరస్థుడు శిక్షలో కొంత భాగాన్ని సంస్థలో గడిపిన తరువాత, మిగిలిన భాగాన్ని కొన్ని షరతులపై తొలగించటాన్ని పెరోల్ అంటారు. ఇదికూడా సాముదాయక చికిత్సా విధానమే. పర్యవేక్షణాధికారి ఆధ్వర్యంలోనే ఈ చికిత్స జరుపబడుతుంది. కాని ఈ రెంటికి మధ్యగల భేదం ఏమంటే ప్రొబేషనులో శిక్షలో కొంత భాగాన్ని కారాగారంలోకాక సమాజంలో గడుపుతాడు. పెరోల్‌లో శిక్షలో కొంత భాగం తొలగిస్తారు. ప్రొబేషన్ నేరస్థుని భవిష్యత్తు నిర్ణయం న్యాయస్థానంపై ఆధారపడి ఉంది. పెరోల్‌లో నేరస్థుని భవిష్యత్తు కారాగార నిర్వహణాధికారి నిర్ణయిస్తాడు.

## పునరావాససేవలు (After Care Services)

సంస్కరణ సంస్థల ముఖ్య ఆశయం. నేరస్థుల పునరావాసం, శిక్షాకాలం పూర్తి అయి జైలునుంచి విడుదల అయిన తరవాత, నేరస్థునికి పునరావాస సేవలు కల్పించడం చాలా అవసరం. విడుదలయిన నేరస్థుడు తిరిగి సమాజంలో తగిన స్థానాన్ని సంపాదించుకొని, సాంఘిక సమాయోజనం (Social Adjustment) పొందటం చాలా కష్టం. సాధారణంగా విడుదలయిన తరువాత కూడా నేరస్థుడు సాంఘిక నిందను (Social Stigma) సులభంగా పోగొట్టుకోలేడు. సుశిక్షితుడయిన కార్యకర్త నేరస్థునికి సమాజ మెప్పుదలగల జీవితాన్ని కల్పించటంలో కృషి చేయాలి.

నేరస్తుని పునరావాసం కోసం 1954 వ సంవత్సరంలో కేంద్ర సాంఘిక సంస్థ (C.S.W.B.) ఒక ప్రత్యేక కమిటీని ఏర్పాటుచేసింది. నేరస్తుల పరిస్థితులను పూర్తిగా పరిశీలించిన తరువాత విడుదల అయిన నేరస్తులకొరకు కొన్ని ప్రత్యేకపు పునరావాస సేవలను ఈ కమిటీ సూచించింది. వాటిలో ముఖ్యమైనవి (1) వృత్తిపరమైన పునరావాస సేవలు (2) సామూహిక పునరావాస సేవలు.

ఈ సేవలను నిర్వర్తించటానికి కొన్నిచోట్ల పునరావాస గృహాలనుకూడా స్థాపించారు. 1959 వ సంవత్సరంలో ఇంకొక కమిటీ ఏర్పాటయింది. ఈ కమిటీ సూచనలననుసరించి కేంద్రప్రభుత్వం జాతీయస్థాయిలో నేరస్తుల పునరావాసానికి, కొన్ని పథకాలను ఏర్పాటుచేసింది.

## భవిష్యత్తులో పునరావాస సేవలు

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పునరావాస సేవలు ఏర్పాటుచేస్తున్నా, అవి చాలినన్ని లేవు. వాటిని ఇంకా విస్తృతపరచాలి. ఆ కార్యక్రమాలను అమలుచేయటంలో కూడా శ్రద్ధవహించాలి.

జైలులో నేరస్తుని సంస్కరణకు అనేక సౌకర్యాల నేర్పాటుచేయటం ద్వారా వాని జీవన పరిస్థితులను మెరుగుపరిచినా, నేరస్తునితో పనిచేసే దృక్పథంలోను, పద్ధతిలోను మార్పురావాలి. నేరస్తుని సంస్కరించటానికి ముఖ్యంగా, కారాగార సిబ్బందికి నేరస్తునికి మధ్య మంచి సంబంధ బాంధవ్యాలు ఉండాలి. కార్యక్రమాలను వ్యక్తిగత దృష్టిలో నిర్వహించాలి. కారాగార సిబ్బంది కూడా ప్రత్యేక శిక్షణను, ప్రత్యేక నిపుణతలను కలిగి ఉండాలి. విడుదల అయిన నేరస్తుల పునరావాసం కొరకు వారికి ఉద్యోగాలు కల్పించటానికి ప్రభుత్వం ముందుకు రావాలి. ప్రొబేషను, పెరోల్ పద్ధతులకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చి, వాటిని విరివిగా అమలుజరపాలి.

జైలులో మానసిక ఆరోగ్య కేంద్రాలను కూడా ఏర్పాటుచేయాలి. వాటిద్వారా మానసిక, వ్యక్తిత్వ లోపాలకు చికిత్సచేసి, తద్వారా వ్యక్తిత్వ అభివృద్ధికి కృషిచేయాలి.

జైలులో పనిచేసే నేరస్తులకు పనికి తగిన వేతనము ఇచ్చి ప్రోత్సహించాలి. వ్యక్తి పరిస్థితులను, శక్తిసామర్థ్యాలకు తగిన వృత్తిలో నేరస్తునికి శిక్షణ ఇచ్చి, విడుదలయిన తరవాత ఆ వృత్తికి తగిన ఉద్యోగాన్నిగాని, ఉపాధినిగాని సంపాదించుకోటానికి సహాయంచేయాలి. ఈ పై సూచనలు పాటిస్తే, నేరస్తుల పునరావాసాన్ని త్వరగా సాధించవచ్చు.

## సంస్కరణ సేవలను అమలుపర్చటంలో సంఘ సంక్షేమ కృషి కార్యకర్త పాత్ర

కారాగార సంస్కరణ సేవలను (Prison Reforms) అమలుపరచటంలో సంఘ సంక్షేమ కృషి కార్యకర్త చాలా ప్రధానమయిన పాత్రను వహిస్తాడు. జైలులో ఉన్నప్పుడేకాక, విడుదలయిన తరవాతకూడా కార్యకర్త నేరస్తునితో పనిచేసి, అతని సంస్కరణకు, పునరావాసానికి తోడ్పడతాడు. నేరస్తులతో పనిచేసేటప్పుడు కార్యకర్త వ్యక్తిసేవా, సమూహసేవా పద్ధతుల నుపయోగిస్తాడు. కార్యకర్త వ్యక్తిసేవా సూత్రాలను, నిపుణతలను ఉపయోగించి, నేరస్తుని ప్రవర్తనలోను, వైఖరిలోను

మార్పు తేవటానికి ప్రయత్నిస్తాడు. నేరస్తుని మూర్తిమత్వ లక్షణాలను, ప్రవర్తనారీతులను, అతని కుటుంబాన్ని ఆర్థిక, సాంఘిక స్థితి గతులను కార్యకర్త బాగా అర్థంచేసికొని, ఆ వ్యక్తిలో నేర స్వభావ మేర్పడటానికి తోడ్పడిన కారణాలను, పరిస్థితులను తెలుసుకొని, వాటిని మార్చటానికి లేదా తొలగించటానికి ప్రయత్నిస్తాడు. అంతేగాక నేరస్తుని శక్తి సామర్థ్యాలను, అభిరుచులను అవగాహన చేసుకొని, వాటికి తగిన వృత్తి శిక్షణను జైలులో పొందటానికి తోడ్పడతాడు. నేరస్తులందరిమధ్య స్నేహభావాన్ని, సత్సంబంధాలను, సహనాన్ని పెంపొందించటానికి కృషి చేస్తాడు. నేరస్తులకు, సంస్థ అధికారులకు మధ్యకూడా మంచి సంబంధాలను నెలకొల్పటానికి కృషి చేస్తాడు.

జైలులో నేరస్తులకోసం, విశ్రాంతి సమయంలో వినోద విజ్ఞాన సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటుచేసి, వాటిద్వారా నేరస్తుల అభివృత్తులలో మార్పును తీసుకురావడం చాలా అవసరం. కనుక, కార్యకర్త సమూహసేవా నిపుణతలను ఉపయోగించి, రకరకాల సమూహ సేవా కార్యక్రమాలను నేరస్తులకోసం ఏర్పాటుచేస్తాడు. వాటిలో నేరస్తులందరూ ఉత్సాహంగా పాల్గొని ఆ కార్యక్రమాలను వారి అభివృద్ధికోసం సద్వినియోగ పరచుకొనేటట్లు ప్రోత్సహిస్తాడు. వారిలో నాయకత్వభావాన్ని ఆత్మవిశ్వాసాన్ని, సమిష్టికృషిని కలిగించటానికి ప్రయత్నిస్తాడు.

పెరోల్, ప్రొబేషన్ చర్యలను సక్రమంగా నిర్వహించటానికి కార్యకర్త సాముదాయక వ్యవస్థాపన పద్ధతి ద్వారా కృషి జరుపుతాడు. సముదాయంలో తిరిగి, సాంఘిక, ఆర్థిక సమాయోజనం (adjustment) పొందటానికి నేరస్తునికి తోడ్పడతాడు. అంతేగాక, నేరస్తులపైనున్న సాంఘిక కళంకు (Social Stigma) పోగొట్టటానికి సామాజికచర్య ద్వారా, సమాజంలో పనిచేస్తాడు. నేరస్తుని పునరావాస ఆవశ్యకతను సమాజానికి తెలియచేస్తాడు.

ఈ విధంగా సంక్షేమకృషి కార్యకర్త, తన అనుభవాన్ని, శిక్షణను, జ్ఞానాన్ని, నిపుణతలను ఉపయోగించి, నేరస్తుల సంస్కరణకు, పునరావాసానికి కృషిచేస్తాడు.

# 5
# బాలనేరం
## (Juvenile Delinquency)

ఏ వ్యక్తి అయినా, మూర్తిమత్వ లోపాలవల్లగాని, మానసిక లోపాలవల్లగాని సామాజిక పరిస్థితులకు తగినట్లు సర్దుబాటు చేసికోలేకపోతే, ఆ వ్యక్తి సామాజిక ప్రమాణాలను, విలువలను, కట్టుబాట్లను అతిక్రమిస్తాడు. ఇట్లాంటి ప్రవర్తనే నేరానికి దారితీస్తుంది.

ప్రాచీన కాలంలో, ఉమ్మడి కుటుంబంద్వారా లభించే సాంఘిక భద్రత, సాంఘిక రక్షణ, క్రమశిక్షణ, సామాజిక నియంత్రణ, మొదలయినవి బాలబాలికల ప్రవర్తనను అదుపులో ఉంచేవి, కాని ప్రస్తుతం సమిష్టికుటుంబం విచ్ఛిన్నతవల్ల, పారిశ్రామికీకరణం, నగరీకరణంవల్ల, అనేకమంది గ్రామీణ ప్రాంతాలనుంచి పట్టణ ప్రాంతాలకు తరలిపోతున్నారు. అక్కడ అనేక అసౌకర్యాలను లోనై, వసతి సౌకర్యాలు లేక పరిశుభ్రత, ఆరోగ్యం సరిగాలేని ప్రాంతాలలో నివసిస్తూ మురికివాడల నేర్పాటుచేస్తున్నారు. బాలనేరానికి మురికివాడలను పుట్టినిల్లుగా చెప్పవచ్చు. మనదేశంలో అసమాయోజన పొందిన బాలుర సంఖ్య క్రమంగా ఎక్కువవుతున్నది.

బాలనేరాన్ని గురించి సవివరంగా అవగాహన చేసుకోవాలంటే ముందుగా, బాలనేరం అంటే ఏమిటో స్పష్టంగా, నిర్దిష్టంగా నిర్వచించాలి. ''చట్టాన్ని అతిక్రమించే బాలుర అక్రమ ప్రవర్తనే'' బాలనేరమని ఫ్రీడ్‌లాండర్ (Friedlander) నిర్వచించాడు.

చట్టం ద్వారా చర్య తీసుకొనే అవసరం కలిగేటట్లుగా బాలురలో సంఘ వ్యతిరేక చర్యలుంటే దానినే బాలనేరమని సిరిల్ బర్ట్ (Cyril Burt) నిర్వచించాడు.

ఇలియట్, మెర్రిల్ (Elliot and Merri') నిర్వచన ప్రకారం ''చట్ట నియమాలకు వేరుగా, విరుద్ధంగా ఉండే బాలలలోని సమాజ వ్యతిరేక ప్రవర్తనే'' బాలనేరం.

## భారతదేశంలో బాలనేరం

బాలనేరానికి స్పష్టమయిన నిర్వచనం లేదు. కనుకనే మన దేశంలో బాలనేరం యొక్క విస్తరణను సరిగా అంచనావేయడం కష్టం. కేవలం చట్టరీత్యా నిర్వచింపబడిన నేరాన్నిబట్టి అంచనా వేస్తే, చాలా తక్కువమంది మాత్రమే నేరస్తులుగా పరిగణనలోనికి వస్తారు. చట్టాలను ఉల్లంఘించే

బాలురు మాత్రమే బాలనేరస్థులు కాని, సామాజిక రీతులు, కట్టుబాట్లను ఉల్లంఘించిన బాలురను నేరస్థులుగా ఎవరూ పరిగణించటం లేదు.

నేరం చేసిన బాలురందరూ కూడా నేర అధికారుల దృష్టికి రావటం లేదు. సామాజిక ఉదాసీనతవల్ల, అధికారుల అసమర్థత, తల్లిదండ్రుల నిర్లక్ష్యంవల్ల కూడా చాలామంది బాలురు నేరం చేసి కూడా తప్పించుకుంటున్నారు.

ఒకటి, రెండు నేరాలు చేసిన బాలురు సాధారణంగా గుప్తంగానే ఉంటారు. చాలాసార్లు నేరాలు చేసిన తరవాతనే, గుర్తింపబడి పట్టుబడతారు. పట్టుబడిన బాలనేరస్థులలో కూడా ఆర్థికంగా వెనుకబడిన వర్గాలకు చెందినవారే ఎక్కువగా ఉంటారు. ఉన్నత వర్గ కుటుంబాలకు చెందిన బాలురు, అపరాధం చేసినా సులభంగా తప్పించుకోవటానికి ఎక్కువ అవకాశముంది.

పై కారణాలవల్ల అధికారులు మన దేశంలో బాలనేరం యొక్క ఖచ్చితమైన ప్రమాణాన్ని గాని స్వభావాన్నిగాన్ని స్పష్టంగా అంచనా వేయలేకపోతున్నారు.

బాలనేరస్థుల వివరాలను అందించగలిగే బాలల న్యాయస్థానాలు కూడా మన దేశంలో ఎక్కువగా లేవు. బాలల చట్టాన్ని అమలుపరిచే ప్రత్యేక బాలల న్యాయస్థానం, 1950 వ సంవత్సరం వరకు బొంబాయిలో మాత్రమే ఉండేది. ఈ శాఖ, బాలనేరస్థులుగా నమోదయిన కేసులను లింగం, ప్రాంతం, మానసిక లోపాలు, శారీరక లోపాలు మొదలైన వాటిని ప్రాతిపదికలుగా తీసుకొని, కొన్ని వర్గాలుగా విభజించింది. ఇంతేగాక నేర స్వభావాన్నిబట్టి వివిధ బాల నేరాలను వర్గీకరించటం జరిగింది. ఈ వర్గీకరణ సహాయంతో కేంద్ర ప్రభుత్వం జాతీయ స్థాయిలో బాలనేరం వివరాలను సేకరించటానికి ప్రయత్నించింది. ఆ వివరాలనుబట్టి, భారతదేశంలో బాలనేరం త్వరితంగా విస్తరిస్తున్నట్లు తెలుస్తున్నది.

మనదేశంలో ఇప్పటికీ బాలల న్యాయస్థానాలు చాల తక్కువగా ఉన్నాయి. అంతేగాక బాలాపరాధానికి సంబంధించిన చట్టాలన్నీ దేశంలో ఒకేవిధంగా లేవు. చట్టాలున్నా అవి సక్రమంగా అమలు జరగటంలేదు. బాలనేరాన్ని గురించి పూర్తి వివరాలు, ఖచ్చితంగా లభించనిచే బాలనేరాన్ని శాస్త్రీయపద్ధతిలో అధ్యయనం చేయలేం. అందుచేతనే "బ్యూరో ఆఫ్ డెలింక్వెన్సీ స్టేటిస్టిక్స్" (Bureao of deliuquency statistics) "ఇంటెలిజెన్స్ బ్యూరో" (Bureao of Intelligence) మొదలయిన సంస్థలు నేరం వివరాలను సేకరించటానికి ప్రయత్నిస్తున్నా, అవి తృప్తికరంగా లేవు.

## బాలనేరం - కారణాలు

బాలనేరానికి గల కారణాలను సిరిల్ బర్ట్ (Cyril Burt), హీలే (Healy) మొదలయిన వారు పరిశీలించగా బాలనేరానికి అనేక కారణాలున్నట్లుగా తేలింది. ఏదో ఒకటి, రెండు కారణాలయితే బాలుడు వాటిని సులభంగా ఎదుర్కొనగలడు. కాని విభిన్నశక్తులు ఒకేసారి బాలునిపై ప్రభావం చూపుతున్నప్పుడు వాటిని ఎదుర్కొనలేకపోతున్నాడు.

బాలనేరానికిగల కారణాలను ముఖ్యంగా మూడురకాలుగా పేర్కొనవచ్చు. (1) కుటుంబ పరిస్థితులు (2) బాలుని వ్యక్తిగత లక్షణాలు (3) సాముదాయక పరిస్థితులు.

## కుటుంబ పరిస్థితులు

బాలుని వ్యక్తిత్వ సాంఘిక అభివృద్ధికి కుటుంబం చాలా ప్రధాన పాత్ర వహిస్తుంది. సరైన కుటుంబ వాతావరణంలేని బాలుడు నేరస్థులుగా మారటానికి అవకాశముంది. అజ్ఞానం నిర్లక్ష్యం, పేద రికం, అసంతృప్తికరమైన కుటుంబ సంబంధాలు, కుటుంబంలో అవినీతి మొదలయిన అనేక కారణాల వల్ల బాలుని మూర్తిమత్వం అభివృద్ధికి అవసరమయిన మానసిక, సాంఘిక, ఆర్థిక రక్షణ, సామాజిక శిక్షణ, ప్రేమ, అనురాగం మొదలైనవి పిల్లలకు తగినంతగా లభించవు. కుటుంబంలో క్రమశిక్షణ లోపించినపుడు, పిల్లలు చెడు అలవాట్లకులోనై, నేరస్థులుగా మారతారు. విచ్ఛిన్న కుటుంబాలకు బాలనేరానికి అవినాభావ సంబంధమున్నదని అనేక పరిశోధనల ద్వారా తెలుసుకున్నాం.

వ్యక్తిగత ఆరోగ్య అభివృద్ధికి, బాలుని జైవిక వారసత్వం చాలా ప్రాముఖ్యమైంది. వారసత్వం ద్వారా సంక్రమించిన శారీరకలోపాలు, బుద్ధిమాంద్యత, మానసిక లోపాలు మొదలయిన వాటివల్ల బాలునిలో నేరస్వభావం ఏర్పడటానికి అవకాశం ఉంది.

విచ్ఛిన్న గృహ పరిస్థితులు, కుటుంబ అవ్యవస్థత బాలనేరానికి ప్రధాన కారణాలుగా పేర్కొనవచ్చు. కుటుంబ యజమాని మరణించటం లేదా ఇల్లు విడిచిపోవటం, విడాకులు, పరిత్యాగం మొదలైన కారణాలవల్ల కుటుంబం విచ్ఛిన్నమై, పిల్లల సంరక్షణకు అవకాశం తగ్గిపోవుచున్నది. బాల నేరస్థులలో అధికశాతం విచ్ఛిన్న గృహాలవల్లనే తయారవుతున్నారని అనేక పరిశోధనలవల్ల ధృవ పరచటం అయింది.

అధిక సంతానం, సంతాన క్రమ వరుసలో బాలుర స్థానం (sibling position) నేర స్వభావం కలిగిన సోదరులు ఉండటం మొదలైన వాటివల్లకూడా బాలురలో నేరస్వభావం ఏర్పడవచ్చు.

తల్లిదండ్రులమధ్య లేదా తల్లిదండ్రులకు పిల్లలకు మధ్య సంతృప్తికరమైన సంబంధ బాంధ వ్యాలు లేకపోవటం వల్లకూడా బాలురు నేరప్రవర్తనకు పాల్పడుతున్నారు. కుటుంబంలో అశాంతి, బాలుని వ్యక్తిగత అసంతృప్తికి దారి తీస్తుంది. బాలుని మానసిక, వ్యక్తిగత అభివృద్ధిపై అశాంతి పరిస్థితుల ప్రభావం అధికంగా ఉంటుంది గనుక బాలురు నేరస్థులుగా మారుతున్నారు.

నైతిక విలువలకు ప్రాధాన్యత ఇవ్వని కుటుంబాలలోను త్రాగుడు, జూదం, అవినీతి నేరం, మొదలైన సమస్యలకు గురి అయిన కుటుంబాలలోని బాలురు ఎక్కువగా నేరస్థులవుతారు. ఎందు కంటే బాలురకు తగిన నైతిక శిక్షణ, సామాజిక విలువలయందు శిక్షణ ఆ కుటుంబాలలో వారికి లభించదు.

ఈ విధంగా కుటుంబ అవ్యవస్థతా పరిస్థితులు బాలురలో నేరస్వభావం కలిగించటానికి ముఖ్య కారణాలవుతున్నాయి.

## వ్యక్తిగత లక్షణాలు (Personal Characteristics)

బాలునికి జైవికంగా సంప్రాప్తించిన శారీరక, మానసిక లక్షణాలు నేర స్వభావానికి కొంత వరకు కారణమవుతాయని ముందుగానే పేర్కొనటమైంది. శారీరక నిర్మితిలోని లోపాలు బాలుని అభివృద్ధికి వ్యక్తిగత సంతృప్తికి చాలా ఆటంకంగా ఉంటాయి. ఇతర బాలురకంటె తాను తక్కువ అనే భావన (inferiority feeling) బాలునిలో సమాజంపై కోపం, ద్వేషం మొదలైన సాంఘిక వ్యతిరేక భావనలను కలిగించవచ్చు.

గ్రంథులు సరిగా పెరగనప్పుడు, వ్యక్తులలో శారీరక, మానసిక లోపాలు ఏర్పడతాయని, వాటివల్ల వ్యక్తి నేరానికి పాల్పడతాడని కొంతమంది శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

మానసిక అవ్యవస్థత (mental disorders) మానసిక సంఘర్షణ (mental conflicts) వల్లకూడా వ్యక్తిగత అసంతృప్తికలిగి బాలునిలో విచలనప్రవర్తన ఏర్పడవచ్చునని హీలే శాస్త్రజ్ఞుని అభిప్రాయం.

## సాముదాయక పరిస్థితులు (Community factors)

సాముదాయక అవ్యవస్థత, జనసాంద్రత ఎక్కువగా ఉండటం, మురికివాడలు, సముదాయంలో విద్యా వినోద సాంస్కృతిక విశ్రాంతి కార్యక్రమాలు తగినన్ని లేకపోవటం మొదలయిన కారణాలు బాలనేరానికి దారితీస్తాయి.

సాంఘిక, ఆర్థిక దుస్థితి కారణంగా సరయిన గృహపరిస్థితులు లేకపోవటంవల్ల బాలురు ఎక్కువ సమయాన్ని ఇంటిబయట గడపటానికి ఇష్టపడుతున్నారు. తమ విరామ సమయాన్ని సద్వినియోగం చేసికోవటానికి సముదాయంలో కూడా తగిన వినోద విజ్ఞాన సౌకర్యాలు లేకపోవటంవల్ల నేరం చేయటమే వినోదచర్యగా, విరామసమయ కాలక్షేపంగా భావించి, అనేకమంది బాలురు నేరస్థులుగా మారుతున్నారు.

చెడుసహవాసంవల్ల కూడా బాలురు అపరాధులుగా తయారవుతున్నారు. ఇరుగుపొరుగు పిల్లలలో క్రమశిక్షణ లేనప్పుడు వారితో సహవాసం చేసిన బాలురు చిన్నచిన్న నేరాలను వినోద కార్యక్రమాలుగా మొదలుపెట్టి, జేబులుకొట్టడం, దొంగతనం చేయటం, మొదలయినవి సాహస కృత్యాలుగా భావించి, బాలురు క్రమంగా నేరస్వభావాన్ని అలవరచుకుంటున్నారు. మురికివాడలలో, పిల్లల ఆరోగ్యాభివృద్ధి కలిగించే వసతులు, గ్రంథాలయాలు, పార్కులు, సాముదాయక వినోద కేంద్రాలు, లేకపోవటంవల్ల బాలురు దుస్సహవాసానికి గురై నేరస్తులవుతున్నారు.

ముఠా ప్రభావంవల్ల కూడా, బాలనేరం ఏర్పడుతున్నది. గృహపరిస్థితులతో, పరిసరాలతో సమాయోజనంలేని బాలురు ఇల్లువిడిచి, దూరప్రాంతాలకుపోయి, సరయిన అవకాశం దొరకక, విరాశా జీవితానికి లోనవుతున్నారు. అట్లాంటివారిని తమజట్టులో చేర్చుకొని, వారికి శిక్షణఇచ్చి, సంఘవ్యతిరేక కార్యక్రమాలు చేయించటానికి వారిని వాడుకొంటున్నారు.

బాలురలో నేరస్వభావం ఏర్పడటానికి పాఠశాల వాతావరణం కూడా కొంతవరకు కారణమవుతున్నది. పాఠశాలలో తగిన వినోద విజ్ఞాన సాంస్కృతిక సౌకర్యాలు లేకపోవటం, పాఠశాల వాతావరణం, క్రమశిక్షణ బాలురకు నచ్చకపోవటం, తల్లిదండ్రుల పర్యవేక్షణ లోపించటం, దుస్సహవాసం, మొదలయిన కారణాలవల్ల, బాలురు పాఠశాలను ఎగవేసి, బయట వినోదాలకు అలవాటుపడి, చెడుఅలవాట్లు నేర్చుకొంటున్నారు. బడి ఎగవేసే అపరాధ ప్రవృత్తికి (Trvancy), బాలాపరాధానికి పరస్పర సంబంధముంది. బడి ఎగవేసే ప్రవృత్తి క్రమంగా బాలనేరానికి దారితీస్తుంది.

బాల్యదశలో పిల్లలు చదివే పుస్తకాలు, సాహిత్యం యొక్క ప్రభావం వారిపై ఎక్కువగా ఉంటుంది. అశ్లీల సాహిత్యం, నేరసాహిత్యం ఎక్కువగా చదవటంవల్ల బాలురలో నేరప్రవృత్తి ఎక్కువవుతున్నది.

సినిమాలుకూడా బాలురలో నేరస్వభావాన్ని ఎక్కువ చేస్తున్నాయని చాలామంది అభిప్రాయం. సినిమాలలో ప్రదర్శించే సాహసకృత్యాలు, నేరం, లైంగిక అంశాలు, అవాస్తవిక స్వాప్నిక అంశాలు (Unrealities and fantacies) మొదలైనవి బాలురను ఎక్కువగా ఆకర్షించి, వారిలో నేరస్వభావాన్ని కలిగిస్తున్నాయి.

ఈ విధంగా సముదాయంలో లైంగిక విచలన ప్రవర్తనకు అవకాశాలు, జూదగృహాలు, చౌకబారు వినోదశాలలు, అశ్లీల పుస్తకశాలలు, అవినీతిని ప్రోత్సహించే సంస్థలు ఎక్కువగా ఉన్నట్లయితే ఆ సముదాయంలో బాలనేరంకూడా ఎక్కువగానే ఉంటుంది.

## బాలనేరం - నివారణా చర్యలు

బాలనేరాన్ని పరిష్కరించటానికి రెండు ముఖ్యమైన మార్గాలున్నాయి. 1. బాలనేరానికి దారితీసే కారణాలను తొలగించే నివారణ కార్యక్రమాలు లేదా నిరోధక చర్యలు. 2. నేరంచేసే బాలురను సంస్కరించి, వారిని సామాన్య పౌరులుగా తయారుచేసే పునరావాస సేవా కార్యక్రమాలు.

విచ్ఛిన్న కుటుంబాలు, కుటుంబంలో అశాంతి, పేదరికం, తల్లిదండ్రుల నిర్లక్ష్యం, శారీరక మానసిక వ్యక్తిగత లోపాలు, సాముదాయక అవ్యవస్థత మొదలైనవి బాలనేరానికి ముఖ్య కారణాలు. గనుక వాటిని తొలగించటం కోసం ఈ కింది నివారణ చర్యల నేర్పాటుచేయాలి.

బాలనేరాన్ని అరికట్టటానికి ఉత్తమ పాఠశాలలు చాలా ఉపయోగపడుతాయి. పాఠశాలలో బాలురకు కేవలం విద్యాశిక్షణ మాత్రమేగాక, వారి అభిరుచిని, ఆసక్తికి, శక్తి సామర్థ్యాలకు తగినట్లుగా వినోద విజ్ఞాన సాంస్కృతిక కార్యక్రమాలను వృత్తి శిక్షణా కార్యక్రమాలను ఏర్పాటు చేయాలి. ఉపాధ్యాయులకు విద్యార్థులకు మధ్య సంతృప్తికరమైన సంబంధ బాంధవ్యాలుండాలి. వారిలో క్రమశిక్షణ కలిగించటానికి ఉపాధ్యాయులు తగిన బాధ్యత వహించాలి. బాలనేరానికి దారితీసే, బడి ఎగవేసే ప్రవృత్తి (Trvancy) పిల్లలలో కలుగకుండా తగు జాగ్రత్త వహించాలి.

బాలనేరాన్ని అరికట్టటానికి కుటుంబ విద్య కూడా చాలా అవసరం. బాలలకు సక్రమమైన అభివృద్ధిని కలిగించటంలో తల్లిదండ్రులకు చాలా ముఖ్యమైన పాత్ర ఉంది. బాలలలో విచలిత ప్రవర్తన ఏర్పడటానికి తల్లిదండ్రుల అజాగ్రత్త, నిర్లక్ష్యం, తగిన క్రమశిక్షణ బాలలకు నేర్పించకపోవటం, తల్లిదండ్రులకు, పిల్లలకు మధ్య సత్సంబంధాలు లేకపోవటం ముఖ్య కారణాలు గనుక ఇట్లాంటి విషయాలలో తల్లిదండ్రులకు తగిన శిక్షణ ఇవ్వాలి. బాలల సరయిన పెంపకానికి అవసరమైన అంశాలను, విషయాలను వారికి తెలియచేసి, వారు బాలురపట్ల తగు శ్రద్ధ వహించేటట్లు చూడాలి.

బాలురలో ఉన్న ఆసక్తిని, ఉత్సాహాన్ని ప్రత్యేకంగా వారికివున్న విరామ సమయాన్ని వారు సద్వినియోగం చేసుకోవాలి. లేకపోతే, వాటిని దుర్వ్యసనాలకోసం, సంఘ వ్యతిరేక కార్యక్రమాల కోసం వినియోగిస్తారు. అందుచేత పాఠశాలలు సముదాయాలు, ప్రభుత్వం, స్వచ్ఛంధ సంస్థలు బాలుర కోసం, తగిన వినోద కేంద్రాలను ఏర్పాటుచేసి సక్రమమయిన విరామసమయ కార్యక్రమాలను నిర్వహించాలి.

శారీరక మానసిక ఆర్థిక లోపాలుతో ఉన్న బాలురు సంతృప్తికరమైన సంబంధాలను ఏర్పాటు చేసుకోలేక, సామాన్య బాలురవలె అభివృద్ధిని సాధించలేకపోవటంవల్ల వారిలో విచలిత ప్రవర్తన, సంఘ వ్యతిరేక భావాలు ఏర్పడవచ్చు. అందుచేత సమాజం, ప్రభుత్వం, వారిపట్ల ప్రత్యేక శ్రద్ధను చూపాలి. వారి కోసం ప్రత్యేకమైన విద్యా, వృత్తి శిక్షణ, వినోద, విజ్ఞాన సౌకర్యాలు పునరావాస సేవలను కల్పించినట్లయితే వారు బాలనేరస్థులుగా మారటానికి అవకాశముండదు. బాలురలో దేశద్రిమ్మరితనాన్ని కూడా చట్టబద్ధంగా తొలగించటానికి కృషి చేయాలి.

వివిధ బాలల సంక్షేమ సంస్థలలో పనిచేసే కార్యకర్తలకు, సిబ్బందికి కూడా, బాలురతో కలిసి పనిచేసే విధానాలలో ప్రత్యేకశిక్షణను ఇవ్వాలి. సుశిక్షితులైన, సంఘ సంక్షేమ కార్యకర్తలను ఈ సంస్థలలో నియమించాలి.

ఈ విధంగా బాలుర తెలివితేటలను శక్తిసామర్థ్యాలను సక్రమంగా నిర్మాణాత్మకంగా, సృజనాత్మకంగా ఉపయోగించటానికి తగిన గృహవాతావరణం, ఆరోగ్య నివాసప్రాంతాలు, నిర్దిష్టమైన విద్యావిధానం, క్రీడాస్థలాలు, గ్రంథాలయాలు విశ్రాంతిసమయ కార్యక్రమాలు మొదలైన సదుపాయాలు కల్పించటంద్వారా బాలనేరాన్ని నివారించవచ్చు.

## పునరావాస సేవలు (Rehabilitation Services)

బాల నేరస్థులను సంస్కరించి, తిరిగి సక్రమమైన జీవితాన్ని కల్పించటానికి పునరావాస సేవలు ఏర్పాటైనాయి. బాలనేరస్థులను వయోజన నేరస్థులతో సమంగా న్యాయవిచారణ చేయటం, శిక్షించటం సముచితం కాదు. ఎందుకంటే వయోజనులు ఉద్దేశపూర్వకంగా నేరంచేస్తారు. బాల నేరస్థులు అనారోగ్యకరమైన పరిసరాలు, పరిపూర్ణ మూర్తిమత్వాభివృద్ధి లేకపోవటంవల్ల నేరాలుచేస్తారు. అందువల్ల బాలనేరస్థులను విచారించేటప్పుడు వారి పరిస్థితులను, నేరాన్ని చేయటానికిగల కారణాలను

దృష్టిలో ఉంచుకొని విచారణ జరగాలి. అట్లాగే, వారికి నేరానికితగిన శిక్షను ఇవ్వటం మాత్రమే కాకుండా వారి ప్రవర్తనలో మార్పుకలిగించే సంస్కరణ సేవలు, విద్యా, ఉద్యోగ, ఉపాధి సౌకర్యాలు పునరావాససేవలను కల్పించడానికి ప్రత్యేకమైన సంస్కరణ సంస్థలను ఏర్పాటుచేయాలి. అందుచేతనే మనదేశంలో బాలనేరస్థులకోసం ప్రత్యేకంగా బాల న్యాయస్థానాలు (Juvenile Courts) బాల నేరస్థుల సంస్కరణ పాఠశాలలు (Correctional Institutions) ప్రభుత్వం స్థాపించింది.

## బాలల న్యాయస్థానాలు (Juvenile Courts)

బాలనేరస్థుల సమస్యలు, వారికి దోహదపడే కారణాలు భిన్నమైనవి కనుక వాటిని ప్రత్యేకంగా పరిశీలించటం చాలా అవసరం. వారుచేసే నేరాలకు, వారు పూర్తిగా బాధ్యులుకారు. వారి నేరాలను న్యాయవిచారణ జరిపినప్పుడు, వారి పరిస్థితులను, నివసించిన పరిసరాలను దృష్టిలో ఉంచుకొని విచారణ జరపాలి. పూర్వం బాలనేరస్థులను వయోజన నేరస్థులను ఒకేవిధంగా విచారణ జరిపి శిక్షించేవారు. కాని ఆధునిక కాలంలో బాలనేరస్థులను శాస్త్రీయ దృక్పథంలో పరిశీలించి, వారికి చికిత్సను, పునరావాసానికి ప్రత్యేక పద్ధతుల నుపయోగిస్తున్నారు.

మనదేశంలో ప్రత్యేకంగా బాలల చట్టాలను రూపొందించారు. వాటిననుసరించి, అనేక రాష్ట్రాలలో బాలనేరస్థులకొరకు ప్రత్యేక న్యాయస్థానాలు ఏర్పాటయినాయి. ఈ న్యాయస్థానాలలో న్యాయవాదులుండరు. న్యాయవిచారణ జరిగేటప్పుడు బయట వ్యక్తులకు ప్రవేశముండదు. బాలుర మనస్తత్వం, వారి సమస్యలు, వాటికారణాలు, మొదలగునవాటికి సంబంధించిన ప్రత్యేక విజ్ఞానాన్ని, శిక్షణను పొందిన న్యాయాధిపతులు, (Judges) పోలీసు అధికారులు, సంక్షేమ కార్యకర్తలు కలిసి నేరంచేసిన బాలుడిని వారి సమస్యలను నిష్పాక్షికంగా పరిశీలించి, వాటికి తగిన పరిష్కారమార్గాలను తెలియచేస్తారు.

## సంస్కరణ సంస్థలు (Correctional Institutions)

బాలనేరస్థులకోసం ఏర్పాటయిన సంస్కరణ సంస్థలలో రిమాండ్ గృహాలు (Remand homes) ధృవీకృత పాఠశాలలు (Certified Schools) బోర్స్టల్ పాఠశాలలు (Borstal School) ముఖ్యమైనవి. నేరంచేసిన బాలుడిని శిక్షించే ఉద్దేశంతో కాక, వారిని సంస్కరించి, వారికి విద్యా శిక్షణ, వృత్తిశిక్షణనిచ్చి, సామాన్యపౌరులుగా తీర్చిదిద్దటం కొరకే ఈ సంస్థలు కృషిచేస్తున్నాయి.

## రిమాండ్ గృహాలు

నేరంచేసిన బాలుడు పట్టుబడిన తరవాత, కేసువిచారణ జరిగేవరకు ఆ బాలుని రిమాండ్ గృహంలో ఉంచుతారు. సురక్షితమైన రిమాండ్ గృహంలో ఆ బాలుని ప్రొబేషను అధికారి, సంఘ సంక్షేమ కార్యకర్త కలసి, సునిశితంగా పరిశీలిస్తారు. వీరి పరిశీలన ఆధారంగా న్యాయాధికారి నేర విచారణ జరిపి, తన తీర్పును నిర్ణయిస్తాడు.

## ధృవీకృత పాఠశాలలు

ధృవీకృత పాఠశాలలలో రెండు రకాలున్నాయి. 1. జూనియర్ ధృవీకృతపాఠశాల 2. సీనియర్ ధృవీకృత పాఠశాల. ఈ సంస్థలు బాలురకోసం బాలికలకోసం కూడా ప్రత్యేకంగా ఉన్నాయి. నేరం ఋజువయిన బాలనేరస్థులను ఈ పాఠశాలలో ఉంచి వారికి విద్యాశిక్షణ, వృత్తి శిక్షణ కల్పిస్తారు. 12 సంవత్సరాలకంటె తక్కువ వయస్సుగల బాలురను జూనియర్ పాఠశాలలకు, 12–16 సంవత్సరాల మధ్య వయస్సు ఉన్న బాలురను సీనియర్ పాఠశాలలకు పంపిస్తారు. ఈ పాఠశాలలు రక్షితభవనాలయినప్పటికీ, పాఠశాలలోపల బాలురకు చాలావరకు స్వేచ్ఛ ఉంటుంది. వారి అభివృద్ధికి తగిన విద్య, ఆరోగ్య, వినోద సౌకర్యాలను కలిగించి వారిని సామాన్య పౌరులుగా తయారుచేయడమే ఈ సంస్థల ముఖ్య ఉద్దేశం.

## బోర్‌స్టల్ పాఠశాలలు

16–21 సంవత్సరాల మధ్య వయస్సుగల బాలనేరస్థుల కోసం ఈ పాఠశాలలను ఏర్పాటు చేశారు. వీరు కౌమార దశకు చెంది బాలురు గనుక వీరిపట్ల ప్రత్యేక శ్రద్ధ వహిస్తారు. బాలుర అభిరుచి, శక్తి సామర్థ్యాలకు అనుగుణంగా వారికి విద్యా శిక్షణ, వృత్తి శిక్షణ ఈ సంస్థలలో ఇస్తారు. శిక్షా కాలంలో బాలుని ప్రవర్తనను సునిశితంగా అధికారులు పరిశీలించి, మంచి ప్రవర్తన కలిగిన బాలురకు, శిక్షా కాలం తగ్గించటం, ప్రొబేషను ఏర్పాటు చేయటం మొదలయినవి చేస్తారు. విడుదలయిన తరువాత వారికి తగిన ఉద్యోగ ఉపాధి సౌకర్యాలను కలిగించి, తద్వారా సామాన్య పౌరులుగా తయారు చేయటానికి సంక్షేమ కార్యకర్తలు ప్రయత్నిస్తారు.

## సంఘ సంక్షేమ కార్యకర్త పాత్ర

బాలనేరాన్ని పరిష్కరించటానికి ఏర్పాటుచేసిన నివారణ చర్యలు, పునరావాస సేవలను రూపొందించి అమలుపరచడంలో సంఘ సంక్షేమ కృషి కార్యకర్త ప్రముఖమైన పాత్ర వహించాలి. సమాజంలోవున్న విచ్ఛిన్న కుటుంబాలతో కలిసి పనిచేసి కుటుంబ అవ్యవస్థతవల్ల బాలురు నేరస్థులుగా మారకుండా ఉండేటట్లు సంక్షేమ కార్యకర్త కృషి చేయవలె. సముదాయంలో ఆరోగ్యకర పరిస్థితులను నెలకొల్పటానికి తగిన వినోద, విజ్ఞాన, సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటు చేయటానికి సమూహ సేవా కార్యక్రమాల ద్వారా కార్యకర్త కృషి చేస్తాడు. పాఠశాలలలో ఉపాధ్యాయులతో, విద్యార్థులతో కలిసి పనిచేసి, బడి ఎగవేయటం, క్రమశిక్షణ లేకపోవటం మొదలయిన సమస్యలను తొలగించటానికి సహాయం చేస్తాడు. తల్లిదండ్రులకు బాలుర మనస్తత్వం, తదితర వివరాలను తెలియజేసి, తల్లిదండ్రులు బాలుర పెంపకం విషయంలో తగు శ్రద్ధ వహించేటట్లు చేస్తాడు.

అంతేగాక, బాలల న్యాయస్థానంలో న్యాయవిచారణ జరపటానికి అవసరమయిన బాలుని కుటుంబ ఆర్థిక, సాంఘిక వివరాలను సేకరించి, న్యాయ విచారణలో న్యాయాధిపతికి సహకరిస్తాడు.

సంస్కరణ సంస్థలలో పునరావాస సేవలను రూపొందించి, పర్యవేక్షించటంలో, బాలుర ప్రవర్తనను అధ్యయనం చేయటంలో సమూహ సేవా, వ్యక్తి సేవా పద్ధతుల నుపయోగించి, కార్యకర్త సంస్థాధికారులకు సహాయపడతాడు.

సంఘ సంక్షేమ కృషి అధ్యయనంలో క్రిమినాలజీ, కరెక్షనల్ అడ్మినిస్ట్రేషన్ (Criminology and Correctional Administration) అనే ప్రత్యేక పాఠ్యాంశంలో శిక్షణ పొందినటువంటి కార్యకర్తలను బాలనేరస్తుల పునరావాస సంస్థలైన, ధృవీకృత పాఠశాలలు, బోర్‌స్టల్ పాఠశాలలు, బాలల న్యాయస్థానాలు, రిమాండ్ గృహాలు, ఆఫ్టర్ కేర్ గృహాలు (After Care Houses) సంస్థలలో నియమించాలి. ఈ సంస్థలలో సంఘ సంక్షేమ కార్యకర్త తన విజ్ఞానాన్ని, నిపుణతనను ఉపయోగిస్తూ, ఆ సంస్థల ద్వారా సేవలను పొందుతున్న వ్యక్తులలో మార్పును తీసుకువచ్చి వారిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందింపచేసి సమాజంలో మామూలు వ్యక్తులవలె సామాజిక స్థాయిని, పాత్రను తిరిగి పొందటానికి కృషి చేస్తాడు. కాబట్టి ప్రత్యేక శిక్షణ పొందిన సంక్షేమ కార్యకర్తలను, ఈ సేవా కార్యక్రమాలలో ప్రభుత్వం నియమించటం చాలా అవసరం.

# 6

# మందుల వ్యసనం
## (Drugaddiction)

జీవకణాలలో, శరీరావయవాలలో కలిగే వైపరీత్యాన్ని సరిదిద్దటానికి మందులను ఉపయోగిస్తారు. ఇవి కొంతవరకు అవసరాలు, ప్రయోజనకరాలు అయినా మితిమీరినప్పుడు మనస్సుపై కొంత దుష్ప్రభావాన్ని చూపుతున్నాయి. బ్రోమైడ్‌లు మొదలైనవాటిని ఎక్కువగా ఉపయోగిస్తే ఉద్రిక్తత, కలవరపాటు, భ్రాంతి, భ్రమ, నిర్విణ్ణత మొదలైనవి కలుగుతాయి. దీనినే ఔషధ సంధి అనికూడా అంటారు. నల్లమందు మొదలైన మత్తుపదార్థాలు కలిసిన మందులు నాడీమండలాన్ని శిథిలపరచి, మానసికచర్యలను మందగింపచేస్తాయి లేదా పూర్తిగా స్థంభింపచేస్తాయి.

సాధారణంగా వ్యక్తి ఏదో మానసిక ఆందోళనవల్ల బాధపడుతూ, దానినుంచి నివృత్తిని పొందటానికి కోకేన్, నల్లమందు కలిసిన మత్తుమందులను సేవిస్తాడు. దీనిఫలితంగా ఆందోళనలు మరింత పెరిగి, వానిని అణచివేయటానికి మత్తుమందులను ఎక్కువ మోతాదులో సేవించాల్సిన అవసరం ఏర్పడుతుంది.

## నిర్వచనం

''క్రమంగా మాదకద్రవ్య సేవించలేనిదే వ్యక్తి జీవించలేని స్థితిని 'ఔషధదాస్యం' లేదా 'మందులవ్యసనం' అని'' పిలవవచ్చు.

''తమాయించుకోలేని పరిస్థితిలో, అలవాటుకు లోనై మందులను సేవించటం ద్వారా మాత్రమే నిద్రకు ఉపక్రమించే వ్యక్తుల పరిస్థితిని మందులవ్యసనంగా చెప్పవచ్చు. నార్కొటిక్ మందులను వాడే దీర్ఘకాల ప్రక్రియను కూడా మందుల వ్యసనంగా చెప్పవచ్చు.

## మత్తుమందుల వ్యసనం - స్వభావం

నల్లమందు, కోకయిన్ వంటి మందులను ఒకసారి అలవాటు చేసుకుంటే శరీరం ఆ మందులకు బానిస అవుతుంది. ఒక దశకు చేరిన తరవాత శరీరం, అట్టి మందుల సేవించని పక్షంలో, అచేతనమై పోతుంది. అందువల్ల క్రమంగా ఈ మందుల వినియోగాన్ని వ్యసనపరులు పెంచుతూ వెళతారు. అట్లాకాకపోతే కావలసిన మత్తు, తృప్తి రావు. అందువల్ల ఈ మందుల వినియోగదారులు, సమయానికి మందు చేరువలో లేకపోతే ఎంతటి నేరాన్నయినా అవలీలగా చేయటానికి జంకరు. కొన్ని

సమయాలలో భౌతికంగా, మానసికంగా కూడా నిరాశాజనకమైన నేరస్థులుగా మారుతారు. శాస్త్ర వేత్తల అభిప్రాయం ప్రకారం మందుల వినియోగదారుల నాడీమండలమంతా పూర్తిగా మందులకు బానిస అవుతుంది. మందుల వినియోగానికి అంతరాయం కలిగితే వాంతులు, మానసిక ఆందోళన, ఉన్మాదం రావచ్చు. పరిశోధనలలో కూడా మందుల వ్యసనానికి లోబడిన వ్యక్తులు మానసికంగా, భౌతికంగా కూడా ఆరోగ్యాన్ని పోగొట్టుకొని, నైతిక పతనాన్ని పొంది, తెలివిహీనులైన సంఘటనలు అనేకం ఉన్నాయని తేలింది. ఆ విధంగా వారు తమకుతామే కాక, తమ కుటుంబాలకు కూడా సమస్యలై బ్రతుకుతుంటారు.

## మత్తుమందులు - వివిధ రకాలు

మత్తు మందులను క్రింది ప్రకారంగా విభజించవచ్చు.

నల్లమందు
విప్పసారా
నాటుసారా
భంగు
గంజాయి
జీలుగుకళ్ళు
కల్లు
గోడాకు
ఎల్. ఎస్. డి.
కోకేయిన్
జర్దా
కారా
నిద్రమాత్రలు
మార్ఫిన్ ఇంజక్షన్ మొ॥నవి.

## వ్యసనపరులు - వివిధ రకాలు

మత్తు మందుల వ్యసనానికి గురిఅయి నష్టపోతున్న వారిని నాలుగు ప్రధాన సమూహాలుగా విభజించవచ్చు.

1. రోగగ్రస్థులు నిర్విరామంగా మత్తు మందులను వాడివాడి, అది వ్యసనంగా మారి అందుకు బానిసలైనవారు.
2. రహస్య జీవితాలను గడుపుతూ (వ్యభిచారులు, కూర్పుగాళ్ళు లేదా తార్పుగాళ్ళు, జూద గాళ్ళు, నల్లమందువంటి మత్తు పదార్థాలను అమ్మేవారు) సమాజంలో తమ ఉనికిని, తక్కువ తనాన్ని మర్చిపోవాలనుకొనేవారు.

3. ఉన్నత వర్గానికి చెంది, రహస్య జీవితాలు గడిపే మహిళలు, అత్యాధునిక స్త్రీ పురుషులు, కొత్తదనంకోసం పరితపించే వనితలు, గమ్యంలేని అర్థరహితమైన జీవితాన్ని గడిపేవారు.

4. 13–19 సం॥ల తొలి వయస్సులో పరిసరాల ప్రాబల్యానికి గురిఅయి, జీవితంలో అనుభూతులను, అనుభవాలను సాహసకృత్యాల ద్వారా సంపాయిద్దామని పిచ్చికలలు కంటూ, మత్తు మందుల వ్యసనానికి లొంగినవారు.

పైన పేర్కొన్న నాలుగురకాల సమూహాలలోను 2, 3 రకాలు సామాజిక అవ్యవస్థలో ఇదివరకే బలి అయినవారు కనుక మత్తుమందు వ్యసనాన్ని వదులుకోలేరు. కాని 1, 4 రకాలు వ్యక్తిగతంగా అనవసరంగా ఈ రొంపిలోకి దిగజారుతున్నారు. ఇట్టివారిని కాపాడవలసి ఉంది. మత్తు మందుల వ్యసనానికి గురైనవారిని ప్రారంభదశలోనే రక్షించలేకపోతే ముదిరినతరువాత వారిని ఎవ్వరూ మార్చలేరు. జేమ్సునే అనే శాస్త్రజ్ఞుని ప్రకారం 1922 నాటికి మత్తుమందుల వ్యసనానికి గురైనవారి సంఖ్య పదిలక్షల సుమారుగా ఉన్నది. మత్తుమందుల వ్యసనానికి లొంగిన అధిక సంఖ్యాకులు భౌతికంగాకాని మానసికంగా కాని చితికినవారే. రహస్యంగా ఈ మత్తుమందుల వ్యాపారం చేసేవారికి చాలా లాభసాటిగా ఉంది. కనుక సామాజిక అవ్యవస్థ మరింత గట్టిపడుతుంది. మత్తుమందుల వ్యసనానికి లోబడినవారిని గురించి ఒక్కసారి తెలుసుకుంటే వారిని ఆ ఊబిలోనుంచి పైకి రానివ్వరు. మత్తుమందులు ఉత్పత్తిచేసేవారు మొదలుకొని, దొంగరవాణా చేసేవారు, టోకు వ్యాపారస్థులు, చిల్లరవర్తకుల వరకూ కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసుకుంటూ ఉంటారు. నగరప్రాంతాలలోనూ, పట్టణ ప్రాంతాలలోను మాత్రమే ఈ సమస్య ఉంటుంది. ఈ వ్యాపారస్థులు ఎవరికీ తెలియకుండా ఉంటారు. వినియోగదారులే పోలీసులకు వ్యాపారస్థులు దొరికిపోకుండా సాధ్యమైనంతవరకూ జాగ్రత్త తీసుకుంటారు. చిల్లర వర్తకులు వారివారి యజమానులు బయటపడకుండా అప్రమత్తంగా ఉంటారు.

## మత్తుమందుల వాడకం - పుట్టుపూర్వోత్తరాలు

మత్తుమందులు అంటే నల్లమందు, కోకాఆకులు, థెరాప్యుటిక్ ఉద్దేశాలకోసం వాడేవారు. క్రీ॥పూ॥ 1550 ప్రాంతంలో ఇంచుమించుగా 700 విధానాలలో వైద్యానికి ఉపయోగించేవారు. రోమ్‌లో వైద్యరంగంలో నల్లమందుకు అపారమైన గౌరవం లభించింది. అరబ్ వైద్యులంతా విరివిగా వాడారు. ఎలిసెన్నా (980 – 1037 క్రీ॥శ॥) అనువ్యక్తి కంటికి, విరోచనాలకు సంబంధించిన వివిధ రోగాలకు నల్లమందు వాడాడు. మహమ్మదీయుల (క్రీ॥శ॥ 570–632) కాలం ముందునాటికి, అరబ్ వర్తకులు భారతదేశానికి నల్లమందు తీసుకువచ్చేవారు. అయితే మహమ్మదీయులు దీనిని విపరీతంగా వాడారు. క్రీ॥శ॥ 7వ శతాబ్దంనుంచి చైనాలో నల్లమందుకు ప్రాముఖ్యత ఉంది. అప్పట్లో అరబ్ వర్తకులు ఇండియానుంచి బర్మా, యునాన్ దేశాలమీదుగా నల్లమందును తీసుకువెళ్ళేవారు. అరబ్ వర్తకులతో ప్రారంభమైన నల్లమందు వ్యాపారం – చైనీయులు, పోర్చుగీస్‌వారు, డచ్‌వారు, ఇంకా

ఇతర దేశీయులచేత అభివృద్ధి పొందింది. ప్రస్తుతం పెర్షియా, భారతదేశం, చైనా, రష్యా, టర్కీస్తాన్, ఆఫ్ఘనిస్తాన్, టర్కీ దేశాలలో నల్లమందును పండిస్తున్నారు.

అయితే ఔషధాలను తయారు చేయటం కోసం ప్రపంచఖ్యాతి గాంచిన ఈ నల్లమందును ఇతర విధాలుగా ఉపయోగించటంవల్ల అనేక సాంఘిక సమస్యలకు కారణభూతమైంది. ఒకప్పుడు పర్షియన్లు, టర్కీలు, అరబ్బులు నల్లమందును విరివిగా వాడి ఉన్నప్పటికీ, భారతదేశం, చైనావంటి దేశాలు నల్లమందును విరివిగా పండించటంతోపాటు ఈ దేశాలవారు సేవించటం కూడా అలవాటు చేసుకున్నారు. నల్లమందును తినటమే కాకుండా, పొగత్రాగటానికి కూడా వాడేవారు. ఫార్మోజాలో డచ్ వారు మొట్టమొదటిసారిగా మలేరియా నుండి రక్షణ పొందటానికి పొగాకులో నల్లమందును కలిపి పొగత్రాగారు. ఫార్మోజానుంచి ఇది ఒక ఆచారంగా అవతరించి, 1800 ప్రాంతంలో చైనాలో పొగత్రాగటం కోసం ప్రత్యేకంగా నల్లమందును ఉపయోగించటమనేది ప్రారంభమయింది. చైనాలో మొదలైన "నల్లమందుతో పొగత్రాగటం" అనే అలవాటు చైనావారు ఎక్కడకు వలసపోతే అక్కడకు కూడా ఇది ప్రాకింది. అమెరికా సంయుక్త రాష్ట్రాలకు వలస పోయిన కూలీల ద్వారా నల్లమందుతో పొగత్రాగే అలవాటు ప్రాకింది. మొట్టమొదటగా క్లాండిక్ (1868) అనే తెల్లవాడు దీని రుచి మరిగాడు.

అట్లా మొదలైన "నల్లమందుతో పొగత్రాగటం" భూగోళాన్ని అంతటిని ఉర్రూతలూగించింది. అన్ని దేశాలవారు, మతస్థులవారు దీనికి బానిసలయ్యారు. చివరకు చట్టరీత్యా దీనిని అరికట్టవలసి వచ్చింది. అనేక అల్కాలాయిడ్ మందులు, మార్ఫిన్‌ను కనుక్కొన్న తరవాత నల్లమందుకు ఉండవలసిన గౌరవం ఉన్నప్పటికీ, అల్కాలాయిడ్ మందులను సేవించటం కూడా ఉధృతమైంది.

గుల్మ సంబంధమైన మందులను వాడటంలో భారతదేశం చైనాకంటే ముందుగానే ఉండేదని చరిత్రలో సాక్ష్యాలున్నాయి. భారత సాహిత్యంలో "సోమరసం" పేరిట ఈ మందుకు కొంత ప్రతిష్ఠ ఉంది. అథర్వణ వేదంలో "భంగు" ప్రయోగం పాత సంస్కృత సాహిత్యంలో కూడా ఉంది. "గంజాయి", "భంగు" ల వాడకం భారతదేశంలో ముస్లిముల కాలంకన్నా ముందు ఉండేదని చెబుతారు. ఈ మందులవల్ల మత్తు మాత్రమే కాకుండా, ఊహాలోకాల్లో విహరించటం కూడా జరుగుతుంది. క్రీ॥శ॥ 9 వ శతాబ్దంలోనే ముస్లిమ్ వర్తకులు నల్లమందును తీసుకువచ్చి, భారతదేశంలో వ్యాపారం చేశారు. మహమ్మదీయుల కాలంలో "చనార్ భర్గ" (నాలుగు ఆకులతో తయారు చేయటం) అనేది ఆల్కహాల్, నల్లమందు, గంజాయినారు, పాపీతో తయారుచేయడమైంది. అప్పట్లో ధనికులు ప్రఖ్యాతి మందుగా దీనిని వాడేవారు. కాలక్రమంలో నల్లమందును భారతదేశంలో పెద్ద ఎత్తున పండించటం మొదలుపెట్టారు.

## మందులవ్యసనం - భారతచట్టం

1930 ప్రమాదకర మందుల చట్టం (నల్లమందుతోసహా) అప్పటి ప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఈ చర్యను 1925 అంతర్జాతీయ నిర్ణయం తరవాత తీసుకొన్నారు. మందుల అమ్మకంపై ప్రభుత్వానికి

ఉపశమనం లభించే మార్గాలున్నప్పటికీ, భారత ప్రభుత్వం నిరంతర మందులవాడకాన్ని మత్తుమందుల వ్యసనంగా గుర్తించి, దీనిని సాంఘిక సమస్యగా భావించింది. ఈ సాంఘిక సమస్యను అరికట్టడం కోసం అనేకవిధాలుగా ప్రయత్నాలు చేసింది.

భారతీయ వైద్య సేవాసంస్థ అధిపతిగా ఉన్న కాలొనెల్ రామనాథ్ చోప్రా మత్తు మందుల వ్యసనంమీద సమగ్రమైన అధ్యయనంచేసి, ఒకప్పుడు వెలువడిన 'భారతీయ వైద్యగెజిట్' అనే పత్రికలో ప్రచురించారు. ఆయన పరిశీలనల ప్రకారం కింది అంశాలు వెలుగులోకి వచ్చాయి.

1. నల్లమందు, గంజాయి, భంగు అనే మత్తుమందులు సామాన్య భారత ప్రజలు అనేకమంది వాడేవారు.
2. 19వ శతాబ్దంలో కోకయిన్‌ను హెచ్చుశాతం జనాభా భారతదేశంలో వినియోగించేవారు.
3. హిప్నాటిక్ మందుల వినియోగదారులు ప్రధానంగా బార్బిట్యురేట్స్. భారతదేశంలో కొంతవరకు తక్కువశాతంలో కనిపించినా దేశమంతటా విస్తరించి ఉన్నారు.
4. సంశ్లేషణ **మూలమైన** అనేక మత్తుమందులకు ప్రపంచ దేశాలలో అనేకచోట్ల ప్రజలు బానిసలైనప్పటికీ, అట్టిమందులు భారతదేశంలో లేవని చెప్పవచ్చు.

## అంతర్జాతీయ అభిరుచి

పారిశ్రామిక రంగంలో శ్రమించి పనిచేసే కష్టజీవులంతా ఆధునిక జీవితంలో ఉన్న అనుభూతులను పొందటానికి, మత్తుమందుల వినియోగానికి చాలావరకు ఆకర్షితులయ్యారు. రసాయనిక పద్ధతులలో అనేక విధాలుగా నల్లమందునుంచి, కోకా ఆకులనుంచి అల్కాలాయిడ్, నార్కోటిక్ మందులను కనిపెట్టారు. ప్రపంచానికి ఈ మత్తుమందులు పెద్ద ఆకర్షణగా అయినాయి. ఈ మందులకు మరిగిన అనేకమంది ప్రజలు, ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి మత్తుమందులను తీసుకువెళ్ళటం, వ్యాపారంచేయటం, వినియోగించటం వంటి చర్యలకు లోనయి, అనేక నేరాలుకూడా చేయటానికి వెనుకాడలేదు. అప్పటినుంచి నేరాలుచేసే నేరస్థులసంఖ్య అత్యధికంగా పెరిగింది. సామాజిక అవ్యవస్థకు కారణభూతమవుతున్న మత్తుమందుల వ్యసనమనే సమస్య ఒక తీవ్రసమస్యగా ప్రబలింది. అంతర్జాతీయ స్థాయిలోనూ, జాతీయస్థాయిలో కూడా చట్టపరమయిన అనేక నియమాలను రూపొందించి, మందుల వ్యసనాన్ని అరికట్టడంకోసం ప్రయత్నాలు చేశారు.

అంతర్జాతీయ స్థాయిలో నార్కోటిక్ మందులకు సంబంధించి, "నార్కోటిక్ మందుల సంబంధమైన ఆర్థిక, సాంఘిక కౌన్సిల్‌పై కమీషన్", "శాశ్వత కేంద్రీయ నల్లమందు బోర్డు" అనేవి అతి ప్రధానమైనవి. 1940 అంతంలో ప్రపంచ ఆరోగ్య సంస్థ "వ్యసనానికి దారితీసే మందులపై నిపుణుల సంఘం" అనే దానిని నియమించింది. ఈ నిపుణుల సంఘం 1963 లో జెనీవాలో సమావేశమై, వ్యసనాలకు దారితీసే సంశ్లేషణాత్మక మందుల విషయంపై ప్రధానంగా చర్చలు జరిపింది.

ఐక్యరాజ్య సమితి నివేదిక ప్రకారం, మధ్యప్రాచ్యంలోనూ, దూరప్రాచ్యంలోనూ, నల్లమందుతో పొగ త్రాగటం ప్రధానంగావుండేదని, అయితే "కన్నాబిస్" తయారీ ఒక ఆసియా, ఆఫ్రికా ప్రాంతాలకే పరిమితమై ఉండక యూరప్, అమెరికా దేశాలను కూడా బాగా విస్తరించిందని తెలుస్తున్నది. "మరిజువానా" (కన్నాబిస్ సిగరెట్లు) అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రసిద్ధి కెక్కినాయి. ఏది ఏమైనా, పశ్చిమ దేశాల్లో, సంశ్లేషణాత్మక మందుల వినియోగం క్రమంగా పెరగటం ఒక విశేషం.

"మందుల వ్యసనానికి లోబడిన ప్రతి వ్యక్తి తన అలవాటు ప్రభావాన్ని మరో నలుగురు వ్యక్తులపై చూపగలరని" శాస్త్రవేత్తల నమ్మకం. బరితెగించిన విధానాలను అనుసరిస్తూ అక్రమ పద్ధతిలో నార్కొటిక్ మందుల వ్యాపారం దినదినాభివృద్ధి చెందుతుంది.

## మందుల నిషేధం - భారత ప్రభుత్వం

నిర్మాణాత్మక చర్యలను తీసుకోవటానికి భారతదేశం నిరంతర కృషి సల్పింది. అంతేకాదు నిదర్శనం 1937 లో భారత కాంగ్రెస్ మంత్రిత్వ శాఖలు 5 రాష్ట్రాలలో అడుగు పెట్టిన తరువాత మందుల నిషేధాన్ని సూత్రప్రాయంగా ఆమోదించి, ఆచరణలో పెట్టడానికి కృషి చేశాయి. మరి కొన్ని ఇతర రాష్ట్రాలలో పరిశోధనాత్మకంగా మందుల నిషేధాన్ని ప్రవేశపెట్టారు. అంతేకాదు మొదటి ప్రయత్నం – ఎక్సైజు దుకాణాలను మూసివేయటం. 1939 లో కాంగ్రెస్ మంత్రిత్వ శాఖలు స్థాన భ్రంశం చెందగానే మందుల నిషేధ ప్రయత్నాలకు కొంత అంతరాయం కలిగినప్పటికీ, తిరిగి అధికారంలోకి వచ్చిన తరవాత పూర్వపు శ్రమ, ప్రయత్నాలు ఫలించాయి.

1948 మార్చిలో, భారత ప్రభుత్వం, పరిపాలనా యంత్రాంగం అంతా మత్తుపానీయాలు, మత్తుమందుల వాడకాన్ని పూర్తిగా అదుపులోకి తీసుకురావాలని నడుం కట్టింది. తరవాత ఆర్టికల్ 47 లో భారత రాజ్యాంగంలోని ప్రభుత్వ నిర్దేశక సూత్రాలలో ఈ అంశాన్ని ఇమిడ్చారు.

## సదస్సులు

స్వాతంత్ర్యం వచ్చిన తరవాత నార్కొటిక్ మందులపై **మూడు** అఖిలభారత సదస్సులు నిర్వహించారు. మొట్టమొదట అఖిలభారత నల్లమందు సదస్సు కొత్తఢిల్లీలో 1949 ఆగష్టులో జరిగింది. అన్ని రాష్ట్రప్రభుత్వాలు ఈ సదస్సులో పాల్గొన్నాయి. సదస్సులో ఒక ఏకగ్రీవ తీర్మానం ప్రతిపాదించబడి, అంగీకారం పొందింది. దీని ప్రకారం 10 సంవత్సరాలకాలంలో ఏడాదికి 10 శాతం చొప్పున మందుల వాడకాన్ని, వ్యాపారాన్ని తగ్గిస్తూ 1959 నాటికి అంతంచేయాలని ఉన్నది. అయితే వైద్యశాస్త్ర రంగాలలో ఉపయోగానికి అంతరాయం లేదు. 1950 నవంబరులో భారత ప్రభుత్వ నార్కొటిక్స్ కమీషన్ వారి సారథ్యంలో ఒక కేంద్రీయ నార్కొటిక్స్ శాఖ వెలిసింది. ఈ శాఖ దేశంలో పండిన నల్లమందు పంటను సక్రమరీతిలో వసూలీ చేయటానికి తగిన చర్యలను తీసుకోవలసి ఉంది. ఇదే కమీషనర్ 'నల్లమందు చట్టం 1857' ప్రకారం నల్లమందు ప్రతినిధిగా కూడా వ్యవహరిస్తూ దేశంలోని నల్లమందు పండించే విధానాలను, నల్లమందు తయారుచేసే పద్ధతిని, క్రమబద్ధం చేస్తాడు. నార్కొటిక్ శాఖవారు నల్లమందుతో అక్రమ వ్యాపారం, రవాణా, వినియోగం,

పంపిణీ, తయారీ, మొదలైన విషయాలలో తగు చర్యలు తీసుకుంటారు. అంతేగాక ఔషధాల తయారీకి అవసరమైన నల్లమందును విడుదలచేస్తారు. "1959 తరవాత ఔషధేతర వినియోగంలో గంజాయి, భంగులను నిషేధిస్తున్నట్లు" కూడా ఆ సదస్సులో ఒప్పందం జరిగింది.

"శాస్త్రీయ పరిశోధనేతర ఔషధేతర వినియోగానికి నల్లమందు వాడకం 1959 నాటికి పూర్తిగా నిషేధించటం జరిగిందని, భారత ప్రభుత్వం నల్లమందు ప్రోటోకల్, 1969 – ఆర్టికల్ 19 ప్రకారం ప్రకటించింది. 1956 లో సిమ్లాలో రెండో అఖిలభారత నార్కొటిక్స్ సదస్సు జరిగింది. ఈ సదస్సులో నార్కొటిక్ మందుల నిషేధంపట్ల ఒక సమగ్ర అధ్యయనం జరిగింది. ఈ సదస్సులో కింది ప్రకారం కొన్ని సూచనలు చేయడమైంది.

1. 1959 మార్చి 31వ తేది తరవాత వైద్యపరీక్షల ద్వారా మందుల వ్యసనానికి పూర్తిగా లొంగిపోయినట్లు గుర్తింపు పొందిన వ్యక్తులకు మాత్రమే మందుల సరఫరా ఉండాలి.
2. ఎక్సయిజ్ లైసెన్సు పొందిన నల్లమందు దుకాణాలన్నీ 31 మార్చి 1959 నాటికి పూర్తిగా మూసివేయాలి.
3. వైద్యాలయాలలో నల్లమందు వ్యసనానికి గురైన వ్యక్తులకు చికిత్స నిమిత్తం ప్రత్యేక ఏర్పాట్లు చేయాలి.
4. శాస్త్రీయ పరిశోధనేతర, ఔషధేతర వినియోగం నిమిత్తం 31 మార్చి 1959 నాటికి గంజాయిని, 1961 నాటికి భంగును, దశలవారీ కార్యక్రమం క్రింద పూర్తిగా సరఫరాను నిలిపి వేయాలి. 'భంగు'కు కొంత వ్యవధి ఇవ్వటంలో ఉద్దేశం – దేశంలో అనేకచోట్ల సాంఘిక ఆధ్యాత్మిక కార్యక్రమాలలో భంగును ఉపయోగించటం అప్పటికి ఉంది. అంతేగాక, గుల్మం–అరణ్యపు పంట అయిఉండటం, అది అందరికీ అందుబాటులో దొరకటం !
5. నార్కొటిక్ మందులు, వాటికి సంబంధించిన అనేక ఔషధాలుకూడా దిగుమతి చేసుకునే టప్పుడు అక్రమ పద్ధతులన్నింటిని అరికట్టాలి.

మూడో సదస్సు అఖిల భారత నార్కొటిక్స్ సదస్సు 1959 లో హైదరాబాదులో జరిగింది. ఈ సదస్సు పూర్వపు సదస్సులోని సూచనలను పరిశీలించి, ఆచరణలో వచ్చిన ఇబ్బందులను పరిశీలించింది. ముఖ్యమైన విశేషాలను కింది ప్రకారం చెప్పొచ్చు.

1. అక్రమ మార్గాల ద్వారా నల్లమందు విడుదలను సమర్థవంతంగా అరికట్టడానికి ప్రభుత్వ పాలిత విక్రయ కేంద్రాల ద్వారా మాత్రమే వైద్యోపయోగానికి కూడా నల్లమందును సరఫరా చేయాలి.
2. వైద్య విషయాలలో తప్ప, ఇతరత్రా ఏ విధంగాకూడా రాష్ట్రాలు తమలోతాము నల్లమందు పంపిణీ ఎగుమతులు చేసుకోరాదు.

3. అమలుపరచటంలో ఇబ్బంది కలిగిన కొన్ని రాష్ట్రాలకు మాత్రం వైద్యేతర ఉపయోగానికి గంజాయిని వాడటానికి, గడువు తేది మార్చి 31, 1961 వరకూ పొడిగించటం జరిగింది.

4. బొంబాయి ప్రభుత్వానికి యోగ్ కమిటీ కొన్ని సిఫారసులు చేసింది. యునాని, ఆయుర్వేద వైద్యరంగాలకు సంబంధించిన సూక్ష్మ గుల్మ మందుల నిషేధాన్ని వైద్యంలో చేయరాదని కోరాయి. అందువల్ల ఈ మరకు యోగ్ కమిటీ చేసిన కొన్ని సిఫారసులను పునరాలోచనను విడిచిపెట్టి, శాస్త్రపరమైన సంపూర్ణ అధ్యయనం మరోసారి చేయమని సదస్సు అభిప్రాయపడింది. అంతకు క్రితం, ఐక్యరాజ్యాల నార్కొటిక్ మందుల కమీషన్, భారత ప్రభుత్వానికి, ప్రపంచ ఆరోగ్య సంస్థ యొక్క అభిప్రాయాన్ని తెలియచేస్తూ వైద్యరంగంలో "కన్నాబిస్" అవసరం లేదని తెలియచేసింది.

భారత కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు తీసుకున్న శ్రద్ధవల్ల ఐక్య రాజ్యాల నార్కొటిక్ మందుల కమీషన్ వారు హర్షం వెలిబుచ్చారు. అన్నిటికంటె విశేషం - భారత ప్రభుత్వ మత్తు మందుల నిషేధ విధానాలను ఐక్య రాజ్యాల ప్రోటోకోల్, 1953 లో ఇమిడ్చారు. నేటి ఆధునిక ప్రపంచంలో మత్తు మందులు కొనటానికి ప్రయత్నాలు చేస్తూ ఉన్నారు. దీనివల్ల అంతర్జాతీయ స్థాయిలో అక్రమ మార్గాల ద్వారా ఈ వ్యాపారం జరుగుతున్నది. దీనివల్ల అంతర్జాతీయ సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి.

## మత్తుమందుల వ్యసనం - చికిత్స - కార్యకర్త పాత్ర

మందుల వ్యసనానికి గురైన వ్యక్తులను నేరస్థులుగా భావించకుండా మానసికరోగులుగా భావించి సేవచేయటమే కార్యకర్తల ప్రధాన బాధ్యతగా ఉండాలి. 1956 సదస్సులో వెలువడిన సూచనల తరువాత అస్సాం ప్రభుత్వం మందులకు మరిగిన వ్యక్తులకు పునరావాస సేవాకార్యక్రమాలను రూపొందించింది. అస్సాం మిగతా రాష్ట్రాలకు ఆదర్శప్రాయమైనది. అమెరికానుంచి వెలువడుతున్న 'మెడికల్ ట్రిబ్యూన్' అనే ప్రసిద్ధ పత్రికలో వచ్చిన నివేదిక ప్రకారం - అమెరికాలోని మానసిక ఆరోగ్య జాతీయ సంస్థ ఒక మోనోగ్రాఫ్‌ను ప్రచురించింది. దాని ప్రకారం నార్కొటిక్ మందులకు గురిఅయిన వ్యక్తుల సంఖ్య 10 సంవత్సరాల కాలంలో 60 వేలనుంచి 40 వేలకు దిగిపోయింది. 1900 మంది వ్యసనపరులలో 90 శాతం 6 నెలల్లో చికిత్స పొందారు. ఇందులో 70 శాతం మంది చిన్నచిన్న నేరాలుచేస్తూ తమ అలవాట్లను మార్చుకోలేని పురుషులున్నారు.

సంఘసంక్షేమ కార్యకర్త మనోవైజ్ఞానిక సంక్షేమ కృషిద్వారా ప్రధాన కార్యక్రమాలను కింది ప్రకారం చేపట్టవచ్చు.

1. వ్యసనపరులను సానుభూతితో చూడాలి.
2. వారి కుటుంబ సమస్యలు పరిష్కరించటానికి ప్రయత్నించాలి.

3. అవసరమగు వైద్యచికిత్స చేయించాలి.
4. తగిన పునరావాస సేవాకార్యక్రమాలను నిర్వహించాలి.
5. మత్తుమందుల వ్యసనాన్ని దేశంలోని ప్రధాన సమస్యలలో ఒకటిగా భావించి తగినంత కృషిజరపాలి.
6. ఈ రంగంలో సాంఘిక పరిశోధన నిర్వహించాలి.

ఈ సేవా కార్యక్రమాల నిర్వహణలోనూ, రూపొందించటంలోనూ, సుశిక్షితులైన సాంఘిక సంక్షేమ కార్యకర్తలను నియమించటం చాలా అవసరం. ఎందుకంటే వ్యక్తి పరిశీలన, సమస్య అవగాహన, సమస్యా పరిష్కారానికి సాంఘిక వ్యక్తి సేవా పద్ధతి చాలా ఉపయోగింపబడు తుంది. అంతేగాక సరైన ఆరోగ్య ప్రదమైన వ్యక్తిత్వ పురోభివృద్ధికి అనువైన విశ్రాంతి కార్యక్రమా లను, సామూహిక సేవా పద్ధతి ద్వారా ఏర్పరిస్తే ఈ సమస్యలను కొంతవరకు అరికట్టవచ్చు. ఈ వ్యసనం యొక్క దుష్ఫలితాలను సమాజంలో అందరికీ తెలియచేయటానికి వీటి పరిష్కారంలో వారి మద్దత్తును పొందటానికి సాముదాయిక వ్యవస్థాపన విధానం చాలా అవసరం.

# మద్యపానం

(Alcoholism)

మద్యపానం ఎన్నో యుగాల నుంచి ఉంది. అయితే అది పూర్వం సమాజంలో పరిమితంగానే ఉండడంవల్ల పెద్ద సమస్య కాదు. పారిశ్రామిక విప్లవం తరవాత కర్మాగారాలలో పనుల ఒత్తిడికి శారీరకంగా తట్టుకోలేక కార్మికులు ఆ శ్రమను మరిచిపోవటానికి తాగుడు అలవరచుకున్నారు. ఇతర వర్గాలవారు కూడా తాగుడుకు లోనవుతూ ఉండటంవల్ల ఈ సమస్య విశేషంగా అందరి దృష్టిని ఆకర్షించింది.

తాగుబోతుతనం వ్యక్తిగత, మానసిక, ఆర్థిక విషయాలకు సంబంధించిన సమస్య. ఈ సమస్య వ్యభిచారం, నేరం మొదలైన ఇతర సామాజిక సమస్యలకు దారి తీస్తుంది.

## సమస్య ?

అప్పుడప్పుడు నలుగురితో కలిసి మద్యాన్ని సేవించే అలవాటు ఒక్కొక్కసారి మితిమీరి సేవించినప్పటికీ, వ్యక్తిగత, సాంఘిక సమన్వయానికి తీవ్రమైన నష్టం కలిగినంతవరకూ "మద్యపానం" లేదా "మదిరావ్యసనం" ఒక సమస్యగా రాదని కొందరి అభిప్రాయం. అయితే అటువంటి కులాసా మద్యపానానికీ, మదిరావ్యసనానికీ మధ్య ఉన్న సరిహద్దు చాలా సూక్ష్మమైనది. మదిరావ్యసనానికి బానిస అయిన వ్యక్తి కూడా తాను ఆ గీత దాటినట్లు అంగీకరించడు. తాగుడుపట్ల అణచుకోలేనంత వ్యామోహం, ఎప్పుడూ మితిమీరి సేవిస్తూండటమూ మదిరావ్యసన లక్షణాలనవచ్చు. మితిమీరిన మద్యపానం ఆర్థిక, సాంఘిక కుటుంబ జీవితాన్ని ధ్వంసం చేస్తుంది. ఒంటరిగా తాగటాన్నిబట్టి మద్యపానానికి వ్యక్తి ఎంత బానిసో చెప్పవచ్చు.

## నిర్వచనం

మద్యాన్ని అదే పనిగా సేవించటంవల్ల అది తాత్కాలికంగాకాని, తీవ్రంగాకాని, మత్తును కలిగించి, వ్యక్తికీ, సమాజానికి తీవ్రమైన నష్టంగా పరిణమిస్తుందని – అదే తాగుబోతు తనమని" ప్రపంచ ఆరోగ్య సంస్థలోని నిపుణుల సంఘం నిర్వచించింది.

మన దేశంలో మద్యాన్ని పూర్వంనుంచి సేవిస్తూ ఉండేవారు. ఆర్యులు సోమరసాన్ని సేవించేవారట. ముస్లిమ్‌ల పరిపాలనా కాలంలో అనేకమంది మద్యపానం చేసేవారట.

## మద్యపానం - వివిధ సిద్ధాంతాలు

సైకో ఎనలిస్టులలో కె. ఎ. మెనింజర్ ప్రకారం - 'ఒకవిధమైన పాక్షిక ఆత్మహత్యే మదిరా వ్యసనం' అని ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించడమైంది. వేరొక సిద్ధాంతం ప్రకారం - 'వైఫల్య భావంతో మదిరా వ్యసనానికి సన్నిహిత సంబంధమున్నదని' ప్రతిపాదించడం జరిగింది.

## మస్తిష్కవల్క సిద్ధాంతాలు (Cerebral Cortex)

దీనిప్రకారం మద్యం మస్తిష్క వల్కలాన్ని రెచ్చగొట్టి, ఆలోచనలను మొద్దుబారచేస్తుంది. మెదడు పైభాగం పనిచేసే తీరును మద్యం నిరోధిస్తుంది. స్మృతికి, ఉదాత్త మనః ప్రవృత్తులకు మస్తిష్క వల్కలం ప్రధానస్థానం. అట్టి స్థానాన్ని మద్యం పనిచేయనివ్వక, వ్యక్తిలో విచక్షణాజ్ఞానం లోపించి, అప్రమత్తత అంతరించి, ఆదిమ - అనాగరిక ప్రవర్తనను విజృంభింపచేస్తుంది. బాధ్యతలను, పరాజయాలను విస్మరించి, వాస్తవిక పరిస్థితుల ఒత్తిడినుంచి విముక్తిపొంది మదిరా వ్యసనంలో మహదానందాన్ని పొందుతాడు. ఈ సిద్ధాంతం ఇతర సిద్ధాంతాలకంటే సమంజసంగా ఉన్నప్పటికీ, మద్యపానం చేసేవారిలో కొందరే ఈ వ్యసనానికి బానిసలవుతున్నారా అనే ప్రశ్నకు జవాబు చెప్పలేకున్నది.

## తాగుబోతులు - రకాలు

మద్యానికి అలవాటుపడినవారు రెండురకాలుగా ఉంటారు. మొదటిరకానికి చెందినవారు కేవలం ఆనందంకోసం, అలసటను మరిచిపోవటం కోసం, స్నేహానికి, వెచ్చదానికి మద్యాన్ని సేవిస్తాడు. కావలెనంటే త్రాగగలడు. అక్కరలేదనుకుంటే మానివేయగలడు. ఇక రెండో రకంవారు తాగుబోతులు. వీరు మద్యాన్ని సేవించలేనిదే జీవించలేరు. ఈ వ్యసనంవల్ల వీరు తీవ్రంగా నష్టపోతారు. అయినప్పటికీ అట్టి అలవాటును మానుకోలేని నిస్సహాయస్థితిలో ఉంటారు. ఇతరుల సహాయంలేకుండా వీరు ఈ సమస్యను పరిష్కరించుకోలేరు.

## మద్యపానం - వివిధ కారణాలు

కొన్ని శాస్త్రీయ సిద్ధాంతాల ప్రకారం మద్యపానం అలవాటు కావటానికిగల కారణాలను- సాంఘిక బాధ్యతలు, సాంసారిక బాధలు, వ్యక్తి అంతః ఘర్షణలు, వ్యాపారంలో పరాజయం, దాంపత్య జీవితంలో వైరస్యం, ఆత్మన్యూనతా భావం మొదలుగాగల జాబితాను తెలపవచ్చు. నిరుత్సాహకరాలయిన వాస్తవిక పరిస్థితులను మరిచిపోవటానికి బాధాకరాలయిన స్మృతుల బారినుంచి తప్పించుకోవటానికి మదిరాపానం ఉపకరిస్తుందన్న వాదమున్నది.

మారుతున్న సమాజంలో మానసిక ప్రకర్షణలు, ఆందోళనాపూరిత పరిస్థితులు అధికంగా ఉంటాయి. తమ ఆవేశాన్ని, ఆందోళననూ, భయాన్ని, కోపతాపాలను తాత్కాలికంగా ఉపశమింప చేయటానికి కొందరు మద్యపానానికి లోనవుతారు. ఆధునిక సమాజంలో నిరాశా, నిస్పృహా

భావాలను తొలగించటానికి మద్యం సేవించటం పరిపాటి అవుతున్నది. ఎన్నో గంటలతరబడి పని చేయటం, భారమైన పని, భద్రత లేకపోవటం, అనారోగ్య గృహపరిసరాలు తాగుబోతుతనానికి దోహదంచేసే కారణాలుగా చెప్పవచ్చు. తాగుబోతుకు సమాయోజనమైన జీవితంలోని మొదటి దశలో సామాజికభద్రతలేక, తోటివారితో పోటీలో పాల్గొనే ధైర్యంలేక, సామాజిక ఆమోదానికి భిన్నమైన విధంగా ప్రవర్తిస్తాడు.

ప్రాథమిక సమూహంలోని వ్యక్తులమధ్య సామాజిక సంబంధాలు సరిఅయిన మూర్తిమత్వం రూపొందటానికి ఎంతగానో తోడ్పడతాయి. కాని వ్యక్తి సరైన సంబంధాలను కోల్పోతే, అతని మూర్తిమత్వం అవ్యవస్థకు దారి తీస్తుంది. నైయుక్తిక కుసమాయోజనాలు అతనిని ప్రాథమిక సమూహమైన కుటుంబం నుంచి వేరు చేస్తాయి. నైయుక్తిక కుసమాయోజనాలను తగ్గించుకోవటానికి కొందరు మద్యాన్ని సేవిస్తారు.

## మద్యపానం - ఫలితాలు

వ్యాధి రూపమైన త్రాగుడు అలవాటుగల వారిలో పిచ్చికోపం, మానసిక అవ్యవస్థత కనిపిస్తుంది. ముఖ్యంగా మూర్ఛ, హిస్టీరియా, స్కిజోఫ్రేనియా వంటి ఇతర మానసిక వ్యాధులలో బాధపడేవారిలో "త్రాగుడు" వ్యాధిరూపం దాల్చుతుందని చెప్పవచ్చు.

తాగుబోతులలో నేరంచేసే ప్రవృత్తి, ఆత్మహత్యా ప్రయత్నాలు అసాధారణాలు కావు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని జాతీయ భద్రతా సమితి మదిరావ్యసనానికి, అనేక విధాలైన సాంఘిక అపరాధాలకు, కారు ప్రమాదాలకు, వ్యభిచార నేరాలకుగల సంబంధాన్ని నిరూపించింది. మద్యపానం ఫలితంగా కలిగే మానసిక వ్యాధులన్నిటికీ – పరుగులెత్తుతున్న ఎలుకలు, పాములు, పెంకు రంగు ఏనుగులు, కీటకాలదాడి మొదలైన కండ్లలోని భ్రాంతులూ, నేరారోపణచేస్తూ, బెదిరిస్తూ అనేక కంఠధ్వనులు వినిపించడంవంటి శ్రవణేంద్రియ భ్రాంతులూ కలగటం ప్రధాన లక్షణాలుగా కనిపిస్తాయి. దీర్ఘకాల మద్యపానంవల్ల వ్యక్తిత్వ విఘటన ఏర్పడుతుంది.

మద్యాన్ని సేవించటంవల్ల వ్యక్తియొక్క శరీర పటుత్వం తగ్గి జబ్బులను ప్రతిఘటించే శక్తి సన్నగిల్లుతుంది, తాగుబోతుతనం కుటుంబ అవ్యవస్థతకు దారితీస్తుంది. అతిగా మద్యాన్ని సేవించడంవల్ల, వ్యక్తి సమాజంలోనూ, కుటుంబంలోనూ ఇతరుల సానుభూతిని, ఆప్యాయతను కోల్పోతాడు. అంతేకాదు. భార్యపుత్రుల పట్లకూడా అనురాగాన్ని కోల్పోతాడు. కుటుంబ సంబంధాలు, సామాజిక సంబంధాలు సన్నగిల్లుతాయి. అతిగా మద్యాన్ని తాగే వ్యక్తి కొంత కాలాన్ని, ధనాన్ని దుర్వినియోగం చేసి కుటుంబాన్ని దారిద్ర్యానికి గురిచేస్తాడు. ఈ వ్యసనం భార్యా భర్తల మీద అనేక సమస్యలను సృష్టించడమే కాకుండా పిల్లలలో చెడు ప్రవర్తన ఏర్పడటానికి దారితీస్తుంది. సమాజంలో భార్యాపుత్రుల అంతస్తు, హోదా దెబ్బతినడంవల్ల వారు మానసికంగా బలహీనతలకు గురి అవుతారు. ఇట్లా తాగుబోతుతనం అనేక కుటుంబ సమస్యలకు దారి తీస్తుంది.

తాగుడు పరిమితి దాటినప్పుడు అది దుష్పరిణామాలకు దారితీసి, దొంగతనం, హత్యలు మొదలైన నేరాలు పెరగటం, చట్టాలను అతిక్రమించడంవల్ల – ఆరోగ్యం క్షీణించడం, కార్మికుని సామర్థ్యం సన్నగిల్లడంవల్ల జీవనాధారమే పోగొట్టుకోవడం, కుటుంబంలో సుఖశాంతులు కరువవటం వంటి దుష్పరిణామాలకు దారితీసి, సమాజం నైతికంగాను, విజ్ఞానికంగాను, వెనుకబడి వివక్షణా జ్ఞానం కోల్పోతుంది.

## కల్తీసారాలు - మరణాలు

మనదేశంలో మద్యనిషేధం ఉన్న ప్రాంతాలలో మద్యం సేవించటానికి లైసెన్సులు మంజూరు చేశారు. ఈ సదుపాయం ఖర్చుతో కూడుకున్నది గనుక, చాలామంది వేర్వేరు రకాలయిన కలుషిత మద్యాన్ని సేవించి ఆరోగ్యాన్ని పాడుచేసుకుంటున్నారు. ఈ నిషేధాన్ని గట్టిగా అమలు పరచకపోవటంవల్ల అనేకమంది అమాయకులు కల్తీ సారాలు తాగి మరణిస్తున్నారు. అక్రమ సంపాదనకు అలవాటుపడిన కొన్ని స్వార్థపర శక్తులు కల్తీ సారాలను తయారు చేస్తున్నాయి, మత్తు కలిగించటానికి విషపూరితమైన మందులుకూడా కలపటంవల్ల అట్టి సారా తాగి కొందరు మరణిస్తున్నారు.

## మద్యపాన నిషేధం - మొదట్లో కొన్ని ప్రయత్నాలు

19 వ శతాబ్దం ఉత్తరార్థం నుంచి మద్యపానాన్ని నిషేధించటానికి ప్రయత్నాలు సాగినప్పటికీ, జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో 1920 లో గాంధీ మహాత్ముని ప్రభావం అధికమైన నాటినుంచి తీవ్రతరం అయిందని చెప్పవచ్చు. 1921 లో భారత జాతీయ కాంగ్రెస్ ఒక తీర్మానాన్ని ఆమోదిస్తూ "కాంగ్రెస్‌కు ఆమోదయోగ్యమైన ఏ రాజ్యాంగంలోనైనా, స్వరాజ్యం వచ్చిన తరువాత ఏర్పడే ప్రభుత్వం మత్తెక్కించే పానీయాలను, ఔషధాలను, వైద్యం నిమిత్తం తప్ప ఇతరత్రా ఏవిధంగానూ ఉపయోగించకుండా పూర్తిగా నిషేధించాలని" ప్రకటించింది. 1930 లో జరిగిన సహాయ నిరాకరణోద్యమంలోను, ఆ తరవాత సాంఘిక సంస్కరణ కార్యక్రమంలోనూ, ఒక భాగంగా మద్యపాన నిషేధాన్ని కాంగ్రెస్ చేపట్టింది. దేశమంతటా సారాయి దుకాణాల ముందు పికెటింగ్ జరిపారు. 1937 లో రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రి వర్గాలు ఏర్పడినప్పుడు మద్యపాన నిషేధంపై ప్రథమ ప్రయోగం ప్రారంభమైంది. 1937–39 మధ్య కాలంలో మద్రాస్, ఒరిస్సా, మధ్యపరగణాలు, బీహార్‌లలో సమగ్రమైన శాసనాను ఆమోదించారు. అయితే 1939 లో ఆ మంత్రి వర్గాలు రాజీనామా చేయడంవల్ల, ద్వితీయ ప్రపంచ సంగ్రామం ఆరంభం కావడంవల్ల ఈ ఉద్యమం వెనుకపడింది.

## మహాత్మా గాంధీ - మద్యపాన నిషేధం

ప్రజా ప్రభుత్వాలు తిరిగి 1946 లో అధికారంలోకి వచ్చాయి. ఆనాటి నుంచి మద్యపాన నిషేధ కార్యక్రమంపై మళ్ళీ దృష్టిని కేంద్రీకరించడం జరిగింది. 1947 లో స్వాతంత్ర్యం ప్రకటించడంతో ఈ ఉద్యమానికి బలం చేకూరింది. మద్యపాన నిషేధాన్ని గురించి మహాత్మాగాంధీ ఇట్లా అన్నాడు. "మద్యపాన నిషేధాన్ని పూర్తిగా అమలుపరచాలంటే ప్రపంచమంతటిలో, సునాయాసంగా

అనుసరించదగిన అనుకూల దేశం భారతదేశం. అందుకు కారణం, భారతీయులలో సాధారణంగా తాగుడంటే గౌరవభావం కాని, మోజు కాని లేకపోవడమే కాకుండా, తాగే అలవాటు కూడా కొన్ని వర్గాల వారికే పరిమితమై ఉండటం''.

స్వాతంత్ర్య పోరాటంలో మద్యపాన నిషేధోద్యమం ఒక భాగమై, సామాజిక సంస్కరణగా ఆమోదం పొందినప్పటికీ, స్వాతంత్ర్యం వచ్చిన తరవాత జాతీయ ప్రభుత్వాలు పాలనాధికారాన్ని చేపట్టినా, మహాత్ముని మరణంతో ఈ సంస్కరణను మర్చిపోయాయి. నిషేధ విధానం రాష్ట్రాలన్నింటిలోనూ ఒకే విధంగా లేకపోవటంవల్ల, ప్రభుత్వ విధాన నిర్మాతలలోనే ఈ సంస్కరణపట్ల ఏకాభిప్రాయం లేదని రుజువైంది.

మద్యపానంవల్ల ప్రభుత్వానికి ఎక్సైజ్ సుంకం రూపంలో ఆదాయం వస్తుంది. అసలే ఆర్థికంగా అభివృద్ధి చెందని మన దేశంలో మద్యపానాన్ని నిషేధించటం సమయోచితమూ, సమంజసమూ కాదనే వాదన తల ఎత్తింది. గాంధీజీ జీవించి ఉన్ననాటికి ఈ వాదన అక్కడక్కడ వినిపిస్తూ ఉన్నందువల్ల ఆయన "నా మాట నమ్మండి, నిషేధ ఉద్యమాన్ని అమలు పరచడంలో ప్రభుత్వ ఆదాయం తగ్గినా, అది అంత ప్రధానం కాదు. అన్నిటికంటే ఈ దురభ్యాసాన్ని తొలగించటం ముఖ్యం. దీనిని భారతదేశం భరించజాలదు'' అని ప్రబోధించాడు.

## మద్యపానం - నిర్దేశిక సూత్రాలు

1950 లో నూతన రాజ్యాంగం అమలులోకి వచ్చింది. అందులోని నిర్దేశిక సూత్రాల్లో 47 వ నిబంధన ఈ విధంగా పేర్కొంటున్నది. "ప్రభుత్వం పోషకాహార స్థాయిని, ప్రజల జీవన ప్రమాణాన్ని, వారి ఆరోగ్యాన్ని వృద్ధి చేయడం తన ప్రాథమిక విధులుగా గుర్తించడంతో బాటు, ఆరోగ్యానికి హాని కలిగించే మత్తు మందులను, పానీయాలను వైద్య వినియోగానికి మినహా, ఇతరత్రా వాడకాన్ని నిషేధించడానికి కృషి చేయాలి''. దీనినిబట్టి భారత రాజ్యాంగ లక్ష్యాలలో మద్యపాన నిషేధం ఒకటని అర్థం చేసుకోవచ్చు.

## మద్యపానం - విచారణ సంఘం

నిర్దేశిక సూత్రాలకు అనుగుణంగా 1954 లో ప్రభుత్వం మద్యపాన నిషేధ విచారణ సంఘాన్ని నియమించింది. వివిధ రాష్ట్రాలు, నిషేధ విధానాలను అవలంబిస్తున్న తీరు తెన్నులను పరిశీలించి, వాటి సక్రమ నిర్వహణకు యంత్రాంగాన్ని, కార్యక్రమాన్ని అవసరమైన ఇతర చర్యలను సూచించాలని విచారణ సంఘాన్ని కోరడం జరిగింది.

ఈ సంఘం తన నివేదికను 1955లో సమర్పించింది. నిషేధాన్ని పటిష్టంగా అమలుపరచడానికి దిగువ సూచనలను చేసింది :-

1. దేశమంతటా 1958 ఏప్రిల్ నాటికి మద్యపాన నిషేధం ఒక శాసన నిబంధనగా రూపొంది ఉండాలి.

2. 1955 ఆఖరుకు రాష్ట్రప్రభుత్వాలన్నీ ఈ విధానాన్ని ఆమోదిస్తూ ఒక గడువు పెట్టుకోవడం, కార్యక్రమం ఫలప్రదం కావడానికి ప్రజలను సిద్ధపరచాలి.
3. మద్యపానాన్ని ఇంతవరకు నిషేధించని రాష్ట్రాలలో ఇకమీదట హోటళ్ళు, బార్లు, రెస్టారెంట్లు, క్లబ్బులు, విందులలో ఇతర సాంఘిక మతసంబంధమైన ఉత్సవ సందర్భాలలో మద్యం వాడకాన్ని పూర్తిగా నిలిపివేయాలి.
4. ప్రభుత్వోద్యోగులెవ్వరూ మద్యపానం చేయరాదనే నియమాన్ని వారివారి సర్వీసు నియమాలలో చేర్చాలి.
5. గ్రామీణ, పట్టణ ప్రాంతాలలో సారాయి దుకాణాలను తగ్గించడం, క్రమంగా వారంలో ఎక్కువ రోజులు దుకాణాలను మూయించడం, దుకాణాలకు సరఫరాలో కోత, సారాలో మత్తుశాతం తగ్గించడం, పారిశ్రామిక, ఇతర అభివృద్ధిప్రాజెక్టులు ఉన్న పరిసరాలలో దుకాణాలను మూయించడం, విదేశాలనుంచి దిగుమతులు తగ్గించడం, నివాస గృహాలకు దూరంగా దుకాణాలను తరలించడం మొదలైన చర్యలు తీసుకోవాలి.
6. ఇతర మత్తుమందుల వాడకాన్ని వీలైనంత కనీసస్థాయికి (వైద్య అవసరాలకు తప్ప) తగ్గించాలి.
7. విదేశీ రాయబార కార్యాలయాలు తాము ఏర్పాటుచేసే విందులకు భారతీయులను ఆహ్వానించినట్లయితే, జాతీయ విధానానికి అనుగుణంగా మద్యాన్ని సేవించరాదు.
8. మద్యం పర్మిట్లు ఇవ్వకూడదు.
9. విద్యావ్యాప్తి ద్వారా, చట్టరీత్యా, నిషేధాన్ని అమలుజరపాలి.
10. రాష్ట్రస్థాయినుంచి గ్రామస్థాయివరకు నిషేధ సంఘాలు ఉండాలి. రాష్ట్రస్థాయిలో అట్టి యంత్రాంగాన్ని నిర్వహించడానికి ఒక అధికారిని నియమించాలి.
11. పోలీసులకు మరికొన్ని అధికారాలుఇచ్చి, చట్టాన్ని పటిష్ఠం చేయాలి.

విచారణ సంఘ నివేదికలో ముగింపు ఇట్లా ఉన్నది–"మద్యపాననిషేధం జాతీయవిధానమనీ, 1958 ఏప్రిల్ నుంచి మత్తుపానీయాలు, ఔషధాలు పూర్తిగా నిలిపివేయడం జరిగిందని, రాష్ట్రాలు శాసనసభల ద్వారా, ఈ విధానం ఆమోదించటంతో, ఇది జాతీయ చట్టం అవుతుందనీ, కేంద్ర ప్రభుత్వం స్పష్టమైన ఒక ప్రకటనను చేయాలి. దేశంలో ప్రణాళికాభివృద్ధికి మద్యపాన నిషేధం చేదోడువాదోడుగా ఉంటుంది. సంక్షేమ రాజ్యంగా విలసిల్లవలసిన మనదేశంలో అట్టడుగున అణగారిపోతున్న ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచే సాంఘిక సంక్షేమ పథకాలలో నిషేధ కార్యక్రమం చేరనట్లయితే, జాతీయాభివృద్ధి పథకంలో పెద్ద అగాధం అట్లాగే ఉండిపోతుంది. కాబట్టి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నిషేధం కూడా అంతర్భాగం కావాలని ఈ సంఘం కోరుతున్నది."

## కొనుగోలు శక్తి - మద్యపానం

దేశంలో ఆర్థిక పరిస్థితులు మెరుగవుతూ వ్యక్తి కొనుగోలుశక్తి పెరుగుతున్నకొద్దీ, సినిమాలు, క్లబ్బులు, బార్లు (గానా - బజానాలు) మొదలైన విలాసాలపై మోజు ఎక్కువ అవుతున్నది. తాగుడంటే ఒకప్పుడు అసహ్యించుకునేవారు. ఈనాడు ఆ భావంపోయి యౌవనంలోకి అడుగుపెడుతున్న వారికి, ముఖ్యంగా యువకులకు, తదితరులకు ఇది ఫ్యాషన్‌గా తయారైంది. అనువుగా ఉండే అలవాటు వ్యామోహంగా తయారైంది. ఈ వ్యామోహం కొనసాగితే మద్యానికి బానిసలవటమే.

## మద్యపానం - ఆచరణలో వైఫల్యం

ప్రభుత్వ యంత్రాంగం పటుత్వంగా లేకపోవటం, ఉద్యోగస్థులలో నిజాయితీ లోపించడం మొదలైనవి అందుకు కారణాలు. సమర్థవంతమైన యంత్రాంగం లేకపోవడంతో తప్పతాగి, వీధులలో పొర్లాడేవారున్నారు. దేశంలో ఆర్థిక అస్థిరత తాండవిస్తుంటే ఎక్సైజ్ సుంకం ద్వారా వచ్చే ప్రభుత్వ ఆదాయాన్ని పోగొట్టుకోవడం అవివేకం అనేవారున్నారు. కల్లు గీయడం కూడా నిషేధపుటుత్తర్వులకు లోబడి ఉంటుంది. కనుక గీత పనివారు అభ్యంతరం తెలిపారు. కారణం ఏదైనా మద్యపాన నిషేధం విఫలమైందని చెప్పక తప్పదు.

ఏ సమస్యనైనా శాసనబద్ధంగా పరిష్కరించటానికి పూనుకున్నప్పుడు అందుకు అవసరమూ, సుశిక్షితమూ, సమర్థవంతమూ అయిన యంత్రాంగాన్ని ముందుగా సిద్ధం చేసుకొని ప్రయత్నించడం మంచిది. అమెరికాలో కూడా మద్యపానాన్ని నిషేధించి, జయప్రదంగా అమలుచేయలేక చివరకు దానిని రద్దు చేశారు. అక్కడ కూడా కొన్ని అవాంఛనీయ పరిణామాలు ఎదురైనాయి.

## మద్యపాన నిషేధం - కొన్ని సూచనలు

మద్య పానీయాల వినియోగాన్ని ప్రోత్సహించే ప్రకటనలను అంతమొందించాలి. బహిరంగ ప్రదేశాలలో, ప్రభుత్వ విందులలో పానీయాలు మాన్పించాలి. మద్యపదార్థం అతి సూక్ష్మంగావుండి, ఆరోగ్యాన్ని ఇచ్చే చల్లని పానీయాల తయారీని ప్రోత్సహించాలి. జాతీయ విస్తరణ, సమాజాభివృద్ధి పథకాలు అమలులో ఉన్న ప్రాంతాలలో గ్రామ సంక్షేమ విస్తరణ ప్రాజెక్టుల నిర్మాణాత్మక కృషిలోను మద్యపాన నిషేధాన్ని ప్రధాన అంశంగా ఉంచాలి.

దేశంలోని మద్యపాన నిషేధ శాసనం విఫలమైన కారణాలను, అనుభవాలను ఆధారంగా తీసుకొని, ప్రత్యామ్నాయ మార్గాలను వెదకాలి. సామాజిక వాతావరణంలో ఆరోగ్యకరమైన మార్పుకు ప్రజలను విద్యావంతులుగా చేయాలి. మద్యపానంవల్ల కలిగే దుష్పరిణామాలను గురించి ప్రాథమిక విద్యా స్థాయి నుంచి బోధపరచాలి. మద్యపానంలో ఉన్న దుష్ఫలితాలు, ఇతర సామాజిక సమస్యలు, వాటి బాగోగులను గురించి సామాజిక వాతావరణం ఆరోగ్యవంతంగా ఉండకపోతే భావి

జీవితంలో ఏర్పడే దుర్భరత గురించి దేశ పురోభివృద్ధికి పౌరులు స్వచ్ఛమైన జీవితాన్ని గడపవలసిన ఆవశ్యకతా మొదలయినవి పాఠ్యప్రణాళికలో చేర్పించాలి. వ్యసనాలు హద్దుమీరినప్పుడు మానవుడు ఎంత నీచమైన జీవితాన్ని అనుభవిస్తాడో చిత్రీకరించి, దురభ్యాసాలపై జుగుప్స కలిగించాలి. విద్యార్థుల మనస్సుపై ఆరోగ్యకరమైన ప్రభావం కలిగించేటట్లు జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించి విజ్ఞానాన్ని అందించాలి.

## మద్యపానం చికిత్స, సంఘ సంక్షేమ కృషి

మద్యం త్రాగకుండ నిరోధించటం, ఆమ్లహరాలైన ఔషధాలను కడుపులోనికి వాడటం, బలమైన ఉపశమన ఔషధాలు, విటమిన్లు వాడటం మొదలగు చికిత్సవల్ల ''మదిరావ్యసనం''ను తొలగించవచ్చు. త్రాగుడు అలవాటు చేసుకోవటానికి ప్రోత్సహించిన మూలకారణం తొలగిపోవటానికి సైకోఎనాలిసిస్ సంప్రదాయానుసారం చికిత్సచేయాలి. మద్యపానంవంటి సామాజిక సమస్యలు కేవలం చట్టాలను రూపొందించటం ద్వారా పరిష్కారం కావు. దీర్ఘకాలిక వ్యసనపరులను కుటుంబం నుంచి వేరుచేసి మానసిక చికిత్స కేంద్రాలలో ఉంచి మానసిక చికిత్సా నిపుణుల ద్వారా చికిత్స చేయించాలి. ఈ సమస్యా పరిష్కారంలో సంఘ సంక్షేమ కార్యకర్త, సమస్యకు గురైన వ్యక్తితో, అతని కుటుంబ సభ్యులతోటి, అతడు నివసిస్తున్న సముదాయంతోటి పని చేయాలి. వ్యక్తి సేవా పద్ధతి ద్వారా వ్యసనానికి గురైన వ్యక్తిని, అతని సమస్యను కూలంకషంగా అవగాహన చేసుకొని, పరిష్కారానికి సహాయపడాలి. అతని కుటుంబ సభ్యులతో కలిసి పనిచేస్తూ, కుటుంబ సంబంధమైన కారణాలను, సమస్యలను పరిష్కరించవచ్చు.

## ముగింపు

ఈ వ్యసనానికి అలవాటుపడ్డవారికి సామాన్యంగా వైయక్తిక లోపాలు ఉండటం సహజం. మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా తమతమ జీవితాలను తీర్చిదిద్దుకోలేకపోవడంవలన, సరియైన విరామ సమయ కార్యక్రమాలు లభించకపోవటంవల్ల ఎక్కువగా వ్యక్తులు మద్యపానానికి గురి అవుతున్నారు. కాబట్టి సంక్షేమ కార్యకర్త ఈ వ్యసనానికి గురిఅయిన వ్యక్తులను పూర్తిగా అవగాహనచేసుకొని, వారికి తిరిగి సరియైన జీవితాన్ని అందించటానికి వ్యక్తి సేవాపద్ధతిని సమూహ సేవాపద్ధతిని ఉపయోగించాలి. అంతేగాక సృజనాత్మక కార్యక్రమాలను రూపొందించి వాటిలో వీరిని పాల్గొనేటట్లు చేయాలి. అవసరమైనప్పుడు మానసిక వైద్యుల సలహాలను తీసుకుంటూ వీరికి సరియైన చికిత్సా విధానాన్ని రూపొందించాలి. వీటితోపాటు సముదాయ విద్యా కార్యక్రమాల ద్వారా ప్రజలకు ఈ సమస్యవల్ల కలిగే దుష్ఫలితాలను వివరంగా తెలియచేస్తూ ఈ సమస్యను రూపుమాపేందుకు సంక్షేమ కార్యకర్త కృషిచేయాలి.

# వ్యభిచారం
(Prostitution)

సంఘ జాడ్యాలలో వ్యభిచారం చాలా పురాతనమైనది. ప్రపంచంలోని ఏ సమాజమూ దీని నిర్మూలన విషయంలో సంపూర్ణ విజయం సాధించలేదు. భారతదేశంలో వేశ్యావృత్తికి పూర్వులు సమాజంలో ప్రత్యేక స్థానమిచ్చారు. క్రమేణా సంఘసేవాతత్పరుల ప్రచారంవల్లనేమి, శాసనాలద్వారానేమి వంశానుగతంగా స్త్రీలు, కన్యలు పడుపువృత్తి నవలంబించే పద్ధతులు అట్టి వృత్తికి దోహదమిచ్చే భోగంమేళం మొదలైనవాటిని నిషేధించడమైంది. జపాన్, ఫ్రాన్సు వంటి దేశాలు సంఘంలో పడుపువృత్తి అనివార్యమైన వ్యవస్థగా గుర్తించి, దాని నవలంబించే వ్యక్తులను ప్రజారోగ్య సంక్షేమం దృష్ట్యా కొన్ని కట్టుబాట్లకు లోబడేటట్లు చేశాయి. కాని ప్రపంచమంతటా ఈ అవినీతి ప్రవర్తన ముఖ్య సమస్యగానే ఈనాటికీ వ్యాపించిఉన్నది. ఈ జాడ్యాన్ని నిర్మూలించటం అన్ని దేశాల ప్రభుత్వాలు పదేపదే సమాలోచనలు జరిపి తగుచర్యలు తీసుకొంటున్నాయి.

## వ్యభిచారం - నిర్వచనం

సమాజం అంగీకరించిన వివాహ పద్ధతులను ధిక్కరించి కామతృప్తిని ఇవ్వటానికి కేవలం డబ్బుసంపాదించే ఉద్దేశ్యంతో స్త్రీ; అనేకమంది పురుషులతో లైంగిక సంబంధాన్ని కలిగిఉండటం 'వ్యభిచారం' అని చెప్పవచ్చు.

ప్రాచీనకాలంలో సంతానోత్పత్తికై చేసే ఆచారకర్మలలో వ్యభిచారం ప్రారంభమైనట్లు కనిపిస్తున్నది. ప్రాచీన బాబిలోనియాలోని 'పవిత్ర వ్యభిచారం' అనే ఆచారాన్ని అనుసరించి స్త్రీలు వివాహాత్పూర్వం విదేశీయులకు తమ్ముతాము కామవ్యాపారం కోసం అర్పించుకొంటూ ఉండేవారు. వివాహానికి పూర్వం వివాహమైన తరవాత తాము వివాహమాడిన స్త్రీలుగాక ఇతరులతో లైంగిక సంబంధాన్ని వాంఛించే పురుషులు ఉండటంచేత, కామతృప్తిని వ్యాపార వస్తువుగా అమ్మే స్త్రీలు ఉండటంవల్ల, ప్రపంచంలో పలుప్రాంతాలలో వ్యభిచారం వాడుకలోకి వచ్చింది.

## వ్యభిచారం- వివిధ నిర్వచనాలు :

1. "ఒక స్త్రీ తన శరీరాన్ని విలాసంకోసంకాని, డబ్బుకోసంకాని, వస్తువులకోసంకాని లైంగిక ప్రక్రియలకు అంకితమవ్వటం వ్యభిచారం". 1956 అఖిలభారత వ్యభిచార నిరోధక చట్టం.

2. "వృత్తిపరంగా, లైంగిక ప్రక్రియలలో, విలాసం - డబ్బు - పోషణ - వస్తువులకోసం, స్త్రీ తనకుతాను అమ్ముకోవటం. బహుమతులు సుఖం మాత్రమేకాక డబ్బు పుచ్చుకోవటం, మానసిక తృప్తి, ఉద్రేకాలతో నిమిత్తం లేకుండా డబ్బు చెల్లింపుపై జరిగే ప్రక్రియ" - సమాజ శాస్త్రీల సర్వస్వం.

3. "ఒకవ్యక్తి ఆడ లేదా మగ, వ్యక్తిగత సంతృప్తికోసం, కొన్నివేళల్లో లేదా అన్నివేళల్లో, అసాధారణ లైంగిక ప్రక్రియల్లో వృత్తిపరంగా నిమగ్నమై ఉండటం, కొంతమంది వ్యక్తులతో లేదా ఎంతమందితోనైనా లైంగిక ప్రక్రియల్లో సంతృప్తిపరచటం, సమలింగ పరలింగ భేదాలు లేకుండా అనుసరించే వృత్తి" - క్లైరీస్నార్ట్, సమాజ శాస్త్రవేత్త.

4. "ఒక వ్యక్తి స్త్రీ లేదా పురుషుడు, ఏదో ఒక బహుమతి (డబ్బు లేక వస్తువులు) ద్వారాకాని వ్యక్తిగత సంతృప్తికోసం అన్నివేళలా, సాధారణమైన లేదా అసాధారణమైన లైంగిక సంబంధాలు వివిధ వ్యక్తులతో, సమలింగ లేదా పరలింగ పరంగాగాని నిర్వహించే ప్రక్రియను వ్యభిచారమని, అట్టివ్యక్తి వ్యభిచారి అని చెప్పవచ్చు" -వాత్స్యాయనుడు.

నిర్వచనానికి సంబంధించి, ఇతర ప్రక్రియలలోవలె కాకుండా "వ్యభిచారం" పరిధిలోకి ఆడ, మగ వస్తారు. ఎవరు ఎన్ని నిర్వచనాలు చెప్పినా, "ఆడ-మగా మధ్యవుండే, విభేదాలు లేని లైంగిక వ్యాపార సంబంధాలు, డబ్బుకోసం లేదా మరేదైనా వస్తువుల కోసం, అతడు లేదా ఆమె, భార్యాభర్తల సంబంధం లేకపోయినా, శారీరక సంబంధాలు కలిగివుండటం ద్వారా "వ్యభిచారం" పదానికి జీవం పోస్తారు" అని చెప్పవచ్చు.

## వ్యభిచారం - గత చరిత్ర

గత చరిత్ర పుటలు తిరగవేస్తే, దయనీయమైన కథలు, గాథలు వ్యభిచారుల గురించి ఎన్నో మన హృదయాలను కదిలిస్తాయి. ఉన్నత శిఖరాల నుంచి లోయల అట్టడుగు ప్రాంతానికి విసిరి వేయబడినట్లున్న వారి సామాజిక అంతస్తును మనల్ని కదిలించక మానదు.

క్రీస్తుకు పూర్వం రోమ్ మహానగరంలో బానిస స్త్రీల సంఖ్య పెరుగుతున్నకొద్దీ వ్యభిచారం పెరిగింది. వ్యభిచారులంతా చట్టరీత్యా పేరు నమోదు చేసుకోవలసి ఉండేది. అట్టి వారికి ప్రత్యేక వస్త్ర, దుస్తులు ఉండేవి. వారిని తక్కువరకం మనుషులుగా చూసేవారు. చట్టరీత్యా నమోదు అయిన వ్యభిచారులకు అనేక ఇబ్బందులు ఎదురవటంతో నమోదు చేసుకోకుండా వ్యభిచారంచేసే స్త్రీలసంఖ్య పెరిగింది. మధ్య దళారీల సంఖ్య పెరిగి వ్యభిచారుల ఆదాయంపై ఆధారపడే దుస్థితి ఏర్పడింది. క్రీస్తు తరవాత కూడా రోమ్‌లో వ్యభిచారవృత్తిలో పెద్దమార్పు లేదు. ఆనాటి ప్రభువులు వ్యభిచారంమీద పన్ను విపరీతంగా వసూలుచేసేవారు. క్రైస్తవ మత ప్రవక్తలు వ్యభిచారాన్ని ఖండించినప్పటికీ, ఒక ప్రత్యేక వీధికి మాత్రమే వ్యభిచారాన్ని పరిమితం చేయమని సూచనలు చేశారు, 5 వ శతాబ్దం వరకు వ్యభిచారులపై పన్ను వసూలుచేయడం ఉండేది. 1161 లో రెండో హెన్రీ లండన్ వద్దగల వ్యభిచార

గృహాలన్నింటిని చట్టం పరిధిలోకి తీసుకువచ్చాడు. జర్మనీ నగరంలో వ్యభిచార గృహాలను ప్రజాసేవగా (Public Service) వినియోగించేవారు. ముఖ్యమైన అతిథులు వచ్చినప్పుడు ఇట్టి గృహాలలో ఆతిథ్యాన్ని ఏర్పాటు చేసేవారు. 13 వ శతాబ్దంలో ఆగ్స్‌బర్గ్, వియన్నా, హాంబర్గ్‌లలో వ్యభిచార గృహాలు పురపాలక సంఘాల రక్షణలో ఉండేవి.

సిఫిలిస్ అనే భయంకరమైన సుఖవ్యాధి సోకడంవల్ల యూరప్ దేశాల్లోని మూడోవంతు జనాభా చనిపోయారు. 15 వ శతాబ్దం అంతంలో ప్రారంభమైన ఈ వ్యాధి 16 వ శతాబ్దం అంతానికి తారాస్థాయినందుకుంది. దానితో వ్యభిచారాన్ని నిర్మూలించే నిమిత్తం లండన్ (1546), పారిస్ (1560), నూరెంబర్గ్ (1562) నగరాలలో చట్టాలు ప్రవేశపెట్టారు. 1635 పారిస్ ఆర్డినెన్సు, 1650 ఇంగ్లండ్‌లోని కామన్ వెల్తు చట్టం దౌర్జన్యాత్మకమైనవి.

మొదటిసారిగా 1684 లో పారిస్ "వ్యాధిగ్రస్తులైన వ్యభిచారుల"ను రక్షించాలని భావించింది. 1700 లో బెర్లిన్‌లో వ్యభిచారులను పరీక్షించటానికి వైద్య పరీక్ష చేయటం జరిగింది. 1765లో పారిస్ మొదటిసారిగా వ్యభిచారులను రిజిస్టర్ చేసి ఎప్పటికప్పుడు వైద్య పరీక్షలు జరిపించాలని సూచించింది. అది 1798లో అమల్లోకి వచ్చింది. 1810 వరకు విజయవంతంగా కృషి జరగకపోయినప్పటికీ 18 వ శతాబ్దం రెండో దశాబ్దంలో పారిస్ పోలీసుశాఖ ప్రత్యేక శ్రద్ధ తీసుకొని వ్యభిచారాన్ని కొన్ని నిర్ణీతమైన గృహాలకు మాత్రమే పరిమితమై ఉండేటట్లు కట్టుదిట్టాలు చేశారు.

అప్పటినుంచి అధికారిక పూర్వకమైన, పటిష్టమైన నియమావళిని బెల్జియం, హంగేరీ, రష్యా, ఇటలీ, స్పెయిన్, పోర్చుగల్ దేశాల్లో అనేక నగరాలలోనూ ఇంచుమించు జర్మనీ దేశం మొత్తంలోనూ ప్రవేశపెట్టడం జరిగింది. బ్రిటన్ దేశం 1864 లో "అంటువ్యాధుల నివారణా చట్టాన్ని" ప్రవేశపెట్టి వారి సైనికులను పరిరక్షణ నిమిత్తం వైద్య సలహా సంప్రదింపులు జరిపినప్పటికి 1869 లో సర్వ జనరక్షణ నిమిత్తం అట్టి చర్యలయొక్క ఆవశ్యకతను గుర్తించి ప్రత్యేక శ్రద్ధ తీసుకుంది.

## భారతదేశంలో బ్రిటిష్‌వారి కాలం

బ్రిటిష్‌వారు తమ పరిపాలనా కాలంలో భారతదేశానికి కొంతమంది స్త్రీలను పనువృత్తికై తీసుకువచ్చారు. విదేశీయులైన అనేక బ్రిటిష్ ఉద్యోగస్థులు, ఈస్టు ఇండియా కంపెనీలో పనిచేసిన బ్రిటిష్‌వారు, బ్రిటిష్ సైన్యం మొదలైనవారి అవసరాలు తీర్చడానికి వ్యభిచారాన్ని ఒక క్రమ పద్ధతిలో నిర్వహించారు. ఈ కాలంలోనే ఉంపుడుగత్తెల (Brothels) గృహాలు ప్రారంభమైనవి. దేశంలో చాలాచోట్ల వ్యభిచార గృహాలు చోటుచేసుకున్నాయి. ఆ విధంగా అంతర్జాతీయ స్థాయిలో ఇది ఒక దురాచారంగా రూపుదిద్దుకుంది.

## వ్యభిచారం - వివిధ రకాలు

1. సంప్రదాయ సిద్ధమైన వ్యభిచారం - రకాలు
   - i) బసవి
   - ii) దేవదాసి

iii) బసివి

iv) మాతంగి

v) వేశ్య

2. ఆధునిక వ్యభిచారం – రకాలు

i) సాధారణ వేశ్యలు

ii) ఉంపుడుగత్తెలు

iii) విలాసం కోసం వ్యభిచారం

iv) కవాలీలు, కేబరా నృత్యాలు చేసేవారు

v) అప్పుడప్పుడు వ్యభిచారం చేసేవారు

vi) బార్‌లో పనిచేసేవారు

vii) పిలుపుకు వచ్చే అమ్మాయిలు

## సంప్రదాయ సిద్ధమైన వ్యభిచారం

1. గెషా — జపాన్ దేశంలో "గెషా"లు ఉంటారు. ఈ స్త్రీలు ఇతరులను వినోద పరచటానికి వినియోగించబడతారు. గెషా యువతి నృత్య సంగీతాలలోను, చతురతో ఆ క్షణంలోనే ప్రత్యుత్తరం ఇవ్వటంలోను ప్రవీణురాలు. మిక్కిలి పిన్న వయస్సు నుంచి వీరికి చక్కని శిక్షణ ఇవ్వటం జరుగుతుంది. సాధారణంగా శిక్షణా కాలం పూర్తి అయిన పిదప వీరు కొన్ని సంవత్సరాలు ఒక వ్యక్తితో గడుపుతామని ఒప్పందం చేసుకుంటారు. కొంతమంది గెషాలు వేశ్యలుగా కూడా ఉంటారు. వివిధ పట్టణాలలోను, గృహాలలోను వీరి అంతస్తు వేరువేరుగా ఉంటుంది. సాధారణంగా భోగభాగ్యాలతో కూడిన జీవితాన్ని గడుపుతారు. వేతనాలందరికి సమానమైనా, గెషా యొక్క మొత్తం సంపాదన ఆమె సౌందర్యం, ప్రావీణ్యాలపై ఆధారపడి ఉంటుంది. గెషాల అంచెచందాలు, నేడు మిక్కిలి కఠినమైన నియమావళి ననుసరించి పరీక్షించబడుతుంది. గెషాలు వివాహం చేసుకోవచ్చు.

2. దేవదాసి — దేవాలయానికి చెందిన వేశ్యను 'దేవదాసి' అంటారు. దేవుని సేవలు చేసే (కొంటనట్టి) స్త్రీ దేవదాసి అని అర్థం. సమాజంలో ఆలయ వ్యవస్థతో పాటు దేవదాసీ వ్యవస్థ ఏర్పడింది. దేవదాసీలను ఏడు విధాలుగా చూడవచ్చు. (1) దత్త (తనకుతానుగా దేవునికి అర్పణ చేసుకున్నది. (2) విక్రీత (దేవాలయానికి తనకుతానుగా అమ్ముడు పోయినది.) (3) భక్త (భక్త్యావేశాలతో దేవుని సేవలకై వచ్చినది.) (4) హ్రీత (ఇతరులచే దేవాలయానికి కానుకగా అర్పించబడినది) (5) అలంకార (వేశ్యాధర్మంలో ఆరితేరినదై సంపన్నుల పోషణతో ఆలయవిధులకు నియమించబడినది.) (6) రుద్రగణిక (గోపిక): తనకుతానుగా దేవుని సేవలకై వచ్చినది. (7) భృత్య: ఆలయవిధుల నిర్వాహణకు

సంబళికగా దేవాలయ నిధులనుంచి జీతభత్యాలతో నియమిత అయినది – అనే ఏడువిధాలుగా కన్యలు దేవదాసీలుగా పరిగణించబడి, ఈ వ్యవస్థ పుట్టింది. 9, 10 శతాబ్దాలలో ఆలయ వ్యవస్థ రూపొందింది, హైందవ సంస్కృతికి నిలయంగా ఆలయం విలసిల్లి, లలితకళలకు ఉనికి పట్టుగా దేవళం వెలుగొందిన కాలంలో ప్రాచీనం, శాస్త్రీయం, సంస్కృతీవికాసం పూరించదగినది అయిన ఆలయ నృత్యకళను ఆరాధించి, సాధించి ఆచరణలో పెట్టటం దేవదాసీల ముఖ్యవిధి.

ప్రతినిత్యం వేకువజామునే లేచి దేవునిసముఖంలో మేలుకొలుపులు పాడటం మొదలుకొని, బాలభోగ, రాజభోగ, విశేషభోగ వేళలలో నృత్యగానాలతో దేవుని కీర్తించి రాత్రి పుష్పాంజలి సమయంలో లాలిపాటలుపాడటం దేవదాసీల నిత్యవిధి. ఇవికాక వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, బ్రహ్మోత్సవ, విశేషోత్సవ దినాలలో, పర్వదినాలలో (1) ఛత్రం పట్టటం (2) చామర వీచటం (3) ఆలవట్టం, పరివట్టం వీవనలు విసరటం (4) కుంభారతి, బృందారతి, పట్టటం (5) వెల్లగొడుగు వేసిన వల్లభం కింద దేవుడు ఊరేగే సమయంలో దేవుని పల్లకీ లేదా వాహనం లేదా రథంముందు బారులుగా స్వరమేళం, ఆటమేళం, పాటమేళం కట్టి దేవుని కీర్తించటం (6) ఆలయంలో దేవుని సముఖంలో ఉభయసంధ్యలూ నృత్యంచేయటం; (7) పూజా సమయంలో కవుతాలాడటం, (అపూర్వ తాళాలతో చేసిన ప్రత్యేక రచనలు అభినయించటం.) (8) స్వామి కొలువుతీరిఉన్న సమయంలో 'కేళికలు' (కవుతాలలో నృత్యాభినయనాలతో కూడిన వినోద ప్రహసన) ఆడటం దేవదాసీల ముఖ్యవిధులు.

ఆంధ్ర భృత్య, చోళ, కాకతీయ, వరంగల్లు రాజవంశస్థులు వారివారి కులాచారం ప్రకారం వారివారి మతాధిదేవతలకు దేవళాలు కట్టించి, దేవోపచారాల నిమిత్తం దేవాలయానికి కన్యలను కానుకగా అర్పించేవారు. సామాన్యుల్లోకూడా, రోగగ్రస్థులు, భయగ్రస్థులు, సంతానం కోరేవారు, తమ కుటుంబాలనుంచిగాని, ఇతర కుటుంబాలనుంచిగాని, కన్యలను ఏరి, ఆలయానికి మొక్కుబడిగా అర్పణచేయటం సహజం. అవసరమైనప్పుడు ఆలయ ధర్మకర్తలు కన్యలను నియమించేవారు.

దేవాలయంలో జరిగే పాటకచ్చేరిలో పాడేపాటలు ఎక్కువగా దేవుని గుణగణాలు కీర్తించేవిగా ఉంటాయి. ముఖ్యంగా శ్రీకృష్ణుని జీవితచరిత్రలోని ఘట్టాలు అభివర్ణించేవిగాఉంటాయి. ఇవికాక జావళీలు, దరువులు, పదాలు, పదవర్ణాలు వంటివి శ్రోతల అభిరుచినిబట్టి జనాళికోరికపైన పాడతారు. ఆ సమయంలో సంతుష్టులైన శ్రోతలనుంచి పట్టుచీరలు, భమిడినగలు, వెండివస్తువులు, విలాసవస్తువులతోపాటు రొఖ్ఖరూపంలో కాసుపీసాలు, మాడలు, మొహార్లుకూడా బహుమతులుగా పొందేవారు.

3. బసవి — శివాలయానికి కానుకగా అర్పించబడిన కన్యలనుకూడా ముద్రధారణ (లింగధారణ) జరిపించి, దేవదాసీలుగా నిర్ణయించిన పిమ్మట, వారిని బసవి స్త్రీలుగా వ్యవహరించేవారు.

బసవి స్త్రీ దేవదాసివలె ఆలయ నృత్యకళను ఆరాధించటమే కాక ఆలయమర్యాదను అలవరుచు కోవటంతోపాటు, శివభక్తులకు కామతృప్తి నివ్వటానికికూడా వీరశైవ ప్రాబల్యంగా చెందిన రోజులలో విధిగానై యున్నది.

కొడగు, కన్నడ దేశాలలోను, బళ్ళారి, కర్నూలు జిల్లాలలోను బోయ, దొమ్మరి జాతులకు చెందిన కన్యలను బసవి స్త్రీలుగా చేసే ఆచారం ఉండేది. అట్లాగే మైసూరు, ధార్వార్, బళ్ళారి పశ్చిమ ప్రాంతాలలో బోయ బేదర జాతులు స్త్రీ సంతానంలో ఒకరిని విధిగా బసవిని చేయటం నాటి ఆచారం.

బసవిగాచేసే కన్యను దేవాలయంలోని దేవుని విగ్రహంతో వివాహంజరిపించి, ముద్ర, మంగళ సూత్రం కట్టించి, ఉన్నత కులస్థులచేత "కన్నెరికం" జరిపించి వేశ్యగా చేసేవారు. బసవి కూతురు తిరిగి బసవిగా ఉండి తల్లికి, ఆ ఆస్తికి వారసురాలు అవుతుంది. కొడుకు మాత్రం తండ్రి వంశజుడుగా ఉండి, తండ్రి ఆస్తికి వారసుడైన సంతానంలోని స్త్రీ సంతానంలో ఒకరిని బసవిగా చేస్తాడు. సంతతిలేని బసవి ఆడపిల్లను దత్తత చేసుకొని ఆమెను బసవినిచేసి, ఆస్తి సంక్రమింపచేయవచ్చు. కాని మగపిల్లవానిని దత్తత చేసుకోరాదు.

ఆ కాలంనాటి బసవి దేవాలయంలో దేవదాసిగాను, సంపన్నుల గృహంలో సంస్థానాధీశుల పక్షంలో రాజ నర్తకిగాను, అతి సామాన్యుల దగ్గర సామాన్య వేశ్యగాను వ్యవహరించి, ఆ యా సందర్భాల ఆయా విధులు నెరవేర్చుతూ ఉండేది. యుద్ధంలో మృత్యులైన వారిపట్ల సానుభూతి చూపుతూ, వారి కుటుంబాలకు సంతాప దినాలలో సహాయపడుతుండేది. మృతవీరుల చిహ్నంగా "వీరకల్లు" స్థాపన సందర్భంలో నాట్యం చేసేది. యుద్ధరంగం నుంచి వచ్చిన క్షతగాత్రులకు ఈనాటి "నర్సు" వలే అనేక సేవలు చేసేది. ఈనాటి "యక్షగానం" అనబడే దేశీయ పద్ధతికి చెందిన నృత్య సంగీతపు బాణీ ఆ కాలంలో బసవి స్త్రీ ఆచరణలో పెట్టేది. శైవమత ప్రాచుర్యానికై సర్వాలంకారశోభితంగా సభను ప్రవేశించిన బసవి శివలీలా గాథలను, శివభక్తుల వీరగాథలను గానంచేస్తూ కథాసన్నివేశాల ననుసరించి మధ్యమధ్య నృత్తమో, నృత్యమో, అభినయమో ప్రదర్శిస్తూ ఉండేది.

4. మాతంగి—మాతంగి పార్వతి నామాంతరం వసిష్ఠుని భార్యకూడా మాతంగి కాని బ్రాహ్మణాది అష్టాదశ వర్ణాలలో మాతంగిజాతికి చెందిన స్త్రీకి మాతంగి పదం శిష్టజనవ్యవహారం. అంటరానితనం అధికంగా ఉన్న రోజులలో సామాన్యవేశ్యలు హరిజనులలో కొన్నికులాలకు చెందిన వారిని చేరనివ్వని కారణంగా ఆయా జాతులవారు తమ పేటలలో రామాలయాలు, కృష్ణాలయాలు స్థాపించి, తమ జాతి కన్యలకు దేవుని ప్రతిమతో వివాహం జరిపించేవారు. ఇట్టి కన్యలు సమయ సందర్భాలనుబట్టి దేవదాసీగాను, నర్తకిగాను, భోగపు స్త్రీ (వేశ్యగాను, వ్యవహరించేవారు.

5. వేశ్య — వేశ్య అంటే శృంగార స్వేచ్ఛగల స్త్రీ లేదా 'స్వతంత్ర' అని అర్థం. నాగరికత నెరిగిన మానవుడు ఏ స్త్రీ అయినా 'స్వతంత్ర' గాకుండా 'ఏకచారిణి'గా ఉండాలన్న కట్టుబాటును నియమించాడు. కాని సమాజం మాత్రం అంతటి కట్టుబాటును ఒక్క-సారిగా పాటించలేక పోయింది. "ఏ స్త్రీ అయినా ఒకరిని విడిచి మరొకరిని 5 సార్లు వివాహం చేసుకోవచ్చు లేదా ఒకేసారి 5 గురు భర్తలను కలిగి ఉండవచ్చు. ఒకవేళ ఆరవసారి వివాహం చేసుకున్న స్త్రీని వేశ్యగా భావించమనీ, ఆమెతో ఎవరు కలిసినా తప్పులేదనీ" బాభ్రవ్యుడు అన్నాడు. అయితే గోణికాపుత్రుడు మాత్రం ఈ సిద్ధాంతాన్ని ఒప్పుకోలేదు.

కాలక్రమేణా సంస్థానాలు ఏర్పడి, వాటికిచెందిన వేశ్యలు రాజనర్తకులుగాను, ఆలయ వ్యవస్థ ఏర్పడినపిమ్మట ఆలయానికి చెందిన వేశ్యలు 'దేవదాసీలు'గాను పిలువబడుతూ ఉండేవారు. ఇక సామాన్యులంతా అందుబాటులో ఉండిన వేశ్యలుమాత్రం 'ఆటపాటలతోనూ, వ్యభిచారంతోనూ, అందరికి చెందిన స్త్రీలు' అని అర్థం స్ఫురించేరీతిలో 'భోగం'వారు అని వాడుకలో నిలిచిపోయారు.

వేశ్యలలో ఆడపిల్లలకు అక్షరాభ్యాసం అయిన వెంటనే కులంలో ఉన్న పెద్దముత్తయిదువను గురువుగా ఎంచి, ఆవిడకు ఆడపిల్లను అప్పగించి నాట్యవిద్య నేర్పిస్తారు. నాట్యవిద్యతోపాటు సంగీత విద్వాంసునివద్ద సంగీతం నేర్పించడం, అమరకోశం చదివించటం, ఆదికావ్యం చెప్పించటం పంచ కావ్యాలు పఠనపచేయుటమూ, అలంకారశాస్త్రం, లక్షణగ్రంథాలు చదివించటం, కవితారీతులు, నవితారీతులు బోధించడం చేస్తారు.

ఆ కాలంలో సుశిక్షిత వేశ్యా స్త్రీలు పదువులు, పదాలు, జావళీలు, తరంగాలు, అష్టపదులు, సర్వజతులు, పదవర్ణాలు, తిల్లానలు అభినయిస్తుండేవారు. అంతేగాక నాగనృత్యం, దీప నృత్యం, హంసనృత్యం, మయూరినృత్యం, పారువానృత్యం, మోహినీనృత్యం, భామపతంగం శుభలక్షణ పల్లవివంటి విశేషనృత్యాలు కూడా ప్రదర్శించటం ఆచారంగా ఉండేది.

ఆ విధమైన ప్రదర్శన సమయంలో ఆనాటి వేశ్యా జనంతల సజ్జ, మొలసజ్జ, చెంప సరులు, కంఠసరులు అయిన ఆభరణాలు ధరించి, కాలికి పారాణి, అరచేతులకు లత్తుక పూసుకొని, 'గంధయం' (అలంకరించుకొన్న లేదా మేకప చేసుకున్న) కట్టిన తీరులోకూడా ఒక ప్రత్యేకత ఉండేది.

గజ్జెలపూజ సంబరంనాడు కన్య విద్యాబుద్ధులూ, శాస్త్రపరిజ్ఞానం, కావ్యసంప్రదాయ కుశలత, నాట్యవిద్యా నిపుణత, సంగీతజ్ఞానం, జనోపయోగకరమైన ఇంగితజ్ఞానం మొదలైనవాటిని కులపెద్దలతోపాటు పురప్రముఖులలో నిష్ణాతులైన దిగ్గజాలవంటి పండితులూ, శాస్త్రజ్ఞులూ పరీక్షించే వారు. కనుకనే ఆనాటి వేశ్యకు సమాజంలో అంతటి గౌరవమర్యాదలు ఉండేవి.

## ఆధునిక వ్యభిచారం - రకాలు

ఆధునిక సమాజంలో వ్యభిచారం వెర్రితలలు వేస్తున్నదని చెప్పవచ్చు. నగరాలలోను, పట్టణాలలోను వ్యభిచారం చేసేవారి సంఖ్య ఎక్కువగా ఉంటుంది. వ్యాపార స్థలాలలోను, బస్టాండుల

లోను, దైన్యస్థితులవల్ల అనేకమంది స్త్రీలు వ్యభిచారంలోకి అడుగుపెడుతున్నారు. అనేక సామాజిక కారణాలకు ఆర్థిక ఇబ్బందులకు తట్టుకోలేని అట్టి స్త్రీలు వ్యభిచార వృత్తిని అసహ్యించుకున్నప్పటికీ మనుగడ కోసం చెయ్యక తప్పటంలేదు. సాధారణ వేశ్యలు, ఉంపుడుగత్తెలు, విలాసంకోసం వివిధ అనుభూతుల కోసం వ్యభిచరించేవారు. కవాలీలు, కేబరా నృత్యాలు చేసే స్త్రీలు, కుటుంబ ఆర్థిక పరిస్థితిని తట్టుకోలేని కొందరు స్త్రీలు అప్పుడప్పుడు వ్యభిచరించేవారు. (తాగుడు – జూదం ఉన్న (ప్రాంతాలలో) క్లబ్బులలో పనిచేసే స్త్రీలు, పిలుపుకు హాజరు అయ్యే కొంతమంది (Call-Girls) అనేక విధాలుగా వ్యభిచార రొంపిలో మునిగి ఉన్నారు.

## వ్యభిచారం - వివిధ కారణాలు

అనేక మంది స్త్రీలు మోసపోయి, దగాపడి, వ్యభిచార గృహ యజమానులు, దళారీలు చేతుల్లోపడి బలవంతంగా ఈ వృత్తిలోకి దించబడినవారే. కొంతమంది స్త్రీలు కుటుంబంలో వచ్చిన కలతలు, కలహాలు, బీదరికం, చితికిపోయిన వైవాహిక జీవితం మొదలైన పరిస్థితులు తట్టుకోలేక మానసికంగా కృంగిపోతున్న దశలో వ్యభిచారంలోకి దిగితే మరికొంతమంది భర్త వదిలేస్తే మరో దారిలేక, పెళ్ళికాక, కొత్తవాళ్ళతో లైంగిక సుఖానుభవంపై ఉండే మోజు మొదలైన కారణాల వల్ల వ్యభిచార వృత్తి స్వీకరించటం జరిగింది.

అయితే ఏదో ఒక్క కారణంవల్ల మాత్రమే వ్యభిచారంలోకి స్త్రీ అడుగుపెట్టింది అని చెప్పడానికి వీలులేదు. అనేక కారణాలు ఒక్క సారిగా తట్టుకోలేని దశలో ఒకటి వెంబడి మరొకటి రావటంవల్ల స్త్రీలు వ్యభిచారం అనే ఉచ్చులోకి దించబడుతున్నారు. మహారాష్ట్ర, మైసూరు, ఆంధ్ర ప్రదేశ్, మద్రాస్ రాష్ట్రాలలో కొన్ని ప్రాంతాలలో ఉన్న దేవదాసీ వ్యవస్థ, ఉత్తరప్రదేశ్ లోని నాయక జాతిలోనూ, మలబారుప్రాంతంలోవున్న నంబూద్రి జాతిలోవున్న కొన్ని సాంఘిక ఆచారాలు వ్యభిచారానికి మరింత జీవం పోశాయి.

నగరీకరణ పారిశ్రామికీకరణ స్త్రీకి ఉన్న కష్టాలను మరింత రెట్టింపు చేయడంతో తట్టుకోలేని నిస్సహాయులైన స్త్రీలు వ్యభిచారం రొంపిలోకి దిగారు. ఈ సమస్యతో ముడపడివున్న సాంఘిక, ఆర్థిక, మానసిక కారణాలను మనం పరిశీలించి నట్లయితే "వ్యభిచారం ఒక వ్యాపార రంగం" గా కనిపిస్తుంది. కొంతమంది దళారీలు అతిభయంకరమైన పనులను నిర్వహించి డబ్బు సంపాదనకోసం స్త్రీల జీవితంతో చెలగాటమాడుతున్నారు.

వ్యభిచారం సాంఘిక వ్యవస్థలో ఒక భాగంగా మొలకెత్తి పెద్ద వటవృక్షంగా ఎదిగింది. వ్యభిచారానికి దారితీసే ముఖ్యమైన సాంఘిక, ఆర్థిక, మానసిక సాంస్కృతిక కారణాలను కింది ప్రకారం చెప్పవచ్చు.

1. a) తండ్రి/తల్లి/సంరక్షకుడు/భర్త/సోదరులు/ఇతర బంధువుల మరణం

* A study conducted by Tata Institute of Social Sciences, Bombay,

2. b) పేదరికం
   c) దిక్కులేనితనం
3. d) తండ్రి/తల్లి యొక్క నిర్లక్షత
   e) తండ్రి/తల్లి యొక్క నిరాదరణ
   f) కుటుంబంలోని ఇతర కారణాలవల్ల అసంతృప్తి
   g) భర్త వదిలివేసిన స్త్రీలు
   h) ఇతర అసంతృప్తికర వైవాహిక జీవితం
   i) తల్లిదండ్రులు/భర్త/బంధువుల అజ్ఞానం
   j) తల్లిదండ్రులు/భర్త/బంధువులచే ఈ వృత్తిలోకి త్రోయబడినవారు
   k) చెడు సహవాసం
   l) మోసపోయినవారు

      సంప్రదాయం/వారసత్వం

      దొంగిలించబడినవారు

   m) దుష్పరిసరాల ప్రభావం
   n) లైంగిక వాంఛ, ఆతృత
   o) అవాంఛనీయ లైంగిక సంబంధాలు
   p) అవాంఛనీయ మాతృత్వం
   q) బలాత్కారం
   r) సులభతరమైన జీవితంపట్ల వాంఛ
   s) సాహస కృత్యాల పట్ల మమత
   t) వివాహం పట్ల జుగుప్స
   u) అజ్ఞానం
   v) అనైతిక విలువలు
   w) కక్ష సాధింపు చర్య

## వ్యభిచారం - దుష్పరిణామాలు :- *

సమాజంలో ఈ సమస్య ముఖ్యంగా సమస్యకు గురిఅయిన వ్యక్తిపైన, ఆ వ్యక్తికి సంబంధించిన కుటుంబంపైన, ఆ వ్యక్తి నివసిస్తున్న సమాజంపైన దుష్ఫలితాలు తీవ్రంగా కలిగిస్తున్నది. వ్యభిచారానికి గురిఅయిన వ్యక్తి వైయక్తిక అవ్యవస్థకు గురిఅయి మానసిక సంక్షోభాన్ని, అనుభవిస్తూ జీవితంపైన ఇచ్ఛను కోల్పోతుంది. ఈ వృత్తి ఒక వ్యక్తిగత సమస్యగా నిలిచిపోతుంది. ఆమెకు

* Prostitution in India - Popular Prakashan, Bombay.

పుట్టిన బిడ్డలు అనాథలుగా సమాజంలో మిగిలిపోయి, సామాజిక నిందకు ప్రతిరూపాలుగా ఉంటూ, ఉన్నతస్థాయికి చేరలేక పరిసరాల ప్రభావంవల్ల సమస్యలుగా తయారు అవుతున్నారు. అంతేగాక ఆ వ్యక్తి, కుటుంబాన్ని సమాజంలో చులకనగా చూడటంవల్ల కుటుంబ అవ్యవస్థకు దారితీస్తుంది. ఈ సమస్య ఏ సమాజంలో ఎక్కువగా ఉంటే ఆ సమాజం తీవ్రమైన సామాజిక అవ్యవస్థకు గురి అయినదని చెప్పవచ్చు. కాబట్టి ఈ సమస్యా పరిష్కారానికి సమస్యకు గురిఅయిన వ్యక్తుల పునరావాసానికి తగిన చర్యలు తీసుకోవటం చాలా అవసరం.

## వ్యభిచార నిరోధక చర్యలు

వ్యభిచార నిరోధానికి కొన్ని ప్రయత్నాలు ఈస్టిండియా కంపెనీ కాలంలో చేశారు. ఈస్టు ఇండియా కంపెనీవారు లైంగిక నేరస్తులకు కొన్ని నియమాలను రూపొందించారు. 1968లో కంపెనీ అధికారులు వ్యభిచారాన్ని అరికట్టడానికి కొన్ని నియమాలను జారీచేశారు. 1669 లో, 1677 లో గవర్నరు అంగూరి కొన్ని ఆదేశాలను వ్యభిచారులకు, సైనికులకు ఉద్దేశించి విడుదలచేశారు. బ్రిటిష్ వారి కాలంలో వ్యభిచార నిరోధక చట్టంకింద చేసిన మొదటి ప్రయత్నమిది. 1860 కు ముందు ఈ విషయంపై అతితక్కువ నియమాలు ఉండేవి. 1868లో అంటువ్యాధుల చట్టంకింద వ్యభిచారు లంతా తప్పనిసరిగా వైద్యాలయాలలో పరీక్ష చేయించుకోవలసి ఉన్నది. ఆ తరవాత 1888 లో కొంచెం మార్పు జరిగింది. 1898 లో 552 సెక్షన్ ప్రకారం నేరస్థుల చట్టంకింద కోర్టులకు కొన్ని అధికారాలు ఇవ్వడమైంది. దీనిప్రకారం దొంగిలించబడిన, ఎత్తుకుపోబడిన స్త్రీలను రక్షించవలసిఉన్నది.

## వివిధ కమిటీల నియామకం

19వ శతాబ్దం మధ్యకాలం తరవాత భారతదేశాన్ని పరిపాలించిన బ్రిటిష్ ప్రభుత్వం వ్యభిచారవృత్తిని గురించి కొంచెం శ్రద్ధతీసుకున్నది. అదికూడా ఆనాటి బ్రిటిష్ సైనికులదృష్ట్యా ప్రభుత్వం శ్రద్ధతీసుకున్నది. ఇంచుమించుగా వ్యభిచారాన్ని ప్రజారోగ్య సమస్యగా చట్టం అదుపులో ఉంచే ప్రక్రియగా తీసుకోవడమైంది. 1892లో ప్రభుత్వం భారతదేశంలోని వ్యభిచార సుఖవ్యాధులపై పరిశీలన జరుపవలసిందిగా ఒక సంఘాన్ని నియమించింది. బ్రిటిష్ ప్రభుత్వం తలపెట్టిన ఈ ప్రయత్నంలో పరిశీలకుల సంఘం నివేదనమేరకు ఒక క్రమపద్ధతిని ప్రవేశపెట్టారు. దానిప్రకారం బ్రిటిష్ సైనికులకు అందుబాటులో ఉండేటట్లు వివిధ దేశాలనుంచి స్త్రీలను తెప్పించేవారు. అట్టి స్త్రీలకు వైద్యసదుపాయం ఉండేది.

ఈ ప్రయత్నాలు పరిస్థితిని చక్కబరచలేదు. మరికొన్ని గట్టి ప్రయత్నాలు చేయాల్సిన అవసరం వచ్చింది. దీని ఫలితంగా 1907 లో తూర్పు బెంగాల్ అస్సాం అవకతవక ఇండ్ల చట్టం ప్రవేశపెట్టడమైంది. అప్పటినుంచి స్థానికంగా వ్యభిచార గృహాల యజమానులను నిర్బంధంలోకి తీసుకురావటం, బందిఖానాలో ఉంచటం వంటి కార్యక్రమాలు పురపాలక సంఘం ద్వారాకాని, రక్షకభటుల ద్వారాగాని జరుగుతూ ఉండేది.

## చట్టాల పరంపర

1923 లో కలకత్తా, బొంబాయిలలో వ్యభిచార నిరోధక చట్టాన్ని ప్రవేశపెట్టడమయింది. కలకత్తా చట్టం 1930 లో తిరిగి బెంగాల్ వ్యభిచార నిరోధక చట్టంగా మారింది. 1923, 1935, 1936 లో వరుసక్రమంగా ఉత్తరప్రదేశ్, పంజాబ్, కర్నాటక రాష్ట్రాలలో వ్యభిచార నిరోధక చట్టం ప్రవేశపెట్టడమైంది. వివిధ చట్టాలలో "వ్యభిచారి", "వ్యభిచార గృహం" లను నిర్వచించటం జరిగింది. వీధులలో విటులను వ్యభిచారిణులు పిలవటం నిషేధించడమైంది. చట్టాన్ని ఉల్లంఘించిన వారికి పెద్ద మొత్తాలలో జరిమానా, శిక్షలు విధించి ఉండేవి.

## అంతర్జాతీయ స్థాయిలో చర్య

జోస్ఫిన్ బట్లర్ అనే ఆమె ప్రపంచ స్థాయిలో వ్యభిచారాన్ని నిరోధించటానికి ఉద్యమాన్ని నడిపింది. అనేక స్వచ్ఛంద సేవా సంస్థలు ప్రపంచం నలుమూలల నుంచి ఆమెకు చేయూతనిచ్చాయి. ఈ సమస్యను సంబంధించి సాంఘికమైన చైతన్యాన్ని కలిగించి, ప్రజలలో నిర్మాణాత్మక ఆలోచనలు పెంపొందించుకోవాలని సందేశమివ్వటం కోసం ఆమె ఒక అంతర్జాతీయ వ్యభిచార నిరోధక సంఘాన్ని స్థాపించింది. ఈ విషయంలో బట్లర్ కృషి ఎంతో కొనియాడదగిందిగా చెప్పవచ్చు.

## నానాజాతి సమితి

వ్యభిచారం సమస్యపై నానాజాతి సమితి గట్టి శ్రద్ధ తీసుకున్నది. 1927, 1933 లో రెండు నిపుణుల సంఘాలు జరిపిన విచారణలో సుమారు పశ్చిమ దేశాలన్నింటిలోనూ వ్యభిచారం విస్తరించి ఉన్నదని తేలింది. మొదటి సంఘం జరిపిన పరిశీలనలో అమెరికా, యూరోపా, మధ్యప్రాచ్యం ఖండాలలో పేరుకుపోయిన వ్యభిచారం లైసెన్సుల పద్ధతిపై ప్రభుత్వ అనుమతితో జరిగినట్లయితే జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో దీని కేసు బలవత్తరంగా ఉంటుందని తేలింది. రెండో సంఘం ఆసియా, దూర ప్రాచ్యపు ఖండాలలో ఉన్న వ్యభిచారాన్ని గురించి ప్రస్తావిస్తూ "అంతర్జాతీయ స్థాయిలో వ్యభిచారాన్ని మరింత ప్రోత్సహిస్తున్న అతి ముఖ్యమైన అంశం వ్యభిచార గృహ నిర్వహణ" అని అభిప్రాయపడింది. లైసెన్సు పద్ధతిపై వ్యభిచార గృహనిర్వహణను ఖండిస్తూ 1937 లో ఒక సదస్సును నిర్వహించబోయింది. అయితే అది రెండో ప్రపంచ సంగ్రామం కారణంగా విఫలమైంది.

## రెండో ప్రపంచ యుద్ధం తరవాత

రెండో ప్రపంచ యుద్ధ కాలంలోను, తరవాత. వ్యభిచారం మరింత ఉన్నత స్థాయికి చేరుకుంది. దూర దేశాల నుంచి వచ్చిన సైనికులు ఈ వృత్తికి జీవం పోశారు. యుద్ధ కారణంగా అనేక మంది పసిపిల్లలు, మహిళలు నిరాశ్రయులై పోయినారు. 1949 లో ఐక్యరాజ్యాల ఆర్థిక సామాజిక శాఖల తరపున ఆనాటి సెక్రటరీ-జనరల్ గతంలో సూచించిన నానాజాతి సమితి వారి సలహా మేరకు .949 డిసెంబరులో ఒక అంతర్జాతీయ సదస్సు నిర్వహించడం జరిగింది.

## వ్యభిచార నిర్మూలన; తీర్మానం :

ఐక్యరాజ్యసమితి వ్యభిచారాన్ని నిర్మూలించాలని అనేక తీర్మానాలు చేసింది. మన భారత దేశంకూడా ఈ తీర్మానాన్ని అంగీకరించింది. దాని అమలుకై మనదేశం ఎంతో కృషిచేసింది. జోస్ఫిన్ బట్లర్ సంఘాలు వంటి అనేక స్వచ్ఛందసంస్థలు దీనికి సహాయపడ్డాయి.

## 1956 చట్టం

భారత ప్రభుత్వం 1956 లో వ్యభిచార నిర్మూలన చట్టాన్ని రూపొందించింది. ఈ చట్టంలో వ్యభిచారాన్ని నడిపేవారిని, పడుపువృత్తికి పురికొల్పుట, మొదలైన చర్యలను చేసేవారిని శిక్షించటానికి ఏర్పాటుచేసి ఉన్నవి. ఈ చట్టాన్ని అనుసరించి ఏ గృహాన్నిగాని, అందులో భాగాన్నిగాని, ఏ ప్రదేశాన్నిగాని, ఎవరైనా లాభం చేకూర్చుకోవటానికి పడుపువృత్తికి ఉపయోగించినట్లయితే అది వ్యభిచారగృహం అంటారు. ఏ స్త్రీ అయినా, ఎవరికి కామతృప్తికై తనశరీరాన్ని అమ్ముకొన్నా వేశ్య అంటారు. వ్యభిచార నిర్మూలన చట్టంలోని కొన్ని నిబంధనలు కింద ఇవ్వడమైంది.

1. ఏ వ్యక్తి అయినా వ్యభిచార గృహాలను నిర్వహించటం నేరమవుతుంది. తన గృహంగాని, తాను అద్దెకుతీసుకున్న గృహంకాని, తన స్వాధీనంలో నున్న స్థలంకాని, వ్యభిచారానికి ఉపయోగిస్తున్నారని తెలిసికూడా అందుకు అనుమతించటం నేరమవుతుంది. ఈ నేరాలను మొదటిసారి చేస్తే కొంతశిక్ష, తిరిగిచేస్తే అంతకన్న హెచ్చుశిక్ష విధిస్తారు.
2. 18 ఏండ్లకు పైబడిన ఏ వ్యక్తిగాని ఒక స్త్రీ పడుపువృత్తిచే నార్జించిన ధనంతో జీవనం గడుపుతుంటే అతడు శిక్షార్హుడవుతాడు.
3. ఏ స్త్రీనైనా పడుపువృత్తిలో ప్రవేశపెట్టినా, అందుకు ప్రోత్సహించినా, అందుకోసం స్థలాంతరానికి తరలించినా నేరమవుతుంది.
4. ఏ స్త్రీ గాని వ్యభిచారగృహం, తదితర ప్రదేశాలలో నిషిద్ధ సంభోగంకోసం వినియోగించుకోవటం, అందుకై ఆమెను బెదిరించటం లేదా నిర్బంధించటం నేరమవుతుంది.
5. దేవాలయాలు, వైద్యశాలలు, విద్యాసంస్థలవంటి ప్రదేశాలలో 200 గజములు (182.88మీ) లోపుగా వ్యభిచార గృహాలు నడిపేవారు, వ్యభిచరించేవారు శిక్షార్హులు.
6. ఏ స్త్రీ గాని స్వీయ హావభావ ప్రదర్శనంవల్ల ఎవరినైనా వ్యభిచరించటానికి ప్రోత్సహిస్తే శిక్షార్హురాలవుతుంది.

నేరస్థుని పూర్వ నడవడి తదితర పరిస్థితులనుబట్టి కోర్టువారు యుక్తమని భావిస్తే మంచి ప్రవర్తనకై పత్రాన్ని తీసుకొనిగాని, మందలించిగాని, అతనిని వదలివేయవచ్చు. ఈ చట్టాన్ని బట్టి ప్రత్యేకాధికారాలు ఉన్న పోలీసు అధికారులు వ్యభిచార గృహాలపై దాడిజరిపి పతితలైన స్త్రీలను అక్కడనుంచి విడుదల చేయవచ్చు. అట్టి స్త్రీలను ప్రత్యేక రక్షణ కేంద్రాలలో ఉంచటం కోసం ఉత్తర్వులు జారీ చేయటానికి కోర్టువారికి అధికారం ఉంది.

## చట్టంలో కొన్ని మార్పులు

1958 లో ఈ చట్టాన్ని అమలులోకి తీసుకువచ్చినప్పుడు ఊహించని కొన్ని అంశాలు వాటంతటవే బయటపడ్డాయి. ఈ చట్టంలో ఏదో ఒక లోపం ఉందని తేలింది. ఒకపక్క- పోలీసుశాఖ, మరోపక్క- న్యాయశాఖ, సంఘ సంక్షేమ కార్యకర్తలు, ఇంకోపక్క- సాంఘిక నీతిదాయిక పరిశుభ్రతా సంఘం (Association for Social & Moral hygiane) వారిని నివేదికలను దృష్టిలో ఉంచుకొని ఈ చట్టంలో కొన్ని మార్పులు తీసుకురావటం ద్వారా మరింత పటిష్టంగాను, కచ్చితంగాను, చట్టాన్ని అమలుచేసేందుకు వీలుగా ప్రయత్నాలు చేశారు. హైకోర్టులు, సుప్రీమ్‌కోర్టు కూడా కొన్ని సూచనలిచ్చాయి.

## సంఘ సంక్షేమ కార్యకర్త - పరిశోధన - పునరావాసం - చికిత్స :-

అనేక ఇబ్బందులున్నప్పటికీ, 1958 మే నెల నుంచిలుకొని 1962 డిసెంబరు మధ్యకాలంలో 18,410 మంది వ్యక్తులను చట్టానికిలోబడి అదుపులోకి తీసుకురావటం జరిగింది. అనేక రక్షాగృహాలను ఏర్పాటుచేసి తద్వారా మహిళలకు, వనితలను, కొన్ని శిక్షణా కార్యక్రమాలు – పునరావాసం, చికిత్స, రక్షణ కల్పించారు. అప్పటినుంచి వైద్యవృత్తిలోను, సంఘసంక్షేమ వృత్తిలోనూ వ్యభిచారానికి ప్రత్యేక రక్షణా చర్యలు తీసుకోవలసిన అవసరం ఏర్పడింది. అనేక విధాలుగా ఈ సమస్యకై పరిశోధనలు జరుగుతున్నాయి. 'వ్యభిచారుల పూర్వకుటుంబ జీవితం' 'వ్యభిచారుల సాంఘిక ఆర్థిక పరిస్థితులు' అన్న అంశాలపై ఇప్పటి సంఘ సంక్షేమ కార్యకర్తలు అనేకవిధాలుగా పరిశోధనలు జరుపుతున్నారు. ఫలితంగా పంచవర్ష ప్రణాళికలలో ఈ సమస్య నివారణపై తగినస్థానం ఇవ్వటమైంది.

## అనేక కార్యక్రమాలు - కార్యకర్త పాత్ర :

ఇంతవరకు రాష్ట్రప్రభుత్వాలు కాని, కేంద్ర సాంఘికసంక్షేమ బోర్డుగాని, వ్యభిచారులకు పునరావాసాన్ని కల్పించి, తద్వారా ఉపాధిని కల్పించలేకపోయారు. త్వరితగతిని తగినచర్యలు తీసుకోనిపోతే ఇంతవరకు చేసిన ప్రయత్నాలు బూడిదలోపోసిన పన్నీరు అవుతాయి. వీరికి పునరావాసానికి సమాజంలో ప్రభుత్వ పరంగాను, స్వచ్ఛందసంస్థల ద్వారా కొన్ని సంస్థాగత సేవాకార్యక్రమాలు నిర్వహించటం జరుగుతుంది. వీటి ముఖ్య ఉద్దేశ్యం వ్యభిచారులకు రక్షణకల్పిస్తూ, స్వయం ఉపాధికల్పన శిక్షణ కార్యక్రమాలలో తగురీతిలో శిక్షణను కల్పిస్తున్నారు.

సంస్థాగత(Institutional)సేవలుగా టైలరింగ్, ఎంబ్రాయిడరీ, అల్లికలు నేత, క్రొవ్వొత్తుల తయారీ, కొవ్వు తయారీ, అగ్గిపెట్టెల తయారీ మొదలైన చిన్నపరిశ్రమలద్వారా వ్యభిచారులకు పునరావాసాన్ని కల్పించవచ్చు. ఉన్నతశిక్షణ పొందిన సంఘసంక్షేమ కార్యకర్తలను ఇట్టి కార్యక్రమ నిర్వహణకు నియమించాలి. అందుకు అవసరమైన నిధులను కూడా సమకూర్చాలి. ఈ రంగంలో సేవచేసేందుకు పోలీసులకు ప్రత్యేకశిక్షణ ఇవ్వాలి. స్వచ్ఛంద సేవాసంస్థలు కూడా వీటికి సహాయం

చేయాలి. ప్రజాభిప్రాయం వ్యభిచారులపట్ల అసహ్యమైన పద్ధతిలో గాకుండా, సానుభూతి పద్ధతిలో ఉండేటట్లు సంఘసంక్షేమ కార్యకర్త చూడాలి.

ఈ మధ్య జరిగిన సంఘ సంక్షేమ కార్యకర్తల పరిశోధన, కొన్ని విషయాలు బయట బడ్డాయి. వ్యభిచారంలో 40 శాతం వరకు 16 నుంచి 22 సం॥ల వయస్సులో స్త్రీలు ఉండటం ఒక విశేషం. సాధారణంగా ఇదే వయస్సులో ఈ వృత్తిలో అడుగుపెట్టడం జరిగింది. సొచ్చుమంది హిందూమతానికి చెంది బీదకుటుంబాల నుంచి వచ్చినవారే కావటం విశేషం. వ్యవసాయ కూలీలు, రోజుపని కూలీలు, అతి బీదవారు, ముష్టివారు వ్యభిచారంలో ఉన్నారు. సంఘ సంక్షేమ కార్యకర్త కృషి ఈ రంగంలో ఎంతైనా జరపవలసి ఉన్నది.

ఈ సమస్య స్వభావాన్ని, దానివల్ల కలిగే దుష్పరిణామాలను దృష్టిలో ఉంచుకొని, సాంఘిక విద్యా కార్యక్రమాలను రూపొందించి, వాటిద్వారా ప్రజలకు తెలియచేయటం అవసరం. ఈ కృషిలో కార్యకర్త పాత్ర అత్యంత ప్రధానమైనది.

(As Community vyanies - Social Actional)

## వ్యభిచార నిర్మూలన - సంఘ సంక్షేమ కార్యకర్త పాత్ర

ఈ సమస్యను కూలంకషంగా అవగాహనచేసుకొని సమస్యా పరిష్కారంలోనూ, నిరోధక చర్యలను చేపట్టడానికి, సుశిక్షితులైన సంఘసంక్షేమ కార్యకర్తలు ప్రముఖపాత్రను వహించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. వ్యక్తి సేవాపద్ధతి ప్రక్రియలను ఆధారంగా చేసుకొని వ్యభిచారిణి ఒక నైయక్తిక అవ్యవస్థకు గురిఅయిన వ్యక్తిగా గుర్తించి ఆమెకు సమాజ మెప్పుదలగల జీవితాన్ని పొందటానికి తగు కృషిచేయాలి. ఈ ప్రక్రియ ముఖ్యంగా సంస్థాగత కార్యక్రమాలలో చేపట్టవచ్చు.

సాముదాయక వ్యవస్థాపకునిగా, సాంఘికచర్యా కార్యకర్తగా వ్యభిచారవృత్తివలన కలిగే కీడు, శారీరక మానసిక రుగ్మతలవల్ల కలిగే ప్రమాదాలను గురించి వివిధ సాముదాయక విద్యా కార్యక్రమాల ద్వారా సవివరంగా ప్రజలకు తెలియచేయటానికి కృషి చేయాలి. ముఖ్యంగా వ్యభిచార వృత్తిలో కూరుకుపోయిన స్త్రీలలో సాంఘిక విద్య, వృత్తిపరమైన విద్యలద్వారా మనో వికాసాన్ని, చైతన్యాన్ని ఆత్మవిశ్వాసాన్ని వారిలో కలిగించాలి. అంతేగాక సమాజంలో గౌరవంగా తలఎత్తుకొని తిరిగే అవకాశాలను వారికి కల్పించాలి. అందుకు అవసరమైనంతవరకు అన్ని సాంఘిక సేవాసంస్థల, ప్రభుత్వ సంక్షేమ సంస్థల సహాయ సహకారాలను సమీకరించటంలో కార్యకర్త అతి కీలకమైన పాత్రను వహించాలి.

సాంఘికచర్యా కార్యకర్తగా ఈ సమస్యను పూర్తిగా పరిష్కరించేందుకు దానితోపాటు వ్యభిచారరాక్షసి కోరల్లో నలిగిపోతున్న అభాగ్య స్త్రీలను ఆదుకోవటానికి, వారికి సామాజిక ఆమోదాన్ని కల్పించటానికి కావలసిన కార్యక్రమాలను చేపట్టి ప్రజల పూర్తి సహకారాన్ని పొందటంలో కార్యకర్త కృషిచేయాలి. ఇంతేగాక సాంఘిక పరిశోధకునిగా వ్యవహరిస్తూ ఈ సమస్యయొక్క నైజాన్ని, దుష్ఫలితాలను పునరావాస కార్యక్రమాలను పూర్తిగా శాస్త్రీయ దృక్పధంతో అన్వేషణ జరిపి తగిన సూచనలు ఇవ్వటం కార్యకర్త బాధ్యత.

# 9

# అస్పృశ్యత

## (Untouchability)

ప్రపంచంలో రాజకీయ, పారిశ్రామిక విప్లవాలు జరిగినప్పటినుంచి వ్యక్తి స్వాతంత్ర్యానికి ప్రాముఖ్యం వచ్చింది. ప్రజలే ప్రభుత్వాన్ని ఏర్పరచుకునే సర్వ స్వతంత్రాధికారాన్ని ఆమోదించటం జరిగింది. అంతర్జాతీయంగా మానవతా హక్కులను, వయోజన ఓటింగ్ హక్కులను ఆమోదించారు. బానిస విధానానికి స్వస్తి చెప్పారు. ఏవ్యక్తిని పుట్టుకనుబట్టి అధికుడుగాగాని, అధముడుగాగాని పరిగణించరాదనీ, ఒక మనిషి మరొక మనిషిని ఏదో ఒక నెపంతో హీనంగా చూడటం మానవతా దృష్టి అనిపించుకోదని, మతము - జాతి వేరైనా వ్యక్తులందరూ సమానమైనవారేనని సమరసభావం మానవాళిలో వికసించడం ఆరంభమైంది.

ప్రజాబాహుళ్యం ప్రజాస్వామిక ఆశయాలను ఆమోదించటంతో మానవునిపై మానవుడు పెత్తనం చెలాయించటం సూత్రప్రాయంగా అంతమైంది. భారతదేశంలో స్వాతంత్ర్య పిపాస ప్రబలి, బ్రిటిష్ సార్వభౌమాధిపత్యాన్ని అంతమొందించటానికి 19 వ శతాబ్ది ద్వితీయార్థ భాగంలో జాతీయ స్వరాజ్య సమరం ప్రారంభమైంది. పరాయి పరిపాలనను పారదోలడంతోబాటు సమాజంలోని అసమానతలుకూడా తొలగిపోతేనేగాని, పౌరులు సంపూర్ణ స్వతంత్రులు కారనేది ఆనాడే గుర్తించారు. ఆ గుర్తింపు ఫలితంగానే, స్వాతంత్ర్యోద్యమ నిర్మాతలయిన గాంధి మహాత్ముడు, పండిత జవహర్‌లాల్ నెహ్రూ, డాక్టర్ అంబేద్కర్ మొదలైన జాతీయనాయకులు ఆ ఉద్యమంలో భాగంగా అస్పృశ్యతా నిర్మూలనను కూడా చేర్చారు.

అస్పృశ్యత అనేది హైందవ సమాజంలో అనాది నుంచి వస్తున్న వర్ణ వ్యవస్థతో ముడిపడి ఉన్న ఆచారం. హిందూ కుల వ్యవస్థలో, ఉన్నతకులాలనీ తక్కువ కులాలనీ తారతమ్యాలు ఉండేవి. తక్కువ కులాల వారిలో కూడా అట్టడుగున ఉన్నవారిని నీచకులస్థులనీ, పంచములనీ, ఆదికులాలనీ, అస్పృశ్యులనీ, అధమకులాలనీ, షెడ్యూలు కులాలనీ, ఆది ఆంధ్రులనీ, హరిజనులని రకరకాలుగా పిలవటం జరుగుతూ ఉంది.

ఉన్నత కులాలకు చెందినవారు అట్టడుగున మగ్గిపోతున్న కులాలవారని, అంటరానివారుగా భావించి, వారి గాలి సోకడంతోనే అపవిత్రుల మౌతామన్న ఘోరణులతో ఊరికి ఎడంగా ఉంచి, వారికి

కొంత మాలిన్యాన్ని అంటగట్టారు. వారిని అనేక కష్టనష్టాలకు గురి చేశారు. వారికి నీచమైన, అపరిశుభ్రమైన పనులు అప్పగించటం జరిగింది. వారికి దేవాలయ ప్రవేశం, ఊళ్ళోవున్న మంచినీటి బావులను వాడుకోవటం ఉండేదికాదు. కొన్ని ఉన్నత కులాల వారి వీధులలో నడచి వెళ్ళేటప్పుడు చెప్పులను చేతులతో పట్టుకొని వెళ్ళవలసి వచ్చేది. విద్యా సౌకర్యాలు అసలు లేవు. ఇట్లా సామాజిక అంతరం ఉండేది.

అస్పృశ్యతను స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా చేసినప్పటి నుంచి తరతరాలుగా అణగారిపోయిన పీడిత కులాలవారి కండ్లు తెరుచుకోవటం ఆరంభించినాయి. వారికి సమాజంలో న్యాయమైన స్థానాన్ని సమకూర్చాలనే ఉద్యమం ప్రారంభమైంది. అనేక స్వచ్ఛంద సేవా సంస్థలు అస్పృశ్యతా నిర్మూలనలో భాగంగా హరిజనోద్ధరణకు కంకణం కట్టుకున్నాయి. ఈ రంగంలో శ్లాఘనీయమైన కృషి చేస్తున్న సంస్థలలో రామకృష్ణ మిషన్ ఒకటి. ఇది సామాజిక సంక్షేమానికి, మత ప్రచారానికి, మానవతా దృక్పథంతో ఏర్పడిన సంస్థ. ఆర్య సమాజ సంస్థకూడా హరిజన ఉద్ధరణకు కృషి చేసింది. సత్యం, అహింస విధానాల ద్వారా అస్పృశ్యతను హిందూ సమాజం నుంచి తొలగించటానికి హరిజన సేవక సంఘం 1932 లో ఏర్పడింది. ఈ సంస్థ నియమావళిని గాంధీజీ రూపొందించారు. దానికి రాజకీయాలతో ప్రమేయం లేదు. దీని శాఖలు అన్ని రాష్ట్రాలలోనూ ఉన్నాయి.

సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ, వెనుకబడ్డ కులాల సమాఖ్య, భారతీయ దళిత వర్గాల సంఘం మొదలైన ఇతర సంస్థలుకూడా అస్పృశ్యతా నివారణకు కృషి చేశాయి. అయితే సనాతన ఆచారాలతో, వర్ణవ్యవస్థతో కరుడుగట్టిన భారత దేశంలో అస్పృశ్యతా నిర్మూలన ఉద్యమానికి అనేక ప్రతిఘటనలు ఎదురైనాయి. ఈ ప్రతిఘటనలను ఎదుర్కొనడానికి స్వాతంత్ర్యానికి పూర్వం నుంచి ప్రభుత్వాలు కొన్ని శాసనాలను అమలులో పెట్టినాయి.

1856 లో ధార్వార్ ప్రభుత్వ పాఠశాలలో అధమ కులంగా పరిగణితమైన మహర్ కులానికి చెందిన ఒక బాలునికి ప్రవేశం నిరాకరించబడిందన్న విషయం బొంబాయి ప్రభుత్వందృష్టికి తీసుకురావటం జరిగింది. ప్రభుత్వ ధనంతో నడిచే అన్ని పాఠశాలలలోనూ ఎట్లాంటి విచక్షణ చూపకుండా అన్ని తరగతులవారిని చేర్చుకోవలసిందిగా 1858 లో ప్రభుత్వం ఉత్తర్వు జారీచేసింది. పాశ్చాత్య నాగరికత, ఆంగ్లవిద్యతో సంధానం ఏర్పడినప్పటికీ, తరతరాలుగా వస్తున్న అస్పృశ్యతా భావాలు పోలేదని, అందుకు ఆధారంగా గ్రామ పాఠశాలల్లో మహర్, ఇతర దళితవర్గాల విద్యార్థులను తరగతి గదులలో కాకుండా, వరండాలలో వేరుగా కూర్చుండబెడుతున్న విషయాన్ని ఉదహరిస్తూ 1915 లో బొంబాయి ప్రభుత్వం పత్రికా ప్రకటనను జారీచేసింది. ఇది దృష్టిలో పెట్టుకుని, దళితవర్గాలకు చెందిన విద్యార్థులకు ప్రవేశానుమతిని నిరాకరించిన ఎయిడెడ్ విద్యాసంస్థలకు ప్రభుత్వం గ్రాంట్లు చెల్లించదని 1923 లో ఒక తీర్మానం జారీచేసింది.

ప్రభుత్వ కార్యాలయానికి, చెరువుకు, బావికి లేదా ప్రజోపయోగ ప్రదేశానికి దారితీసే పురవీధులలో అన్ని తరగతుల ప్రజలు, వారేకులం వారయినా, తిరగటానికి అనుమతించే తీర్మానం ఒకదానిని శాసనబద్ధం చేస్తూ మద్రాసు శాసనమండలి 1925లో బిల్లును ప్రవేశపెట్టింది.

దేవాలయ ప్రవేశానికి కేరళలో శాంతియుతమైన ఉద్యమం జరిగింది. అస్పృశ్యతకు సంబంధించిన సంస్కరణలలో, 1936లో తిరువాన్కూరు మహారాజు ప్రకటించిన 'దేవాలయ ప్రవేశ ఫర్మానం' చెప్పుకోతగ్గది. దీనిప్రకారం 'రాజావారి ప్రభుత్వ అజమాయిషీలోని దేవాలయాలలో హిందువులైనవారు ఏ కులానికిచెందినవారయినా, ప్రవేశించడానికి, పూజచేసుకోవటానికి ఏ అభ్యంతరం ఉండరాదు.

దీనిని ఆదర్శంగా పెట్టుకుని, మరికొన్ని రాష్ట్రాలు శాసనాలు రూపొందించాయి. మొత్తం మీద అస్సాం, రాజస్థాన్ తప్పించి మిగిలిన రాష్ట్రాలన్నింటిలోనూ, అస్పృశ్యతకు సంబంధించిన శాసనాలు అమలులోకి వచ్చాయి.

అస్పృశ్యతా నివారణకు అహర్నిశలు పాటుపడిన నాయకులలో డాక్టర్ అంబేద్కర్ అగ్రగణ్యుడు. జీవితంలో అస్పృశ్యతను ప్రత్యక్షంగా అనుభవించి, అనేక అడ్డంకులను ఎదుర్కొన్న వాడు అంబేద్కర్. అతడు షెడ్యూల్డు కులాల ప్రజలలో ఆత్మగౌరవం పెంపొందటానికి అవసరమైన వాతావరణం సృష్టించాడు. హీనులమనే భావాన్ని దూరంగా నెట్టి, తమ సామాజిక, ఆర్థిక హక్కుల కోసం పోరాటం జరిగేట్లు వారిని ఉత్తేజపరిచాడు. దళిత కులాలవారి పౌరసత్వ హక్కులను సముద్ధరించే సంకల్పంతో అనేక సత్యాగ్రహోద్యమాలను నిర్వహించాడు. అంతేకాదు అతడు రాజ్యాంగ నిర్మాతలలో ముఖ్యుడిగా ఉన్నాడు. రాజ్యాంగంలో పౌరులకు సాంఘిక ఆర్థిక, రాజకీయ న్యాయం, భావస్వాతంత్ర్యం, వాక్ స్వాతంత్ర్యం, మతవిశ్వాసాలలో స్వేచ్ఛ, సమానహోదా, అన్ని అవకాశాలలోనూ సమానత్వం, వ్యక్తిగౌరవం, దేశసమైక్యత వర్ధిల్లచేస్తూ సర్వమానవ సౌభ్రాత్రాన్ని పెంపొందిస్తామని పేర్కొనడం జరిగింది.

రాజ్యాంగంలో సమానత, సామాజిక న్యాయం, సర్వమానవ సౌభ్రాత్రం అనేభావాలకు ప్రాధాన్యమిచ్చారు. రాజ్యాంగం ప్రకారం అస్పృశ్యతను పాటించడం నేరంగా పేర్కొన్నారు. సమాజంలో గూడుకట్టుకుపోయిన అసమానతలను తొలగించటానికి కూడా సాధారణ హక్కులు కాక, ప్రత్యేక రక్షణలు కల్పించారు. 46వ నిబంధన ప్రకారం, సాంఘిక దురన్యాయాలనుంచి, తదితర పీడనలకు లోనుకాకుండా, ఈ తరగతుల ప్రజలకు, రక్షణను కల్పించటంతో బాటు ఆర్థికంగాను, విద్యావిషయకంగాను, వారి పరిస్థితులను మెరుగుపరచాలి. హిందువులలోని అన్ని తెగలవారికి హిందూ దేవాలయాలలో ప్రవేశం కల్పించడం జరిగింది. ప్రజాహిత సంస్థలు లేదా ప్రభుత్వ ధనంతో నడిచే సంస్థలు, దుకాణాలు, హోటళ్ళు, వినోదశాలలు, మంచినీటి బావులు, చెరువులు, నీటిపంపులు, స్మశానవాటికలు, రోడ్లు, స్నానాల రేవులు, మొదలైనవాటి వినియోగానికి ఆటంకంగా ఉన్న అనర్హతలను, పరిమితులను, 15వ నిబంధన తొలగిస్తున్నది.

ప్రభుత్వం నిర్వహిస్తున్న లేదా ప్రభుత్వ సహాయంతో నడుస్తున్న విద్యా సంస్థలలో ప్రవేశానికి గల అయోగ్యతలను 29 వ నిబంధన అంతమొందిస్తున్నది. ప్రభుత్వోద్యోగాలలో నియామకానికి సంబంధించిన అవకాశాలను పరిశీలించే బాధ్యత ప్రభుత్వంపై ఉండటమే కాకుండా, వారికి తగిన ప్రాతినిధ్యం లేనప్పుడు అవసరమైతే రిజర్వేషన్లను, 16,335 నిబంధనలు కల్పిస్తున్నాయి. 244 వ నిబంధన ఏజన్సీ లేదా గిరిజన ప్రాంతాల పరిపాలనా నిర్వహణకు ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయడానికి అవకాశమిస్తున్నది. ఈ తరగతుల ప్రజల సంక్షేమం నిమిత్తం రాష్ట్రాలలో ప్రత్యేక శాఖలు ప్రారంభించటానికి 164, 338 నిబంధనలు అనుమతిస్తున్నాయి. 330, 332, 334 నిబంధనలు వీరికి లోక్ సభ, రాష్ట్ర శాసన సభలలో పరిమిత కాలంపాటు ప్రత్యేక ప్రాతినిధ్యానికి అవకాశాలను కల్పిస్తున్నాయి.

ఇన్ని రక్షణలు కల్పించినప్పటికీ వారి స్థితి గతులలో అంతగా మార్పు రాలేదు. నూటికి 78 పైగా గ్రామసీమలో నివసిస్తున్న భారతీయ పౌరులలో నిరక్షరాస్యత విస్తృతంగా ఉండటంవల్ల, కుల విభేదాలు, సనాతన ఆచారాలు వీరిలో జీర్ణించుకొని పోవటంవల్ల స్వాతంత్ర్యం వచ్చిన తరువాతకూడా అస్పృశ్యత కొనసాగుతూనే వచ్చింది. ఈ సామాజిక దురన్యాయాన్ని నేరంగా ఎంచి తేగాని రూపుమాయదనే తలంపుతో అస్పృశ్యతా (నేరాల) చట్టం అనే శాసనాన్ని లోక్ సభ ఆమోదించింది. ఈ చట్టం 1955 జూన్ 1 నుంచి అమలులోకి వచ్చింది.

ఈ చట్టం ప్రకారం అస్పృశ్యతను పాటించినవారు శిక్షార్హులవుతారు. మతాన్ని, దైవారాధనను గురించి, చట్టంలో ఈ విధంగా ఉంది. హిందువులందరికి అనుమతివున్న పూజామందిరాలలోకి అస్పృశ్యులన్న నెపంతో ఎవరినీ ప్రవేశించకుండా ఆటంకపరచరాదు. పూజా – పునస్కారాలకు అవకాశం నిరాకరించినా, పవిత్రమైన కోనేరు, బావి, కొలనల నీరు, స్నానానికి, పూజకు వాడుకోనివ్వక పోయినా శిక్షార్హులవుతారు.

ఈ నిబంధన ఎవరెవరికి వర్తిస్తుందో తెలియచేస్తూ, బౌద్ధులు, సిక్కులు, జైనులు, హిందూమతంలో విభిన్న శాఖలకు ప్రాతినిధ్యం వహిస్తున్న వీరశైవులు, లింగాయతులు, ఆదివాసులు, బ్రహ్మసమాజీయులు, ఆర్యసమాజీయులు మొదలైనవారిని హిందువులుగా పేర్కొనడం జరిగింది.

1. దుకాణం, రెస్టారెంట్, హోటల్, వినోదమందిరాలలో ప్రవేశం.
2. ధర్మసత్రాల మొ॥చోట్ల ప్రజల వినియోగార్థం ఉన్న పాత్రల వాడకం.
3. ఇష్టంవచ్చిన వృత్తి లేదా వ్యాపార నిర్వహణ.
4. నది, కాలువ, వాగు, బావి, చెరువు, కుళాయి లేదా నీరుతెచ్చుకునే ఇతర స్థలాలు, స్నానాలరేవు, శ్మశానవాటిక, పారిశుధ్య సౌకర్యాలు, రోడ్డు లేదా రహదారి, ఇతర ఇతర ప్రజోపయోగమైనవాటి వినియోగం.
5. సాధారణపౌరుల వాడుక నిమిత్తం వితరణగా ఇవ్వబడిన ధర్మసంస్థలు లేదా ప్రభుత్వ ధనంతో నడిపే ఇతర సంస్థల వినియోగం.

6. ధర్మాదాయ సంస్థ ఏర్పాటుచేసిన సౌకర్యాల వాడకం.
7. రవాణాసౌకర్యాల వినియోగం
8. ఏ ప్రాంతంలోనయినా సరే ఇల్లు కట్టుకోవడానికి లేదా అద్దెకు ఉండటానికి అనుమతి
9. ధర్మసత్రాల వినియోగం
10. సాంఘిక, మతసంబంధమైన ఆచార వ్యవహారాలలోను, ఊరేగింపులలోను స్వేచ్ఛ.
11. నగలు, గొడుగు, నగిషీబట్టలు, చెప్పులు ధరించటం మొదలైన విషయాలు.

ఆసుపత్రులలో, విద్యాసంస్థలలో, విద్యాసంస్థలకు చెందిన వసతిగృహాలలో ప్రవేశం నిరాకరించినా లేదా ప్రవేశించిన తరవాత అస్పృశ్యులన్న కారణంగా విచక్షణ చూపినా, వారికి సరకులు అమ్మటానికి నిరాకరించినా, ఇస్త్రీషాపులు, క్షౌరశాలలు మొదలైనవాటిలో ఈ తరగతుల వారికి సేవచేయటానికి నిరాకరించినా, నేరంగానే పరిగణిస్తారు. అంతేగాకుండా అటు రాజ్యాంగమూ, ఇటు చట్టమూ కల్పించిన కొన్ని హక్కులను నిమ్నజాతులవారు వినియోగించుకొనటానికి పూనుకొన్న ప్పుడు వారిపట్ల ఉన్నత కులాలవారు అసూయతో అప్పుడప్పుడు బహిష్కరణ అనే ఆయుధాన్ని ఉప యోగించటం కూడా నేరంగానే ప్రకటించడమైంది. సామాజికపరంగా సమకూరే సౌలభ్యాలను మారం చేయడం, అస్పృశ్యతను పాటించని వారిని కులం నుంచి వెలివేయడం మొదలైనవి కూడా నేరాలే.

ఈ చట్టంలోని నిబంధనలను ఉల్లంఘించిన నేరానికి నిందితులకు ఆరు మాసాల వరకు జైలు శిక్ష లేదా 500 రూపాయల వరకూ జరిమానా లేదా ఈ రెండూ విధించే అవకాశముంది. ఈ నేరా నికి ఒకసారి శిక్షపొంది, తిరిగి, అదే నేరంచేస్తే అట్లాంటివారు జైలుశిక్ష, జరిమానా ఈ రెండిటిలో ఏ ఒక్కటో పొందే అవకాశాన్ని జారవిడుచుకొని, జరిమానాతోపాటు జైలు శిక్ష అనుభవించవలసి ఉంటుంది.

దుకాణాల, వ్యాపారస్థుల విషయంలో ఎవరైనా సరుకులు అమ్మడానికి నిరాకరించారన్న నేరం చేసినందుకు ఆ వృత్తి చేసుకోవటానికి, వారికిచ్చిన లైసెన్సును రద్దు చేయవచ్చు. ధర్మాదాయ సంస్థల విషయంలో అస్పృశ్యతా నేరం కింద శిక్ష పొందిన ట్రస్టీలకు లేదా మేనేజర్లకు సంస్థల నిర్వ హణ నిమిత్తం ప్రభుత్వం మంజూరుచేసే ఎట్లాంటి గ్రాంట్లయినా రద్దు కావడమేకాక, శిక్ష రద్దుకు వారు పెట్టుకున్న అప్పీళ్ళు కూడా త్రోసిపుచ్చడం జరుగుతుంది.

ఈ చట్టంలో చెప్పుకోదగిన మరో విశేషమేమంటే, సాధారణంగా న్యాయశాస్త్ర సూత్రాల ప్రకారం నిందితునిపై ఆరోపణలను, నేరారోపకుడు రుజువు చేయవలసివుండగా, ఇక్కడ మాత్రం అట్లా కాకుండా, నిందితుడే తనపై వచ్చిన ఆరోపణలను నిరాధారాలని రుజువు చేసుకోవలసిన బాధ్యత ఉంటుంది.

అయితే కొన్ని నేరాల విచారణ సందర్భంలో సుప్రీంకోర్టు వెలిబుచ్చిన అభిప్రాయాలను పరిశీలించినట్లయితే, ఈ నిబంధన విషయంలో నిందితునిపైవున్న బాధ్యత కొంత సడలినట్లుతోస్తుంది.

నిందితుడు నేరం చేసినాడన్న సత్యాన్ని ఎంతవరకు రుజువుచేయగలిగాడన్నదానికి, ఈ నిబంధన నేరారోపకుని పట్ల నిర్ణయించిన పరీక్షగా ఎంచుకోవచ్చునని తీర్మానించారు.

చట్టంలో ఇన్ని నిబంధనలు కల్పించినా, విచారకరమైన విషయం ఏమంటే వీటికి సంబంధించిన వివరాలు ప్రజలకు అంతగా తెలియకపోవటమే కాబట్టి, చట్ట నియమావళిని గురించి, ఆశయాలను గురించి, కరపత్రాలద్వారా జనబాహుళ్యంలో బహుళంగా ప్రచారం చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అస్పృశ్యతను నిర్మూలించడానికి ప్రభుత్వం ఒక శాసనాన్ని ఆమోదించినంతమాత్రాన సరిపోదు. శాసనంలోని నిబంధనలను అమలుపరచడంద్వారా సమస్య ఎంతవరకు సమసిపోతుందో పరిశీలించడానికి తగిన యంత్రాంగాన్ని ఏర్పరుచుకోవడం ఎంతో ప్రధానం. ప్రభుత్వం ఈ చట్టం విషయంలో ఎంతవరకు సఫలీకృతమైందనేది, అది తీసుకున్న చర్యలను పరిశీలిస్తే బోధపడుతుంది.

ఈ చట్టం సవ్యంగా ఎంతవరకు అమలుజరుగుతున్నదో ఎప్పటికప్పుడు పరిశీలించడానికి ఒక సంఘాన్ని నియమించమని కేంద్ర దేశీయ వ్యవహారాల మంత్రిత్వశాఖ అన్ని రాష్ట్ర ప్రభుత్వాలకు సూచించింది. కేంద్రంలో మాత్రం షెడ్యూల్డు కులాల సంక్షేమాన్ని, సమీక్షిస్తూ ఉండటానికి ఒక అధికారిని (Commissioner for Scheduled Castes and Scheduled Tribes) నియమించారు. ఈ అధికారి తరచూ సమర్పించిన నివేదికలను, ఇలయ పెరుమాళ్ళు సంఘం సమర్పించిన నివేదికను (Report of the Committee on Untouchability, economic and educational development of the Scheduled Castes) పరిశీలిస్తే గ్రామాలలో అస్పృశ్యత ఇంకా విస్తృతంగా పాటించడం సాగుతున్నదనే విషయం తెలుస్తుంది.

గ్రామీణ ప్రాంతాలలో అస్పృశ్యతను విపరీతంగా పాటించడం జరుగుతున్నప్పటికీ, ఈ చట్టం కింద 1955-64 మధ్యకాలంలో దేశం మొత్తంమీద వచ్చిన ఆరోపణల సంఖ్య చూస్తే 4540 మాత్రమే అని తెలుసుకొని ఆశ్చర్యపోక తప్పదు. దీనిని దీనినిబట్టి ప్రజలలోను, అధికారులలోను, ఈ సమస్యపట్ల ఎంత నిర్లక్ష్యమున్నదో అర్థమవుతుంది. న్యాయస్థానాలకు వెళ్ళిన ఆరోపణలలోకూడా చాలావరకు ఆమోదం పొందకపోవటానికి ఈ కింది కారణాలను ఉదహరించవచ్చు.

ఉన్నత కులాలవారికి వ్యతిరేకంగా సాక్ష్యంచెబితే, ఆ తరవాత తమకేమి హానిజరుగుతుందోనన్న భయాందోళనలు, నిమ్నజాతులవారిలో ఉండటం ఒక కారణం. హిందువులలో కూడా కుల బహిష్కరణ చేస్తారనే భయంవల్ల నిజమైన సాక్ష్యం ఇవ్వటానికి ముందుకు రావటంలేదు. వీటికితోడు ఆరోపణలను అధికారులు ఆషామాషీగా పరిగణించటం మరొకటి.

తరతరాలుగా కరుడుగట్టిన కులవ్యవస్థలో మాయనిమచ్చగా వస్తున్న అస్పృశ్యత శీఘ్రంగా తొలగిపోవడం అంత సులభంకాదు. మూడువంతులకు పైగా గ్రామీణ జీవితం గడుపుతున్న భారతీయులకు విద్య, వార్తాసౌకర్యాలు, రవాణా వంటి ఆధునిక సౌకర్యాలు అందుబాటులో లేనందువల్లకూడా మనం ఆశించేమార్పు నిదానంగాకాని ఫలించకపోవచ్చు.

పీడితప్రజల జీవనప్రమాణం, విద్యాస్థాయి పెరిగేకొద్దీ అస్పృశ్యత తగ్గిపోతుంది. ఒకటి రెండు దశాబ్దాల కిందటికంటే నేటిపరిస్థితి ఎంతో మెరుగు. రాబోయే కాలంలో ప్రభుత్వం తలపెట్టిన ఆర్థిక, సాంఘిక, విద్యాసంస్కరణలు ప్రజలందరికి సమానంగా వాటిఫలితాలు అందినప్పుడు, కుల వ్యవస్థ అనేది పూర్తిగా అంతరించకపోయినా, అస్పృశ్యత మాత్రం రూపుమాసిపోతుందనడంలో ఎట్లాంటి సందేహం అక్కరలేదు.

ఇంతవరకు అస్పృశ్యతా నివారణకు సంబంధించిన శాసనాలను పరిశీలించాం. నివారణకు అవసరమైన ఆర్థిక, సాంఘికవిద్యా సౌకర్యాలు ఆయా తరగతుల ప్రజలకు ప్రభుత్వం సమకూర్చాలి.

ఆర్థికంగాను, విద్యావిషయాలలోను, స్థితిగతులు మెరుగైతే, వారి సాంఘికస్థాయి పెరుగుతుంది. ఈ లక్ష్యంతోనే ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధతో దళితవర్గ ప్రజల - ముఖ్యంగా షెడ్యూల్డుకులాల, తెగల ప్రజల ఆర్థిక శక్తిని, విద్యా సామాజిక స్థాయిలను పెంచడానికి కృషి చేయాలి.

Social worker - as community organise Social Actional.

## ముగింపు

అస్పృశ్యత లేక అంటరానితనం నేటి ఆధునిక సమాజంలో ప్రజలమధ్య సామాజిక అంతరాన్ని, అసమానతలను సృష్టిస్తోంది. దీనివల్ల ప్రజలలో దురభిప్రాయాలు, అంధవిశ్వాసాలు ఎక్కువగా ఏర్పడటంవల్ల సామాజిక జీవనానికి, సంఘటిత పురోభివృద్ధికి సంకెళ్ళు పడుతున్నాయి. కాబట్టి ఈ సమస్యను కూలంకషంగా అవగాహన చేసుకోవటంలోనూ, దానిని పరిష్కరించటంలోనూ, సాంఘిక సంక్షేమ కార్యకర్త ఎనలేని కృషి చేయాలి. ముఖ్యంగా సామాజిక చర్య విధానాన్ని అవలంబిస్తూ ప్రజల మానసిక దృక్పథంలోనూ, ఆలోచనా రీతులలోనూ, ప్రవర్తనా పద్ధతులలోనూ మార్పులు తీసుకురావటానికి అవసరమైన కృషి కార్యకర్త చేయాలి. దీనిని సాధించటంలో ప్రచార సాధనాలను విరివిగా ఉపయోగిస్తూ ప్రజలలో ఈ సమస్య నిర్మూలనకై తగిన పరిస్థితులను కల్పించాలి. అస్పృశ్యతా నివారణా చట్టాన్ని సాముదాయక విద్యా కార్యక్రమాల ద్వారా సక్రమంగా అమలు చేయటంలో కార్యకర్త బాధ్యత ఎంతైనా ఉంది.

2. కొన్ని కులాల వారు వంశ పారంపర్య వృత్తి లేదా కులవృత్తిగా భిక్షాటనను అవలంబిస్తారు. ఆంధ్రప్రదేశ్‌లో దాసర్లు, జంగందేవరలు మొదలైనవారు కొందరు ఇతరుల దయాభిక్షపై ఆధారపడి జీవనాన్ని సాగిస్తారు.
3. మతాన్ని ఆధారంగా చేసుకొని భిక్షాటనను సాగించేవారున్నారు. ఉదాహరణకు – సాధువులు సన్యాసులు, బైరాగులు, బసవన్నలు, ఫకీర్లు మొదలగువారు. వీరు మత సంబంధమైన కేంద్రాలలో తిరుగుతూ భిక్షాన్ని స్వీకరిస్తారు.

   మతసంబంధమైన సాధువులకువలెనే వేషంవేసి, వారితో ఎట్లాంటి సంబంధంలేకుండానే, ప్రజలను మోసగించి, భిక్షాన్ని ఎత్తుకునే శరీర దారుఢ్యంగల భిక్షువులు మరికొందరుంటారు.
4. కొందరు చిన్నపిల్లలను భిక్షాటనవృత్తిలోకి దింపి, ధనాన్ని సంపాదిస్తారు. మరికొందరు అప్పుడే పుట్టిన పసిపిల్లలను దొంగిలించి అవయవాలను చిన్నాభిన్నంచేసి, వికలాంగులుగా తయారుచేసి, నడిరోడ్లపై ఒకగుడ్డపై ఉంచి, దానధర్మాలకోసం చూస్తారు.
5. అంటువ్యాధులతో బాధపడే దీర్ఘకాల రోగులు, అవిటివారు, ముసలివారు మొదలగువారు కూడా సమాజంపై ఆధారపడి భిక్షాటన చేస్తారు.
6. కొందరు పనిపాట్లు చేసుకుంటూ అప్పుడప్పుడు విరామ సమయాలలో భిక్షాటన చేస్తుంటారు.

## భిక్షాటనవృత్తి - వివిధ కారణాలు :

అతిక్లిష్టమైన సాంఘిక సమస్యగా ఉన్న భిక్షాటనకు ఒక ప్రత్యేక కారణమని చెప్పలేం. అనేక కారణాలు దోహదంచేస్తాయి. శారీరక మానసిక లోపాలు, వ్యక్తిగత, సామాజిక అవ్యవస్థలు, దారిద్ర్యం, నిరుద్యోగం, భిక్షపెట్టే సాంప్రదాయం సమిష్టికుటుంబాల విచ్ఛిన్నత మొదలగుకారణాలన్ని భిక్షాటన వృత్తికి దోహదంచేస్తాయి. భిక్షాటనకుగల కారణాలను కింది విధంగా చెప్పవచ్చు :–

## I. జైవిక కారణాలు :

భిక్షువులలో అనేకమంది శారీరక, మానసిక లోపాలవల్ల, ముసలితనంవల్ల, అనారోగ్యం వల్ల బాధపడేవర్గానికి చెందిన వారుండారు. ఇట్టి లోపాలు వారసత్వంవల్లగాని, తదితర కారణాలవల్లగాని కావచ్చు.

సిఫిలిస్, క్షయ, కుష్టు మొదలైన దీర్ఘకాల వ్యాధులు, చర్మవ్యాధులవల్ల కూడా కొంతమంది నిరాశా నిస్పృహలకు లోనయి, వేరేగత్యంతరం లేక, భిక్షువులుగా జీవిస్తూ ఉంటారు. ఇట్టివారికి సరిఅయిన పునరావాస సౌకర్యాలు కల్పించకపోతే వారు తమజీవనోపాధిని స్వయంగా సంపాదించుకోలేరు. సామాన్యంగా మనసమాజంలో ముసలివారిని, దీర్ఘకాల రోగులను చీదరించుకుంటూ అసహ్యించుకుంటూ పోషిస్తారేతప్ప, సాటిమానవులుగా గౌరవించరు. వికలాంగులు ప్రమాదవశాత్తు కుంటితనం వచ్చినవారు, మరుగుజ్జులు సమాజంలో గౌరవించబడటంలేదు. ఆర్థిక, శారీరక బలహీనతల వల్ల వీరు భిక్షాటనవృత్తిని చేపట్టవలసి వస్తున్నది. అయితే కొందరు వికలాంగుల మాదిరిగా నటించి ధనార్జన చేస్తుంటారు.

## II. ఆర్థిక కారణాలు

దారిద్ర్యం, నిరుద్యోగం, సరైన ఉద్యోగం లేకపోవడం, వీటివల్ల భిక్షాటన ఒక లాభసాటి వ్యాపారంగా రూపొందింది. అనాథలు, నిర్లక్ష్యం చేయబడిన స్త్రీలు, విధవలు, భర్త వదిలివేసినవారు మొదలైనవారు కేవలం ఆర్థిక దుస్థితివల్ల భిక్షాటన చేయవలసి వస్తున్నది.

### A) దారిద్ర్యం, నిరుద్యోగం :-

సరైన ఉపాధి లేకపోవడంవల్ల వ్యక్తులు తమను తమ కుటుంబాన్ని పోషించలేనపుడు భిక్షాటనకు పాల్పడతారు. మన దేశంలో జనాభా పెరుగుదలవల్ల, గ్రామీణ ప్రాంతాలలో ఉద్యోగ అవకాశాలు లేకపోవటంవల్ల, ప్రజలు అధికంగా గ్రామీణ ప్రాంతాల నుంచి పట్టణ ప్రాంతాలకు తరలిపోతున్నారు. వీరికి పట్టణాలలో కూడా సరైన ఉపాధి సౌకర్యాలు లభించకపోగా గత్యంతరం లేక వీరు భిక్షాటనను సిద్ధపడుతున్నారు. "భారత దేశంలో గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ రంగంలో ఉపాధి సౌకర్యాలు లేకపోవటం భిక్షాటనకు సాధారణమైన కారణమని" డాక్టర్ ఆర్. కె. ముఖర్జీ తెలిపారు.

### B) ఉద్యోగాన్ని పోగొట్టుకోవటం

సరైన ఉద్యోగం లేకపోవటంవల్ల మాత్రమేగాక, కుటుంబంలో ఉద్యోగం ద్వారా సంపాదించే వ్యక్తి, అదికాస్తా పోగొట్టుకుంటే కుటుంబపు సామాజిక, ఆర్థిక అంతస్థు దెబ్బతింటుంది. దానివల్ల కుటుంబం నైతికంగా పతనంచెంది, చివరకు భిక్షాటనకు పాల్పడతారు. ప్రజలకు ఉద్యోగాలు లేకపోవడం వల్లకూడా మన సమాజంలో భిక్షువుల సంఖ్య పెరుగుతుంది. మన దేశంలో అనేక ప్రాంతాలలో ప్రజలు కూలీలుగా పనిచేస్తూ, విరామ సమయంలో యాచన కూడా చేసి తమ జీవనాన్ని గడుపుకుంటున్నారు.

అయితే బీదవారంతా భిక్షువులు కారు. భిక్షువులంతా బీదవారూ కారు. దారిద్ర్యం భిక్షాటనకు ఒక కారణమని చెప్పవచ్చు.

### C) లాభసాటి వ్యాపారం

కొంతమంది కష్టించి పనిచేయటానికి ఇష్టపడక సులభమార్గంలో ధనార్జన చేయటం కోసం భిక్షాటనను చేపడతారు. వంశపారంపర్యంగా భిక్షాటన చేసేవారికి ఇది లాభసాటియైన వృత్తి. దీనికితోడు, భిక్షువులు కొందరు పిల్లలను దొంగిలించి, తీసుకునిపోయి, కొంతకాలం పోషించి, భిక్షాటనలో శిక్షణనిచ్చి, ధనార్జన చేస్తారు. అట్టి పిల్లల నాయకుడు ఆ పిల్లల సంపాదనంతటినీ వసూలు చేస్తాడు. మన భారత దేశంలో జరుగుతున్న అతివిషాదకర సంఘటనలలో, ఇది ప్రధానమైనది. ఇది చాలా మందికి తెలియదు.

## III. సావాజిక కారణాలు :

సంప్రదాయ సిద్ధమైన సమిష్టి కుటుంబాలలో ముసలివారికి, బలహీనులకు, అనారోగ్యంతో ఉన్నవారికి ప్రత్యేకమైన భద్రత ఉండేది. పారిశ్రామికీకరణంవల్ల, నగరీకరణంవల్ల, సమిష్టి కుటుంబం-సముదాయం ఈ రెండూ అవ్యవస్థకు లోనయినాయి. అందువల్ల కుటుంబం అట్లాంటి వ్యక్తులకు భద్రత కల్పించలేకపోవటంవల్ల వారు పీడినపడి భిక్షాటన చేస్తున్నారు. పారిశ్రామిక ప్రాంతాలలో స్త్రీలుకూడా పురుషులతో సమానంగా పనిచేయడంవల్ల, పగలంతా ఇల్లువిడిచి పోవటంవలన, వారిపిల్లలకు సరి అయిన రక్షణ, శిక్షణ లేక వ్యక్తిగత శ్రద్ధలేక చెడుసహవాసాలకు లోనయి, తిరుగుబోతులయి చివరకు భిక్షాటనకు పాల్పడుతున్నారు. కొన్ని సంప్రదాయ సిద్ధమైన సామాజిక సమూహాలవారు భిక్షాటనను తమ కులవృత్తిగా భావిస్తున్నారు. ఉదాహరణకు జంగాలు, దాసర్లు, హరిదాసులు, కోయలు మొదలైనవారు. వీరు ఇంటింటికి వెళ్ళి భిక్షాటన చేస్తారు. కొన్ని ప్రత్యేక పండుగలు, సాంఘిక ఉత్సవాల సందర్భంగా ప్రజలు విరివిగా దానధర్మాలు చేయటంకూడా భిక్షాటనను ప్రోత్సహించినట్లు అవుతుంది.

## IV. మతపరమైన కారణాలు :

సాధు, ఫకీరు వేషాలలో భిక్షాటన చేసేవారికి చక్కని ప్రోత్సాహంకూడా ఉంటుంది. కొంతమంది తమ పాపపరిహార్థం దానాలు చేస్తే, అట్టిదానాలు కొంతమందిని భిక్షాటనకు పాల్పడేటట్లు ప్రోత్సహిస్తాయి. పర్వదినాలలో, జన్మదినాలలో, వివాహ సమయంలో, మరణ సమయంలో కొందరు దానధర్మాలు చేస్తారు. మోక్షంకోసం మరికొందరు దానాలు చేస్తారు.

విచక్షణలేకుండా దానధర్మాలు చేయడంవల్లనే భిక్షాటన వృత్తి అధికంగా ప్రబలుతున్నది. ఈ వృత్తి సామాజిక, ఆర్థిక పరిస్థితుల పర్యవసానమని నిశ్చితంగా చెప్పవచ్చు.

## ఫలితాలు :

భిక్షాటన వృత్తివల్ల అనేక దుష్ఫలితాలు ఏర్పడతాయని, పై కారణాలవల్ల తెలుస్తున్నది. కింది దుష్ఫలితాలను మనం ఈ వృత్తిలో చూడవచ్చు.

**1. సోమరితనం :-**

భిక్షువులంతా సోమరులని చెప్పవచ్చు. ప్రతిఒక్కరూ ఏదోవిధమైన నిర్మాణాత్మక కార్యక్రమాలలో పాల్గొనవచ్చు. కాని భిక్షాటన వృత్తిలో ప్రవేశించినవ్యక్తి సోమరిఅయి ఏ పనినీ చేయటానికి ఇష్టపడడు.

**2. సాంఘిక నేరాలు :-**

**A)** భిక్షువులలో కొంతమంది నటించటంకోసం తమ అవయవాలకు ఎర్రరంగు పూసిన గుడ్డ పీలికలు కట్టుకుని, గాయపడినట్లు, దీర్ఘకాల రోగాలకు గురిఅయినట్లు ప్రజలను మోసగిస్తారు.

B) కొంతమంది స్త్రీలను బలవంతంగా భిక్షాటనలోకి దించి తరువాత వ్యభిచార గృహాలకు వారిని అమ్మి డబ్బు సంపాదిస్తారు.

C) కొన్ని కొన్ని సమయాలలో కొంతమంది భిక్షువులు పసిపిల్లలను అక్రమంగా ఎత్తుకుపోయి అవయవాలను వికలతకు గురిచేసి వారిని ఎరచూపి డబ్బు సంపాదిస్తారు.

D) కొంతమంది స్త్రీలను పగలంతా భిక్షాటనకు పంపి, రాత్రులలో వ్యభిచారానికి బలిచేస్తారు.

3. అంటువ్యాధులు :

అనేకమంది భిక్షువుల ద్వారా భయంకరమైన కొన్ని అంటు వ్యాధులు సమాజంలో వ్యాపిస్తుంటాయి. గజ్జి, చిడుము, తామర, క్షయ, కుష్టు మొదలైన వ్యాధులను వ్యాపింపచేస్తాయి.

4. అనారోగ్య పరిస్థితులు :

భిక్షువులు బహిరంగ ప్రదేశాలలో మల విసర్జన, మూత్ర విసర్జన చేయటంవ్వారా పరిసరాలను పాడుచేస్తారు. రైల్వే ప్లాట్‌ఫారాలపై, బస్‌స్టాండులలో, ఫుట్‌పాత్‌లపై నిద్రపోతారు. ఆయా ప్రదేశాలను అనేక విధాలుగా కలుషితం చేస్తారు.

5. వ్యక్తిగత అవ్యవస్థత :

భిక్షాటన వృత్తిలో ఉన్న వ్యక్తులు తమ మూర్తిమత్వాన్ని కుంటుపరచుకొని అవ్యవస్థతకు లోనయి తమకు తాముగా ఒక సమస్య అయి, సమాజానికి భారం అవుతారు.

6. కుటుంబ అవ్యవస్థత :

భిక్షాటనలో ఉన్న కొన్ని కుటుంబాలు అవ్యవస్థతకు లోనయి అనేక నేరప్రవృత్తులకు తలపడతారు.

## భిక్షాటన వృత్తి - నిషేధం

ఈనాడు ప్రపంచంలో నాగరిక దేశాలన్ని భిక్షాటనను ఒక సాంఘిక సమస్యగా పరిగణించాయి. అందువల్ల అనేక భిక్షాటన నిషేధ చట్టాలు ప్రవేశపెట్టటమైంది. ఇట్టి చట్టాలను అతిక్రమించిన వారు నేరస్తులుగా, శిక్షార్హులుగా పరిగణించబడతారు. అయితే భిక్షాటనను చట్టరీత్యా నిషేధించటానికి గల బలమైన కారణాలను కింది విధంగా పేర్కొనవచ్చు.

1. భిక్షువులు సమాజానికి చీడపురుగుల వంటివారు.
2. సమాజంలోని ప్రశాంతతకు భిక్షాటన భంగం కలిగిస్తుంది. అట్లా ప్రశాంతతను భంగపరిచే హక్కు ఎవరికీ లేదు.
3. ఏ మతమూ సోమరితనాన్ని హర్షించదు. అంతేకాదు. సోమరులకూ, ఇతర భ్రష్టులకు విచక్షణా రహితమైన దానధర్మాలను ఏ మతమూ ప్రోత్సహించదు.
4. వ్యక్తులు విచక్షణారహితంగా దానాలు చేయటంవల్ల భిక్షాటన వృత్తికి ప్రోత్సాహం లభిస్తుంది.

5. పిల్లలను అపహరించి, వారికి అంగవైకల్యాన్ని కలిగించి, అట్లాంటివారిని ప్రదర్శించి ధనార్జన చేసే క్రూరపస్థులను భిక్షాటనవృత్తి పురికొల్పుతుంది.
6. భిక్షువు అవ్యవస్థకు లోనయి నైతికంగా పతనంపొంది ఆత్మగౌరవాన్ని కోల్పోతాడు. అందువల్ల అతడు జేబులుకొట్టటానికి, దొంగతనాలకు దోపిడీలకు జంకడు.

ఈ కారణాలన్నీ భిక్షాటనవృత్తి ద్వారా, సమాజానికి అతిప్రమాదం ఏర్పడవచ్చునని భావించవచ్చు. అందువల్ల ఈ వృత్తిని నిషేధించి, భిక్షువులకు సరైన పునరావాసం కల్పించవలసి ఉంటుంది.

## పునరావాస కార్యక్రమాలు :

ధనవంతులు, ఆస్తిపరులు, పాలకులు–ఆశ్రమాలను, ధర్మశాలలను, కట్టించి, దానధర్మాలు చేస్తూ, బీదవారికి తిండి, గుడ్డ, వసతి సౌకర్యాలు కల్పిస్తూ ఉండేవారు. అందువల్లనే సన్యాసులు, సాధువులు, వికలాంగులు మొదలగు భిక్షువులు ఆశ్రమాలలో జీవితాన్ని గడిపేవారు. త్వరితగతిలో సామాజిక పరివర్తనవల్ల పాతవ్యవస్థలు క్రమేపీ క్షీణించటంవల్ల ఎటువంటి ఆధారమూలేక భిక్షువులు నేటి ఆధునిక సమాజంలో సమస్యగా తయారైనారు.

## భిక్షువులకు కింది ప్రకారం పునరావాస కార్యక్రమాలను నిర్వహించవచ్చు :

**1.** భిక్షాగృహాలు :

భిక్షువులను చట్టరీత్యా కారాగారాలలో బంధించటం వల్లకాని, జరిమానా విధించటం వల్లకాని సమస్య పరిష్కారం కాదు. వారిని శిక్షించటానికి బదులు భిక్షా గృహాలలో ఉంచి శిక్షణ ఇవ్వటం మంచిది. వివిధ వృత్తి విద్యలలో శిక్షణ, సభ్యత – సంస్కారంలో శిక్షణ, ఆరోగ్యపు అలవాట్లలో తర్ఫీదు మొదలగునవి ఇవ్వాలి. ప్రతి రాష్ట్రంలో ఒక కేంద్రాన్ని ఏర్పాటుచేసి భిక్షువులను అక్కడకు పంపాలి. వైద్య పరీక్షలుచేసి వారిని వర్గీకరించాలి. వారివారి స్వభావాలను, అభిరుచులను బట్టి వేర్వేరుగా నివాసం, శిక్షణ ఏర్పాటు చేయాలి. శరీరదారుఢ్యంవున్న భిక్షువులను వ్యవసాయ క్షేత్రాలలో కాని, కర్మాగారాలలోకాని పని కల్పించాలి. భిక్షువులను ప్రవేశపెట్టటానికి, శిక్షణ ఇవ్వటానికి, తరవాత పునరావాస ప్రయత్నాలు చేయటానికి, వీటికన్నిటికీ సంబంధించిన సమగ్ర కార్యక్రమాలను ప్రభుత్వం రూపొందించి అమలుజరపాలి.

2. సాధారణ చర్యలు :

సాధారణ సాంఘిక భీమా, సమగ్ర సాంఘిక భద్రతా కార్యక్రమాలను అమలుపరచాలి. అనారోగ్యంగా ఉన్నవారికి, ప్రమాదానికి గురి అయిన వారికి, మరణాంతరం కుటుంబ సభ్యులకు, నిరుద్యోగులకు ఈ భద్రత ఏర్పాట్లు చేయాలి. విచక్షణారహితమైన దానధర్మాలపట్ల నిరుత్సాహాన్ని కలిగించేటట్లు సాంఘిక చర్య జరపాలి. అనేక అభివృద్ధి పథకాల ద్వారా ప్రజల ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచి వైయక్తిక, కుటుంబ సంక్షేమ కార్యక్రమాలను అమలుపరచాలి.

పరిశీలనలు – చట్టాల సవరణ :

ఇంతవరకు బొంబాయి, మద్రాస్, కాన్పూరు, కలకత్తా మొదలైన పట్టణాలలో భిక్షువులను గురించి కొన్ని పరిశీలనలు జరిగాయి. పంచవర్ష ప్రణాళికలు భిక్షుగృహాలను (Beggar Homes) ప్రారంభించటానికి అవకాశం కల్పించాయి. తరవాత అనేక రాష్ట్రాలలో లోపభూయిష్టమైన చట్టాలను సవరించి భిక్షాటన నిషేధించటమైంది. తరవాత అనేక రాష్ట్రాలలో భిక్షాటన నిరోధక చట్టాలు ఆమోదించడమైంది.

## చట్టాలు - ప్రణాళికలు - రాష్ట్రాలలో కృషి :

బీహార్ భిక్షాటన నిరోధక చట్టం 1952, బొంబాయి భిక్షాటన నిరోధక చట్టం 1945, మైసూర్ భిక్షాటన నిరోధక చట్టం 1944, హైదరాబాదు భిక్షాటన నిరోధక చట్టం 1941, మొదలగు శాసనాలద్వారా, రాష్ట్రాల స్థాయిలో, భిక్షాటనను బహిరంగ స్థలాలలో నిషేధించారు. స్వాతంత్ర్యానంతరం దాదాపు అన్ని రాష్ట్రాలలో భిక్షాటనను నిషేధిస్తూ శాసనాలు వచ్చాయి. ప్రణాళికలద్వారా కృషి కొంత జరిగింది. రెండో ప్రణాళికాకాలంలో ప్రతిరాష్ట్రం భిక్షుక గృహాలను స్థాపించాలని సూచన వచ్చింది. వివిధ రాష్ట్రాలలో 26 భిక్షుక గృహాలు స్థాపించటానికి నిర్ణయమైంది. మూడో ప్రణాళికా కాలంలో మరో 26 భిక్షుకగృహాలు మంజూరు అయినాయి. నాలుగో ప్రణాళికలో 3 కోట్లు కేటాయించారు. దానితో ఇంచుమించుగా అన్ని రాష్ట్రాలలో భిక్షుక గృహాలు స్థాపించటమైంది.

1961 లో మన రాష్ట్రప్రభుత్వం కర్నూలులోనూ, వరంగల్లులోనూ భిక్షుక గృహాలు నిర్మించింది. 1962 లో హైదరాబాద్‌లో రెండు భిక్షుక గృహాలు స్థాపించడం జరిగింది.

## భిక్షాటన నిర్మూలన - సంఘ సంక్షేమ కార్యకర్త పాత్ర :

భిక్షువుల పునరావాస కార్యక్రమాలకు సంబంధించిన సంస్థలలో సంఘసంక్షేమ కార్యకర్త పాత్ర చాలా ప్రధానమైనది. ఎందువల్లనంటే, అతడు నేర్చుకున్న శాస్త్రీయ పరిజ్ఞానం ఈ సంస్థల ద్వారా సహాయాన్ని పొందే వ్యక్తుల జీవితాలలో మార్పు తీసుకురావటానికి ఉపయోగపడుతుంది. భిక్షాటన నిర్మూలనకు సంఘసంక్షేమ కార్యకర్త అనేక విధాలుగా పాటుపడవచ్చు.

1. ప్రజాభిప్రాయాన్ని భిక్షాటనకు వ్యతిరేకంగా సాంఘిక చర్యా పద్ధతుల ద్వారా మలచవచ్చు. భిక్షాటన వృత్తి సమాజానికి ఒక "చీడ" అని తెలపాలి.
2. నిరుద్యోగ భృతి, వయోవృద్ధులకు ఆర్థిక సహాయం, వైద్య సహాయం మొదలైన అసంస్థాగత సేవలను (Non inistitution services) నిర్వహించాలి.
3. భిక్షుక గృహాలు, వయోవృద్ధుల సంక్షేమ గృహాల స్థాపనకు కృషి చేయాలి.
4. కేంద్రస్థాయిలో, రాష్ట్రస్థాయిలో భిక్షాటనను నిషేధిస్తూ శాసనాలను తీసుకురావడంలో సాంఘిక చర్య కార్యకర్తగా కృషి చేయాలి. ఉన్న శాసనాలను కట్టుదిట్టంగా అమలు పరిచేందుకు కృషి చేయాలి.

5. ప్రతి తాలూకా స్థాయిలో గ్రామీణ గృహాలు స్థాపించి, ఆయా ప్రాంతాలలోని భిక్షువులకు స్థానం కల్పించి పనిపాటలు నేర్పించాలి.
6. భిక్షువుల పిల్లలను ముఠాల వలయం నుండి కాపాడాలి.
7. ఆర్థిక అసమానతలు తొలిగేందుకు కృషి జరపాలి.
8. మతంపేరిట భిక్షాటన చేసేవారిని నిరుత్సాహపరచి దానధర్మాలకు స్వస్తి చెప్పాలి.

వ్యక్తిసేవ, సామూహికసేవ, C. O., S. R. - Details

## భిక్షాటన నిర్మూలనలో సంఘ సంక్షేమ శాస్త్రీయ పద్ధతుల ఉపయోగం :

వ్యక్తి సేవా పద్ధతి :

భిక్షాటన నిర్మూలనకు సంఘ సంక్షేమ కార్యకర్త వ్యక్తి సేవాపద్ధతిని ఉపయోగించినపుడు భిక్షువులను వ్యక్తిగతంగా కలవాలి. ఇంటర్వ్యూ ప్రక్రియ ద్వారా భిక్షువుల సమస్యలను వ్యక్తి సేవలో ఉన్న ప్రాథమిక సూత్రాలకులోబడి పూర్తిగా అర్థం చేసుకోవాలి. భిక్షువుల వ్యక్తిగత బలహీనతలను తెలుసుకొని, తగినరీతిలో చికిత్సా మార్గాలను రూపొందించాలి.

## సామూహిక సేవాపద్ధతి :

సామూహిక సేవాపద్ధతిలో సంఘసంక్షేమ కార్యకర్త భిక్షువుల సమూహాలను పరీక్షిస్తాడు. భిక్షువుల సాంఘిక సమూహజీవన పద్ధతిలో ఉన్న 'పరాన్న భుక్కు' ప్రవర్తనను, బాధ్యతారహిత జీవనవిధానాన్ని కూలంకషంగా తెలుసుకుంటాడు. వివిధ పద్ధతులద్వారా భిక్షాసమూహాలలో సాంఘిక చైతన్యాన్ని కలిగించి బాధ్యతకలిగిన పౌరులుగా బ్రతకాలన్న కోరికను కలిగిస్తాడు. దీనికోసం దృశ్య, శ్రవణాత్మక సాధనాలను ఉపయోగిస్తాడు.

## సాముదాయిక వ్యవస్థాపన ;

భిక్షువుల సముదాయాలలో సాంఘిక సంక్షేమకృషి విశిష్టమైన పద్ధతిలో జరుగుతుంది. సాంస్కృతిక, విద్యా, వినోద కార్యక్రమాలద్వారా భిక్షాటన తప్పు అన్న భావనను కలిగిస్తాడు. సమాజంద్వారా కలిగే సాంఘిక ప్రయోజనాల పరమార్థాన్ని ప్రతిభిక్షువు తెలుసుకోవటానికి కార్యకర్త కొన్ని ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహిస్తాడు. భిక్షువుల సమస్యలను, అవసరాలను తెలుసుకొని, అందుకు అవసరమైన వనరులను సమాజంలో సమీకరిస్తాడు. 'అవసరాలు – వనరుల లభ్యం – సమస్యా పరిష్కారం' అనే ప్రక్రియను కార్యకర్త నిర్వహిస్తాడు.

కార్యకర్త కొన్ని కార్యక్రమాలు నిర్వహించటంద్వారా భిక్షువులపట్ల ప్రజలలో సానుభూతిని కలిగిస్తాడు. 'భిక్షువును అసహ్యించుకోవటానికి బదులు – భిక్షువును బాగుచెయ్యి' అనే సందేశంద్వారా ఈ పనిని నిర్వహిస్తాడు. చట్టపరమైన సహాయాన్ని భిక్షువులకు అందిస్తాడు.

# మురికివాడలు
# (SLUMS)

త్వరితగతిన మారుతున్న ఆధునిక సమాజంలో మురికివాడలు ఒక ముఖ్య సమస్యగా తయారైంది. భారత దేశంలో మురికివాడలులేని నగరాలులేవని చెప్పవచ్చు. స్వాతంత్ర్యానంతరం నగరాభివృద్ధితోపాటు మురికివాడల సంఖ్య పెరిగింది. అన్నవస్త్రాలతోపాటు వసతి సౌకర్యం కూడా జీవిత ముఖ్యావసరాలలో ప్రధానమైంది. అపరిశుభ్రమైన పరిసరాలు వ్యక్తుల ఆరోగ్యాన్ని, సామాజిక ప్రవర్తనను కుంటుపరుస్తాయి. పారిశ్రామికీకరణ, నగరీకరణవల్ల అపరిశుభ్రత, వసతి సౌకర్య లోపం, మురికివాడల పెరుగుదల అధికమౌతున్నాయి. ఈ సమస్యను వీలైనంతతొందరగా, మెలకువలో పరిష్కరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. సామాజిక అవ్యవస్థ స్థితిగతులను అభివృద్ధికీ మురికివాడలకూ వీడని అనుబంధం ఉంది. నగరాలలోవున్న మురికివాడలు బాగుపడితే సామాజిక అభివృద్ధిని మనం ఎంతైనా సాధించవచ్చు.

## నిర్వచనం

"శిథిలావస్థలోవుండి, ఏ క్షణంలోనైనా కూలిపోతాయనిపించే ఇండ్లు, పూరిగుడిసెలు, వాటికిమించి ఉండే అధిక జనాభా, అనారోగ్య పరిస్థితులు మొదలైన లక్షణాలతో బీదవారు, కూలి జనం నివసించే ప్రాంతాన్ని మురికివాడలుగా మనం భావించవచ్చు."

భారత కార్మికులపై రాయల్ కమీషన్ (**Royal Commission on Indian Labour, 1931**) వారు మురికివాడలపై అభిప్రాయాన్ని తెలియచేస్తూ "మురికివాడలలో గృహాలన్నీ అతి చేరువగా ఉంటూ ప్రక్కలూ, వెనకా-ముందూ, ఉన్న స్థలాన్నంతటినీ, సాధ్యమైనంతగా ఉపయోగిస్తూ, మనుష్యులు తిరిగేందుకు చిన్నచిన్న సందులు విడిచి, చెత్తా-చెదారం, దుమ్ము-ధూళి, మన్ను-మశానంతో ఈ ప్రాంతం మగ్గిపోతూ, గాలి, నీరు పూర్తిగా అపరిశుభ్రంగా ఉంటాయి. ఆరుబయలు లేక కిటికీ తలుపులు లేక మురికికూపంలోవున్న చిన్న గదులకు పాత కిరోసిన్ డబ్బారేకులతో, పాత గోనెసంచుల గుడ్డతో గోప్యతకోసం తెరలా అమరుస్తారు. వీటివల్ల వచ్చే గాలి, వెలుతురు కూడా రాదు.

ఐక్యరాజ్యసమితి రిపోర్టులో – "జనసమ్మర్థంతోనూ, అపరిశుభ్ర పరిసరాలతోనూ ప్రజల శారీరక, మానసిక, నైతిక ఆరోగ్యాన్ని భంగపరిచే పరిస్థితులతోనుకూడిన ప్రాంతాన్ని మురికివాడలని" నిర్వచించారు.*

## మురికివాడలు - ఉదాహరణలు (Examples)

మురికివాడలు భారతదేశంలో అతి ముఖ్యమైనవి చూడాలనుకుంటే బొంబాయి, కలకత్తా, కాన్పూర్, మద్రాస్ వంటి మహానగరాలు సందర్శించాలి. అయితే మురికివాడలను బొంబాయిలో చాల్స్ (Chawls) అని, కలకత్తాలో బస్తీ (Bustees) లని, కాన్పూర్ అహతాలనీ (Ahtas), మద్రాస్‌లో చేరీలని (Cheries) పిలుస్తారు. ఇవి దేశంలో కొన్ని అతి ముఖ్యమైన మురికివాడలుగా చెప్పవచ్చు.

## మురికివాడలు - ముఖ్యలక్షణాలు :

మురికివాడలలో ముఖ్యంగా మనకు అయిదు లక్షణాలు కనబడతాయి. అవి—

1. తక్కువ రకంగా ఉండే ఇండ్లు, శిథిలావస్థలో ఉండే ఇండ్లు, పూరిగుడిసెలు.
2. మంచినీటి కొరత, స్నానాలగదులు, మరుగుదొడ్లు లేకపోవడం.
3. గుడిసెల పరిసర ప్రాంతాలలో ఉన్న అపరిశుభ్రమైన చెత్తా, చెదారం, మురుగునీటివల్ల భరింపరాని చెడువాసన ఇతర అనారోగ్య పరిస్థితులు ప్రత్యక్షంగా కనిపించడం.
4. నగరంలో ఉంటూ, అనారోగ్య పరిస్థితులు, నైతికపతనం కనిపించటం.
5. అధిక జనాభా.

మురికి వాడలు – **మూడు** విధాలు :-

పారిశ్రామిక విప్లవం తరవాత మురికివాడలను **మూడు**విధాలుగా విభజనచేశారు.

1. పరిశ్రమల ప్రాంతాలలో మురికివాడలు
2. ఆర్థిక దుస్థితి – మురికివాడలు
3. నగర వ్యాపార కేంద్రం – మురికివాడలు

**I.** పరిశ్రమల ప్రాంతాలలో మురికివాడలు

పరిశ్రమలలో పనిచేసే కార్మికులు తక్కువ అద్దెకు లభించే ఇండ్లలో నివసిస్తూ ఉంటారు. ఈ ఇండ్లలో సౌకర్యాలు అంతగా ఉండవు. భారతదేశంలో ఉన్న నగరాలలో పరిశ్రమలను చుట్టు ముట్టుకొని అనేక మురికివాడలున్నాయి.

**II.** ఆర్థిక దుస్థితి – మురికివాడలు

ఆర్థికంగా బలహీనవర్గాలకు చెందిన కుటుంబాలవారు మంచి నివాస ప్రాంతాలలో గృహ వసతి సౌకర్యాలు ఏర్పరచుకోలేనందువల్ల వారు పనిచేస్తున్న కేంద్రాలకు, సంస్థలకు, సమీపంలో ఇరుకు ప్రాంతాలలో తాత్కాలిక వసతిని ఏర్పరచుకొని మురికివాడల అభివృద్ధికి తోడ్పడుతున్నారు.

---

* Report on the world situation (U. N. Publication, 1957)

III. నగర వ్యాపార కేంద్రం - మురికివాడలు

కొన్ని మురికివాడలు నగరాలలో ఉన్న వ్యాపార కేంద్రాలకు దగ్గరగా వెలుస్తాయి. వ్యాపారం నిమిత్తం అధిక సంఖ్యలో జనాభా వస్తూపోతూ ఉంటారు. అటువంటివారిని ఆకర్షించి సద్యోవిధంగా డబ్బు సంపాదించటానికి అనేకవిధాలుగా అవినీతిపరులు, బ్లాకెట్ ఆటగాళ్ళు, జూదరులు, త్రాగుబోతులు, పడుపువృత్తిపై జీవించేవారు ఈ ప్రాంతాలలో నివసిస్తూ మురికిపేటలను అభివృద్ధి చేస్తారు. వారివారి కార్యక్రమాలను ఇండ్లను చిన్నవిగా విభజించటమేకాక, పరిసరాల శుభ్రతను పాటించరు.

పారిశ్రామిక పట్టణాలలో, నగరాలలో అధికశాతం ప్రజానీకం రైల్వే ప్లాట్‌ఫారాలమీదనో, రోడ్లప్రక్కనో, ఇతర ఖాళీప్రదేశాలలోనో జీవనం గడుపుతారు. ఇంకా అనేక మిలియన్ల ప్రజలు గుడిసెలలో, ఒక్కగది ఉండే పూరిళ్ళలో, అపరిశుభ్రత, వాతావరణంలో, మురుగుకాలవగట్లపై నివసిస్తూంటారు.

## మురికివాడల పెరుగుదల - కారణాలు :

మురికివాడల పెరుగుదలకున్న కారణాలను కిందివిధంగా చెప్పవచ్చు.

1. పేదరికం

మురికివాడలు శీఘ్రగతిని పెరగటానికిగల ప్రధాన కారణం - పేదరికం. చిన్నకూలీలు, కార్మికులు, మధ్యతరగతివారు మంచి ఇండ్లను కట్టుకోలేరు. గృహనిర్మాణ పద్ధతిలో ఖర్చు మితిమీరి పెరగటంవల్ల ఒక సామాన్య కార్మికుడు, మధ్యతరగతి ఉద్యోగి ఇండ్లు కట్టడం గాలిమేడగా మిగిలి పోతుంది. అందువల్ల అట్టి పరిస్థితిలో మురికివాడలలో నివసించక తప్పదు.

2. వలస

పల్లె ప్రాంతాల నుంచి పట్టణ ప్రాంతాలకు అనేకమంది వలసపోతున్నారు. ఉద్యోగం కోసం, వ్యాపారం కోసం, నాగరికత ఆకర్షణ, ప్రభుత్వ కార్యాలయాలలో కార్యకలాపాలు, విద్యా సదుపాయాలు, ఇతర కారణాలవల్ల ఈ వలస జరుగుతుంది. అందువల్ల పట్టణాలలో ఉన్న ఇండ్లనే సదుపాయాలు లేకుండా కొన్ని భాగాలుగాచేసి అద్దెలకివ్వడం జరుగుతున్నది. అందుకే నగరాలలో ఇండ్లు ఎంత చిన్నవైనా పెద్దవైనా భాగాలుగాచేసి ఎక్కువ అద్దెను రాబట్టటం ఒక వ్యాపారంగా రూపొందింది.

3. అధిక జనాభా :

అధిక జనాభా కారణంగా మూఢ నమ్మకాలు, పాత అలవాట్లు, ఆరోగ్యసూత్రాలపట్ల నిర్లక్ష్యం మొదలయిన వాటివల్ల మురికివాడలు దినదినాభివృద్ధి చెందుతున్నాయి. అధిక జనాభావల్ల సామాజిక అవ్యవస్థ ఏర్పడుతుంది. తలసరి ఆదాయం తక్కువ కావటంవల్ల, సంపూర్ణాహారం, వైద్య సదుపాయం లేకపోవటంవల్ల, జీవన వయః పరిమితి తగ్గడమేకాక ఉత్పత్తి శక్తికూడా పడిపోతుంది.

త్రాగుడు, వ్యభిచారం, జూదం, బ్రాకెట్టు ఆట, దొంగతనాలు మొదలైనవి సామాన్య విషయాలుగా ఉంటాయి. ముఠాలుకూడా ఎక్కువ అభివృద్ధి చెందుతాయి.

4. నైతిక పతనం :

నైతిక విలువలు, ప్రవర్తన ఈ ప్రాంతాలలో అంతంత మాత్రంగానే ఉండటం కారణంగా బాలలమీద విపరీతమైన దుష్పరిణామాన్ని కలిగిస్తాయి. మానసిక, శారీరక, సృజనాత్మక శక్తులు కుంటుపడతాయి. సామాజిక వ్యతిరేకచర్యలకు పూర్తిగా అలవాటుపడిన బాలలకు అభివృద్ధి ఆగిపోతుంది. బాలనేరాలు, భిక్షాటన, శారీరక అంగవైకల్యంవంటి సమస్యలు విలయతాండవం చేస్తుంటాయి. ఈ సందర్భంగా (John J. Clarke) జాన్ జె. క్లార్క్ అనే పండితుడు – ''మురికివాడలలో ఉండే కుటుంబాలలో సామరస్య, సౌభ్రాత్రాలు తక్కువనీ, అక్కడ పెరిగే పిల్లలు బాలనేరస్థులు కావడమే కాక, తెలివితేటలలో వెనకపడిపోతారని'' భావిస్తున్నాడు.

5. అతిశీఘ్రంగా పెరుగుతున్న నగరీకరణ :

పరిశ్రమలు వెలుగుతున్న మూలంగా గ్రామాలు పట్టణాలుగా, పట్టణాలు నగరాలుగా, నగరాలు మహానగరాలుగా మారక తప్పదు. ఈ ప్రక్రియలలో ఛీమలవలె పెరుగుతున్న జనం మురికి వాడలు నిర్మించుకోనక తప్పదు.

6. పట్టణాలలో పారిశ్రామిక కేంద్రీకరణ – పారిశ్రామిక కార్మికులకు గృహసౌకర్యాల కొరత :

కొన్ని పట్టణాలలోను, నగరాలోలను పరిశ్రమలస్థాపన కేంద్రీకరించడమైంది. పరిశ్రమల యజమానులు కాని, ప్రభుత్వం కాని కార్మికులకు అవసరమైన గృహవసతి సౌకర్యాల నేర్పరచలేక పోతున్నాయి. అందువల్ల మురికివాడలు పెరుగుతున్నాయి.

7. చాలినంత స్థలం లేకపోవటం

పట్టణ, నగర ప్రాంతాలలో గృహనిర్మాణానికి అవసరమైనంత స్థలంకూడా అందుబాటులో లేదు. ఇండ్ల స్థలం ఖరీదు హెచ్చుగా ఉండటంవల్ల, ప్రజలు క్రిక్కిరిసిన ఇండ్లలో మురికివాడలలో నివసించవలసి వస్తున్నది.

8, రవాణా సౌకర్యాల కొరత

జనాభా పెరుగుతున్న శీఘ్రగతిని రవాణా సౌకర్యాలు పట్టణాలలో, నగరాలలో పెరగటం లేదు. అందువల్ల నిత్యం కార్మికులు దూర ప్రాంతాలకు ప్రయాణం నిమిత్తం ఖర్చుచేయలేక, కర్మాగారాల సమీపంలోనే, అపరిశుభ్ర పరిసరాలలో నివసించటం అలవాటు చేసుకుంటారు.

9. అద్దెను నియంత్రణ చేయలేక పోవటం

పట్టణ, నగర ప్రాంతాలలో అద్దె నియంత్రణ (Rent Control) చట్టాలు అసంతృప్తికరంగా ఉన్నాయి. గృహ యజమానులు తమ అద్దెలు వసూలు చేసుకోవటంలో ఉన్న ఆసక్తి, అద్దెకు ఉన్నవారికి కనీసపుసౌకర్యాలు కల్పించటంలో చూపించరు. అధిక అద్దెలను భరించలేనివారంతా మురికివాడలలో నివసించడానికి ముందుకువస్తారు.

10. పట్టణ, నగర నిర్మాణ పథకాలు లోపించటం :

సరైన పట్టణ, నగర నిర్మాణ అభివృద్ధి పథకాలు లేకపోవటంవల్ల మురికివాడలు పెరిగే అవకాశం ఉన్నది. కొన్ని ప్రాంతాలలో మంచినీరు లేక, రోడ్లులేక, గాలి వెలుతురు సరిగ్గా ఉండక, మురికినీటిపారుదల సౌకర్యాలు లేక, వీధులు అపరిశుభ్రంగా ఉండి అనారోగ్యాన్ని కలిగిస్తాయి.

## ఫలితాలు :

"భారతదేశంలో పారిశ్రామిక వాడలలోని మురికి ప్రాంతాలలో పురుషులు అజ్ఞానులుగా మారతారు. స్త్రీలను అవమానపరుస్తారు. మొదటిదశలోనే పసిపిల్లల హృదయాలలో విషబీజాలు మొలకెత్తుతాయి" –* అని డాక్టరు ఆర్. కె. ముఖర్జీ అభిప్రాయపడుతున్నారు.

మురికివాడలు బీదవారికి, నిరుద్యోగులకు, త్రాగుబోతులకు, పడుపుగత్తెలకు, బాలనేరస్థులకు ఆశ్రయాన్ని కల్పిస్తాయి. అజ్ఞానం, అనారోగ్యపు అలవాట్లు, సోమరితనం మొదలైనవి మురికివాడల జీవనవిధాన ముఖ్యలక్షణాలు. అనేక సామాజిక సమస్యలు ఒకదానితో మరొకటి ముడిపడి పడగ లెత్తుతాయి.

శారీరక, మానసిక, నైతిక ఆరోగ్యం పతనావస్థకు దారితీస్తుంది. ఇక్కడి ప్రజలు, అనేక అనారోగ్యానికి గురిఅయి వ్యాధిగ్రస్తులవుతున్నారు. ఇక్కడఉన్న అపరిశుభ్రత అనారోగ్య పరిస్థితులు– కలరా, టైఫాయిడ్, మశూచి, క్షయ మొదలైన అంటువ్యాధుల వ్యాప్తికి దోహదపడతాయి. ఈ పరిస్థితులలో ప్రజలలో నిరాశ, నిస్పృహ, మానసిక రుగ్మతలు, సంఘర్షణలు, ప్రకర్షణలు అభివృద్ధిచెందుతాయి.

అతిచిన్న ఇళ్ళల్లో అధిక కుటుంబసభ్యులు ఉండటమూ, వ్యక్తిజీవన విధానంలో గోప్యత లేకపోవటమూ, మొదలైన పరిస్థితులు వ్యక్తులలో ద్వేషము పగలను పెంపొందించి మూర్తిమత్వ అవ్యవస్థకు గురిచేస్తాయి.

మురికివాడలపై జరిగిన అనేక అధ్యయనాలు, పరిశీలనలవల్ల దారిద్ర్యం, యాచన, కుటుంబ అవ్యవస్థత, లైంగిక విచలిత ప్రవర్తన, జూదం, బాలనేరాలు, నేరాలు మొదలైనవి కేంద్రీకృతమవు తున్నాయని తెలుస్తున్నది. అంతేగాక తీరిక వేళల్లో వినోద కార్యక్రమాలు, ఇతర నిర్మాణాత్మక కార్య క్రమాలు లోపించటంవల్ల అనేక సాంఘిక సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి.

## పునరావాస కార్యక్రమాలు :

మనదేశంలో స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మురికివాడల నిర్మూలనకు చాలా కృషి జరి గింది. రెండో పంచవర్ష ప్రణాళికలలో ఇందుకు 20 కోట్లు కేటాయించారు. మురికివాడల నిర్మూలనా కార్యక్రమాలు అనేక పెద్ద నగరాలలో రూపొందించడమైంది. మురికివాడల నిర్మూలనా సంఘం వారి సూచనల మేరకు దీర్ఘకాలిక చర్చలతోపాటు మంచినీటి సౌకర్యాలు, లైట్లు, రోడ్లు, మురికినీటి పారు దల మొదలైన కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. మన పంచవర్ష ప్రణాళికలో మురికివాడలను, బీద

---

* Mukherjee R.K. "Indian Working Class" (1951) P. 319

వారి గృహాలను చక్కబరిచేందుకు - 1. ప్రైవేట్ రంగం 2. సహకార సంఘాలు 3. పురపాలక సంఘాలు 4. పారిశ్రామిక యజమానులు 5. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి నిర్వహిస్తాయని వివరించారు.

మురికివాడల సమస్యా పరిష్కారానికి రెండు ప్రధాన కార్యక్రమాలు ఉండాలి. 1. మురికి వాడల నిర్మూలన 2. ఉన్న మురికివాడలను బాగుపరచటం. ఇందుకు కేంద్రం ద్వారా రాష్ట్రానికి, రాష్ట్రం ద్వారా పురపాలక సంఘాలకు ఆర్థిక సహాయం అందించే పథకం 1956 సం॥లో అమలులోకి వచ్చింది. మొదట ప్రముఖనగరాలైన బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాస్, కాన్పూర్, అహమదాబాద్‌లలో మాత్రమే ప్రవేశపెట్టడమైంది.

## నగర సమాజ వికాస కార్యక్రమాలు

మురికివాడలలో అనేక సమాజ వికాస కార్యక్రమాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. గృహ నిర్మాణ కార్యక్రమాలు పిల్లలకు పార్కులు, మంచిగాలి, వెలుతురు కోసం చెట్ల పెంపకం, రక్షిత జలం, మురుగు నీటి కాల్వల పథకం, మరుగుదొడ్లు, స్నానాల గదులు ఏర్పరచటం ప్రధాన కార్య క్రమాలు.

పట్టణ ప్రణాళికల ద్వారా విశాలమైన రోడ్లు వేయటం నుండి మురుగునీటి కాలువలు, మంచినీటి కుళాయిలు, ప్రణాళికాబద్ధంగా ఉండే గృహనిర్మాణ పథకాలు మొదలైనవి ఎన్నో ఇందుకు ఉదాహరణలు. ఐక్యరాజ్యాల అంతర్జాతీయ శిశు అభివృద్ధి నిధి నుండి కొంత ఆర్థిక సహాయం కూడా ఈ పథకాలకు లభిస్తుంది. సమగ్ర శిశు అభివృద్ధి సేవలు అనే ఒక కార్యక్రమాన్ని భారత ప్రభుత్వం చేపట్టింది. గుర్తింపుపొందిన మహిళా సంఘాలు, యువజన సంఘాలు ఈ కార్యక్రమాలు చేపట్టవచ్చు. అటువంటి సంఘాలకు ప్రభుత్వ ఆర్థిక సహాయం కూడా లభిస్తుంది.

## మురికివాడల నిర్మూలన - సంఘసంక్షేమ కార్యకర్త పాత్ర :

మురికివాడల నిర్మూలనలో సంఘసంక్షేమ కార్యకర్తల పాత్ర ఎంతైనా ఉంది. దేశంలోని ప్రధాన నగరాలలో నగరాభివృద్ధి సంస్థలద్వారా నగర మురికివాడల ప్రజాసంక్షేమ కార్యక్రమాలను ప్రవేశపెట్టడం జరుగుతుంది. శిక్షితులైన సంఘసంక్షేమ కార్యకర్తలు ఈ సంస్థలద్వారా అనేక కార్య క్రమాలను నిర్వహించి మురికివాడల నిర్మూలనకు, ఉన్న మురికివాడలలోని ప్రజల అభివృద్ధికి పాటు పడవచ్చు. మురికివాడలలో ప్రజలకోసం కేవలం రోడ్లువేయటం, లైట్లువేయటం,మరుగుదొడ్లుకట్టించటం వంటి కార్యక్రమాలకు అంకితం కాకూడదు. కుటుంబాన్ని ఒక యూనిట్ (Unit)గా తీసుకుని, నివాస పరిస్థితులలో సరిక్రొత్త మార్పులు తీసుకొనిరావాలి. కుటుంబసభ్యులకు సరైన ఉద్యోగ అవకాశాలను కల్పించటం, ప్రాథమికవిద్యలో సరైన శిక్షణ, పరిసరాల పరిరక్షణ, వైద్యసహాయం, అభిరుచినిబట్టి వ్యక్తులకు వివిధ వృత్తివిద్యలలో శిక్షణ ఇప్పించటం, సరైన పోషకపదార్థాల పంపిణీకి ప్రయత్నించటం మొదలైన విషయాలతోపాటు, సాంఘికవిద్య, ఆరోగ్యవిద్య, వయోజనవిద్య వంటి కార్యక్రమాల ద్వారా, చక్కని ఆలోచనావిధానాన్ని కలిగించవచ్చు.

సాధ్యమైనంతవరకు తనకుతానుగా, ప్రతివ్యక్తి సహాయాన్ని చేసుకొనేరీతిలో కార్యకర్త కృషిచేయాలి. సాముదాయక వికాస కార్యక్రమాలు, వినోదం, ఇతర సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా, ప్రజా జీవన విధానంలో క్రొత్త ఊపిరిని పోయవచ్చు. సాంఘికచర్యా కార్యకర్తగా సమర్థవంతమైన పాత్రను నిర్వహించాలి. భారీఎత్తున చేపట్టే కార్యక్రమాలకు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో పనిచేస్తున్న స్వచ్ఛంద సేవాసంస్థలు సహాయాన్ని అర్థించాలి. స్థానిక స్వచ్ఛంద సేవా సంస్థలను ప్రతికార్యక్రమంలోనూ పాల్గొనే అవకాశాలను కల్పించాలి. బలహీనవర్గాలవారికి సబ్సిడీ పద్ధతిలో గృహనిర్మాణ పథకాలను చేపట్టాలి. ఈ విధంగా సంఘసంక్షేమ కార్యకర్త వ్యక్తి సేవా కార్యకర్తగా, సామూహిక సేవాకార్యకర్తగా, సాంఘిక సముదాయ కార్యకర్తగా, తన పాత్రను నిర్వహించాలి. అంతేగాక సంఘసంక్షేమ కార్యకర్త మురికివాడలలో నివసిస్తున్న ప్రజల జీవన పరిస్థితులపైన, వారి సమస్యలమీద పరిశోధనలు ఎప్పటికప్పుడు జరిపి, వాటిపై పరిష్కారమార్గాలను సూచించాలి.

# 12

# జనాభా సమస్య

## (Population Problem)

ఆధునిక సమాజంలో పెరుగుతున్న జనాభాను, నిశ్చలంగా ఉన్న వనరులను సమీక్షిస్తే ఎవరికైనా కలవరపాటు తప్పదు. జనాభా సమస్యను సాధ్యమైనంత తొందరగా, మెలకువగా పరిష్కరించకపోతే తీవ్రమైన పరిణామాలను సమాజం ఎదుర్కోవలసి ఉంటుంది.

జనాభా పెరుగుదల అన్ని దేశాలలోను ఒక విధంగా లేదు. కొన్ని దేశాలలో ఎక్కువ శాతంలోను, మరికొన్ని దేశాలలో తక్కువ శాతంలోను జనాభా పెరుగుతుంది. ఆర్థిక ప్రగతిపై జనాభా పెరుగుదల లేదా తగ్గుదల ప్రభావం గణనీయంగా ఉంటుంది. జనాభా సమస్యను గురించి మొదటిసారిగా చర్చించింది మాల్థస్. గాడ్‌విన్, కాండర్‌సెట్ మహాశయుల అభిప్రాయాలను విమర్శిస్తూ, 1798 లో మాల్థస్ "జనాభా సిద్ధాంతం – రానున్న సమాజాభివృద్ధి" అనే అంశంపై వ్యాసాన్ని రాశాడు. అతడు ఇంగ్లండ్ దేశపు క్రైస్తవ మతగురువు.

"స్త్రీ పురుషుల మధ్య ఉన్న పరస్పరాకర్షణ" – జనాభా పెరుగుదలకు ప్రధాన కారణమని వాదించాడు. యుద్ధాలు, క్షామం, వ్యాధులు మొదలైనవి సంభవించినపుడు సహజంగా కొంత జనాభా తగ్గుతుంది. మాల్థస్ అభిప్రాయం ప్రకారం–జనాభాను కొన్ని నిరోధకచర్యల (Preventive Checks) ద్వారా అంటే వివాహాన్ని, పిల్లలను కనటాన్ని వాయిదా వేసుకోవటం లేదా పూర్తిగా నిస్వీకరించటంవల్ల అదుపులోకి తీసుకురావచ్చునని చెప్పాడు.

వివాహం చేసుకున్నప్పటికీ, జనాభాను అదుపులోకి తీసుకురావచ్చునని ఫ్రెంచి తత్త్వవేత్త మార్క్విస్ డి కాండర్‌సెట్ చెప్పిన విషయాన్ని మాల్థస్ త్రోసిపుచ్చాడు. మాల్థస్ ఆంగ్లేయులనాటి పేదల చట్టాలువంటి సంక్షేమ కార్యక్రమాలను వ్యతిరేకించాడు. సంక్షేమ కార్యక్రమాలు జనాభా పెరుగుదలకు తోడ్పడతాయి అని విమర్శించాడు.

మాల్థస్ జనసంఖ్యా సిద్ధాంతం ప్రచారంలోకి వచ్చింది. 1803 ప్రచురణలో, 1798 లో చెప్పిన విషయాలను కొంత మార్పు చేశాడు. ఇంగ్లండ్ దేశంలో అప్పుడు జనాభా విపరీతంగా పెరుగుతున్నందువల్ల, లోపభూయిష్టమైన పేదరిక చట్టంవల్ల (Poor Law) మాల్థస్ జనాభా పెరుగుదల ప్రభావాలను నిశితంగా పరిశీలించాడు. ఆ పరిశీలన ఫలితమే ఆయన ప్రతిపాదించిన జనసంఖ్యా సిద్ధాంతం.

## జనాభా పెరుగుదల - మాల్థస్ సిద్ధాంతాలు :

జనాభా పెరుగుదలను గురించి మాల్థస్ ముఖ్యంగా మూడు విషయాలను చెప్పాడు :

1. జనాభా గుణోత్తరశ్రేఢి (Geometric Progression) లో పెరుగుతుంది. గుణోత్తరశ్రేఢి అంటే 1, 2, 4, 8, 16, 32 క్రమం. తగు జాగ్రత్తలు తీసుకోకపోతే 25 సంవత్సరాలకు ఒకసారి జనాభా రెండింతలవుతుంది. (ఆ కాలంలో ఇంగ్లండ్ లోను, అమెరికా లోను [illegible]) ఈ విధంగా జనాభా పెరిగింది.

(2) జనాభా, గుణోత్తర శ్రేఢితో పెరిగినా, ఆహారం పెరుగుదల అంకశ్రేఢి (Arithmatic Progression) ప్రకారం ఉంటుంది. అంకశ్రేఢి అంటే 1, 2, 3, 4, 5, 6, 7 క్రమం. ఈ విధంగా జనాభా, ఆహారపదార్థాలు పెరిగితే 200 సంవత్సరాల తరవాత ఈ రెంటికీ మధ్య నిష్పత్తి $\frac{259}{9}$ ఉంటుంది. 300 సంవత్సరాల తరవాత $\frac{4096}{13}$ ఉంటుంది. కాబట్టి జనాభా పెరుగుదల, ఆహారపదార్థాల పెరుగుదలను మించి ఉంటుంది. జనాభా పెరుగుదల, ఆహారపదార్థాల పెరుగుదలను మించి ఉంటుంది. జనాభా పెరుగుదల, ఆహారపదార్థాల పెరుగుదల పోటీలో ఆహారపదార్థాల పెరుగుదల వెనుకబడుతుంది.

(3) ఈ విధంగా జనాభా పెరిగితే కరువుకాటకాలు, అంటువ్యాధులు, యుద్ధాలు మొదలైన ప్రకృతి చర్యలు (Positive Checks) ప్రబలి, జనసంఖ్యను సంతులనం చేస్తాయని అతని అభిప్రాయం. జననాల రేటు తగ్గేటట్లు, ప్రజలు నిరోధక చర్యలను పాటించాలని ఉద్బోధించాడు.

మాల్థస్ సిద్ధాంతంపై తీవ్ర వాదోపవాదాలు చెలరేగాయి. కొంతమంది అతణ్ణి నిరాశా వాద ప్రవక్త అని విమర్శించారు. కొంతమంది ఆర్థికవేత్తలు అతనితో ఏకీభవించలేదు. జనాభా పెరుగుదలను, ఆహారపదార్థాల పెరుగుదలతో పోల్చరాదని, దేశపు మొత్తం సంపదతో పోల్చాలని వారు సూచించారు. ఉపయోగంలోకి రావలసిన సహజమైన వనరులు ఉండేంతవరకు జనాభా పెరుగుదల లాభదాయకంగానే ఉండగలదన్నారు.

## మాల్థస్ సిద్ధాంతాలు - విమర్శ

1. మాల్థస్ తన జనాభా సిద్ధాంతంలో ఒక్క ఆహారానికి, జనాభాకు మాత్రమే సంబంధాన్ని చెప్పాడు. కాని పారిశ్రామిక అభివృద్ధిని పూర్తిగా మర్చిపోయాడు. ఇది ముఖ్యలోపం.
2. వృక్షాలలో చీడ, అకాలమరణం ఎట్లా పెరుగుదలను అదుపులో ఉంచుతుందో అట్లా జనాభానుకూడా రోగాలు, అవినీతి, యుద్ధాలు అదుపులో ఉంచుతాయన్న వాదన విమర్శనాత్మకం.
3. ప్రతి 25 సంవత్సరాలకు జనాభా రెట్టింపవుతుందనే విషయం ప్రామాణికంగా దేశాలలో మాల్థస్ నిరూపించలేదు.

4. మానవుడు ఒక్క ఆకలితోనే పుట్టాడు. అతనికి తినటానికి, త్రాగటానికి ఒక్క కడుపే కాదు. రెండు కాళ్ళు, రెండు చేతులు ఉన్నాయి. వాటితో కష్టించి పనిచేసుకుని బ్రతుకగలడు అని కానన్ చెప్పాడు.

## అభిలషణీయ జనాభా సిద్ధాంతం (Optimum Theory of Population)

మాల్థస్ సిద్ధాంతంలో అనేక లోపాలవల్ల ఆధునిక ఆర్థికవేత్తలు ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ప్రజలకు అత్యధిక ఆర్థిక సంక్షేమం నిజ ఆదాయంలో సూచించవచ్చు. అభిలషణీయ పరిణామం ఈ సిద్ధాంతంపైన ఆధారపడివున్నది. ఎడ్వర్డు కానన్, బెన్‌హామ్, డాల్టన్ వంటి తత్త్వవేత్తలు ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఈ అభిలషణీయ జనాభా సిద్ధాంతాన్ని ఆధునిక జనాభా సిద్ధాంతమనికూడా పిలవవచ్చు.

## ఎడ్వర్డు కానన్ అభిలషణీయ భావన

ఒకానొక సమయంలో లభ్యమయ్యే భూమిని, దానినుంచి సాధించటానికి వీలైనంత ఎక్కువ ఉత్పాదకతను తెలిపినట్లయితే ఆ సమయంలో ఆ దేశంలో నివసించటానికి వీలయ్యే జనాభా సంఖ్య ఎంతో నిర్ణయించవచ్చు.

ఇటువంటి జనాభాగల దేశంలో జనాభా పెరుగుదల, ఆ దేశం యొక్క నిజ ఆదాయాన్ని తగ్గిస్తుంది. దేశంలోని సహజ సంపద, ఉత్పత్తి విధానం, మూలధనం, అభిలషణీయ జనాభా సంఖ్యను నిర్ణయిస్తుంది. ఈ సూత్రాన్నిబట్టి జనాభాను 3 రకాలుగా చెప్పవచ్చు.

1. అల్ప జనాభా
2. అభిలషణీయ జనాభా
3. అధిక జనాభా

**1. అల్పజనాభా :**

దేశంలో లభ్యమయ్యే సహజసంపద ఉత్పత్తిని పూర్తిగా వినియోగించడానికి అవసరమైన జనాభా తక్కువగా ఉంటే వారి తలసరి ఆదాయం అత్యధికమవుతుంది. జనాభా అల్పంగా ఉంటుంది. ఇటువంటి దేశాలు జనాభాను పెంచుకోవచ్చు.

**2. అభిలషణీయ జనాభా :**

తలసరి ఆదాయం జనాభాయొక్క అవసరాన్ని తీర్చగలిగినట్లయితే దానికి సరిపడే జనాభాను అభిలషణీయ జనాభా అంటారు.

**3. అధిక జనాభా :**

అల్ప జనాభా నుంచి జనాభాలోటు పూర్తికాగానే ఆ పైన కూడా జనాభా పెరిగితే, ఆ దేశం అత్యధిక జనాభాగలదేశం అవుతుంది. ఉదా : ఒక దేశం రూ. 200/- ల తలసరి ఆదాయంతో 10 కోట్ల జనాభాను అభిలషణీయంగా ఉంచగలదు అనుకుందాం. ఒకవేళ ఆ దేశంలో 15 కోట్లు జనాభా ఉంటే అధిక జనాభాగా చెప్పవచ్చు.




రేఖా పటం

Ah = అల్ప జనాభా

h = అభిలషణీయ జనాభా

hb = అధిక జనాభా

ఈ సిద్ధాంతాన్నిబట్టి చెప్పగలిగిందేమంటే ఏ దేశంలోనైతే జనాభా హెచ్చుగా ఉంటుందో అక్కడ సహజ సంపదలు తక్కువని, జనాభా తక్కువగల దేశంలో సహజ సంపద ఎక్కువని చెప్పవచ్చు. అభిలషణీయ స్థితి స్థిరం కాదు. గనుక మారుతుంటుంది.

## డాల్టన్ అభిలషణీయ భావన

ఇతడు జనాభాను ఒక సమీకరణం ద్వారా వ్యక్తపరిచాడు.

$M = \frac{A-O}{O}$ M = జనాభా సర్దుబాటు

O = అభిలషణీయ జనాభా

A = ఉన్న జనాభా

ఉదాహరణ : A = 15

O = 10 అయితే

$M = \frac{15-10}{10} = \frac{5}{10} = (.5)$

ఇక్కడ M = O అయితే అభిలషణీయ జనాభా

M = ఋణాత్మకమైతే అల్ప జనాభా

M = ధనాత్మకమైతే అధిక జనాభాగా గుర్తించవచ్చు.

ఈ సిద్ధాంతంవల్ల జనాభా పెరుగుదలలో వాస్తవికత తెలుస్తుంది. జనాభా అభివృద్ధినిబట్టి మారుతుంటుంది. మాల్థస్ ప్రకారం జనాభా ఒక ఆహార అభివృద్ధినిబట్టి మాత్రమే మారుతుంది

అనటం అసహజం. అనేక ఇతర లోపాలు కూడా లేవు. అందువల్ల అభిలషణీయ జనాభాను "అనుసిక జనాభా" అని కూడా అంటారు.

## భారతదేశం - పెరుగుతున్న జనాభా

1961 లో ప్రపంచ జనాభా 3000 మిలియన్లు, భూ ప్రాంతం 135.16 స్క్వేరు మైలోమీటర్లు అయి ఉండగా భారత దేశం వాటిలో 2.4 శాతం భూప్రాంతాన్ని, 14.6 శాతం జనాభాను కలిగిఉంది. ప్రపంచ దేశాలలో 582.5 మిలియన్ల జనాభాలో చైనాదేశం మొదటి అత్యధిక జనాభా కలిగిన దేశం కాగా రెండోస్థానంలో మన దేశం ఉంది.

భారత దేశ జనాభా 1971 లో 548 మిలియన్ల నుంచి 1981 లో 684 మిలియన్లకు పెరిగింది. అంటే 10 సంవత్సరాలలో 136 మిలియన్ల జనాభా పెరిగింది. స్వాతంత్ర్యం తరవాత ఇంచు మించు మన దేశ జనాభా రెట్టింపు అయింది. క్రొత్త ఢిల్లీలో 1981 మే 25 వ తేదీన మొట్టమొదటి జాతీయస్థాయి పార్లమెంటేరియన్ల మహాసభ "జనాభా సమస్య" లపై ప్రత్యేకంగా జరిగింది. ఆనాటి భారత ప్రధాని 1981 జనాభా లెక్కల ప్రకారం వెలువడిన జనసంఖ్యపట్ల కొంత కలవరపాటు కనబరిచారు. స్వచ్ఛంద కుటుంబ నియంత్రణ అమలును ప్రజలు ఆదరించాలని కోరారు.

1881 జనాభా లెక్కల ప్రకారం భారత దేశ జనాభా 253 మిలియన్లు. 50 సంవత్సరాల తరవాత 300 మిలియన్ల ప్రజల దేశవిమోచనానికి కృషి చేస్తున్నట్లుగా జాతీయగీతం ఉదహరించింది. అయితే అది కొద్దిపాటి వృద్ధిపాటి వృద్ధి మాత్రమే. అప్పుడు ఆంగ్లేయులు భారత సామ్రాజ్యంగా వ్యవహరించిన భూభాగంలో నేటి నాలుగు స్వతంత్ర దేశాలు కలిసి ఉన్నాయి. భారత దేశం, పాకిస్థాన్, బంగ్లాదేశ్, బర్మా దేశాలు సంయుక్త జనాభా ఇప్పటికి 3 రెట్లుకు పెరిగింది.

ఈ శతాబ్దం మొదటి 50 సంవత్సరాలలో జనాభా ఎందుకు నిలకడగా ఉన్నది? ఆతరవాత విపరీత రీతిలో అది ఎందుకు వృద్ధిచెందినది? దీనికి కారణం చాలా సరళమైనది. పూర్వపు నిలకడ ఆరోగ్యవంతమైనది కాదు. వ్యాధులు, కరవు - కాటకాలవల్ల, ఊహించలేని రీతిలో ఎక్కువగా సంభవించిన మరణాల ఫలితమే ఇది. 1911 - 1921 దశాబ్దంలో ఇన్ఫ్లుయెంజా 20 మిలియన్ల ప్రజల ప్రాణాలను పొట్టనుపెట్టుకోవడంతో భారత జనాభా పడిపోయింది.

1939 - 45 యుద్ధ సంపూర్తి కొన్ని ప్రముఖ రాజకీయ వైజ్ఞానిక సంఘటనలను చవిచూసింది. రాజకీయంగా, అది వలస యుగాంతానికి నాంది. ఒకదాని వెంబడి మరొకటిగా అనేక దేశాలు స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు పొందాయి. వైజ్ఞానికంగా అణుయుగం ప్రారంభమైంది. ఎక్కువగా ప్రశంసలు పొందకపోయినా, పర్యవసానాలకు అత్యంత ముఖ్యమైన 'ఆంటీబయోటిక్స్' వంటి అద్భుత ఔషధాలు ఉద్భవించటం, వాటిని విస్తారంగా వినియోగించటం మొదలైంది. నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు కూడా అంటురోగాలను, దుర్భిక్షాన్ని ఎదుర్కొనడానికి తమ సంపదను సమీకరించాయి. భారత దేశం విదేశ పాలనలో ఉన్న కడపటి సంవత్సరాలలో, ఒకే ఒక రాష్ట్రం బెంగాల్ లో సంభవించిన క్షామంలో 3.5 మిలియన్లు ప్రజలు మరణించారు.

గత మూడున్నర దశాబ్దాలలో మామూలుగా అనేక పర్యాయాలు అనావృష్టి సంభవించినా, కరవు కారణంగా మరణాలు లేవు. దుర్భిక్షం ప్రకృతి సృష్టించినదయితే, క్షామాలు ఎక్కువగా మానవ కల్పితమే. స్వాతంత్ర్యం కరవులకు అంతం పలికినందుకు భారత ప్రజలు గర్వించడం సమంజసమే. దానితోపాటుగా అంటురోగాలపై సంయుక్తంగా దాడిచేశాం. ప్లేగు, మశూచికాలు నిర్మూలించబడ్డాయి. మలేరియావల్ల మరణాలు మిలియన్ల నుంచి వేలకు తగ్గాయి.

ప్రజారోగ్యం విస్తరించి, సాంఘిక సంక్షేమ పథకాలు ప్రారంభమై 19 వ శతాబ్దంలో ఐరోపాలో జరినట్లుగానే, ఇవన్నీ జనాభావృద్ధికి కారణమైనాయి. 1801, 1901 సంవత్సరాల మధ్య కాలంలో బ్రిటన్ జనాభా 10.5 మిలియన్ల నుంచి 37 మిలియన్లకు పెరిగింది. ఐరోపా జనాభా 188 మిలియన్ల నుంచి 415 మిలియన్లకు వృద్ధి చెందింది. ఆ విధంగా భారతదేశ జనాభా పెరుగుదల అజాగ్రత్త,అశ్రద్ధల ఫలితంకాదు. శాయశక్తులా ప్రజాజీవితాలను ప్రభుత్వం రక్షిస్తుందనటానికిచిహ్నం.

ప్రజారోగ్య సేవల వ్యవస్థీకరణ ఫలితంగా మరణాల రేటు తగ్గుతుంది. విద్య, జీవనస్థాయి అభివృద్ధులతోపాటు జననాల రేటుకూడా తగ్గుతుంది. వ్యక్తిపట్ల – జాతి బాధ్యత, మరణాల రేటును, జాతిపట్ల – వ్యక్తి బాధ్యత, జననాల రేటును తగ్గించవచ్చునని చెప్పవచ్చు.

1951 లో వెయ్యికి 40 గా ఉన్న జననాల రేటు దేశం మొత్తంమీద 33 కి తగ్గింది. ముఖ్యంగా బాలికలలో విద్య అత్యధికంగా ఉన్న రాష్ట్రాలలో, ఆర్థిక పురోగతి త్వరితగతిలో సాగుతున్న స్థలాలలో, ఆరోగ్య సేవలు వికసితం చెందిన ప్రదేశాలలో జననాల రేటు చెప్పుకోతగినంతగా పడిపోయింది. ఇది కేరళలో వెయ్యికి 25.6, పంజాబులో వెయ్యికి 30.3, 2000 వ సంవత్సరం నాటికి వెయ్యికి 21 వరకు జాతీయ సగటును తగ్గించటం భారత ప్రభుత్వ ధ్యేయం.

1980 లో 4 బిలియన్లు ఉన్న ప్రపంచ జనాభా 2000 సంవత్సరం నాటికి 6 బిలియన్లు దాట గలదని అంచనావేయడమైంది. మరోవిధంగా చెప్పాలంటే, రెండు దశాబ్దాలకంటె తక్కువకాలంలో నేడున్న ప్రజానీకానికి మరో సగంమంది జత అవుతారు. ఇప్పటికే భూమి, నీరు, ఆహారం, గృహవసతి, ఉపాధి, విద్య ఆరోగ్యాలలో ఒత్తిడిని ఎదుర్కొంటున్న వర్ధమాన దేశాలలోనే 90 శాతం వృద్ధి ఉంటుంది.

* జనాభాకు సంబంధించిన కొన్ని వివరాలు :

| | | | |
|---|---|---|---|
| 1981 భారత జనాభా : | 683, 997, 512 వ్యక్తులు | | |
| పిరిలో : | స్త్రీలు 330, 494, 525 | | |
| | పురుషులు 353, 502, 987 | | |
| పెరుగుదల : | 1901—238 మిలియన్లు | | |
| | 1951—361 ,, | పెరుగుదల | 51 . 5 % |
| | 1981—648 ,, | | 89 . 4 % |

* Times of India Directory, 1984 Times of India Publications, Bombay.

| | నివాసం | వ్యక్తులు - పురుషులు - స్త్రీలు |
|---|---|---|
| లింగభేదాన్నిబట్టి గ్రామీణ నగర ప్రాంతాలలో జనాభా, 1981 | మొత్తం | - 658, 140, 676—330, 895, 757—318, 244, 919 |
| | గ్రామీణ | - 501, 952, 169—256, 836, 180—245, 115, 989 |
| | నగర | - 156, 188, 507— 83, 059, 577— 73, 128, 930 |

1901 నుంచి 1981 వరకు భారత జనాభా పెరుగుదల

| సంవత్సరం | వ్యక్తులు | దశాబ్దాలమధ్య తేడా శాతం |
|---|---|---|
| 1901 | 239, 396, 327 | — |
| 1911 | 252, 093, 390 | 5 . 75 |
| 1921 | 251, 321, 213 | 0 . 31 |
| 1931 | 278, 977, 238 | 11 . 00 |
| 1941 | 318, 660, 580 | 14 . 22 |
| 1951 | 361, 088, 090 | 13 . 31 |
| 1961 | 439, 234, 771 | 21 . 51 |
| 1971 | 548, 159, 652 | 24 . 80 |
| 1981 | 683, 997, 512 | 24 . 78 |

## అత్యంత జనాబా పెరుగుదల - సాంఘిక, అనారోగ్య సమస్యలు :

జనాభా పెరుగుదల అధికమైనపుడు, ఉన్న వనరులు చాలక, బీదరికానికిగురై, సాంఘిక ఆర్థిక సంబంధమైన అనేక ఇబ్బందులకు లోనయి, వివిధ సమస్యలలో చిక్కుకుని బాధపడతారు. వీటివల్ల అనేక శారీరక అశక్తతలు ఏర్పడి, వివిధ సాంఘిక, అనారోగ్య సమస్యలు ఏర్పడతాయి. ఇవి కింది ప్రకారం చెప్పవచ్చు.

రోడ్డు ప్రమాదాలు, మదిరా వ్యసనం, మందుల వ్యసనం, రక్తలేమి, గర్భకోశ వ్యాధులు, జనన కాల వ్యాధులు, ఊపిరితిత్తుల వ్యాధులు, కాన్సర్, వెన్నెముక జ్వరం, కలరా, అసంపూర్ణ ఆహారం, ఆహారలేమి, విరోచనాలు, కండ్ల వ్యాధులు, కండరాల వ్యాధులు, నరాల బలహీనత, వివిధ జ్వరాలు, ఉదరకోశ వ్యాధులు, మలేరియా, పోలియో, మసూచి, అంటువ్యాధులు (చర్మ సంబంధ), క్షయ, కుష్టు, టైఫాయిడ్, సుఖరోగాలు, కోరింతదగ్గు, ధనుర్వాతం, మధుమేహం, కరువు కాటకాలు, నిరుద్యోగం, నిరక్షరాస్యత, ప్లేగు, అజ్ఞానం మొదలైనవి. ఇంతేగాక అధికజనాభా గల సమాజాలలో తక్కువ జీవన ప్రమాణాలు, ఆర్థిక స్థితిగతులు కనిపిస్తాయి. ఇట్టి సమాజాలలో అభివృద్ధి చాలా నెమ్మదిగా ఉంటుంది.

## జనాభా నియంత్రణ - వివిధ కార్యక్రమాలు :

తక్కువ ఆదాయం, వెనుకబడిన సాంకేతిక అభివృద్ధిగల మన భారతదేశంలో - బీద పరిస్థితులు, మంచినీటి కొరత, విద్యుత్తు కొరత, పిండోత్పత్తి శాస్త్రవిజ్ఞానంలో అజ్ఞానం మొదలగు పరిస్థితులవల్ల కుటుంబ నియంత్రణా విధానాలు సులభంగా ఆమోదించడమైంది. ప్రభుత్వ కుటుంబ నియంత్రణా కేంద్రాలలో గర్భనిరోధక విధానాలు వివిధ పద్ధతులలో ప్రవేశపెట్టడమైంది.

## వివిధ పద్ధతులు

శస్త్రచికిత్స :

శస్త్రచికిత్స అనేది అతి ముఖ్యమైనది. వెసక్టమీ శస్త్రచికిత్స మగవారికి, ట్యూబెక్టమీ శస్త్రచికిత్స స్త్రీలకు నిర్దేశించారు. పురుషులు ఈ చికిత్సకు వెనుకాడినా, స్త్రీలు ముందంజవేస్తున్నారు. 2 దశాబ్దాల క్రితం బిడ్డ పుట్టిన తరువాత ఆపరేషనుచేసి ఆసుపత్రిలో వారం రోజులపాటు విశ్రాంతి తీసుకోవలసి వచ్చేది. ఇప్పుడు స్త్రీలకు లాప్రోస్కోపిక్ పద్ధతిలో ఏ సమయంలోనైనా ఆపరేషను అతి సులభంగా చేయవచ్చు. ఒకటి, రెండు రోజుల విశ్రాంతి చాలు. అంతేగాక రూ. 100/- ల నుంచి రూ. 120/- వరకు శస్త్రచికిత్స చేయించుకునేవారికి (స్త్రీ పురుషులకు) పారితోషికం ఇస్తున్నారు. ఇదికాక ఆమెకు/అతనికి అవసరమైన మందులు, డాక్టరు ఫీజు అన్నీ ప్రభుత్వమే భరిస్తుంది. ఉద్యోగస్తులైన స్త్రీ పురుషులకు వారం నుంచి 10 రోజుల వరకు శస్త్రచికిత్స నిమిత్తం జీతంతో సెలవు మంజూరు చేస్తున్నారు. టాటా మొదలగు పెద్ద పారిశ్రామికవేత్తలు రూ. 250/-ల నుంచి రూ. 500/-ల వరకు పారితోషికం ఇస్తున్నారు. ప్రభుత్వ ఉద్యోగులకు జీతంలో ఒక ఇంక్రిమెంటు అదనంగా లభిస్తుంది. 1970 అంతం వరకూ 7 మిలియన్ల వ్యక్తులు శస్త్రచికిత్స పొందగా వారిలో 90 శాతం పురుషులు, మిగతావారు స్త్రీలు ఉన్నారు.

## లూపు :

గర్భకోశంలో లూపు అనే ప్లాస్టిక్ తీగెను అమర్చుతారు. దీనిని 1965 లో ప్రవేశపెట్టారు. 1970 అంతానికి 4 మిలియన్ల స్త్రీలు ఈ సేవను పొందారు. అయితే దీనికి కారణం 10 శాతం స్త్రీలలో అధిక రక్తస్రావం, 6 శాతం స్త్రీలలో లూపు దానికదే పడిపోవటం. కొందరు స్త్రీలు మానసికంగా అసంతృప్తిని వ్యక్తం చేశారు. నిజానికి లూపు అతి సులభమైనదప్పటికీ, భారత స్త్రీలకు అనుకూలమైన పద్ధతిలో ఇవి ఇంకా తయారుకాలేదు. భారత ప్రభుత్వం స్వయంగా నడుపుతున్న పరిశోధనా విభాగంలో ఇవి తయారు అవుతున్నాయి. ఇంకా కొత్త పద్ధతులలో లూపును ఉత్పత్తి చేయటానికి పరిశోధన జరుగుతున్నది.

## రబ్బరు తొడుగు లేదా నిరోధ్ :

మన దేశానికి 300 మిలియన్ల రబ్బరు తొడుగులు లేదా నిరోధ్‌లు అవసరమైవుండగా, 100 మిలియన్లు మాత్రమే ఉత్పత్తి అవుతున్నాయి. మిగతా 200 మిలియన్లు విదేశాల నుంచి దిగుమతి

చేసుకొంటున్నారు. 1968 నుంచి 1969 వరకు 200 మిలియన్ల షీత్ (Sheath) ను అమెరికా నుంచి సహాయంగా మన దేశం పొంది ఉన్నది. ఇప్పుడు త్రివేంద్రంలో హిందుస్థాన్ లేటెక్సు లిమిటెడ్ అనే భారత ప్రభుత్వ సంస్థ కావలసినంత మేరకు ఉత్పత్తి చేస్తున్నది. అన్ని ప్రభుత్వ ఆసుపత్రులలోను, కుటుంబనియంత్రణా కేంద్రాలలోను వీటిని ఉచితంగా ఇస్తున్నారు. తపాలా జవాను ద్వారా, పాఠశాలల ఉపాధ్యాయుల ద్వారా, సహకార సంఘాల ద్వారా, గ్రామాలకు – కుగ్రామాలకు పంపిణీ జరుగుతున్నది. కొన్ని వ్యాపార సంస్థలు కూడా ఈ నిరోధ్‌లను పంపిణీ చేస్తున్నాయి. యూనియన్ కార్బయిడ్, వెస్టర్న్ ఇండియా మాచ్ సంస్థ, లిప్టన్ ఇండియా, హిందుస్థాన్ లీవరు, బ్రూక్ బాండ్ ఇండియా, ఇంపీరియల్ పొగాకు సంస్థ ఇందుకు ఉదాహరణలు.

## మాత్రలు :

1968 వరకు భారతదేశ ఆరోగ్య, కుటుంబనియంత్రణా మంత్రిత్వశాఖ గర్భనిరోధక మాత్రలను ప్రవేశపెట్టడానికి అనుమతించలేదు. అప్పటివరకు భారతదేశంలో అవి ఉత్పత్తికాలేదు. అమెరికా సంస్థ సహాయంతో మొదటిసారిగా నగర, పట్టణ ప్రాంతాలలో లక్షమంది స్త్రీలకు మాత్రలు ఇచ్చి, వైద్యపరీక్షలో ఉంచారు. వైద్యులకు "ఈ గర్భనిరోధక మాత్రలు వాడటంలో" ఇచ్చిన తరిఫీదులో ఉన్న కొన్ని లోపాలవల్ల 50,000 స్త్రీలు మాత్రమే వీటిని సక్రమంగా ఉపయోగించారు. ఒక అమెరికా మందుల సంస్థ బొంబాయిలో ఈ మాత్రలు తయారుచేసే కర్మాగారాన్ని స్థాపించింది.

## కుటుంబ నియంత్రణా కేంద్రాలు :

1970 లో 3,687 కేంద్రాలు పట్టణ – నగర ప్రాంతాలలో స్థాపితంకాగా, వీటిలో 1022 రాష్ట్ర ప్రభుత్వాలు, 368 స్థానిక సంస్థలు, 371 స్వచ్ఛంద సేవాసంస్థలు, 1926 నగరసంస్థలు నిర్వహించాయి, అదే సంవత్సరంలో గ్రామీణ ప్రాంతాలలో 41,151 కేంద్రాలను స్థాపించారు. వీటిలో 4,812 ముఖ్య గ్రామీణ కేంద్రాలు కాగా, 29,912 ఉపకేంద్రాలు (Sub-centers), 7,427 ఇతర కేంద్రాలు ఉన్నాయి. కేంద్ర ప్రభుత్వం ఈ కేంద్రాలకు పురుష, మహిళా డాక్టర్లను నియమించింది. అనేకవేల మంది డాక్టర్లకు ఈ రంగంలో తరిఫీదు ఇచ్చారు. మహిళా డాక్టర్ల లోటు ఒకప్రక్క ఉండగా, అనేక మంది డాక్టర్లు గ్రామ ప్రాంతాలలో కుటుంబ నియంత్రణా కేంద్రాలలో పనిచేయటానికి ఇష్టపడటం లేదు. ప్రస్తుతం 'జనాభా వైద్యం' (Population Medicine) అనే కొత్త వైద్యశాఖను ఏర్పాటు చేస్తున్నారు.

## వైద్య విజ్ఞానం :

20–25 ఏండ్ల క్రితం, స్వతంత్ర భారతదేశంలో వైద్యంలో తరిఫీదు పొందినవారికి గర్భనిరోధక విధానాలలో జ్ఞానం అంతంతమాత్రంగా ఉండేది. దీనికి కారణం, అప్పట్లో వారిచదువులో భాగంగా కుటుంబ నియంత్రణ లేకపోవడమే. వైద్యరంగంలోనే గర్భనిరోధక చర్యలను వివిధ పద్ధతులలో చేపట్టడం జరుగుతుంది. కనుక వైద్యవిద్యార్థు లందరికీ ఈ రంగంలో తరిఫీదును ఇవ్వవలసి ఉంది.

## ప్రైవేటు రంగంలో డాక్టర్లు :

కుటుంబ నియంత్రణకు సంబంధించి అనేక ప్రైవేటు డాక్టర్లద్వారా కూడా సేవలు అందించడం జరుగుతున్నది. గ్రామీణ ప్రజలకు చేరువలో ఉండే ఆయుర్వేద, యునాని, [illegible] హకీమ్ - డాక్టర్ల యొక్క సహకారాన్ని ప్రభుత్వం అర్థించింది. వీరిద్వారా కుటుంబ నియంత్రణకు సంబంధించిన ప్రచారం చేస్తుంది. అంతేగాక మహిళా సమాజాలు, శిక్షితులైన కుటుంబ క్షేమ కార్యకర్తలు, విదేశ క్రైస్తవమత ఆసుపత్రులు, డాక్టర్లు, వాణిజ్య పారిశ్రామిక నాయకులు, కార్మిక సంఘాలు, వివిధ మతసంస్థలు, పంచాయతీరాజ్, గ్రామీణ యువజన సంఘాలు, స్థానిక సంస్థలు, గాంధేయ సర్వోదయ కార్యకర్తలు మొదలైనవారి సహకారంతో కుటుంబ నియంత్రణను [illegible] విస్తృత ప్రచారం చేస్తున్నారు.

## గర్భనిరోధానికి అనుకూల పరిస్థితులు ;

ఆధునిక వ్యవసాయ పద్ధతులను అనేకం భారతదేశం [illegible]. దీనికి జాతీయ ఆర్థిక సాంఘిక అభివృద్ధి అనే నాణేనికి ఆహార ఉత్పత్తి, కుటుంబ నియంత్రణ బొమ్మా - బొరుసు వంటివి. పంచవర్ష ప్రణాళికలలో అనేక మిలియన్ల రూపాయలు ఈ కార్యక్రమం నిమిత్తం కేటాయించ[illegible]న్నుంది. ప్రతి 80 వేల గ్రామీణ జనాభాకు, లేదా, ప్రతి 50 వేల నగర పట్టణ జనాభాకు ఒక కుటుంబ నియంత్రణా కేంద్రాన్ని స్థాపించారు.

ప్రపంచంలోని అన్ని ముఖ్య మతాలు ఉన్న భారతదేశంలో గర్భనిరోధక పద్ధతులపట్ల ప్రజాభిప్రాయం అతి ముఖ్యం. అదృష్టవశాత్తు, ఏ మతమూ కుటుంబ నియంత్రణను వ్యతిరేకించలేదు. మన దేశానికి కుటుంబనియంత్రణ నిమిత్తం-అమెరికా, స్వీడన్, జపాన్, నార్వే, నెదర్లాండ్స్, కెనడా మొదలైన అనేక దేశాలు సహాయాన్ని అందించాయి. ఫోర్డు ఫౌండేషన్ వంటి విదేశీ సంస్థలు, సాంకేతిక సిబ్బంది, కుటుంబ నియంత్రణ సిబ్బంది శిక్షణ, దృశ్యశ్రవణాత్మక పరికరాలు, మంచి [illegible] సినిమాలు, నిరోధ్ ల సరఫరా, గర్భనిరోధక మాత్రలు, [illegible], శిక్షణా [illegible] రూపంలో ఎన్నో విధాలుగా సహాయాన్ని అందించడం జరుగుతున్నది.

## భారత కుటుంబ ప్రణాళికా సంఘం :

1949 లో బొంబాయిలో ఏర్పడిన ఈ సంఘం జాతీయస్థాయి స్వచ్ఛంద సేవాసంస్థ. జనాభా నియంత్రణా, సిద్ధాంతాలపట్ల విశేష ప్రచారంచేసి కుటుంబనియంత్రణకు తోడ్పడటానికి ఏర్పడింది. ఈ సంఘానికి దేశమంతటా 43 శాఖలున్నాయి. 17 సమగ్ర గ్రామీణ పథకాలు ప్రవేశపెట్టడం జరిగింది. జనాభా విద్యను స్కూలు పిల్లలకు, కళాశాల యువతీ యువకులకు [illegible] ఉండేటట్లు బోధించటానికి ప్రయత్నిస్తున్నది.

## విశ్వవిద్యాలయాలు, కళాశాలలో జనాభా విద్య :

దేశంలోని అన్ని కళాశాలలు, విశ్వవిద్యాలయాలలో సంఘ సంక్షేమ శాఖలద్వారా లేదా వయోజన విద్యాశాఖల ద్వారా జనాభా విద్యను వ్యాపింపచేయటానికి సంఘాలు ఏర్పడుతున్నాయి. వీటిద్వారా విద్యనభ్యసించే యువతీయువకులు తాము నేర్చుకోవటమేగాక, ఇతరులను తమ విజ్ఞానాన్ని అందించగలుగుతారు. ఇందుకు అవసరమైన ఆర్థిక వనరులను కేంద్ర సంఘ సంక్షేమ మంత్రిత్వ శాఖ, విశ్వవిద్యాలయాల సంఘం (కమీషన్) ద్వారా సమకూర్చుతుంది.

## ముగింపు :

హరిత విప్లవం అద్భుతమైనది. దీనిలో అంతర్భాగమైన (ఆహారం మినహాయించి) 'అధిక సారవంతం' (Fertility) వల్ల వచ్చే సమస్యలను నివారించేందుకు మార్గంలేదు. మనిషి తిండివల్ల మాత్రమే బ్రతకలేడు. వ్యక్తి జీవించడానికి ఇతర సరుకులు, సేవలుకూడ అవసరమే. ఆకలియుద్ధాన్ని జయించగలదేమోకాని, చివరికపు యుద్ధంలో ఓడిపోకతప్పదు. దీనికి రెండేరెండు మార్గాలు. ఒకటి–ఆహారోత్పత్తి, ఇతర సరకులు–సేవలు. రెండు–అంతే ముఖ్యమైన కుటుంబ ప్రణాళిక లేదా నియంత్రణ ద్వారా ప్రతి కుటుంబంలో పరిమిత సంతానాన్ని కలిగి ఉండటం.

గతచరిత్ర అంతా మనిషికిఉన్న మేధస్సును గురించి చెబుతుంది. మనిషి ప్రకృతితో పోరాటం సాగించటం అతిసనాతన కాలంనుంచి ఉన్నది. అది ఎప్పుడూ ఉంటుంది. అత్యంతాధునిక సాంకేతికాభివృద్ధిని సాధించిన మానవుడు పొందిన ఘనవిజయాలెన్నో. అయితే అది నిర్మాణానికే కాదు, నాశనానికి కూడా.

ఇప్పుడు రెండేరెండు ప్రశ్నలకు సమాధానం కావాలి. మొదటిది—ఆవరణ సంతులనాన్ని (Ecological Balance) ను పునరుద్ధరించటానికి, (తనకు, తనతోటి మానవులకు) మొత్తం శారీరక పరిసరాలలో ఎట్లాంటి మరమ్మత్తులు చేయాలి ?

మొదటిది—మనిషి తనకుతానే సాటి అని అనుకోవటం పొరపాటు. ప్రకృతి అంతా తన సుఖసంతోషాలకు మాత్రమే నిర్దేశించబడి, బానిసలా సేవచేస్తూ ఉంటుందనుకోవటం పొరపాటు. మనిషి ఈ విశాల విశ్వంలో–అనంత ప్రకృతిలో ఒక సభ్యుడు మాత్రమే. విశ్వమానవ సౌభ్రాతృత్వం సాటి సభ్యులపట్ల ప్రేమానురాగాలు పెంచుకోవటంద్వారా మాత్రమే మనిషి సుఖపడగలడు.

రెండోది—మనం, మన కుటుంబ సంఖ్య పెంపుదలకు స్వస్తిచెప్పి, ప్రపంచ జనాభాను పరిమితం చేయటానికి తోడ్పడాలి. ఎక్కడో ఒకచోట, ఏదోఒక జనసంఖ్యవద్ద ప్రపంచ జనాభాను ఆపకపోతే, అనేక విపరీతాలు పుడతాయి. అభివృద్ధి పొందుతున్న దేశాలలో, ఆకలి – రోగాలు, ప్రబలమైతే – సాంఘిక దుస్సంఘటనలు, రాజకీయపు కుళ్ళు మొదలైనవి అభివృద్ధి పొందిన దేశాల్లో తాండవం చేస్తాయి. మనకున్న వనరులను తెలుసుకొని, భవిష్యత్తులో రాబోయే సాంకేతిక మార్పులకు అనుకూలంగా ఉండే రీతిలో మానవాళి అంతా సమానం అనేదృష్టితో మనుగడను సాగించడానికి అవసరమైన పద్ధతిలో నడవాలి.

చివరగా - మనోవ్యధను, అశాంతికిలోనై కూర్చుండే సమయం కాదిది. ప్రపంచమంతటా కాలచక్రం శీఘ్రగతిని దొర్లుతూ పోతుంది. శాంతియుతమైన మార్పుపట్ల ఆశను పెంచుకోవాలి. "భయ పెట్టబడిన ప్రతి మానవుడు ఎదురుతిరిగి వీరుడైనాడని" చరిత్ర చెబుతుంది.

మనిషి మనుగడకే ముప్పువచ్చే సమయమిది. మన జనసంఖ్యను పరిమితం చేసుకుందాం. మన పరిసరాల కాలుష్యాన్ని తరుముదాం. మనం ఒకరికోసం మరొకరం - అంతా ప్రతి ఒక్కరికోసం- అంతా అందరికోసం శాంతియుతంగా బ్రతకాలి.

## జనాభా సమస్య - సంఘ సంక్షేమ కార్యకర్త పాత్ర

జనాభా సమస్యను పరిష్కరించటంలో ఆధునిక సమాజంలో సంఘ సంక్షేమ కార్యకర్త పాత్ర ప్రముఖమైనదిగా చెప్పవచ్చు. సాముదాయిక విద్య, సాంఘిక విద్య ద్వారా జనాభా పెరుగుదల వలనవచ్చే నష్టాలను సమాజానికి తెలియచెప్పాలి. నిర్ణిత సమయాలలో వివిధ సంస్థలద్వారా, సంఘాల ద్వారా జనాభా విద్యపై చర్చలు, సమావేశాలు, సదస్సులు నిర్వహించి, ప్రజలలో నాటుకుపోయిన మూఢ నమ్మకాలను, అంధ విశ్వాసాలను, మతపరమైన దురభిప్రాయాలను తొలగించాలి.

సమస్యాపీడిత వ్యక్తులు వచ్చినప్పుడు సాంఘికవ్యక్తి సేవాపద్ధతి ద్వారా కార్యకర్త కృషి చేస్తూ, వ్యక్తిసేవ ద్వారా వారి సమస్యలను పరిష్కరించాలి. కుటుంబ సంక్షేమ సంస్థల సహకారంతో అనేక కార్యక్రమాలు చేపట్టాలి. ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థల సహకారంతో కార్యకర్త ఇతర ప్రచార సాధనాలను ఉపయోగించి జనాభా సమస్యను అరికట్టడానికి ప్రయత్నించాలి. సాంఘిక పరి శోధన ద్వారా జనాభా సమస్యను గురించి, దానిని పరిష్కరించే పథకాలను గురించి వివరాలను సేక రించి ఆయా పద్ధతులలో మార్పును తీసుకురావటానికి సూచనలు చేయటంలో కార్యకర్త కృషి చేయాలి. అంతేగాక ఈ సమస్య పరిష్కారంలో కృషి చేస్తున్న వివిధ ప్రభుత్వ, స్వచ్ఛంద సేవా సంస్థల మధ్య సమన్వయాన్ని తీసుకువస్తూ వారి పథకాలను రూపొందించటంలోనూ, అమలుపరచటం లోనూ కార్యకర్త వృత్తిపరమైన సహాయాన్ని అందించవచ్చు.

# 13
# భారతీయ గ్రామీణ సమస్యలు
(Indian Village Problems)

పూర్వకాలంలో మనసమాజంలో, గ్రామీణ ప్రాంతాలు స్వయంసమృద్ధిని పొంది, ఏవిధమైన యీతిబాధలు, సామాజిక సమస్యలు లేకుండా ఉండేవి. ఇటువంటి గ్రామీణ వ్యవస్థ, బ్రిటిష్ పరిపాలనలో, అభివృద్ధిని పొందలేక వెనుకబడింది. ఎందుకంటే, బ్రిటిష్‌వారు పట్టణప్రాంతాలను అభివృద్ధి చేయడమే ముఖ్యలక్ష్యంగా పెట్టుకొన్నారు. అందువల్ల, వారు దేశాన్ని పరిపాలించిన రెండు వందల సంవత్సరాలలో గ్రామీణప్రాంతాలు విద్య, ఆరోగ్య, రవాణా మొదలైన సౌకర్యాలు పొందలేక, నవీననాగరికతకు, ఆధునిక జీవితానికి దూరంగావుంటూ, అనేక సమస్యలు గురిఅయినాయి. అందుకనే గ్రామీణులలో నిరక్షరాస్యత, అమాయకత్వం, జడత్వం, అనారోగ్యం, దారిద్ర్యం ఎక్కువగా ప్రబలిఉన్నవి. వీటన్నిటి ప్రభావంవల్ల ఇతరసమస్యలు కూడా గ్రామీణ ప్రాంతాలలో ఎక్కువయినాయి.

మనదేశంలో అధికశాతం జనాభా గ్రామీణ ప్రాంతాలలో సమస్యలతోకూడిన జీవన మనుగడ సాగిస్తూఉంటే, దేశ అభివృద్ధి బాగా కుంటుపడుతుంది. కాబట్టి గ్రామీణసమస్యల గురించి ప్రభుత్వం ప్రత్యేక అవగాహనను ఏర్పరచుకుని, వాటిపరిష్కారానికి సత్వరంగా కృషిచేయవలె.

## నిరక్షరాస్యత :

నిరక్షరాస్యత ప్రజాస్వామిక జీవనంలో, జాతిపురోభివృద్ధికి ఒక అడ్డంకు. నిరక్షరాస్యత జాతికి కళంకం. గ్రామీణ ప్రజలలో అధికశాతం యీనాటికీ నిరక్షరాస్యులుగానే ఉన్నారు. దీనివల్ల వారు, వారికై ఏర్పరచిన అభివృద్ధి కార్యక్రమాలను అవగాహన చేసుకోలేక, సరయిన ఫలితాలను పొందలేకపోతున్నారు. అంతేగాక సమాజంలో ఉన్న స్వార్థపరులు, సంకుచిత స్వభావం కలవారు, వీరిని అన్నివిధాల దోపిడీచేస్తూ, నిత్యదారిద్ర్యంలో ఉండేటట్లు చేస్తున్నారు. మన ప్రణాళిక అభివృద్ధి కార్యక్రమాల లక్ష్యం, ప్రజలను తమ అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనేటట్లు చేయడమే. కాని దానికి, నిరక్షరాస్యత తీరని అవరోధంగా ఏర్పడి ఉంది. కాబట్టి, గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలు సక్రమంగా రూపొందించి, అమలుపరచాలి అంటే, నిరక్షరాస్యతను యుద్ధప్రాతిపదికపై నివారించటం మనందరి కర్తవ్యం.

చేస్తుంది. ఇంతేగాక దేశంలో ఉన్న మైనారిటీ వర్గాలకు చెందిన వారి సంక్షేమం కోసం ఏ విధమైన అడ్డంకులు లేకుండా వారి జీవన విధానాలను, సంస్కృతిని ప్రోత్సహించడానికి ప్రభుత్వం ప్రణాళికల ద్వారా కృషి చేస్తున్నది. స్త్రీ, పురుష భేధం లేకుండా, కులమత విచక్షణ లేకుండా పౌరులందరికీ ప్రాథమిక హక్కులను ఇవ్వడం జరిగింది. వీటన్నింటిని సక్రమంగా రూపొందించి, అమలుపరచడానికి ప్రణాళికా సంఘాలతోపాటు, ప్రభుత్వ యంత్రాంగంలో మూడు వ్యవస్థలను రూపొందించడం జరిగింది. అవి న్యాయ వ్యవస్థ, లెజిస్లేచర్, నిర్వహణా వ్యవస్థలు (Judiciary, Legislature, Execution) మొదలయినవి. ఈ మూడింటి మధ్య సరయిన అవగాహనను సమన్వయాన్ని, సమతుల్యాన్ని పెంపొందించడానికి ప్రభుత్వం కృషి చేస్తుంది.

పంచవర్ష ప్రణాళికలు, సాంఘిక సంక్షేమ కార్యక్రమాల అభివృద్ధిని రాష్ట్ర ప్రభుత్వాలకు స్వచ్ఛంద సంస్థలకు అప్పగించింది. స్వచ్ఛంద సంస్థలు బలహీనం అవడంవల్ల స్వచ్ఛంద సేవాసంస్థలను బలపరచి, వాటిద్వారా, సంక్షేమ కార్యక్రమాలను సక్రమంగా అమలుపరచాలనే ముఖ్య ఉద్దేశ్యంతో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థను (C. S. W. B.) 1953 వ సంవత్సరంలో కేంద్ర ప్రభుత్వం స్థాపించింది. ఈ సంస్థ స్వచ్ఛంద సంస్థలకు ప్రణాళికాబద్ధమైన ఆర్థిక సహాయాన్ని అందించి, వివిధ సంక్షేమ రంగాలలో కార్యక్రమాలను అమలుపరుస్తుంది.

గ్రామీణ సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు, నగర సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు, కుటుంబ, బాలల, స్త్రీ సంక్షేమ పథకాలు, సాంఘిక, నైతిక, ఆరోగ్య పథకాలు, కార్యకర్తల శిక్షణా పథకాలు మొదలయిన అనేక సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను ప్రవేశపెట్టి కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు తీవ్ర కృషి జరుపుతున్నది. అంతేగాక ఈ సంస్థ కేంద్ర మంత్రిత్వ శాఖల, రాష్ట్ర మంత్రిత్వ శాఖల వేర్వేరు సంక్షేమ పథకాల సమన్వయానికి పాటుపడుతున్నది.

విద్యా మంత్రిత్వ శాఖ, ఆరోగ్య మంత్రిత్వ శాఖ, విదేశ వ్యవహారాల మంత్రిత్వ శాఖ, సామాజిక అభివృద్ధి సహకార మంత్రిత్వశాఖ, కార్మిక ఉద్యోగ మంత్రిత్వ శాఖ మొదలయిన కేంద్ర, రాష్ట్ర మంత్రిత్వ శాఖలు కూడా సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను ఏర్పాటుచేసి ప్రత్యక్షంగా, పరోక్షంగా కూడా సాంఘిక సంక్షేమానికి పాటుపడుతున్నాయి.

సంక్షేమ కార్యక్రమాలను విజయవంతంగా అమలుపరచాలంటే ప్రజల సహాయ సహకారాలు చాలా అవసరం. వీటిని పొందడంలో స్వచ్ఛంధ సంస్థలకు చాలా ప్రముఖ పాత్ర ఉంది. అనాదినుంచీ భారతదేశంలో స్వచ్ఛంద సంస్థలు సంఘ సంక్షేమం కోసం తీవ్ర కృషి జరుపుతున్నాయి. స్వచ్ఛంద సేవాసంస్థలు ప్రజలతో ప్రత్యక్ష సన్నిహిత సంబంధాలను కలిగి ఉంటాయి. అవి ముఖ్యంగా ప్రజల అవసరాలను తీర్చటంకోసమే ప్రజలే ఏర్పాటు చేసుకున్నారు. ఈ సంస్థలు మానవతా దృక్పథంతో పని చేస్తాయి. వ్యక్తుల అవసరాలకు తగినట్లుగా కార్యక్రమాలను మార్చుకొనేటట్లు సరళంగా వ్యవహరిస్తాయి. కాబట్టి స్వచ్ఛంద సంస్థలకు ప్రజల సహకారం చాలా హెచ్చుగా ఉంటుంది. ప్రజలు వాటిని

తమ సంస్థలుగా భావించి ఆ సంస్థలద్వారా అమలుజరిగే కార్యక్రమాలలో అన్ని విధాల సహకరిస్తారు. అందుచేత సంక్షేమ కార్యక్రమాలను స్వచ్ఛంద సంస్థల ద్వారా అమలుపరిస్తే, ఎక్కువ ఫలితాలను సాధించి, త్వరలో సాంఘికాభివృద్ధిని ప్రభుత్వం చేకూర్చగలదు.

ఆధునిక సంఘసంక్షేమ పరిధి చాలా విస్తృతమైంది. మానవ జీవితానికి సంబంధించిన సంక్షేమ సేవలన్నింటిని దీనిలో చేర్చటం జరిగింది. ఈ బృహత్తర కార్యక్రమాన్ని ప్రభుత్వం స్వచ్ఛంద సంస్థలు ప్రజలు కలిసి సమన్వయ కృషితో అమలుజరపాలి. అంతేగాక, ప్రభుత్వ సంస్థలలోను, స్వచ్ఛంద సంస్థలలోను సంక్షేమకృషి కార్యకర్తలను నియమించి, వారిద్వారా, సంక్షేమ కార్యక్రమాలన్నింటిని సంక్షేమకృషి శాస్త్రీయ పద్ధతులలో నిర్వహించినట్లయితే ఎక్కువ ఫలితాలను సాధించవచ్చు.

## అమాయకత్వం :

వ్యక్తి నిరక్షరాస్యుడుగా ఉండటంవల్ల, అతని జీవనంలో అమాయకత్వం చోటుచేసుకుంటుంది. నేటికీ మనకు గ్రామీణ ప్రాంతాలలో కన్పిస్తున్న అస్పృశ్యత, బాల్యవివాహాలు, వెట్టిచాకిరీ మొదలైన సమస్యలు దీనికి నిదర్శనలు. అంతేగాక, గ్రామీణ ప్రజలలో చాలా సంవత్సరాల నుంచీ పాతుకుపోయిన మూఢ విశ్వాసాలు, సనాతన ఆచార వ్యవహారాలు యీ అమాయకత్వాన్ని పెంపొందిస్తున్నాయి. దీనివల్ల వ్యక్తి, ప్రభుత్వం తనకు, తన ప్రాంతాల అభివృద్ధికై ఏర్పాటు చేసిన కార్యక్రమాలను సక్రమంగా ఉపయోగించుకోలేక అనేక సమస్యలతో కొట్టుమిట్టాడటం యీనాటికీ కన్పిస్తున్నది. కాబట్టి, ప్రజలలో గూడుకట్టుకుపోయిన ఈ అమాయకత్వాన్ని తొలగించేందుకు గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలు అమలు చేయవలె. ఎందుకంటే స్వాతంత్ర్యం వచ్చిన నాటినుంచీ ప్రభుత్వపరంగా, సమాజ వికాస ఉద్యమ కార్యక్రమాలను, తదితర ఆర్థిక పురోభివృద్ధి కార్యక్రమాలను అమలుపరుస్తున్నా, ఇంకా అనేకమందిలో ఈ అమాయకత్వం అనే జాడ్యం ఉండటంవల్ల, ఆశించినంతగా అభివృద్ధిని సాధించలేకపోతున్నారు.

## సామాజిక జడత

వ్యక్తులలో నిరక్షరాస్యత, అమాయకత్వం ప్రబలంగా ఉన్నప్పుడు, వారిలో సామాజిక జడత ఉండటం సహజం. దీనివల్ల, వారు ఉన్నదాంతోనే తృప్తిపడుతూ, వారి అభివృద్ధికై ఏమాత్రం కృషిచేయకపోవడం జరుగుతుంది. ఈ జడత వ్యక్తుల మనోవికాసానికి, సామాజిక చైతన్యానికి తీవ్రమైన అడ్డంకులను కల్పిస్తుంది. సోమరితనానికి అలవాటుపడ్డ ప్రజలలో స్వయం సహాయతా భావం లోపిస్తుంది. వారు వారి సమస్యలను అవగాహన చేసుకోవడంలోను, పరిష్కరించడంలోను ఏమాత్రం ఆసక్తి చూపరు. నిరక్షరాస్యత, అమాయకత్వం, జడత, గ్రామీణ పురోభివృద్ధికి వీలుకల్పించడంలేదు. కాబట్టి, గ్రామీణ సమాజాలు అభివృద్ధి చెందలేక మనసమాజంలో స్తబ్ధంగా ఉండిపోతున్నాయి.

## అనారోగ్యం

గ్రామీణప్రాంతాలలో మనకు కొట్టొచ్చినట్లు కనబడే సమస్యలలో అనారోగ్యం ముఖ్యమైంది. ఆరోగ్య విధానాల గురించి వారికి తెలియకపోవడం, అందుబాటులో ఉన్న సౌకర్యాలను వినియోగించుకోవడానికి విముఖతచూపడం, ఆరోగ్య, వైద్యకేంద్రాలు అవసరమైనవాటికంటె తక్కువ సంఖ్యలో ఉండటం, పౌష్టికాహారం గురించి తెలియకపోవడం, వ్యక్తి, పరిసరాల పరిశుభ్రత గురించి ఆలోచనలేకపోవడం, మురికినీటి పారుదల సౌకర్యాలు లేకపోవడంవల్ల గ్రామీణప్రాంతాలలో నేటికీ ఆరోగ్యసమస్యలు మనకు హెచ్చుస్థాయిలో కన్పిస్తూ ఉంటాయి.

## దారిద్ర్యం

పేదరికపు ప్రభావంవల్ల గ్రామీణ ప్రజలలో ఎక్కువశాతం దారిద్ర్యానికిలోనై, ఎన్నో కష్టనష్టాలను అనుభవిస్తున్నారు. పేదరికం వ్యక్తులలో నిరాశా నిస్పృహలను, సమాజంపై ద్వేషాన్ని

తరుచుగా కలిగిస్తుంది. పేదరికానికి గురయినవ్యక్తి, తన శక్తిసామర్థ్యాలను పెంపొందించుకొనలేక, తన అభివృద్ధిని, తనపై ఆధారపడినవారి అభివృద్ధిని సాధించలేడు. నేటి సామాజిక సమస్యలకు మూల కారణం, పేదరికం అని చెప్పవచ్చు. కొన్ని కొన్ని సమయాలలో ఇది నేరానికికూడా దారితీస్తుంది.

ఈ సమస్య లన్నింటివల్ల గ్రామీణ ప్రాంతాలలో నివసించే అధిక శాతం ప్రజలు జీవితంలో ముందడుగు వేయలేక, సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడి ఉంటున్నారు. కాబట్టి, ఈ సమస్యలను కూకటివేళ్ళతో పెకలించి, గ్రామీణ ప్రజల మానసిక దృక్పథంలో మార్పు తీసుకునిరావలె. అంతే గాక వారిలో స్వయం సహాయతాభావాన్ని పెంపొందింపచేసి, వారి సమస్యలను వారే పరిష్కరించు కొనేందుకు ప్రోత్సహించవలె. దీనితోపాటు, అన్ని అభివృద్ధి కార్యక్రమాలలో వారిపట్ల పక్షపాత వైఖరిని చూపకుండా, ప్రభుత్వం వివిధ పథకాల ద్వారా గ్రామీణ సమగ్రాభివృద్ధికి కృషి చేయడం చాలా అవసరం.

గ్రామీణ సమస్యలలో ముఖ్యమైన నిరక్షరాస్యత, వెట్టిచాకిరి, ప్రచ్ఛన్న నిరుద్యోగిత గురించి ఈ దిగువ చర్చించడం జరిగింది.

## నిరక్షరాస్యత (Illeteracy)

మన దేశ గ్రామీణ ప్రాంతాలలో, నిరక్షరాస్యుల సంఖ్య చాలా ఎక్కువగా ఉన్నది. మిగతా దేశాలతో పోల్చిచూస్తే, ఈ సమస్య మన దేశంలో ఎక్కువగా ఉన్నదని తెలుస్తున్నది. ఏ సమాజంలోనయినా ఎక్కువ శాతం ప్రజలు నిరక్షరాస్యులు ఉంటే, ఆ సమాజ అభివృద్ధి కుంటుపడు తుంది. నిరక్షరాస్యతవల్ల ప్రజలలో అజ్ఞానం, అవివేకం ఎక్కువవుతాయి. నిరక్షరాస్యుడైన వ్యక్తి, తన వ్యక్తిత్వాన్ని పూర్తిగా సమకూర్చుకోలేకపోవడమేగాక అతని శక్తి సామర్థ్యాలను, నిపుణతలను పెంపొందించుకోలేడు. దీనివల్ల ఆ వ్యక్తి వారిలో ఆత్మవిశ్వాసం లోపించడం, అతడు ఇతరులపై ఆధారపడడం జరుగుతుంది. అంతేగాక సామాజిక, ఆర్థిక, ఆరోగ్య అంశాలను సవివరంగా అవగాహన చేసుకోలేడు. అందువల్ల ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు అతని అభివృద్ధికై కల్పించిన అవకాశాలను ఏమాత్రం సద్వినియోగపరచుకోలేకపోతున్నాడు. నిరక్షరాస్యతవల్ల వ్యక్తి తరచుగా మూఢనమ్మకా లకు, అంధవిశ్వాసాలకు లోనైవుంటాడు.

దేశ జనాభాలో ఎక్కువ భాగం గ్రామీణ ప్రాంతాలకు చెందినవారై ఉన్నారు. నిరక్ష రాస్యత పట్టణ ప్రాంతాలతో పోల్చిచూస్తే, గ్రామీణ, గిరిజన సముదాయాలలో చాలా ఎక్కువగా కన్పిస్తున్నది. ప్రభుత్వం వీరికై ఎన్నో పురోభివృద్ధి పథకాలను అమలుపరచినా, అవి ఆశించిన ఫలితా లను ఇవ్వలేకపోవడానికి ముఖ్యంగా ప్రజలలోవున్న నిరక్షరాస్యతే కారణమని చెప్పవచ్చు.

స్వాతంత్ర్యం వచ్చిన తరవాత, మన ప్రభుత్వం ప్రజాస్వామ్య విలువలను ఆధారంగా చేసు కుని సమసమాజ శ్రేయోరాజ్యానికి పథకాలను ఏర్పరచుకొంది. ఈ కార్యక్రమాలన్నీ సఫలీకృతం కావాలంటే, దేశప్రజలు వాటివల్ల పురోభివృద్ధిని సాధించాలంటే, ప్రజలు ఆయా కార్యక్రమాలలో

స్వచ్ఛందంగా పాల్గొనటం ఎంతయినా అవసరం. ఇట్టి పరిస్థితిలో, పెరుగుతున్న నిరక్షరాస్యత, ప్రజాస్వామ్య పరిపాలనకు, సంక్షేమ రాజ్యస్థాపనకు ఎన్నో అడ్డంకులను కల్పిస్తుంది. వ్యక్తులందరి విజ్ఞానం, శక్తి సామర్థ్యాలు, నిపుణతలు అభివృద్ధి చెందినపుడే దేశం అభివృద్ధి చెందుతుంది.

మన దేశంలో నిరక్షరాస్యత స్త్రీలలో అధికంగావుంది. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో కట్టుబాట్లు, సాంప్రదాయాలు, మూఢాచారాలు ఎక్కువగా ఉండటంవల్ల అధిక శాతం గ్రామీణ స్త్రీలు నేటికిని నిరక్షరాస్యులుగా ఉండిపోతున్నారు. అంతేగాక నిరక్షరాస్యులలో ఎక్కువ భాగం షెడ్యూల్డు కులాలకు, షెడ్యూల్డు తెగలకు, బలహీనవర్గాలకు చెందినవారు. ఈ సమస్యవల్లనే ప్రభుత్వాం పైవర్గాలవారి సంక్షేమానికి ఎన్నో పథకాలను అమలుపరచినప్పటికీ వారిలో ఆశించినంతగా పురోభివృద్ధి నేటికికూడా జరగలేదు.

నిరక్షరాస్యతకు, పేదరికానికి చాలా దగ్గర సంబంధముందని అనేక పరిశోధనలద్వారా నిరూపించడమైంది. నిరక్షరాస్యతవల్ల, పేదరికంతోపాటు నిరుద్యోగం, వ్యక్తిగత, సామాజిక అవ్యవస్థత, మానసిక దౌర్బల్యం, సామాజిక, ఆర్థిక దోపిడీ మొదలగునవి ఎక్కువవుతున్నవి. అంతేగాక, నేటి ఆధునిక సమాజంలో, సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందడంవల్ల, వచ్చే మార్పులను, లభిస్తున్న అవకాశాలను, వనరులను గ్రామీణ ప్రాంతాలలోఉన్న నిరక్షరాస్యులు ఎక్కువగా పొందలేకపోతున్నారు.

దీన్నిబట్టి చూస్తే, కేవలం అక్షరజ్ఞానం కలిగించే విద్యయేగాక, ప్రజల నిత్యజీవిత వ్యవహారాలకు, వృత్తిమనుగడకు సంబంధించిన విద్యను గ్రామీణ ప్రజలకు అందివ్వడం చాలా అవసరం. దీనివల్ల వారిలో సామాజిక చైతన్యం పెంపొంది, వారు సరిఅయిన పౌరులుగా తయారయి, జాతి అభివృద్ధి కార్యక్రమాలలో ఉత్సాహంగా పాల్గొనేందుకు అవకాశాలు కల్పించవచ్చు. జాతిపిత మహాత్మాగాంధీ అన్నట్లు, నిరక్షరాస్యత జాతికి కళంకం. అది మనదేశానికి సిగ్గుచేటు. కనుక దానిని పూర్తిగా నిర్మూలించాలి.

ప్రభుత్వం, ప్రత్యేకంగా గ్రామీణ ప్రాంతాలలో నిరక్షరాస్యతను పూర్తిగా నిర్మూలించడానికి వివిధ పథకాలను చేపట్టింది. నిర్బంధ ఉచిత ప్రాథమికవిద్య, సాంఘికవిద్య, వయోజనవిద్య, ఆరోగ్యవిద్య వాటిల్లో ముఖ్యమైనవి. ఈ పథకాలను అర్థవంతంగాను, లక్ష్యాలను సిద్ధింపచేసుకునేలా అమలుపరచాలి అంటే, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలతోపాటు, స్వచ్ఛందసంస్థలు, కార్మికసంఘాలు, విద్యాలయాలు సమన్వయరీతిలో సమిష్టిగా కృషిచేయవలసిన అవసరం ఉంది.

## వెట్టిచాకిరి (BONDED LABOUR)

మనదేశంలోని గ్రామీణ ప్రజల ముఖ్య సమస్యలలో వెట్టిచాకిరీ కూడా ఒకటి. గ్రామీణ ప్రజలలో అధిక సంఖ్యాకులు పేదరికంతో బాధపడుతున్నారు. వారి అవసరాలను తీర్చుకొనే ఆర్థిక స్తోమతు లేక వారు ధనవంతులైన భూస్వాములు, ఋణదాతలు, వడ్డీవ్యాపారస్తుల దగ్గరనుంచి, ధన

రూపంలోగాని, వస్తురూపంలోగాని ఋణాలు తీసుకొని ఋణగ్రస్తులవుతున్నారు. కాని ఋణాలను తీర్చేశక్తి వారికి లేకపోవటంవల్ల ఏదోఒక మార్గంలో ఋణాన్ని తీర్చుకోవటానికి, ఋణదాతలను వెట్టిచాకిరీ చేయటానికి ఒప్పుకుంటున్నారు. తద్వారా ఆర్థిక, శ్రామిక దోపిడీకి గురిఅవుతున్నారు. ఒప్పందం మేరకు ఋణం పూర్తిగా తీరిపోయేవరకు యీ వెట్టిచాకిరీ చేయాలి. పూర్తిగా తీర్చకపోతే తరవాత తరం వారు వెట్టిచాకిరీ చేసి ఆ ఋణాన్ని తీర్చాలి. ఈ విధంగా తాతలు, తండ్రులు చేసిన ఋణాన్ని తీర్చటానికి వారేకాక వారి సంతానంకూడా వెట్టిచాకిరి చేయవలసి ఉన్నది. ఎంత కష్టపడి నప్పటికీ వెట్టిచాకిరీకి ఆదాయఫలిత ముండదు. వ్యక్తి తన స్వేచ్ఛను కోల్పోతాడు. ఆ వ్యక్తి ఇంకొకచోట పనిచేసి ఆదాయం సంపాదించకూడదు. వ్యవసాయంచేసి ఉత్పత్తి చేసిందికూడా ఋణ దాతలకి చాల తక్కువధరకు ఇచ్చివేయాలి. అందుచేత ఆ వ్యక్తి కుటుంబం దారిద్ర్యంనుంచి ఎప్పటికీ బయటికిరాలేదు. ఈ విధంగా వెట్టిచాకిరి పద్ధతివల్ల కుటుంబం మొత్తం ఆర్థికంగాకాని మరే యితర విధంగాగాని అభివృద్ధి చెందలేదు. వారి కనీస అవసరాలను తీర్చుకొనే అవకాశంలేక తరతరాలుగా దారిద్ర్యంతోనే మగ్గవలసి వస్తున్నది. కుటుంబ అవ్యవస్థత, దారిద్ర్యం, నిరుద్యోగం, నేరం మొదలయిన అనేక సామాజిక సమస్యలకు వెట్టిచాకిరీ పద్ధతి ఒకమూలకారణమవుతున్నది.

వెట్టిచాకిరీ సమస్యను, నిరక్షరాస్యత ఇంకా తీవ్రతరం చేస్తున్నది. తీసుకొన్న ఋణాలు తీర్చటానికి పట్టేకాలం, వడ్డీ, తీర్చిన ఋణం మొదలయిన వివరాలు తెలుసుకోవటానికి, గుర్తించు కోవటానికి తగిన జ్ఞానం వారికి లేకపోవటంవల్ల, వారి అజ్ఞానం, అమాయకత్వం కారణంగా, వారు సులభంగా, ఆర్థిక, శ్రామిక దోపిడీకి గురిఅవుతున్నారు.

వెట్టిచాకిరీ సమస్య మన గ్రామాలలో చాలా ప్రాచీనకాలంనుంచీ ఉన్నది. స్వాతంత్ర్యానికి ముందు సంస్కర్తలు వెట్టిచాకిరిని తొలగించటానికి చాలా కృషిచేసినా ఫలితం లేకపోయింది. స్వాతంత్ర్యం వచ్చినతరవాత ప్రభుత్వం ప్రజలందరికి స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం, సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని సమకూర్చటమే ధ్యేయంగా పెట్టుకొన్నది. ప్రాథమిక హక్కులలో ముఖ్యమైన సమానత్వపు హక్కు, స్వాతంత్ర హక్కు, ఆస్తి హక్కుల ప్రకారం, వ్యక్తులందరూ సమానమే. జాతి, మత, కుల, లింగ, ప్రాంతీయ భేదాలచే ఏ వ్యక్తిని వేరుపరచరాదు. ఆస్తిని సంపాదించటానికి అనుభవించటానికి, అమ్మివేసుకోవటానికి పౌరులందరూ హక్కును కలిగి ఉన్నారు. ఏ వ్యక్తి అయినా, ఏ వృత్తినైనా, స్వేచ్ఛగా అనుసరించవచ్చు. ఏ ఉద్యోగమయినా, ఏ వ్యాపారమయినా, నిరభ్యంతరంగా చేపట్టవచ్చు. ఏ వ్యక్తి వ్యక్తిగత స్వేచ్ఛను కోల్పో నక్కరలేదు.

దోపిడీ నిరోధక హక్కు (Right against exploitation) ప్రకారం, మనుష్యులను అమ్మటం, కొనటం వంటి వ్యాపారం వెట్టిచాకిరీ, నిర్బంధపు పని తదితర పనులను నిషేధించటం జరి గింది. ఈ సూత్రాలను ఏ వ్యక్తి అయినా ఉల్లంఘించినట్లయితే, అ వ్యక్తిని నేరస్థునిగా పరిగణించి,

చట్టరీత్యా శిక్షించడం జరుగుతుంది. పద్నాలుగు సంవత్సరాలలోపు పిల్లలను [illegible]
గనులలోగాని, లేదా మరి ఏ ఇతర అపాయకర పనులలోగాని ప్రవేశపెట్ట [illegible]
ధించాలి. వ్యక్తిని, మానవత్వపు విలువలకు వ్యతిరేకంగా, [illegible]

అదేరీతిగా ఆదేశ సూత్రాలలోని 38 వ ప్రకరణం ప్రకారం [illegible]
ఆరోగ్యాన్ని శక్తిని, బాలల సుకుమార మనస్సును, దుర్వినియో [illegible]
మించిన వృత్తులలో నిర్బంధంగా ప్రవేశపెట్టడంగాని చేయరాదు.

43 వ ప్రకరణం ప్రకారం ప్రభుత్వం వ్యవసాయిక, పారిశ్రామిక [illegible]
పనిని, జీవన వేతనాన్ని (Living wage) యోగ్యమైన జీవన ప్రమాణాన్ని [illegible]
షరతులను నిర్ణయించాలి.

ఈ విధంగా రాజ్యాంగం చట్టాల ద్వారా వెట్టి చాకిరి [illegible]
ప్రాంతాలలో అది ఇంకా అమలులోనే ఉంది. అందుచేతనే [illegible]
చాకిరీ నిర్మూలనకు ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ చూపింది. 20 సూత్రాల [illegible]
వెట్టిచాకిరీ నిర్మూలన ఒకటి.

1976 వ సంవత్సరంలో ప్రత్యేకంగా వెట్టిచాకిరీ పద్ధతి నిర్మూలన [illegible] (The Bonded Labour System Abolition Act 1976) అమలులోకి వచ్చింది. [illegible]
దోపిడీని కలిగించే వెట్టిచాకిరీ పద్ధతిని పూర్తిగా నిర్మూలించబడు [illegible]
చట్టం భారతదేశమంతటా అమలు జరగాలి. ఈ చట్టం అమలులోకి వచ్చిన [illegible]
ప్రతి వ్యక్తి వెట్టి చాకిరీ నుంచి విముక్తుడు కావటానికి అవకాశం కలిగింది.

ఋణదాతకు, ఋణగ్రస్తునికి నోటీసుల ద్వారాగాని, [illegible]
ఒప్పందమైనా సరే అది వెట్టి చాకిరీని కల్పించినట్లయితే ఆ ఒప్పందం [illegible]

ఈ చట్టం ప్రకారం వెట్టి చాకిరీ చేసే ప్రతి వ్యక్తి [illegible] (Bonded Debt) విముక్తుడవుతున్నాడు.

అంతేగాక తానిదివరకు చెల్లించిన [illegible] ఋణాన్ని [illegible]
టానికి అర్హతను కలిగి ఉన్నాడు.

ఈ చట్టం అమలులోకి వచ్చిన తరువాత ఏ వ్యక్తిని [illegible]
టానికి నిర్బంధించినట్లయితే, ఆ వ్యక్తి మూడు సంవత్సరాల [illegible]
యల జరిమానాకు పాత్రుడవుతాడు.

రాష్ట్ర ప్రభుత్వాలన్నీ ఈ చట్టాన్ని పూర్తిగా అమలు చేయడానికి [illegible]
నాయి. ఈ చట్టాన్ని నిర్వహించే అధికారం జిల్లా మెజిస్ట్రేట్ (District Magistrate) [illegible]
నారు. వెట్టి చాకిరీ చేసే వ్యక్తిని వెట్టి చాకిరీ నుంచి పూర్తిగా [illegible]

ఆర్థిక స్థిరత్వానికి సహాయపడి, ఆ వ్యక్తిని పరిరక్షించే బాధ్యత కూడా జిల్లా మేజిస్ట్రేటు, ఇతర అధికార్లపై ఉంది.

ఈ చట్టాన్ని ఎంతవరకు అమలుపరుస్తున్నారో పర్యవేక్షించటానికి రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రత్యేక విజిలెన్సు కమిటీలను (Vigilance Committee) ఏర్పాటు చేస్తున్నాయి.

ఈ విధంగా గ్రామీణ ప్రాంతాలలో వెట్టి చాకిరీని పూర్తిగా నిర్మూలించటానికి చట్టబద్ధమైన కృషి జరుగుతున్నది.

## ప్రచ్ఛన్న నిరుద్యోగిత (DISGUISED UNEMPLOYMENT)

అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రచ్ఛన్న నిరుద్యోగిత సర్వసాధారణమైనది. ఒక వ్యక్తి, అసలు వేతనంకంటె తక్కువ వేతనానికి పనిచేయడానికి సిద్ధపడితే, ఆ పరిస్థితిని అల్పఉద్యోగిత (Under employment) లేదా అనైచ్ఛిక నిరుద్యోగిత (involuntary unemployment) లేదా ప్రచ్ఛన్న నిరుద్యోగిత ( Disguised Unemployment ) అంటారు. వ్యక్తులు సమగ్ర ఉద్యోగాన్ని (Full time employment) పొందలేనప్పుడు, పాక్షిక ఉద్యోగాలను లేదా అల్పఉద్యోగాలను చేస్తూ ఉంటారు.

ప్రచ్ఛన్న నిరుద్యోగిత గ్రామీణ ప్రాంతాలలో చాలా ప్రబలంగా ఉంది. దీనికి ముఖ్య కారణం జనాభా పెరుగుదల మన దేశంలోని వనరులు ఉద్యోగావకాశాలు మొదలయినవి జనాభా ఎక్కువకావటంవల్ల అందరికీ సరిపోవటంలేదు. పారిశ్రామికీకరణానికి ముందు గ్రామీణ ప్రజలకు, కుటీరపరిశ్రమలు ఎక్కువగా ఉపాధి సౌకర్యాలు కల్పించేవి. కాని పురాతనమైన గ్రామీణపరిశ్రమలు క్షీణించిపోవడంవల్ల, చాలామంది సాంప్రదాయిక వృత్తులు చేసుకునేవ్యక్తులు, తమ ఉపాధి అవకాశాలను పోగొట్టుకొని అల్పోద్యోగులవుతున్నారు.

గ్రామీణ ప్రాంతాలు, సమగ్రంగా అభివృద్ధి చెందకపోవడంకూడా, అల్పోద్యోగానికి దారితీస్తున్నది. వ్యవసాయం, పరిశ్రమలు ఉపాధి దృక్పథంతో అభివృద్ధి చెందడంలేదు. అంతేగాక కావలసిన యంత్రసామగ్రి, సాంకేతిక పరిజ్ఞానం లోపించడంవల్ల, మన దేశంలో లభిస్తున్న విస్తృతమైన వనరులను సక్రమంగా ఉపయోగించలేకపోవడం జరుగుతున్నది. అందుచేతనే అనేకమందికి ఉద్యోగావకాశాలు లభించడంలేదు.

గ్రామీణ ప్రాంతాలలోని ప్రచ్ఛన్న నిరుద్యోగితను నిర్మూలించడానికి ప్రభుత్వం, పంచవర్ష ప్రణాళికలద్వారా ఉపాధికల్పనా కార్యక్రమాలను చేపట్టింది. వీటివల్ల యీ సమస్యాపరిష్కారానికి కొంతమేరకు కృషిజరిగిందని చెప్పవచ్చు.

అల్పోద్యోగిత పరిష్కారానికి వ్యవసాయాన్ని ఆధునికపద్ధతులలో కొనసాగించడమే కాకుండా, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పటిష్టంచేయడం అవసరమని ప్రణాళికాసంఘంవారు అభిప్రాయ

పట్టారు. అల్పోద్యోగాన్ని తొలగించడానికి, కుటీరపరిశ్రమలు, అభివృద్ధి కార్యక్రమాలను విస్తృత పరుస్తూ, కొత్త పరిశ్రమలనుకూడా గ్రామీణ ప్రాంతాలలో నెలకొల్పాలని వారు సూచించారు.

అల్పోద్యోగాన్ని తొలగించడానికి ఈ కింది కార్యక్రమాలను చేపట్టడం జరిగింది. పెద్ద తరహా, చిన్నతరహా సేద్యపునీటి ప్రాజెక్టులు నిర్మించడం, ఆధునిక పద్ధతులలో తోటల పెంపకం చేయడం, బియ్యం, పిండి, పంచదార పరిశ్రమలు, నూలువడకటం, బెల్లం తయారీ, కోళ్ళ పెంపకం, సబ్బులు, నూనెలు తయారుచేయడం, పాడి అభివృద్ధిపథకాలు మొదలైన గ్రామీణ పరిశ్రమల నభివృద్ధిచేయటంద్వారా గ్రామీణ ప్రాంతాలలో ఉపాధిసౌకర్యాలు ఏర్పాటుచేయడం జరుగుతున్నది.

పై పథకాలద్వారా, గ్రామీణప్రజల ముఖ్య సమస్యలలో ఒకటైన ప్రచ్ఛన్న నిరుద్యోగిత తొలగించి, గ్రామీణ సమగ్రాభివృద్ధికి తోడ్పడడం చాలా అవసరం.

## గ్రామీణాభివృద్ధి పథకాలు (RURAL DEVELOPMENT SCHEME)

అనేకమైన సామాజిక, ఆర్థిక సమస్యలతో చాలా కాలం నుంచి మగ్గిపోతున్న గ్రామీణ సమాజాలను అభివృద్ధిపరచాలనే ముఖ్య ఉద్దేశ్యంతో, స్వాతంత్ర్యం రాకముందునుంచీ, గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలను మన దేశంలో ప్రారంభించడం జరిగింది. నిర్మాణాత్మక కార్యక్రమాల ద్వారా గాంధీజీ గ్రామీణ సర్వతోముఖాభివృద్ధికి కృషి జరిపినాడు. తరవాత సంయుక్త మద్రాసు రాష్ట్రంలో ప్రభుత్వపరంగా ఫిర్కాడెవలప్‌మెంట్ పథకాన్ని ప్రవేశపెట్టారు. ఈ పథకాన్ననుసరించి, రాష్ట్ర ప్రాంతాన్ని అనేక ఫిర్కాలుగా విభజించి, అభివృద్ధి కార్యక్రమాలను అమలుపరచటంలో సంఘటిత కృషి జరిగింది.

మొదటి పంచవర్ష ప్రణాళికలో గ్రామీణ పునర్నిర్మాణ కార్యక్రమాలకు ప్రాధాన్యత నివ్వటం జరిగింది. గ్రామీణ ఆర్థిక, సామాజిక రంగాలలో అభివృద్ధిని ప్రణాళికాబద్ధంగా సాధించటానికి ప్రభుత్వంగా సాధించటానికి ప్రభుత్వం సమాజ వికాస కార్యక్రమాలను ప్రయోగాత్మకంగా 1952 వ సంవత్సరంలో ప్రారంభించింది. ఈ కార్యక్రమాన్ని 1953 వ సంవత్సరంలో జాతీయ విస్తరణా కార్యక్రమంగా మార్పుచేసి, దేశంలోవున్న అన్ని గ్రామీణ సముదాయాలకు వర్తించేటట్లుగా చేయటం, గ్రామీణ పురోభివృద్ధికి చాలా దోహదం చేసిందని చెప్పవచ్చు. ఈ బృహత్కార్యక్రమం ఆశయం ఏమంటే, గ్రామీణ ప్రజలను, వారి సమస్యలను వారు గుర్తించేటట్లు చేసి, ఆ సమస్యల పరిష్కారంలో వారినే పాల్గొనేటట్లుగా చేయటం; దీనితోపాటు కొన్ని ముఖ్య ఉద్దేశాలనుగూడా పొందుపరచటం జరిగింది. అవి ఏమంటే 1. ప్రజల మనస్తత్వంలో, దృక్పథంలో మార్పువచ్చేటట్లు చూడటం 2 ప్రగతిని పెంపొందించగల నాయకత్వాన్ని అభివృద్ధి చేయడం. 3. ప్రజలలో స్వయం సహాయతా భావాన్ని పెంపొందించడం. 4. వ్యవసాయోత్పత్తులను అధికం చేసేటందుకు మేలయిన, ఆధునికమైన వ్యవసాయ పద్ధతులను, విధానాలను పెంపొందించడం. 5. ప్రస్తుతమున్న చిన్నతరహా పరిశ్రమలను, గృహపరిశ్రమలను అభివృద్ధి పరచడం. 6. ఆహారానికి సంబంధించిన అన్నిటిని తనంతటతానే సమకూర్చుకోడానికి కావలసిన ప్రోత్సాహ, సహాయ సహకారాలు కుటుంబానికి లభించేటట్లుగా చేయడం.

7. గ్రామాభివృద్ధి కార్యక్రమాలలో గ్రామ ఉపాధ్యాయుడు పాల్గొనేటట్లు చూడటం తరవాత అతని గౌరవ మర్యాదలు అధికమయ్యేటట్లు చూడటం. 8. అనారోగ్యంవల్ల రోజురోజుకు అధికమవుతున్న జనాభా నష్టాన్ని సాధ్యమైనంత వరకు తగ్గించడం.

ఈ లక్ష్యాలను నెరవేర్చడానికి జిల్లాస్థాయిలో వివిధ బ్లాకులను రూపొందించి, ఆయా ప్రాంతాలలో బ్లాక్ డెవలప్‌మెంట్ అధికారి నాయకత్వంలో వివిధ విస్తరణశాఖలకు సంబంధించిన కార్యకర్తలు అభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించడం జరిగింది. ఇదేగాక, పెద్దపెద్ద గ్రామాలలోను వాటికి సంబంధించిన కుగ్రామాలలోను గ్రామసేవిక నాయకత్వంలో ఈ విస్తరణ కార్యక్రమాలను ఏర్పాటుచేయడం జరిగింది.

కాని ఈ కార్యక్రమాలు ఆశించినంతగా మార్పును, అభివృద్ధిని ప్రజలలో తీసుకురాలేక పోవడంవల్ల భారతప్రభుత్వం కీర్తిశేషులు శ్రీ బల్వంతరాయ్ మెహతా నాయకత్వంలో ఒక కమిటీని ఏర్పాటుచేసి, ఈ జాతీయ కార్యక్రమాన్ని కూలంకషంగా పరిశీలించి, సూచనలను ఇవ్వవలసిందిగా కోరడమైంది. వీరు సమర్పించిన నివేదిక ప్రకారం, సమాజవికాస అభివృద్ధి కార్యక్రమాలలో గ్రామీణప్రజలు సరయిన ఆసక్తిని చూపడంలేదని, అందువల్ల ప్రజాహిత కార్యక్రమాలలో ప్రజలు విరివిగా పాల్గొనడంలేదని అభిప్రాయాన్ని వెల్లడిచేయడమైంది. దీనిని నెరవేర్చడానికి ఈ కార్యక్రమాల ద్వారా చేపట్టేపథకాలను, అమలుపరచడంలోనేకాక, రూపొందించడంలో కూడా, ప్రజాప్రతినిధులకు పాత్రనివ్వడం చాలా అవసరమని తెలియజేశారు. ఈ నివేదికను భారతప్రభుత్వం ఆమోదించి, 1958 వ సంవత్సరంలో పంచాయతీరాజ్ అనే వ్యవస్థను ఏర్పాటుచేయడం జరిగింది. ఈ పథకం ప్రకారం, కార్య క్రమాల నిర్వహణ మూడుస్థాయిలలో జరుగుతుంది. అవి (1) గ్రామస్థాయి (2) పంచాయతీ సమితి స్థాయి (3) జిల్లాపరిషత్ స్థాయి.

ఈ నూతన పరిపాలనా వ్యవస్థను ఏర్పరచినతరవాత, గ్రామీణ ప్రజలు, వారు ఎంపికచేసిన ప్రతినిధులద్వారా అభివృద్ధికార్యక్రమాలను అమలుపరుస్తూ, గ్రామీణపురోభివృద్ధికి కృషిచేస్తున్నారు. ఈ జాతీయ కార్యక్రమాలద్వారా, వ్యవసాయ, పారిశ్రామిక, విద్య, సామాజికవిద్య, మొదలైన రంగాలలో గణనీయమైన అభివృద్ధిని సాధించడమైంది.

ఈ కార్యక్రమాలతోపాటు, వివిధ సంస్థలను ప్రభుత్వం ఏర్పరచి, వాటిద్వారా సమగ్ర గ్రామీణాభివృద్ధిని సాధించడానికి వివిధ కార్యక్రమాలను, ప్రణాళికలను రూపొందించింది.

## సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం

గ్రామీణ ప్రజలలో పేదరికాన్ని నిర్మూలిస్తేగాని త్వరితగతిలో అభివృద్ధిని సాధించలేమనే సత్యాన్ని ప్రభుత్వం గుర్తించింది. చిన్నకారు, సన్నకారు రైతులకు ప్రోత్సాహాన్ని కలిగించేందుకు కొన్ని పథకాలద్వారా సబ్సిడీలను ప్రజలకిచ్చి, వారి అభివృద్ధికి తోడ్పడడానికి వివిధ కార్యక్రమాలను

అమలుపరచడం జరిగింది. వాటిలో ముఖ్యంగా పేర్కొనదగినవి : చిన్నకారు రైతుల అభివృద్ధి పథకం, సన్నకారు రైతుల అభివృద్ధి పథకం, జాతీయ గ్రామీణ ఉపాధికల్పనా పథకం (National rural Employment Scheme), పనికి ఆహార పథకం (Food for Work Scheme) మొదలైనవి. గ్రామీణ అభివృద్ధి అన్ని రంగాలలో జరిగితేనేగాని, గ్రామీణ ప్రజల సమస్యలు శాశ్వతంగా పరిష్కరించడం జరగదు అనే ఉద్దేశంతో 1980 వ సంవత్సరంలో సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకాలను ప్రారంభించటమైంది. ఈ పథకంద్వారా జాతీయాదాయం పెరుగుదలేగాక, పేద కుటుంబాల ఆదాయం ఉత్పాదక శక్తులను పెంచడంకూడా ముఖ్య ఉద్దేశ్యంగా పెట్టుకున్నారు. గ్రామీణ ప్రాంతాలను ముందుగా సర్వేచేసి, అతి బీదరికంలోవున్న కుటుంబాల వివరాలను సేకరించాలి. సర్వే జరిపిన తరువాత ప్రతి సంవత్సరం ఒక్కొక్క పంచాయతీసమితి ఆర్థిక సహాయం చేయడానికి తగిన అరువందల కుటుంబాలను ఎంపిక చేసుకుంటారు. వ్యవసాయం, పశుపోషణ, గృహపరిశ్రమలు, వ్యాపారం మొదలైన రంగాలలో కుటుంబ పరిస్థితి, వ్యక్తుల శక్తి సామర్థ్యాలు, అభిరుచులనుబట్టి ఒక పథకాన్ని రూపొందించి, ఆ కుటుంబాలకు ఆదాయం కల్పించే కార్యక్రమాలను అందిస్తారు. చిన్నతరహా సేద్యపు నీటివనరులు కల్పించడం, వ్యవసాయ సంబంధిత పరికరాలను, సాధనాలను ఇవ్వడం, పట్టుపరిశ్రమ, తోటల పెంపకం పశువుల పెంపకం, చిన్నచిన్న కుటీర పరిశ్రమలను, వ్యాపారాలను ఆయా కుటుంబాలకు కల్పించి, వారి పురోభివృద్ధికి సహాయం చేయడం జరుగుతుంది. ఈ కార్యక్రమాలను జయప్రదం చేయడానికి కావలసిన పెట్టుబడులను గ్రామీణాభివృద్ధి సంస్థ ఉచితంగా ఇస్తుంది. కొంతవరకు పెట్టుబడిని బ్యాంకుల ద్వారా తక్కువ వడ్డీకి అప్పురూపంలో ఇప్పిస్తుంది. ఈ పెట్టుబడిపై వచ్చే ఉత్పత్తి ద్వారా కుటుంబ ఆదాయం, జీవనప్రమాణం పెరిగి, వారు పేదరికం నుంచి విముక్తి పొందడానికి అవకాశం కల్గుతుంది.

ఇంతేగాక, ఈ సంస్థ గ్రామీణ ఉపాధి పథకం ద్వారా సామాజిక అడవుల పెంపకం కోసం కావలసిన వనరులను గ్రామీణ ప్రజలకు అందించి, వాటిని పర్యవేక్షిస్తుంది. వీటితోపాటు, నిరుద్యోగులుగా ఉన్న గ్రామీణ యువకులను వారి అభిరుచినిబట్టి వృత్తి శిక్షణను ఉచితంగా ఇచ్చి, వారిలో స్వయం సహాయతాభావాన్ని పెంపొందింపచేసి, వారి కాళ్ళపై వాళ్ళు నిలబడేటట్లుగా జీవించడానికి కావలసిన సహాయాన్ని అందిస్తుంది. ఈ విధంగా గ్రామీణ సమస్యలలో ప్రధానమయిన పేదరికాన్ని నిర్మూలించి, గ్రామీణ సమగ్రాభివృద్ధికి ఈ సంస్థ కృషి చేస్తుంది.

పైన పేర్కొన్న గ్రామీణ సమాజాభివృద్ధి కార్యక్రమాలను పరిశీలిస్తే, ఈ కింది అంశాలను మనం గమనించవచ్చు.

1. ప్రజల జీవనవిధానాలలో గణనీయమైన మార్పులు తీసుకురాబడ్డాయి. వ్యవసాయ రంగంలో అధునాతనపద్ధతులను, నేడు గ్రామీణ ప్రజలు అధికశాతంలో అవలంబించడం మనకు కన్పిస్తుంది. దీనితోపాటు, పశుపోషణ విషయంలోకూడా, పశువైద్యులు, సంబంధిత అధికారులను సంప్రదిస్తూ, నూతన విధానాలను అమలుపరచడం చూడవచ్చు. నేటి గ్రామీణ సమాజాలలో రహదారి సౌకర్యాలు, బాగా అభివృద్ధిచెందినాయి. వైద్యరంగంలో ప్రాథమిక ఆరోగ్యకేంద్రాల

ద్వారా ఎక్కువశాతం ప్రజలు సహాయాన్ని పొందుతున్నారు. విద్యారంగంలో ప్రతిగ్రామంలో ఏకోపాధ్యాయ పాఠశాలలను ఏర్పరచి, ప్రాథమికవిద్యను అందరికీ అందుబాటులో ఉండేటట్లు కృషి జరిగింది. అంతేగాక, మాధ్యమిక, ఉన్నత విద్యాసంస్థలను, జూనియర్ కళాశాలలను గ్రామీణ ప్రాంతాలలో నెలకొల్పి, విద్యారంగంలో ప్రభుత్వం కృషిచేస్తున్నది. వీటితోపాటు, విద్యుత్ శక్తి, నీటిపారుదల సౌకర్యాలు మొదలగు కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించడం జరుగుతున్నది.

ఈ కార్యక్రమాలు అభివృద్ధిని సాధిస్తున్నప్పటికీ, అవి ఆశించినంత త్వరితంగా అమలు జరగడం లేదనటం సత్యదూరం కానేరదు. ఎందుకంటే, పంచాయతీరాజ్ వ్యవస్థవల్ల, గ్రామీణప్రజల జీవనపరిస్థితులపై సామాజిక ప్రభావంకన్న రాజకీయ ప్రభావం ఎక్కువగా కలగడంవల్ల, రాజకీయ కక్షలు, సంఘర్షణలు, వైరుధ్యాలు ప్రబలి, గ్రామీణ జీవనపరిస్థితులలో సంక్షోభాన్ని కలిగిస్తున్నాయి. వీటివల్ల, వారిలో ఐక్యత లోపించి, గ్రామీణ పురోభివృద్ధికి వారు సంఘటితకృషి చేయలేకపోవడం చాల విచారకరమైన విషయం. అంతేగాక, ఈ కార్యక్రమాలను, నిర్వహిస్తున్న అధికారులలో క్రమశిక్షణారాహిత్యం పెరిగి, అవినీతి, లంచగొండితనం, జాప్యత, బంధుప్రీతి, ఆశ్రితపక్షపాతం మొదలగు సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ఇవి అరికట్టితేనేగాని గ్రామీణ పురోభివృద్ధిని త్వరితంగా సాధించలేం.

## సంఘ సంక్షేమ కార్యకర్త పాత్ర :

గ్రామీణాభివృద్ధి విస్తరణ కార్యక్రమాలను రూపొందించి, అమలుపరచడంలో నిర్వహణ అధికారులుగా సుశిక్షితులయిన సంఘసంక్షేమ కార్యకర్తలను నియమించవలసిన అవసరం ఎంతయినా ఉంది. ఎందుకంటే, సంక్షేమ కార్యకర్తలు, సముదాయాలను అధ్యయనం చేయడంలో, వాటి సమస్యలను అవగాహన చేసుకోవడంలో, వాటిని పరిష్కరించడానికి కావలసిన పథకాలను అమలు పరచడంలో, తగిన శాస్త్రీయ పరిజ్ఞానాన్ని నిపుణతలను వారు పొందిఉన్నారు. ఈ కార్యక్రమాలలో ముఖ్యంగా అమలుపరచే విస్తరణ విధానాలు మూడు ఉన్నాయి. (1) నాయకులద్వారా (2) సమూహాలలోని సభ్యులతో (3) సమూహాలద్వారా పనిచేయడం. సాంఘికసంక్షేమకార్యకర్త వ్యక్తిసేవాపద్ధతి ద్వారా, సమాజనిర్మితి, ప్రకార్యాలలో పొందిన పరిజ్ఞానంద్వారా, నాయకులతో పనిచేసి, వారిని అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనేటట్లు చేయవచ్చు. సామూహిక సేవా కార్యక్రమాలద్వారా సమూహాలకు చెందిన సభ్యులతో కలసి పనిచేస్తూ, సమూహ ప్రాతిపదికపై, కార్యక్రమాలను రూపొందించి, వారిని పురోభివృద్ధి పంథాలో నడిపించడానికి కృషిచేయగలడు. సాముదాయక వ్యవస్థాపన పద్ధతులద్వారా సాముదాయక అవసరాలు తెలుసుకుని, స్థానికంగా లభించే వనరులను సమీకరించి, అభివృద్ధి పథకాలను రూపొందించి, అమలుపరచగలడు. రకరకాలయిన జన బాహుళ్యానికి, సేవలను అందించటంలో, శాస్త్రీయ విధానాలను అమలుపరచి, అందరి సంక్షేమానికి, కార్యకర్త కృషిచేస్తాడు. పరిశోధనా కార్యక్రమాలు నిర్వహిస్తూ, అమలుపరుస్తున్న పథకాలను విశ్లేషణ జరిపి వాటిలోని లోటుపాటులను గుర్తించి, సక్రమమయిన కార్యక్రమాలను రూపొందించి,

అమలుపరచడంలో సంక్షేమ కార్యకర్త అతి కీలకమైన పాత్రను నిర్వహిస్తాడు. అంతేగాక గ్రామీణ
ప్రజలకు సంబంధించిన సమస్యలను పరిష్కరించడంలో సమైక్యతాభావాన్ని ప్రజలలో కలిగించి, వారం
దరూ, కలసికట్టుగా సమస్యలను ఎదుర్కొనడంలో కార్యకర్త సహాయపడగలడు. కాబట్టి గ్రామీ
ణాభివృద్ధి కార్యక్రమాలలో సుశిక్షితులయిన కార్యకర్తలను నియామకం చేయటం ఎంతయినా
అవసరం.

## వయోజన విద్య (ADULT EDUCATION)

విద్య మానవునికి అవసరం. విద్య మానవుని సహజ జ్ఞానాన్ని మెరుగు పెడుతుంది. విద్య
మానవునిలో వివేకాన్ని, విచక్షణా జ్ఞానాన్ని పెంపొందిస్తుంది. విద్యాకార్యక్రమాలద్వారా సామాజిక
పరివర్తనలు తీసుకురావడమే సంక్షేమరాజ్య ముఖ్య ఉద్దేశ్యం. అభివృద్ధి చెందుతున్న భారతీయ సమా
జంలో నేటికికూడా ముఖ్య సమస్యలుగా నిరక్షరాస్యత, జడత్వం, అనారోగ్యం, దారిద్ర్యం ఉన్నాయని
చెప్పవలె. వ్యక్తి, సమాజం త్వరితంగా పురోభివృద్ధిని సాధించాలంటే, ఈ సమస్యలన్నింటిని పూర్తిగా
తొలగించాలి. కాబట్టి ఈ ఉద్యమంలో విద్య చాలా ప్రముఖపాత్ర వహిస్తుంది.

ప్రజాస్వామిక సమాజాలలో, ప్రతీ పౌరుడూ తన విధులను తెలుసుకుని సామాజిక పురోభి
వృద్ధి కార్యక్రమాలలో కృషి చేయవలె. మనకు స్వాతంత్ర్యం రాకమునుపు, అనేక సంఘ సంస్కర్తలు
సంఘ సేవకులు ప్రజలను విద్యావంతులుగా చేయడానికి చాలా కార్యక్రమాలను నిర్వహించారు.
వాటిలో వయోజన విద్యా కార్యక్రమం ముఖ్యమైనది. కాబట్టి, వయోజన విద్య భావన మన సమా
జంలో చాలా కాలం నుంచి ఉన్నదని విశదమవుతున్నది. కాని ఈ కార్యక్రమాల ద్వారా వయోజను
లలో నిరక్షరాస్యతను తొలగించడమే ముఖ్య లక్ష్యంగా పెట్టుకొని వయోజనులకు చదవటం, రాయటం
సులభ గణితం నేర్పించడానికి కార్యకర్తలు కృషి చేశారు. కాని స్వాతంత్ర్యం వచ్చిన తరవాత ఈ
విధమైన కార్యక్రమాలు దేశవ్యాప్తంగా నిర్వహించబడుతున్నప్పటికీ, మారుతున్న సమాజంలో వీటి
నింకను అభివృద్ధిపరచవలెననెడి అభిలాషను చాలామంది వ్యక్తం చేశారు. ఎందుకంటే, ప్రతీ పౌరుడు
తన బాధ్యతలను, విధులను నిర్వహిస్తూ, సామాజిక శ్రమ విభజనలో పాల్గొంటూ, తన పురోభివృద్ధికే
కాయశక్తులా కృషి చేయాలి అంటే, వయోజన విద్యా విధానంలో మార్పు తీసుకుని రావలె. దీనినే
ఆధారంగా చేసుకుని భారత ప్రభుత్వం అక్టోబరు, రెండు, 1978 వ సంవత్సరంలో దేశవ్యాప్తంగా
జాతీయ వయోజన విద్యా పథకాన్ని ప్రారంభించింది.

ఈ బృహత్కార్యక్రమం ద్వారా, **15-35** సంవత్సరాల వయస్సులో ఉన్న స్త్రీ పురుషులలో
మూడువందల మిలియన్ల నిరక్షరాస్యులను, ఒక నిర్ణీతమైన గడువులో, దశలవారీగా, ప్రయోజనులుగా
తీర్చిదిద్దాలి అని అభిప్రాయం. దీనిని సాధించేందుకు జాతీయ, రాష్ట్ర, జిల్లా, గ్రామీణాస్థాయిలలో,
పాలనా యంత్రాంగాన్ని ఏర్పరచటమైంది.

## ఈ కార్యక్రమం ముఖ్య ఉద్దేశాలు

1. అక్షరాస్యత

వయోజనులలో అక్షరాస్యత, సులభగణితం నేర్పించడం. దీనివల్ల వ్యక్తులు తమ దైనందిన కార్యక్రమాలలోను, ఒకరినొకరు అవగాహన చేసుకోవడంలోను, సామాన్య జీవన మనుగడను సాగించడానికి కావలసిన పరిజ్ఞానాన్ని పెంపొందించుకుంటారు.

2. వృత్తిపరమైన విద్య (Functional literacy)

వయోజనవిద్యా కార్యక్రమాలలో పాల్గొనేవారికి, వారివారి వృత్తులకు సంబంధించిన పరిజ్ఞానాన్ని, నిపుణతలను నేర్పించడం. దీనివల్ల వయోజనుడు, తను చేస్తున్న వృత్తికార్యకలాపాలలో నిపుణతలను, పరిజ్ఞానాన్ని పెంపొందించుకుని, తన ఉత్పాదకశక్తులను అభివృద్ధిపరచుకుని, ఆదాయాన్ని పెంపొందించుకోవడానికి కృషిచేస్తాడు.

3. సామాజిక అవగాహన

ఈ కార్యక్రమాలద్వారా వయోజనులలో సక్రమమైన అవగాహనను పెంపొందించడం సాధ్యమవుతుంది. దీనివల్ల వ్యక్తి తనగురించి, తన కుటుంబంగురించి, సముదాయం గురించి, సమాజం గురించి తెలియని ఎన్నో క్రొత్తవిషయాలను తెలుసుకుని, సామాజిక చైతన్యాన్ని, సామాజిక స్పృహను పొందుతాడు.

ముఖ్యంగా ఈ జాతీయ వయోజన విద్యా కార్యక్రమాలు, హరిజనులకు, గిరిజనులకు, స్త్రీలకు, వయోవృద్ధులకు ఉపయోగపడేరీతిలో రూపొందించి అమలుపరచాలి. ఈ కార్యక్రమాన్ని, దేశంలో, ప్రభుత్వం, స్వచ్ఛంద సేవాసంస్థలు ఎక్కువగా అమలుపరుస్తున్నాయి. ఈ కార్యక్రమాలను నిర్వహించేవారికి తగిన శిక్షణా కార్యక్రమాలుకూడా ప్రభుత్వం ఏర్పాటుచేసింది. అంతేగాక, ప్రణాళికాబద్ధమైన పద్ధతులద్వారా ఈ కార్యక్రమాన్ని అమలుపరచడం జరుగుతున్నది. ఈ కార్య క్రమాన్ని నిర్వహించే సంస్థలకు, ఆర్థిక సహాయాన్నికూడా ప్రభుత్వం అందిస్తున్నది.

దేశవ్యాప్తంగా ఈ కార్యక్రమాన్ని గిరిజన, గ్రామీణ, నగర సముదాయాలలో, ఎక్కడయితే నిరక్షరాస్యత ఎక్కువగా ఉన్నదో ఆయా ప్రాంతాలలో వయోజన విద్యాకేంద్రాలు నెలకొల్పడం జరిగింది. కేంద్రాలను నిర్వహిస్తున్న కార్యకర్తలకు తగిన శిక్షణా తరగతులను ఏర్పాటు చేశారు. ఉపన్యాస పద్ధతి, నాటకీయ పద్ధతి, మొదలగు విధానాలద్వారా వయోజన విద్యా కార్య క్రమాలను నిర్వహించడం జరుగుతున్నది.

ఈ కార్యక్రమాల నిర్వహణా పద్ధతిని నిశితంగా పరిశీలిస్తే కొన్ని లోపాలు మనకి కన్పిస్తాయి. (1) ఎక్కువమంది వయోజనులు ఈ కార్యక్రమంపై ఆశించినంత ఆసక్తి చూపడం లేదు. (2) వయోజనవిద్యా కేంద్రాలను నిర్వహించే కార్యకర్తలకు సరయిన శిక్షణ ఇవ్వడంలేదు. (3) వివిధ అభివృద్ధి సంస్థలమధ్య, సరయిన సమన్వయం, అవగాహన లేకపోవడంవల్ల కొన్ని కార్య

క్రమాలు జయప్రదం కావడంలేదు. (4) వయోజనవిద్యా కార్యకర్తలకు సరయిన ప్రోత్సాహకాన్ని ఇవ్వడంలేదు.

కొన్ని మన ఇరుగుపొరుగు దేశాలలో ఈ కార్యక్రమం జయప్రదం అవడానికి కారణం, దీనిని ఆయా ప్రభుత్వాలు, ఒక ఉద్యమంగా గుర్తించి, విద్యాలయాలను, విద్యార్థులను ఈ కార్యక్రమంలో తప్పనిసరిగా పాల్గొనేటట్లు చేయడం అందువల్లనే ఆయా దేశాలలో నిరక్షరాస్యతను పూర్తిగా నిర్మూలించడం జరిగింది. కాబట్టి, భారతసమాజంలో కూడా, వయోజనులలో ఉన్న నిరక్షరాస్యతను పూర్తిగా తొలగించాలి అంటే, ఉన్న లోపాలను సరిదిద్దుతూ ఈ కార్యక్రమాన్ని ఒక ఉద్యమంగా నడపవలసిన అవసరం ఎంతయినా ఉంది.

## సామాజిక విద్య (SOCIAL EDUCATION)

సామాజిక ప్రగతికి, సామాజిక విద్య చాలా అవసరం. సామాజిక అభివృద్ధి కోసం వ్యక్తులందరూ కృషి చేసేటట్లుగా సమాజాన్ని విద్యావంతం చేయడమే సామాజిక విద్య ముఖ్య లక్ష్యం.

వ్యక్తికి సాంఘిక, రాజకీయ, ఆర్థిక, ఆరోగ్య అంశాల అవగాహనను కలిగించే విద్యయే సామాజిక విద్య. ప్రతి పౌరుడు సాంఘిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థను చక్కగా అర్థం చేసికొని తగిన పాత్రను వహించినప్పుడే దేశం పురోగమిస్తుంది. రాజకీయ అవగాహనను పెంపొందించుకుంటే, స్థానిక రాజకీయ వ్యవస్థను మెరుగుపరచుకోవచ్చు. సాంఘిక అవగాహనను పెంపొందించుకొంటే, అనేక సాంఘిక దురాచారాలను పారద్రోలి, సాంఘిక పరిజ్ఞానాన్ని పెంపొందించుకోవచ్చు. ఆరోగ్య విషయాలను గురించి చక్కని అవగాహన కలిగినప్పుడు ఆరోగ్యాన్ని, పరిశుభ్రతను మెరుగుపరచుకొని, వ్యక్తి సంక్షేమాన్ని, కుటుంబ సంక్షేమాన్ని సాధించుకోవచ్చు. ఆర్థిక విషయాలను అవగాహన చేసికొంటే ఆదాయాన్ని, ఉత్పత్తిని పెంపొందించుకొని, పేదరికాన్ని పారద్రోలి, జీవన ప్రమాణాన్ని మెరుగుపరచుకోవచ్చు. నిరక్షరాస్యులైన వయోజనులలో మూఢ నమ్మకాలను, మూఢాచారాలను తొలగించి, వారిలో శాస్త్రీయ విజ్ఞానాన్ని పెంపొందించటానికి, ఆత్మవిశ్వాసాన్ని వృద్ధిచేయటానికి స్వయంశక్తిమంతులుగా వారిని తయారుచేయటానికి కూడ యీ సామాజిక విద్య చాలా అవసరం.

అధిక శాతం గ్రామీణ ప్రజలు, ప్రాచీన సాంప్రదాయ పద్ధతులకు బాగా అలవాటుపడి ఉంటారు. కాని సాంఘిక రాజకీయ, ఆర్థిక వ్యవస్థలలో కలిగిన ఆధునిక మార్పులవల్ల కొత్త జీవిత పద్ధతులు, విధానాలు అనుసరించడం చాలా అవసరమవుతున్నవి. కనుక గ్రామీణ ప్రజల జీవిత విధానంలో మార్పు కలిగించడం, వారిలో ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక అభివృద్ధి కలిగించడం అత్యవసరం అవి సామాజిక విద్య ద్వారా మాత్రమే సాధించవచ్చు.

మనదేశంలో అనేకమైన కుల, మత, ప్రాంతీయ భాషా విభేదాలున్నాయి. ఆర్థిక, సాంఘిక అసమానత్వం ఎక్కువగా ఉంది. వీటివల్ల అనేక సాంఘిక సమస్యలు ఏర్పడుతున్నాయి. వీటిని తొల

గించాలి అంటే ఒకరినొకరు అర్థం చేసికోవడం, ప్రజలలో సహకారభావాన్ని, సంఘీభావాన్ని కలిగించడం, జాతి ఐక్యతకు కృషి చేసేటట్లు ప్రజలను ప్రోత్సహించడం చాలా అవసరం. సామాజిక విద్యా పథకాల ద్వారా గ్రామీణ ప్రజలలో సామాజిక స్పృహను (Social Awareness) కలిగించి, వ్యక్తులను బాధ్యతాయుతమైన పౌరులుగా తీర్చిదిద్దవచ్చు. సామాజిక విద్య ద్వారా సామాజిక ఐక్యతను చాలా సులభంగా సాధించగలం.

గ్రామీణ, గిరిజన సమాజాలలో సామాజిక విద్యయొక్క ఆవశ్యకత ఎంతయినా ఉంది. ఎందుకంటే, ఆ ప్రాంతాలలోని ప్రజలు ఆధునిక నాగరికతకు దూరంగా ఉంటూ, తగిన అవకాశాలు లేక, వివిధ సమస్యలకుగురయి, చాలా దుర్భరమైన పరిస్థితులలో జీవిస్తున్నారు. అందుకనే 1952 వ సంవత్సరంలో సమాజ వికాస కార్యక్రమాలను ప్రభుత్వం ఏర్పాటు చేసింది. తరవాత సంవత్సరంలో జాతీయ విస్తరణ కార్యక్రమాలను ప్రవేశపెట్టినపుడు సామాజిక విద్యా కార్యక్రమాలకు అధిక ప్రాధాన్యత నివ్వడం జరిగింది. ఏ అభివృద్ధి కార్యక్రమమైనా సఫలీకృతం కావాలి అంటే ప్రజలు ఆ కార్యక్రమాన్ని బాగా అవగాహన చేసుకుని ఆ కార్యక్రమాలలో విరివిగా పాల్గొనాలి. కాబట్టి అభివృద్ధి కార్యక్రమాలను సమాజాలలో ప్రవేశపెట్టడానికి ముందు వాటి గురించి సవివరంగా ప్రజలకు తెలియ చేయాలి. సామాజిక విద్యా కార్యకర్త ఈ పాత్రను సక్రమంగా నిర్వహించాలి. ముఖ్యంగా సామాజిక విద్యా కార్యకర్త ప్రజలలో ఈ మార్పును తీసుకురావడానికి కొన్ని పద్ధతులను ఉపయోగించాలి. 1. ఆయా ప్రాంతాలలో సహజ నాయకత్వ లక్షణాలు కలిగిన వారిని గుర్తించి, ఈ మార్పులకు అనుగుణంగా వారిని కార్యక్రమాలలో పాల్గొనేటట్లు చేయవలె. 2. సముదాయాలలో ఉన్న స్వచ్ఛంద సంస్థలను, ప్రజాస్వామిక సమూహాలను సంఘటిత పరచి, వాటిని ఈ కార్యక్రమాలయందు ఆసక్తి చూపేటట్లు చేయవలె. 3. సామూహిక విద్యా కార్యక్రమాలద్వారా జనబాహుళ్యంలో చైతన్యాన్ని తీసుకురావాలి. వీటిని సక్రమంగా అమలుపరచటానికి ఈ కింది విధానాలను ఉపయోగించాలి.

1. చర్చావేదికలు ఏర్పాటుచేయడం
2. ఉపన్యాసాలద్వారా తెలియచేయడం
3. ప్రదర్శనలు ఏర్పాటుచేయటం
4. దృశ్య, శ్రవణాత్మక విద్యా విధానాలను ఉపయోగించడం
5. హరికథలు, బుర్రకథలు మొదలగు సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటుచేయడం
6. కరపత్రాలు, పోస్టర్ల ద్వారా సందేశాలను అందించడం
7. ప్రజలలో స్వయంసహాయతా భావాల్ని పెంపొందింపచేయడానికి సామూహిక పథకాలను రూపొందించడం
8. వివిధ ప్రభుత్వ స్వచ్ఛంద సేవాసంస్థల మధ్య అవగాహన సమన్వయాన్ని కలిగించడం మొదలయినవి

## సామాజిక విద్య ద్వారా యీ కింది అంశాలను బోధించాలి

మానవులందరూ సమానమే. కులమతభేదాలు పూర్తిగా నిర్మూలనం కావాలి. జాతీయ సమైక్యతకోసం ప్రతిపౌరుడు కృషి చేయాలి. ప్రజాస్వామ్య వ్యవస్థను గురించి, వారికి వివరించి, వారి హక్కులను, బాధ్యతలను వారికి తెలియజేయాలి. ముఖ్యంగా ఓటు హక్కు విలువను వారికి తెలిపి, దానిని సద్వినియోగపరచుకొనే జ్ఞానాన్ని వారిలో కలిగించాలి. ప్రభుత్వ పరిపాలనా విధానాలు, ప్రజల అభివృద్ధి కోసం, ప్రభుత్వం కలిగించే సౌకర్యాలు, వాటిని ఉపయోగించుకునే విధానాలను వారికి తెలియజేయాలి.

స్వయం శక్తి ద్వారా, గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమాలను చేపట్టి, సమగ్ర గ్రామీణాభివృద్ధికి కృషి చేసేటట్లు వారిని ప్రోత్సహించాలి.

మానసిక, సాంస్కృతిక అభివృద్ధిని కలిగించే వినోద, విజ్ఞాన, సాంస్కృతిక కార్యక్రమాల ఆవశ్యకతను, విలువలను గుర్తించి, ఆటపాటలు, నాటకాలు, ఉత్సవాలు మొదలైనవి క్రమబద్ధంగా నిర్వహించేటట్లు గ్రామీణ ప్రజలను ప్రోత్సహించాలి.

ఆరోగ్య సూత్రాలను, నియమాలను వారికి తెలియచేసి, అందుబాటులో ఉన్న ఆరోగ్య సౌకర్యాలను పూర్తిగా వినియోగించుకొని, వ్యక్తి సంక్షేమం, కుటుంబ సంక్షేమం సాధించుకొనేటట్లు చూడాలి.

వివిధ సాంఘిక సమస్యలు, వాటిని పరిష్కరించటానికి వివిధ సంఘ సంస్కర్తలు చేసిన కృషి, ప్రభుత్వం అమలుపరిచే చట్టాలు మొదలయినవాటిని తెలియచేసి, సాంఘిక సమస్యలను పరిష్కరించటంలో వారి పూర్తి సహకారాన్ని పొందేటట్లు చూడాలి.

ఆరోగ్యం, కుటుంబ సంక్షేమానికి సంబంధించిన అంశాలలో ముఖ్యంగా పరిసరాల పరిశుభ్రత, వ్యక్తిగత పరిశుభ్రత, సామాన్య ఆరోగ్య సమస్యలు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రం సేవలు, మాతా శిశు సంరక్షణ సేవలు, పాఠశాల ఆరోగ్య సేవలు, అంటువ్యాధులను నివారించటానికి, అరికట్టటానికి తీసుకోవలసిన జాగ్రత్తలు, కుటుంబ సంక్షేమం, కుటుంబనియంత్రణా పద్ధతులు మొదలయిన అంశాలను గురించి వారికి వివరంగా తెలియచేయాలి.

సామాజిక విద్యా కార్యకర్త ప్రజలలో పరిపూర్ణ సామాజిక విజ్ఞానాన్ని కలిగించాలంటే, కొన్ని ప్రత్యేక లక్షణాలను కలిగి ఉండాలి. కార్యకర్త స్థానికుడై వుండి, వ్యక్తులందరి సాంఘికామోదాన్ని కలిగి ఉండాలి. క్రమశిక్షణ, మర్యాద, విద్య నేర్పించటంలో ఆసక్తి, నాయకత్వ లక్షణాలు, ఉత్సాహం మొదలైనవి కార్యకర్తకు చాలా అవసరం. రాజకీయ దురభిమానంగాని, మత దురాభిమానం గాని కలిగి ఉండరాదు. విద్య నేర్పించటానికి అవసరమైన ప్రత్యేక శిక్షణను, నిపుణతలను కార్యకర్త కలిగి ఉండాలి.

ఈ విధంగా సామాజిక విద్య ద్వారా, గ్రామీణ ప్రజలను పేదరికంతో బాధపడే వెనుక బడిన వర్గాలను స్త్రీలను ప్రయోజకులుగా చేసి, గ్రామీణ అభివృద్ధికి, జాతీయ అభివృద్ధికి ఉపయోగ పడే పౌరులుగా తయారుచేయవచ్చు.

సామాజిక విద్యా కార్యక్రమాలు సఫలీకృతంగాను, సక్రమంగాను అమలుపరచాలి అంటే, సుశిక్షితులైన సంఘ సంక్షేమ కార్యకర్తలను ఈ కార్యక్రమ నిర్వహణ అధికారులుగా నియమించటం చాలా అవసరం.

# 14
# సామాజిక శాసనాలు

మానవుడు సంఘజీవి. మానవుని దైనందిన జీవితవిధానం, అతని సామాజిక జీవితం సామాజిక వ్యవస్థాపనమీద ఆధారపడి ఉంటాయి. వ్యక్తుల ప్రవర్తనను నియమబద్ధం చేయటానికి సమాజం, సామాజిక ప్రమాణాలను ఏర్పాటుచేస్తుంది. మానవ సంబంధాలను, ప్రవర్తనారీతులను క్రమబద్ధంచేసి, సామాజిక సమన్వయాన్ని పెంపొందించి, వ్యక్తి అభివృద్ధికి, సమాజ శ్రేయస్సును కలిగించటానికి దోహదపడే చర్యలను సమాజం చేపడుతుంది. వాటినే సామాజిక నియంత్రణా విధానాలని చెప్పవచ్చు. సామాజిక నియంత్రణ సమాజపరంగా జరుగుతుంది. వ్యక్తుల ప్రవర్తనను క్రమబద్ధం చేయటంలో సమాజం చేసే ఒత్తిడిని, సామాజిక నియంత్రణ అని చెప్పవచ్చు. సమాజం కొన్ని నియమాలను అనుసరించి, వ్యక్తుల ప్రవర్తనను, చేష్టలను క్రమబద్ధం చేసినపుడు ఆ విధానాన్ని సామాజిక నియంత్రణ అంటారు.

సమాజం నిర్ణయించిన ప్రవర్తనా విధానాలనే ఆచారాలు, కట్టుబాట్లు, జానపదరీతులు, సామాజికరీతులు అని వ్యవహరిస్తారు. వీటివల్ల సామాజిక నియంత్రణ జరిగి, సామాజిక వ్యవస్థాపన ఏర్పడుతుంది. సమాజపు కట్టుబాట్లను, అనుకూలపద్ధతులను, సామాజికరీతులను వ్యక్తులు సామాజికీకరణం ద్వారా అలవర్చుకొని, వాటికనుగుణ్యంగా తమ జీవిత విధానాలను తీర్చిదిద్దుకుంటారు. తద్వారా సామాజిక నియంత్రణ జరిగి, సామాజిక వ్యవస్థాపన ఏర్పడుతుంది. వాటిలో ముఖ్యమైనవి సాంప్రదాయాలు, ఆచారవ్యవహారాలు, నీతినియమాలు, కట్టుబాట్లు, కుటుంబం, మతం, కులం, శాసనాలు మొదలైనవి.

ఈ సామాజిక నియంత్రణా సాధనాలకు ప్రాచీనకాలంలో చాలా ప్రాముఖ్యం ఉండేది. వ్యక్తుల ప్రవర్తనపై, సాంఘిక నియమాల ప్రభావం అధికంగా ఉండేది. వ్యక్తుల దైనందిన సాంఘిక జీవితం, చాలా సామాన్యంగా ఉండేది కాబట్టి అవి, సామాజిక నియంత్రణను చాలా సులభంగా సాధించేవి.

అయితే క్రమంగా మానవ సమాజాలలో నాగరికతా విజ్ఞానం అభివృద్ధి చెందింది. వ్యక్తుల జీవిత విధానాలు, వారి అవసరాలు కూడా చాలావరకు మార్పు చెందాయి. సామాజిక జీవితం సంక్లిష్టం కావటం ప్రారంభించింది. జనాభా పెరుగుదలతోపాటు, ఆర్థిక, సాంస్కృతిక, సాంఘిక మార్పులు అనేకంగా సంభవిస్తున్నాయి. ఈ మార్పులవల్ల, సామాజిక నియంత్రణా వ్యవస్థలలో

కూడా మార్పుకలిగి, ప్రజలపై వాటిప్రభావం కొంతవరకూ కోల్పోయినాయి. ఈ వ్యవస్థలు రూపొందించిన, శిక్షాస్మృతులను ప్రజలు ఎక్కువగా ఉల్లంఘించటంవల్ల, అతిశక్తివంతమైన నియంత్రణా విధానాన్ని రూపొందించడంలో సామాజిక శాసనాలు ఏర్పడ్డాయి. సమాజంలో సంక్లిష్టత ఎక్కువవుతున్నకొద్దీ, సామాజిక శాసనాల ఆవశ్యకతకూడా ఎక్కువవుతున్నది. ఆధునిక కాలంలో సామాజిక శాసనాలే బలమైన సాంఘిక నియంత్రణా సాధనాలుగా పనిచేస్తున్నాయి.

సమాజంలో వ్యక్తుల ప్రవర్తనను నియమబద్ధంచేస్తూ, సమాజంలో శాంతి, భద్రత, రక్షణ, అభివృద్ధికి తగిన పరిస్థితులను కల్పించడమే శాసనాల ముఖ్యలక్ష్యం.

సమాజంలో ఉన్న సాంఘిక అసమానతలను తొలగించి, వ్యక్తులందరి అభివృద్ధికి సమానావకాశాలు కల్పించి, దేశ సమగ్రాభివృద్ధికి తోడ్పడటమే శాసనాల ముఖ్య కర్తవ్యం.

సంక్షేమ రాజ్యంలో పౌరులందరి సంక్షేమం కోసం ప్రభుత్వం కృషి చేస్తుంది. ప్రజలలో జాతి, మత, కుల విభేధాలను నిర్మూలించి, సమాజంలో సాంఘిక సమానత్వాన్ని సాధించడానికి తోడ్పడుతుంది. విద్య, ఆరోగ్యం, గృహనిర్మాణం మొదలైన సేవలను ఏర్పాటుచేసి సమాజ సర్వతోముఖాభివృద్ధికి పాటుపడుతుంది. శారీరక, సాంఘిక, మానసిక సమస్యలతో బాధపడుతున్న వారికి, వెనుకబడినవర్గాల వారికి, ప్రత్యేక సంక్షేమ కార్యక్రమాలను ఏర్పాటుచేసి, వారి సమస్యలను పరిష్కరించటానికి, వారి అభివృద్ధికి ప్రయత్నిస్తుంది. ప్రతీ వ్యక్తి తన కనీస అవసరాలను తీర్చుకోవటానికి కావలసిన అవకాశాలను కల్పించి, వారి ఆరోగ్య, జీవన ప్రమాణాలను మెరుగుపరుస్తుంది. సాంఘిక దురాచారాలను, సాంఘిక సమస్యలను రూపుమాపి, సమాజ శ్రేయస్సుకు, దేశ శ్రేయస్సుకు నిరంతరం కృషి చేస్తుంది. ఏ ప్రభుత్వమైనా సరే, సాంఘిక శాసనాలద్వారా మాత్రమే పై లక్ష్యాలను సాధించి సంక్షేమ రాజ్యాన్ని ఏర్పాటు చేయగలుగుతుంది.

## సామాజిక శాసనాలు - భావన

సామాజిక న్యాయ సూత్రాలను, నియమాలను, చట్టాలను సమ్మేళనమే సాంఘిక శాసనం. జాన్ ఎస్. బ్రాడ్వే (John S. Broadway) నిర్వచనం ప్రకారం "మానవుల సమస్యలను పరిష్కరించటానికి సంబంధించిన నిర్ణయాలను తీసుకునే విధానమే శాసనం". ప్రజల మధ్య ఉన్న సంబంధాలను ప్రజలకు, సమాజానికి మధ్యగల సంబంధాలను, ప్రజలకు ప్రభుత్వానికి మధ్యగల సంబంధాలను క్రమబద్ధం చేసే విధానమే శాసనం అని చెప్పవచ్చు.

నాగరికత అభివృద్ధిచెందుతున్నకొద్దీ శాంతిభద్రతలను రక్షించేబాధ్యత ప్రభుత్వానికి ఎక్కువవుతున్నది. హక్కులు, బాధ్యతలు, అమలుపరచడానికి సామాజికన్యాయాన్ని కలిగించడానికి, న్యాయసూత్రాల ననుసరించి, ప్రభుత్వం చట్టాలను చేయటం ప్రారంభించింది.

సంక్షేమరాజ్యంలో సాంఘిక శాసనాలు, ఈ కింది లక్ష్యాలను నెరవేరుస్తాయి.

1. సాంఘిక అసమానతలు తొలగించడం.
2. సామాజిక సమస్యలను నిర్మూలించడం, నివారించడం.
3. సంఘంలో బలహీనవర్గాలవారి సంక్షేమం పెంపొందించడం.

భారత రాజ్యాంగ తీర్మానం ప్రకారం, భారత దేశ పౌరులందరికీ, సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయం కలిగించడానికి, వారందరికీ స్వతంత్ర ఆలోచనలకు, భావ వ్యక్తీకరణకు, నమ్మకాలను కలిగి ఉండటానికి, మత విశ్వాసానికి, దైవారాధనకు, అవసరమైన స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలను కలిగి ఉండటానికి, అంతస్తులలోను అవకాశాలలోను ప్రజలందరికూ సమానత్వాన్ని కలిగించడానికి, దేశ ప్రజలందరి మధ్య సౌభ్రాతృత్వాన్ని పెంపొందించి, వ్యక్తి ఔన్నత్యాన్ని, దేశసమైక్యతను కాపాడటానికి అవసరమైన శాసనాలు చేయుటం ప్రభుత్వం ముఖ్యబాధ్యత అయిఉంది.

ప్రభుత్వం శాసనసభలలో రూపొందించే సామాజిక శాసనాలను, రాజ్యాంగంలో పొందుపరిచిన నిర్దేశక సూత్రాలను దృష్టిలో ఉంచుకుని, రూపొందించాలి. నిర్దేశకసూత్రాలు సామాజిక సంక్షేమానికి తోడ్పడతాయి. మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చినతరవాత, రూపొందించిన సామాజిక శాసనాలన్నీ, నిర్దేశకసూత్రాల ననుసరించి చేసినవే.

## భారతదేశంలో సామాజిక శాసనాలు :

మనదేశంలో ఉన్న అనేకమైన సామాజిక సమస్యలను శాసనాలద్వారా మాత్రమే శాశ్వతంగా పరిష్కరించగలం. అందుచేతనే మనదేశంలో వివిధ వర్గాలవారి పురోభివృద్ధిని ఆటంకపరిచే అనేక సాంఘిక సమస్యలు పరిష్కరించడానికి వివిధ శాసనాలు చేయడమైంది.

సంక్షేమరంగాలలో స్త్రీ సంక్షేమం ముఖ్యమైనది. స్త్రీ హోదాను హీనపరిచే అనేక సాంఘిక సమస్యలను అరికట్టటానికి సాంఘిక శాసనాలను రూపొందించడమైంది.

సతీసహగమన నిషేధ చట్టం – 1829, హిందూ వితంతు వివాహ చట్టం – 1856. బాల్య వివాహ నిరోధక చట్టం – 1929, హిందూ వివాహ చట్టం – 1955, హిందూ వారసత్వ చట్టం – 1956, వరకట్న నిషేధ చట్టం – 1960. మొదలయిన శాసనాలను చేసి, స్త్రీకి సాంఘిక, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాన్ని, సమానత్వాన్ని కలిగించడానికి కృషిజరిగింది.

వ్యభిచారవృత్తి చాలా తీవ్రమయిన సమస్య. వ్యభిచారవృత్తివల్ల వేశ్యకేగాక, సమాజానికి కూడా నష్టం వాటిల్లుతుంది. కుటుంబ విచ్ఛిన్నత, సాముదాయక అవ్యవస్థత కలుగుతాయి. వ్యాప్తి చెందుతున్న ఈ సమస్యను శాసనంద్వారానే అరికట్టాలి. 1956లో అక్రమ సంబంధాల నిరోధక చట్టం (Suppression of immoral traffic among women and girl Act) వచ్చింది. ఈ చట్టం ప్రకారం వేశ్యావృత్తిని కొనసాగించే వేశ్యలు, దానికి కారకులు, ప్రోత్సాహకులుగా ఉన్న తదితరులను చట్టరీత్యా శిక్షిస్తారు. చట్టరీత్యా పట్టుబడిన మహిళలను సంరక్షక కేంద్రాలలో ఉంచే అవకాశాన్ని శాసనం కలిగించింది.

మన దేశంలోని సాంఘిక అసమానతకు ముఖ్య కారణం అస్పృశ్యత. ఈ అస్పృశ్యత అనాదినుంచీ వస్తున్న సమాజ వ్యవస్థలో సన్నిహితంగా ముడివడివున్న సాంఘిక దురాచారం ఈ సమస్యను నిర్మూలించడానికి స్వాతంత్రం ముందునుంచే ప్రయత్నాలు జరిగాయి. 1955 వ సంవత్సరంలో అస్పృశ్యతా నివారణా చట్టం అమలులోకి వచ్చింది. ఈ చట్టాన్ని సవ్యంగా అమలుపరచడానికి ప్రత్యేక యంత్రాంగాన్ని ఏర్పరచారు.

## యాచన

యాచనకూడా ఒక ప్రధానమయిన సాంఘిక సమస్య. దానివల్ల చాలా సాంఘిక అనర్థాలు కలుగుతున్నాయి. అందుచేతనే యాచనను అరికట్టటానికి ప్రభుత్వం తగిన శాసనాలను రూపొందించింది. దాదాపు అన్ని రాష్ట్రాలలో, ఏదో ఒక రూపంలో యాచన నిరోధక చట్టాలు అమలులో ఉన్నాయి.

## మద్యపానం

మద్యపానం కూడా అనేక దుష్పరిమాణాలకు దారితీస్తుంది. దానివల్ల వ్యక్తిగత, కుటుంబ సాముదాయిక అవ్యవస్థత ఏర్పడుతుంది. ఈఅనర్థాలను అరికట్టాలంటే, శాసనం ద్వారా మద్యపానాన్ని పూర్తిగా నిషేధించాలి. నిర్దేశక సూత్రాలలో మత్తుమందులను, పానీయాలను సేవించడం నిషేధించాలి అని పేర్కొన్నారు. 1954 వ సంవత్సరంలో ప్రభుత్వం మద్యపాన నిషేధం విచారణ సంఘాన్ని నియమించింది. ఈ సంఘం చేసిన తీర్మానాన్ని ఆమోదిస్తూ, మద్యపాన నిషేధం ద్వితీయ ప్రణాళికలో దేశమంతటా అమలుపరచాలనీ లోక్‌సభ సిఫారసుచేసింది. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు మద్యపానాన్ని పూర్తిగా నిషేధించాయి. కాని దేశమంతటా, మద్యపానాన్ని నిషేధించటానికి ప్రయత్నాలు జరుగలేదు. కొన్ని రాష్ట్రాలలో నిషేధించటానికి శాసనాలను ఏర్పాటుచేసినా, అవి సక్రమంగా అమలు కాలేదు.

దేశంలో సామాజిక భద్రతను వ్యవస్థీకృతంగా ఏర్పాటుచేయవలసిన బాధ్యత ప్రభుత్వానిదే. స్వాతంత్ర్యం వచ్చినతరవాత, ప్రజలకు సామాజిక భద్రతను కలిగించడానికి చట్టాలద్వారా విరివిగా కృషిజరిగింది. అస్వస్థతా సహాయసదుపాయం, ప్రసూతిసహాయం, ప్రమాదాలు జరిగినపుడు సహాయం, నిరాధారులకు సహాయం, వైద్యసహాయం మొదలైన ప్రయోజనాలను కల్పించడానికి 1948 లో ఉద్యోగుల ప్రభుత్వ భీమా చట్టం అమలుపరచడం జరిగింది. కార్మిక సంక్షేమంకోసం కేంద్ర ప్రభుత్వాలు, రాష్ట్ర ప్రభుత్వాలు వివిధ సంక్షేమ కార్యక్రమాలను అమలుపరుస్తున్నారు.

బాలలకు సంబంధించిన సమస్యలను పరిష్కరించడానికి బాలల సంక్షేమంకోసం శాసనాలను ఏర్పాటుచేయడానికి ప్రత్యేకశ్రద్ధ చూపారు. బాలనేరం ముఖ్యమైన సామాజిక సమస్య దానిని అరికట్టటానికి స్వాతంత్ర్యానికి ముందుగానే చట్టబద్ధమైన ప్రయత్నాలు జరిగాయి. 1897 భారతీయ సంస్కరణ పాఠశాలల చట్టం, (Indian Reformatory Schools, Act 1897) బాలల సంస్కరణ కోసం ప్రత్యేకంగా ఉద్దేశించడమైంది. బాలనేరస్తుల విచారణ, శిక్షణ, భద్రత మొదలయిన

విషయాలకు సంబంధించిన బాలల చట్టాలు (Children's Act) వివిధ రాష్ట్రాలలో అమలు చేయడమైంది.

ఈవిధంగా మన దేశంలో ప్రధాన సాంఘిక సమస్యలను నివారించటానికి, పరిష్కరించటానికి సామాజిక శాసనాలద్వారా కృషి జరుగుతున్నది. సామాజిక శాసనాలను చేయటం ప్రభుత్వానికి మాత్రమే పరిమితమయిన బాధ్యత. శాసన నిర్మాణం, దానిని అమలుపరచటం రెండూ ప్రభుత్వం వారి బాధ్యతలే. శాసనాలు విజయవంతం కావాలంటే, వాటిని అమలుపరచటానికి తగినంత సిబ్బంది కావాలి. శాసనప్రయోజనాన్ని ప్రజలందరూ కూడా గుర్తించి, వాటినామోదించి అనుసరించాలి.

సామాజిక శాసనాలు, వాటి లక్ష్యాలను నెరవేర్చాలంటే ప్రజలకు ఆ శాసనాలను గురించి, వాటివల్ల కలిగే ప్రయోజనాలను గురించి సవివరంగా వివిధ విద్యా కార్యక్రమాల ద్వారా తెలియ చేయటం చాలా అవసరం. ఎందుకంటే నిరక్షరాస్యులు ఎక్కువగా ఉన్న మన సమాజంలో అధిక శాతం ప్రజలు వారికై ప్రభుత్వం ఏర్పరచిన సామాజిక భద్రతను గురించి, హక్కుల గురించి వారంతట వారు తెలిసికోనడం చాలా కష్టం. కాబట్టి ఈ కార్యక్రమాలలో వివిధ ప్రభుత్వ, స్వచ్ఛంద సంస్థలు, సాంఘిక సేవా కార్యకర్తలు ఎక్కువగా పాల్గొని, ప్రజలకు శాసనాలను గురించి తెలియచేయడం చాలా అవసరం. ఇది జరగకపోతే శాసనాలు అమలుపరచటం కష్టసాధ్యం అవుతుంది. ఈ శాసనాలను అమలుపరిచే అధికారులు స్వార్థచింతన లేకుండా, మానవతా దృక్పథంతో ప్రజలకు సహాయపడినప్పుడు, వీటివల్ల ఆశించిన ఫలితాలు పొందవచ్చు. వివిధ ప్రచార సాధనాలను ఉపయోగిస్తూ, ప్రజలకు శాసనాలను గురించి తెలియచేయవలసిన బాధ్యత ప్రభుత్వంపై ఎంతయినా ఉంది. సంఘ సంక్షేమ కార్యకర్తలు తాను పొందిన వృత్తి శిక్షణ ద్వారా సముపార్జించుకున్న నిపుణతలవల్ల, సామాజిక శాసనాలను రూపొందించటంలోను, అమలుపరచటంలోను సరయిన పాత్రను వహించగలడు.

## సామాజిక ప్రణాళిక (SOCIAL PLANNING)

ప్రాచీన సమాజాలలో సాంప్రదాయక భావాలవల్ల, సామాజిక అభివృద్ధి అంతా జరిగేదు కాని శాస్త్రీయ, సాంకేతిక విజ్ఞానం అభివృద్ధి చెందడంవల్ల మానవ ప్రయత్నంద్వారా విశేషమైన అభివృద్ధిని సాధించవచ్చునని గుర్తించడమైంది. సమాజంలో ప్రజలు తమ జీవితాన్ని మెరుగుపరచు కోడానికి అనేక ప్రయత్నాలు చేశారు. కొన్ని ఆశయాలను రూపొందించుకొని వాటిని సాధించటానికి కృషిచేశారు. స్వేచ్ఛ, సమానత్వం, భద్రత, న్యాయం, కనీస అవసరాల తృప్తి చాలావరకు సాధించడం జరిగింది. ప్రజలలో అన్నిరంగాలలో సమగ్రాభివృద్ధి జరిగినప్పుడే సమాజం అభివృద్ధిచెంద గలదని ప్రభుత్వం గుర్తించింది.

పారిశ్రామిక, ఆర్థిక, రాజకీయ, విద్యావిషయక, శాస్త్రీయ, సాంకేతిక, నైతిక రంగా లన్నింటిలో కూడా సమాజం అభివృద్ధి చెందాలి. సమాజంలోని అవాంఛనీయమైన పరిస్థితులను

చింది. దీని ప్రకారం, వ్యక్తులందరికీ కుల, మత, జాతి విచక్షణ లేకుండా సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని చేకూర్చటం లక్ష్యంగా పెట్టుకోవడం జరిగింది. ఈ ధ్యేయాన్ని నెరవేర్చడానికి రాజ్యాంగంలో నిర్దేశక సూత్రాలుకూడా ఏర్పాటుచేయడం జరిగింది. ఈ సూత్రాలను అనుసరించి, సమ సమాజ నిర్మాణానికి, సంక్షేమరాజ్య స్థాపనకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కృషిచేయవలె. ఏ ప్రణాళికలను రూపొందించినా, అవి ప్రజాస్వామ్య విలువలకు, సిద్ధాంతాలను అనుగుణంగా ఉండాలి. ఈ పరిధులలో ప్రణాళికలను, పథకాలను చేపట్టవలె.

సంక్షేమ రాజ్యంలో ప్రభుత్వం ప్రతివ్యక్తికీ, కనీస జీవితావసరాలను కలిగించి, వారి జీవన ప్రమాణాన్ని పెంచుతుంది. విద్య, ఆరోగ్యం, గృహనిర్మాణం, రవాణాసౌకర్యాలు, గ్రంథాలయాలు, సాంస్కృతిక కార్యక్రమాలు మొదలయినవి ఏర్పాటుచేసి, వ్యక్తి లేదా కుటుంబ సంక్షేమానికి పాటు పడుతుంది. ప్రజలలో జాతి, మత, కుల, విభేదాలను నిర్మూలించి, సాంఘిక అసమానత్వాన్ని తొలగిస్తుంది. వ్యవసాయదారులకు, కార్మికులకు, పౌరులకు వివిధ రకాలయిన సాంఘిక రక్షణ పథకాలను ఏర్పాటుచేసి, సాంఘిక భద్రతను చేకూరుస్తుంది. బాలల సంక్షేమం, కుటుంబ సంక్షేమం, స్త్రీ సంక్షేమం, యువజన సంక్షేమానికి, సంబంధించిన అనేక కార్యక్రమాలను ప్రవేశపెట్టి, సమస్యలను పూర్తిగా నివారించటానికి కృషిచేస్తుంది. శారీరకంగా, మానసికంగా, ఆర్థికంగా, సాంఘికంగా లోప భూయిష్టమైన వర్గాలవారికి, ప్రత్యేకసేవలను అందించి, వారి అభివృద్ధికి ప్రయత్నిస్తుంది. బలహీన వర్గాల సంక్షేమంకోసం ప్రత్యేక సేవలను కల్పిస్తుంది. నిరక్షరాస్యత, పేదరికం, నిరుద్యోగం, నేరం, వ్యభిచారం మొదలయిన సాంఘిక సమస్యలను శాసనాలద్వారా ప్రణాళికలద్వారా పూర్తిగా నిర్మూలించడానికి కృషిచేస్తుంది.

పైన పేర్కొన్న వివిధ సంక్షేమ కార్యక్రమాలన్నీ ప్రణాళికాబద్ధంగా ఏర్పాటుచేయాలి. ప్రభుత్వ కృషిద్వారా మాత్రమే పై కార్యక్రమాలను ఏర్పాటుచేసి, సంఘసంక్షేమాన్ని సాధించగలం. 1950వ సంవత్సరంలో ప్రభుత్వం జాతీయ ప్రణాళికాసంఘాన్ని నెలకొల్పి, దానిద్వారా ప్రణాళికా విధానాన్ని అన్నిరంగాలలో ప్రవేశపెట్టింది.

ఈ కార్యక్రమాలను నిర్వహించడానికి ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలు రూపొందించి, వాటి ద్వారా గ్రామీణ, గిరిజన, నగర అభివృద్ధి కార్యక్రమాలను వివిధ పథకాల ద్వారా ప్రవేశపెట్టి, గణనీయమైన పురోభివృద్ధిని ప్రభుత్వం సాధించింది, వీటితోపాటు, ఆర్థిక రంగంలో భారీ పరిశ్రమలను, కుటీర, గృహ పరిశ్రమలను పెంపొందిస్తూ, ఉపాధికల్పనా కార్యక్రమాలను ప్రభుత్వం కల్పిస్తున్నది. హరిత విప్లవం ద్వారా అధిక శాతం ప్రజల జీవనోపాధి అయిన వ్యవసాయ రంగంలోని లోపాలను సరిదిద్ది, ప్రజల జీవన విధానాలలో మార్పు తీసుకురావడం జరిగింది.

సామాజిక శాసనాలు, సామాజిక ప్రణాళికలు, సామాజిక విద్యా కార్యక్రమాల ద్వారా సమాజాలలో ఉన్న సామాజిక అసమానతలను తగ్గిస్తూ, సామాజిక సమస్యలను పరిష్కరిస్తూ, సామాజిక న్యాయాన్ని ప్రజలకు సమకూరుస్తూ, సామాజిక అభివృద్ధికి ప్రభుత్వం అన్ని రంగాలలో కృషి

చేస్తుంది. ఇంతేగాక దేశంలో ఉన్న మైనారిటీ వర్గాలకు చెందిన వారి సంక్షేమం కోసం ఏ విధమైన అడ్డంకులు లేకుండా వారి జీవన విధానాలను, సంస్కృతిని ప్రోత్సహించడానికి ప్రభుత్వం ప్రణాళికల ద్వారా కృషి చేస్తున్నది. స్త్రీ, పురుష భేదం లేకుండా, కులమత విచక్షణ లేకుండా పౌరులందరికీ ప్రాథమిక హక్కులను ఇవ్వడం జరిగింది. వీటన్నింటిని సక్రమంగా రూపొందించి, అమలుపరచడానికి ప్రణాళికా సంఘాలతోపాటు, ప్రభుత్వ యంత్రాంగంలో మూడు వ్యవస్థలను రూపొందించడం జరిగింది. అవి న్యాయ వ్యవస్థ, లెజిస్లేచర్, నిర్వహణా వ్యవస్థలు (Judiciary, Legislature, Execution) మొదలయినవి. ఈ మూడింటి మధ్య సరయిన అవగాహనను సమన్వయాన్ని, సమతుల్యాన్ని పెంపొందించడానికి ప్రభుత్వం కృషి చేస్తుంది.

పంచవర్ష ప్రణాళికలు, సాంఘిక సంక్షేమ కార్యక్రమాల అభివృద్ధిని రాష్ట్ర ప్రభుత్వాలకు స్వచ్ఛంద సంస్థలకు అప్పగించింది. స్వచ్ఛంద సంస్థలు బలహీనం అవడంవల్ల స్వచ్ఛంద సేవాసంస్థలను బలపరచి, వాటిద్వారా, సంక్షేమ కార్యక్రమాలను సక్రమంగా అమలుపరచాలనే ముఖ్య ఉద్దేశ్యంతో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థను (C. S. W. B.) 1953 వ సంవత్సరంలో కేంద్ర ప్రభుత్వం స్థాపించింది. ఈ సంస్థ స్వచ్ఛంద సంస్థలకు ప్రణాళికాబద్ధమైన ఆర్థిక సహాయాన్ని అందించి, వివిధ సంక్షేమ రంగాలలో కార్యక్రమాలను అమలుపరుస్తుంది.

గ్రామీణ సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు, నగర సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులు, కుటుంబ, బాలల, స్త్రీ సంక్షేమ పథకాలు, సాంఘిక, నైతిక, ఆరోగ్య పథకాలు, కార్యకర్తల శిక్షణా పథకాలు మొదలయిన అనేక సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను ప్రవేశపెట్టి కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు తీవ్ర కృషి జరుపుతున్నది. అంతేగాక ఈ సంస్థ కేంద్ర మంత్రిత్వ శాఖల, రాష్ట్ర మంత్రిత్వ శాఖల వేర్వేరు సంక్షేమ పథకాల సమన్వయానికి పాటుపడుతున్నది.

విద్యా మంత్రిత్వ శాఖ, ఆరోగ్య మంత్రిత్వ శాఖ, విదేశ వ్యవహారాల మంత్రిత్వ శాఖ, సామాజిక అభివృద్ధి సహకార మంత్రిత్వశాఖ, కార్మిక ఉద్యోగ మంత్రిత్వ శాఖ మొదలయిన కేంద్ర, రాష్ట్ర మంత్రిత్వ శాఖలు కూడా సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను ఏర్పాటుచేసి ప్రత్యక్షంగా, పరోక్షంగా కూడా సాంఘిక సంక్షేమానికి పాటుపడుతున్నాయి.

సంక్షేమ కార్యక్రమాలను విజయవంతంగా అమలుపరచాలంటే ప్రజల సహాయ సహకారాలు చాలా అవసరం. వీటిని పొందడంలో స్వచ్ఛంధ సంస్థలకు చాలా ప్రముఖ పాత్ర ఉంది. అనాదినుంచీ భారతదేశంలో స్వచ్ఛంద సంస్థలు సంఘ సంక్షేమం కోసం తీవ్ర కృషి జరుపుతున్నాయి. స్వచ్ఛంద సేవాసంస్థలు ప్రజలతో ప్రత్యక్ష సన్నిహిత సంబంధాలను కలిగి ఉంటాయి. అవి ముఖ్యంగా ప్రజల అవసరాలను తీర్చటంకోసమే ప్రజలే ఏర్పాటు చేసుకున్నారు. ఈ సంస్థలు మానవతా దృక్పథంతో పని చేస్తాయి. వ్యక్తుల అవసరాలకు తగినట్లుగా కార్యక్రమాలను మార్చుకోనేటట్లు సరళంగా వ్యవహరిస్తాయి. కాబట్టి స్వచ్ఛంద సంస్థలకు ప్రజల సహకారం చాలా హెచ్చుగా ఉంటుంది. ప్రజలు వాటిని

తమ సంస్థలుగా భావించి ఆ సంస్థలద్వారా అమలుజరిగే కార్యక్రమాలలో అన్ని విధాల సహకరిస్తారు. అందుచేత సంక్షేమ కార్యక్రమాలను స్వచ్ఛంద సంస్థల ద్వారా అమలుపరిస్తే, ఎక్కువ ఫలితాలను సాధించి, త్వరలో సాంఘికాభివృద్ధిని ప్రభుత్వం చేకూర్చగలదు.

ఆధునిక సంఘసంక్షేమ పరిధి చాలా విస్తృతమైంది. మానవ జీవితానికి సంబంధించిన సంక్షేమ సేవలన్నింటిని దీనిలో చేర్చటం జరిగింది. ఈ బృహత్తర కార్యక్రమాన్ని ప్రభుత్వం స్వచ్ఛంద సంస్థలు ప్రజలు కలిసి సమన్వయ కృషితో అమలుజరపాలి. అంతేగాక, ప్రభుత్వ సంస్థలలోను, స్వచ్ఛంద సంస్థలలోను సంక్షేమకృషి కార్యకర్తలను నియమించి, వారిద్వారా, సంక్షేమ కార్యక్రమాలన్నింటిని సంక్షేమకృషి శాస్త్రీయ పద్ధతులలో నిర్వహించినట్లయితే ఎక్కువ ఫలితాలను సాధించవచ్చు.